# పండరీ భాగవతము

[ద్విపద కావ్యము]

రచన:

పుట్టపర్తి నారాయణాచార్యులు

ప్రతులకు:
పుట్టపర్తి నారాయణాచార్యులు
కడప.

# పీఠిక

"మీ రేదియు పెద్ద గ్రంథమేల వ్రాయలేదు? ఇది చాల యేండ్లుగా - చాల మంది నన్ను వేసిన ప్రశ్న. ప్రశ్నవేసిన వారే కాని-నా యుత్తరము విన్నవారే లేరు. ఈ "పండరీ భాగవతము" వ్రాసి దాదాపు ముప్పది యేండ్లకు పైగా నైనది. ఇరువదివేలకుపై చిలుకు ద్విపదలను వ్రాసియున్నాను. కాని వీనిని గడ్డకు తెచ్చుకొను మార్గము! కాలము గడచుకొలది-నా నిరాశ యెక్కువైనదీ; నిరాశతో వ్రాతప్రతి యందుపేక్షయు బెరిగెను. ఆ ద్విపదలలో కొన్నిటిని చెదలు దిన్నవి. కొన్ని నీటిలోఁ దడిసిపోయినవి. ఇప్పుడు ప్రచురించిన ద్విపదలు యీ ప్రమాదములకుఁ దప్పి నిలిచినవి. కొందరీ రచనలను ద్విపదలని చప్పరించిరి. వారికి నేనేమి బదులిత్తును? ఛందః పద్ధతిని జూచి రచనలపై రాగద్వేషములు పెంచుకొనువాడు- రసిక బ్రువుడు - అంతే.

తెలుగు దేశములోని ప్రకాశకులు నన్ను దోచివేసిరి. నేనిప్పటికి వ్రాసిన పుస్తకములు వంద. కాని, వానితో ప్రకాశకులు ధనవంతులైనారే కాని - నా దారిద్ర్యము పోలేదు. కాగా పోయిన సంవత్సరము - ఐదారు పుస్తకములు స్వయముగా వేసితిని. వానిని కర్చుపెట్టుకొనుటలో కడపజిల్లా కలెక్టరుగారైన వి. చంద్రమౌళిగారు యెంతో తోడ్పడిరి. వారి యుదార హృదయమునకు నా నమస్కారములు. జిల్లాపరిషత్తు డిప్యూటీ సెక్రటరీగారైన యానంబాక వెంకటేశ్వర్లుగారు సాహసముతో నాకు సహాయపడిరి. వారిది వెన్నవంటి మనసు. సెక్రటరీగారు తోడ్పడిరి. కడపజిల్లా పరిషత్తు చేర్మన్ సూర్యనారాయణరెడ్డిగారు: యీ ప్రయత్నమునకు తన చేయూతనిచ్చిరి. పై యిర్వురి యుపకారమును స్మరింతును.

అనంతపురం జిల్లా డిప్యూటీ సెక్రటరీగారైన పుళికల్లు రామచంద్రపిళ్ళైగారును, విద్యాశాఖాధికారిణి కుమారి నంద్యాల లక్ష్మీదేవమ్మగారును, పుస్తకములు కర్చుపెట్టుకొనుటలో సాయ

పడిరి. అనంతపురము-కర్నూలు-కడప మండలముల యుపాధ్యాయు లందరును దోడ్పడిరి. కర్నూలు జిల్లా శాఖాధికారి అనుపూరు నాగ భూషణరావు నాకండగాఁ నిలిచెను. వీరందరు నా కింతకుముం దొనర్చిన యుపకారఫలమే - యీ గ్రంథప్రచురణము.

సాహిత్య అకాడమీ కార్యదర్శి దేవులపల్లి రామానుజరావు గారు నాకుఁ జిరకాలమిత్రులు. సాహితీపరులు. ఉదారులు. వారు అకాడమీ పక్షమున మొదలు "పండరీ భాగవతము" నకై వేయి రూపాయలు మంజూరు చేయించిరి. మరల నా కష్టములు చెప్పికొనగా సాహసించి రెండవ వేయి నిప్పించినారు. వారికి నా నమోవాకములు. అకాడమీ అధ్యక్షులు డాక్టరు బెజవాడ గోపాలరెడ్డిగారు నాకు చేసిన సాయము మరువరానిది. వారి సహకారము లేనిచో అకాడమీ సాయము లభించి యుండెడిదిగాదు. వారికి నా నమస్కారములు.

సహృదయ కవి వై. సి. వి. రెడ్డి నా "పండరీ భాగవతము" వ్రాతప్రతిలో నుండగనే పలుచోటుల చదివి దాని ప్రచారమునకుఁ దోడ్పడెను. అట్లే మరికొందరును బాసటయై నిలచిరి. వారి యుప కారమును మరువ జాలను.

సిండికేటు (అనంతపురం) బ్యాంకు మేనేజరు నంద్యాల వెంకట సుబ్బయ్య నాకభిన్న మిత్రుడు. అతనికి నిండు దీవెనలు. దీనిలో కొంత భాగమును తిరుపతి దేవస్థానము వారు 'సప్తగిరి' పత్రికలో చాల కాలము ప్రచురించిరి. వారికి నా నమస్కారములు. మా పాఠశాలలో నున్న వాట్కిన్సు సర్వాంగ సుందరముగ 'విఠలుని' బొమ్మ గీచి యిచ్చినాడు. వానికి నా యాశీర్వాదములు. శ్రీ ధనికొండ హనుమంతరావుగారు యెన్నో కష్టముల కోర్చి గ్రంథమును సుందర ముగ ముద్రించి యొసగిరి. వారికి నా మనఃపూర్వక నమ స్కృతులు.

ఇది భక్తి కావ్యము. జరుగగల సర్వమునకును విఠలేశ్వరుని దయయే ప్రధానమై నడిపించును.

"పుట్టపర్తి"

# విషయసూచిక

—o—

# పండరీభాగవతము

## (పుండరీక చరిత్ర)

ఓంకార వనజ పీఠోద్భాసమాను
శంకారహిత భక్తజనహృదాసీను
నవికృతసంధాను, నతి సుఖాధాను
నవగుణగణహీను, నఖిలప్రధాను
విశ్వవిధాను, సంవిత్సుఖతాను
విశ్వసమాధాను, విశ్వావధాను
విశ్వప్రదీపు, విర్వేలప్రతాపు
విశ్వైకరూపు, విభిన్నోపతాపు
నీశ్వరవినుతు, మునీశ్వరహృదయ
భాస్వన్నభోంగణ బాలార్కమూర్తి
బోధావతారు, దుర్వాదనికారు
బోధైకసారు, దుర్బోధ్యప్రకారు
గళిత వికారు - విక్రమకళాధారు
సలలితశృంగారు - శమితాపచారు
క్షపిత రాక్షసవీరు - సరసవిహారు
విపుల యశోహారు - విశ్వనిస్తారు
నాగమకాసార హంస - నిధ్యాన
సాగరామృతము, గోపీగణోరోజ
గంధిలవక్షు - వికచనేత్ర వనజ
బంధుర నీల దివ్యకటాక్ష పాత
సంచాలితామరీ సముదయు - విబుధ
వంచకుఁ గటితటీ వసదేక హస్తు.

సకల ప్రశస్తు, శాశ్వతు, నజు, నగుణు
చక చక న్మృదుహాస సంశ్రయోత్ఫుల్ల
లలిత గండస్థలు, లావణ్యమూర్తి
ఫలితావతారునిఁ బండరినాథు
నస్మన్నిధానంబు, నతి భక్తిఁ గొలిచి;
విస్మయావహమూర్తి విమల సత్కీర్తి
విదళితార్తార్తి, సంవిత్పరిస్ఫూర్తి,
మద భరాలసనేత్ర, మంజుల గాత్ర
పద్మసుందరవేణి, పద్మప్రవాత్రి
పద్మనాభుని రాణి, భావించి, వేద
సద్మీకృతాంభోజ సమచతుర్వక్త్రి
త్రిదశ భాగ్యవిధాత, త్రిభువనత్రాత,
సదమల మునిజాత శరణప్రదాత
భక్తసంచయ నేత, భవభయత్రాత,
సక్తమానసమున శతధృతిఁ దలఁచి—
కవికుల మానస కలహంసి, భావ
నివహమాల్యాంచిత, నీరదపార
దావదాత శరీర, నఖిల సవిత్రి
పావనగాత్రి, నబ్జసమాన నేత్రిఁ,
జంపకనాస, నిలింపవిభూష,
కంపితాఽజ్ఞాన, పంకహరాఽభిధాన
జ్ఞానప్రదాయిని, జ్ఞానైకమూర్తి,
మౌని నిధ్యాన నభోనీరదమ్ముఁ—
దొలి మినుకుల నేర్చి కల కలఁ బలుకు
జిలువారు చిలుకతోఁ జెలఁగెడు దానిఁ
గవి సహృదయతాఖ్య కనకహర్మ్యమున
నివసించుదాని - వీణియచెక్కు గీటి
వలికించుదాని నుజ్జ్వలసామపంక్తి.

లలితహస్తాబ్జ పాటల కాంతిఁ జేసి
తన యక్షమాల జొత్తును నింపు దాని—
వనజగర్భుని తపఃఫలము - మచ్చిత్త
ఫలకంబునను నిల్పు భారతీదేవి—
నెలవంక పూవు - మిన్నేటి నెట్టెంబు
రుదురాకపోగులు - మృదుల కటాక్ష
మధుర నేత్రములు - వామాంగాయమాన
వామాక్షి - వాసుకి వలయంబు - హస్త
భీమ త్రిశూలమ్ము - పృథు సర్పరాజ
పట్టబంధం - బొసపరియైన నగవు
నెట్టన ధరియించి - నిబిడానుకంప
పొడవయి నిల్చిన పోల్కిఁ జూపట్టు
మృడురూపు - లోఁ జూపు నిడి పరీక్షించి;
నాయాసలకు గీము - నా చేయు నోము
నా యూర్పు, నా చూపు, నాదు జీవనము
నా సకలంబైన నగవుల బరణి
నా సవిత్రి - వినీత నా కేశమకుట
మణిఘృణి వేష్టిత మంజుల పాద -
నణిమాదివిద్యా మహాసౌధ కలిత
కేళి - భ్రూమధ్యస్థలీలోలమూర్తి
బాలికజన మతి భ్రమకరి - యోగ
విద్యావిధాన సంవేద్య - మునీంద్ర
బోధ్య - సహస్రార పుష్కరశోధ్య
గుండలినీశక్తి, గుహినిఁ జాముండి
ఖండేందుధర మనః కమల సౌరభము
మద భరాలసహాస, మంజుల భాష
మదిరావిఘూర్ణిత మృదితాక్షి - మంజు
శింజాన మంజీర - చిన్మయమూర్తి

గుంజావిభూషిత, కూట మాతంగి
మరకతశ్యామ, మన్మథరాజ్యలక్ష్మి,
గిరిరాజపుత్రికఁ గీర్తించి మ్రొక్కి—
తక్కిన దేవతాతతికి సద్భక్తి
నెక్కొన దలపించి; నిటలంబు వంచి—
రామగుణగ్రామ రమ్యకాంతార
సీమ విహార రసికులైన యట్టి
వర కపీశ్వర కవీశ్వరుల భూషించి—
యరుదార వేదమ్ము లటు విభాగించి
జగతికి నొసఁగి - సాక్షాద్విష్ణుఁడనగ
నెగడి - పంచమవేదముగ వెలుంగొంద
భారతమ్మొనరించి - భాగవతమున
సారవేదాంత విజ్ఞానమ్ము గుప్పి
కృతకృత్యుఁడయిన సుకీర్తి, మౌనీంద్ర
నుతమూర్తి, సంవిద్విధుత మనుజార్తి
విమలు "వేదవ్యాసు" వినుతిఁ గావించి—
కమనీయ కవితా వికాసంబులకును
నవ వసంతంబైన నానార్థ భవ్య
"కవికులగురు" వచోగతిఁ గీర్తి సేసి—
"భాస-సౌమిల్లక-బాణ-దిఙ్నాగ"
భాసుర "శూద్రక" ప్రముఖ సత్కవుల
లలితవాణీ తమాలతికాటవీవేల
పులకాయమాన వాక్పుష్పుల నెంచి
ధారుణీతలముఁ బూత మొనర్చు కొఱకు
భారతీదేవి పుంభావమ్ము పూని
పుట్టినట్టుల, రసమూర్తియై బిరుదు
గట్టిన కవుల సంస్కారమే కదల
రచన సేసిన మహారసిక కోటికిఁ

ప్రచుర నాటక కర్త "భవభూతి" నెంచి
"ప్రవరసేనా"దిక ప్రాకృత సుకవి
నివహంబు మదిలోన నిలిపి కేల్మోడ్చి—
తులసీ పవిత్ర భాషల రామపూజ
సలిపిన [1] "తులసి" కంజలి ఘటియించి—
పసిడి గంటము బూని పండరీశ్వరుఁడె
వసిగొని లిఖియింప భక్తి క్రమముగఁ
గవిత లల్లిన పూత భవులఁ జిద్గగన
రవులఁ [2] "దుకా"ది సత్కవుల సేవించి—
తొలుదొల్తఁ దెలుఁగునఁ దొలకరివేళఁ
బలుకు గోయిల క్రొత్త వగ "వస్తు కవిత"
నక్షర రమ్యత నఖిల సూరులును
బక్షంబు సేయంగఁ బలికిన యట్టి
"భట్టారకుని"—నిరవద్య పాండిత్య
పట్టభద్రుని-గుణభద్రునిఁ దలఁచి;
తెలుఁగు కొలంబు నోములు పండఁ బుట్టి
తెలుఁగు బల్కుల తీపి తెట్టువ గట్టఁ
దఱపి వెన్నెల చల్లఁదనము - లేఁజిగురు
నెఱపిన జిగి-ప్రియాతరుణాధరంపు
జవి-మలయానిల సారసౌరభముఁ
జెవి కింపయిన విపంచీకల క్వణన
మొకచోటఁ గూడ, భావుకులు తూగాడ
నకలంకమగు కైతలల్లిన యట్టి
నిక్కంపు యోగి, నిర్నిద్రానురాగిఁ
"దిక్కనామాత్యు" నాదృతిఁ గీర్తి సేసి—
మల్లికాపరిమళం బల్లికొన్నట్టు

1. తులసీదాసు.
2. తుకారాముడు మొదలైనవారు.

అల్లి దెమ్మెర లల్లపల్లన వీచు
కరణి - రచన సేయు ఘనుఁడు - "ప్రబంధ
పరమేశ్వరు"నకుఁ నప్పన మంజలించి—
యవికలావేశ విత్తాఢ్యులై - దేశి
కవితఁ బరిమళం బవఘళింపంగ
జానుఁ దెన్గునఁ గూర్చి చనిన కళా ని
ధానుల - శివకవితతిఁ బ్రస్తుతించి—
పలికిన పలుకెల్లఁ బరమేశునెదుట
నిలిపిన దీపంబు కళికగా వెలయఁ
దలడింప విమతపంక్తులు వచోధాటి
కలఘు కవిత్వంబు లల్లిన - శాస్త్ర
పరిణాహి గంధబంధురుఁడైన "పాల
కురికి సోమున" కేటికోళ్ళు చెల్లించి—
దిననాథు సవతు "నాచన సోమనాథు"
మనమునఁ బలు మెప్పు మలయంగ నొప్పి—
రాజులకును గృతిరత్నంబు నీక
రాజరాజగు రఘురాము శ్రీ చరణ
వలయంబులో మాటి, వలగొన్న మేటిఁ
దలఁచి "పోతన్న" నతంద్ర మానసుని;
మరి యద్యతన కవివరశక్తి రక్తి,
గుఱుతించి - భావి విజ్ఞులఁ గుస్తరించి
భక్తుల దాసుండ - భక్తుల లెంక
భక్తుల పడిగాపు - భక్తిజీవనుఁడ
భక్తిగోత్రుండ - సద్భక్తి వంశ్యుండ
భక్తిచాపల్యుండ - భక్తిబంధుండ
విదితాష్ట భాషా కవిత్వ నిర్మాణ
మదబంధురుఁడ - కళా మహిత రాహస్య
సేవధి - నవధాన చిత్రచణుండ

భావుకు లెల్లరుఁ బ్రమదంబు నొంది
"భళి భళి" యని మెచ్చ భక్తకుటుంబ
ములు దల లార్చి కన్నులను మోడ్వంగ-
భక్తభండారంబు - పండరీశ్వరుఁడు
రక్తి దుల్కాడ - సంభ్రమితుఁ డావేళ
మున ఘల్లు ఘలు ఘల్లు మని వలయములు
నినదింపఁ బ్రేంకణంబునుఁ జూప - రసము
యమకంబు గమకంబు - నమరిన జాతి
గ్రమ హితాన్వయముఁ గారకముల సొంపు
సుడులలోఁ దూగు, నానుడులలో బాగు
నడకని గతియుఁ, జొప్పడినట్టి మతియు
ధ్వని, యలంకార, ముత్తమ శైలి, పాక
మనవద్య మౌచితి, యర్థవిన్యాస
మప్పుడప్పుడు గుప్పు గుప్పున వెడలి
ముప్పిరిఁగొన జేయ మోదంబు విబుధ
కోటికి - రచియింతు ఘోర దుర్జన్మ
పాటన ప్రవణుఁడౌ పండరినాథు
గుణపరిమళములు గుబులుకొనంగ
నెనిమిది దిక్కుల నెంతయు వేడ్కఁ
బరమంబుఁ 'బండరీ భాగవతమ్ము'—
నరు దరు దనఁదగు నా పురాణంబు
నకు మొదలెట్టి దన్ననుఁ, బవిత్రంబు
సకల మునీంద్ర సంశ్రయమైన యట్టి
నైమిశంబనెడు గణ్యారణ్యమందుఁ
దామస రహితులు - దత్త్వవిజ్ఞాన
సహితులు - సమ్మోద మహితులు - సుజన
విహితులు - మునులెల్ల విశ్వేశ్వరునకు
నాతత వేదవిద్యాస్వరూపునకుఁ

బ్రీతిగా సత్రంబు వేల్వఁ దొడంగి
గుమి గూడి నిష్ఠించి - విమల పురాణ
సముదయ గూఢార్థ సముపేతు - నతి వి
నీతుఁ దోషిత బుధవ్రాతు - విఖ్యాతు
సూతునిఁ జూచి విస్ఫుటవాక్యములను
నని రిట్టు లో సూత! వినయాధినేత!
మునిజన గీత! మా పున్నెంబు వలనఁ
గలిగిన దీనాడు గలిమలాపహము
దిలకింపఁగా భవదీయ దర్శనము___
నీ వెఱుఁగని యట్టి నిఖిల పురాణ
భావంబు లెవ్వియు లేవు - రూపింప
వ్యాసాదులగు మునీశ్వరులును నీవు
భాషింప వలతురు బహు ధర్మములను;
గావున మాపైనిఁ గనికరం బుంచి
వే వివరింపుము విస్ఫుట ఫణితి
దైవతక్షేత్ర తీర్థమ్ములు పరమ
పావనంబు లయిన తావెద్ది గలదొ!
అని యిట్లు మునులెల్లఁ దనుఁగూర్చి యడుగ
వినమితమస్తుడై -వనజోపమములు
గరములు మొగిచి-పింగళజటా భార
పరిణతశిరు, వారిధర నీలదేహ
కాంత కాంతిచ్ఛటాఽఽకలిత దిగంతు-
దంతుర మృగచర్మధరు, మహాశాంతు
దండమండితు, మహోద్దండ పాపౌఘ
ఖండన కుశల తీక్ష్ణ కటాక్షపాతు
సాత్యవతేయు నిశ్చల భక్తియుక్తి
మత్యుపహితుఁ జేసి- మనసారఁ దలఁచి
చిఱునవ్వు మోమున బెరయంగఁ బలికెఁ

బరమ పూరుషునకుఁ బ్రాణంబులార!
మునులార! విజ్ఞాన ఘనులార! పూత
తనులార! శాంతైకధనులార! కర్మ
పరులార! వరనయాకరులార! ముక్తి
తరుణీ స్వయంగ్రాహ భరపుణ్యులార!
చనవు సేయుటెగాక సకల విజ్ఞాన
మునకు నాశ్రయభూతులనఁ జనునట్టి
మీ యెఱుంగని యది మేదిని గలదె!
నాయందుఁ గృపసేసి నన్నడిగితిరి
ధన్యుండనైతి హస్తమ్ములు మోడ్చి
మాన్యులు మీకెల్ల మఱి మఱి మ్రొక్కి-
పండరీశ్వరునకు భక్త్యైకధనున
కండజగమనున కతి ప్రీతి నెఱఁగి
విపుల ధర్మవ్రాత విజ్ఞాతయైన
యపగత కల్మషుండైన, విష్ణ్వంశ
మైన వేదవ్యాసుఁ డర్థితో నాకుఁ
దాను బోధించిన తత్త్వంబు వట్టి
పలుకుదు వినుఁడు-సకలనాకిమౌళి
విలసిత నవరత్న వితతి నీరంధ్ర
రోచిర్వితాన విరోచమానాంఘ్రి
యాచాంత మన్మధుం, డాదిదేవుండు
ప్రమథాధినాథుండు-ప్రమథరూపుండు
ప్రమథిత రాక్షస ప్రభుశోణ శోణి
తాలక్తకాక్త సవ్యపదుండు-విధృత
శూలుండు-కలిత కంకాళుండు-కాల
కాలుండు-శాత్రవాఁభీలుండు-భయద
ఫాలుండు-సంవర్తలోలుండు-భువన
పాలుండు-రమణీయలీలుండు-భరణ

శీలుండు-శ్రితదేవజాలుండు-నీల
కంఠ ఘంటానాద కంపితాళుండు
లుంఠిత భక్తార్తి, లోలార్క-నేత్రుఁ
డతిదృప్త పలతృప్త వితత పిశాచ
నుతుఁడు-రక్షఃపరివృతుఁడు-హృత్కోణ
గతుఁడు-మహర్షిసన్నుతుఁడు-భక్తౌఘ
హితుఁడు-వేదాంతసమ్మతుఁడు నందీశ
కృతచాటు వచనుండు-హతవికారుండు
సతత శుభంకరుం డతులిత మూర్తి
భూతిభూషితుఁడు-విభూతిశోభితుఁడు
భూతభావనుఁడైన, భూతేశుఁ డెపుడు
కృపతోఁడ సాక్షాత్కరించి భక్తులకు
నెపమింత నెట్టక నిర్వాణ సుఖము
నెట్టన దయసేయు నట్టి యాకాశి
దట్టుడు-మునులకుఁ దలమానికంబు
శైవాగమాచార జటిలుండు-నిబిడ
భావనానిగడిత భవుఁడు-నిపీత
జలధి-గాంభీర్యైక జలధి-యగస్తి
సెలువాఱుచుండెడి సిద్ధాశ్రమమునఁ
దనపత్నితోఁ గూడ ఘన తపోనిష్ఠ
బనుపడ నిష్ఠించి దినములు గడప
వింధ్యమహీధ్రంబ వంధ్యగర్వమున
నాంధ్యంబు గ్రమ్మిన నఖిల లోకైక
దీపకుండైన యాదిత్యునితోడఁ
బాపనిశ్చయమునఁ బంతంబు వూని
పెఱుగంగఁ దొడఁగినఁ దఱుగంగఁ దొడఁగె
పరమ భూసుర విధి ప్రణిహితాచార
ములు-గాల గమనంబు దెలియని దానఁ

గళనేదె జగతి-భాస్కరరుచుల్మాసె
రిక్కలు రాలె-విదుక్కులు దూలె
దిక్కరుల్ మ్రొగ్గె, దిగ్భిత్తులు ప్రగ్గె
జలధులు దొనఁకె, ఖవలయంబు వణకె
బలిలోకమున సర్పకులపతి దనికెఁ
గళవళపడసాఁగెఁ గంది భూతములు
కలగుండు వడసాగె గ్రహమండలంబు
దలసూప కదఁగె సదాగతి-వింధ్య
కుల మహీధరకూట కోటి ఢీకొనఁగ
ఖంగు ఖంగున దిశాకరుల కర్ణములు
భంగంబు నొందంగఁ బలుమఱు మ్రోసె
బ్రహ్మాండ భాండ-మా పట్టున బెగడి
బ్రహ్మాది దేవతావరులు-బిచ్చవడి
తమలోనఁ బెనవడి తమ తమకైన
క్రమమున యోచించి గజిబిజిఁ బడుచు
వారును వారును వైకుంఠమునకుఁ
బాఱి-మెత్తనిపాప పరియంకమందుఁ
బవడించి-దేవతా ప్రమదలు క్రమ
నవనవోత్సాహ స్తనంబులు నిక్క-
వీచోపులిడఁగ-సంవిన్మూర్తులైన
వాచంయములు రెండు ప్రక్కల నిలిచి
తన చెన్నుపైఁ గనుల్మనములు నిలిపి
కొని-చిత్రముల విధంబునఁ బొల్చియుండఁ
గనక గర్భతనూజుఁ డనురాగ భరిత
మనమున-గాత్రమ్ము మహతిలోఁ గలిపి
యావేశ వివశనాట్యమ్ముల తోడ
భావించి భావించి-ప్రస్తుతింపంగ-
నిత్యముక్తులు సమున్నిద్ర మానసులు

ప్రీత్యతిశయమున రెండు కన్నులను
నానంద బాష్పంబు లావరింపంగ
మేనులఁ బులకలు మిక్కిలి వొదమ
మోడుపుఁ జేతుల మ్రొక్కుచునుండ.
వాడి చూపుల వింత వాలకంబమర
లలిత ముగ్గలి మండలములు చలింప
ఘలు ఘల్లుమని మేఖలలు నినదింప
సురములు నిక్కఁ జూపఁబకుఁ గాయ్వెక్కఁ
దరుణ గండస్థల భరితస్మితములు
దిక్కుల వెన్నెలల్దీపింప జేయఁ
జక్కని దెక్కులు విక్కలయాను
గతిగాఁగఁ జలియింపఁ గ్రమపాదమ్ము
లతి మనోహరరీతి వచ్చరలెల్లఁ
బ్రెక్కణమ్మునుఁ జూప-శ్రీదేవిగనుల
నెక్కొన్నచూపులు పీలముల్గులియఁ
దన పాదముల పై పుదగఁ గూరుచుండి
యనువుగాఁ బరిచర్య లాచరింపంగఁ
గొలువు దీర్చినవానిఁ, గోటిసూర్యులను
జులుకన పేయు కాంతులు గలవానిఁ
బొడసూపరాకున్న పొడవులవాని
గడలేని వాని-నెక్కడ మన్నవాని
గుణములు లేకున్న-గుణములు వొంది
గుణివోలె మాయలఁ గురియించు వానిఁ
గలిగియులేని సకల లోకములనుఁ
గలిగించి-వెలిగించి-మలగించువానిఁ
జిక్కి చిక్కనివాని-నెక్కటి వెలుఁగు
నెక్కటి-బగుతుల-దిక్కైనవాని
నిడుదఁ గన్నులవాని నుడురాజునేలు

వడువున గమపట్టు వదనంబు వాని
నెగు భుజంబులవాని-నెమ్మెదొలంకు
వగల నవ్వులుగల వాతెఱవాని
జిలుగు దుప్పటవాని-శ్రీవత్సకాంతి
కలకల లాడు వక్షః స్థలివాని-
వెడఁద పొక్కిలివాని-విశ్వవిశ్వములు
గడుకొని రక్షించు నెడగలవాని
సరిలేనివాని-నిచ్చల మైనవాని
సరగఁ జెక్కులజాఱు జవ్వాదివాని-
భువనంబు లేవియుఁ బొదలకమున్న
భవుకాలి గజ్జెలు పలుకకమున్న
జలధులు సర్వంబు నెలయకమున్నఁ
గలయంత జగతిఁ జీకటి రాకమున్నఁ
గమలంబు బొక్కిటఁ గదలక మున్నఁ
గమలోదరుఁడు శ్రుతుల్గఱవకమున్న
నటమున్న నటమున్న నటమున్నమున్న
వటపత్రశాయియై బొటవ్రేలి నోటఁ
జివుకుచుఁ దానొక్క శిశువు పోలికను
భువనంబులను బండి నవ నవ రీతిఁ
దనలోనెఁ దానవ్వి, దానికినవ్వి
తనరూపె దాఁజూచి, దానికి నవ్వి
తనపల్కె దావిని, దానికి నవ్వి
తనచేత దానెంచి దానికి నవ్వి
నవ్వుపుట్టుకఁ జూచినవ్వి-క్రీడించు
నవ్వి శ్వకారణు నఖిలాఁభి గమ్యు
వేదాంత వేద్యు, సంవిన్మూర్తి, భేద
వాదాఽవిషయు, భవభేదన ప్రవణు
విశ్వేశు; విశ్వాత్ము, విశ్వైకనిలయు

శాశ్వతానంద సంశ్రయు, గుణాఽతీతు
నగుణు, నిరంజను నిగడితభక్తు
నిగమాగ మాధీను-నగణితశక్తి
నవ్విష్ణుదేవుని నసలారఁ గాంచి-
చివ్వ నఁగరములు సేర్చి మస్తములు
వంచి-వందించి-గీర్వాణ సంఘంబు
లంచిత మగుభక్తి నాత్మలు గరఁగఁ
బులకలు దనువులఁ దిలకంబులొత్త
నిలుచున్న, నపుడింద్ర నీలాచలంబు
చఱుల నెక్కొన్న చందురుని వెన్నెలల
తెఱఁగున నవ్వవాతెఱఁ గ్రందుకొనియె
నవ్విష్ణుదేవున, శద్దాసిఁగాంచి
యవ్విరించి, దలంచి, యఖిలగీర్వాణ
గణము నివారించి, కమలాక్షుఁగాంచి
వినయ మాధ్వీకమిశ్రణమున మివులఁ
జవిఁగొల్పువాక్య సంచయములఁ బలికె-
భువన పావనమూర్తి! పుణ్యైకవర్తి!
సదమలకీర్తి, సంవిదిత లోకార్తి!
మదవినివర్తి! సమ్మద పరిపూర్తి!
జయభక్త మందార! జయదుష్టదూర
జయ జగదాధార! జగదేకవీర!
జయ నిత్యకల్యాణ! జయజనత్రాణ:
జయఫాల దృగ్బాణ! సద్గుణాఽధీన!
జయవార్ధి పుత్రీశ! శమితాఽఽసురేశ!
జయభవ భయనాశ! జయసుప్రకాశ!
జయ మహోత్పలనేత్ర! జయసుచారిత్ర!
జయ నీలపృథుగాత్ర! జయమోక్షసూత్ర!
జయభక్త సంరక్ష! జయకృపాఽధ్యక్ష!

జయ సురశత్రు భంజన దక్ష వీక్ష!
విమల మౌనీంద్ర సంవిన్మూర్తి! గనుము
గమనీయ తరములు గన్నులనెత్తి
మమ్ము నీ వారిని మా తొలివేల్పు!
నెమ్మనంబులు మోదనిభృతముల్గాఁగ
దేవాది దేవుండ! దేవతా వళికి
నీ వెరక్షకుఁడవు మావెతలెల్ల
నీవెగాకింకిట నిలుకడ గాఁగ
నేవాఁడు విని తీర్పనెక్కటి గలఁడు?
ఆలకింపుము వింధ్యమత్యవ లేప
లోలమై-త్రిభువన పాలకుండైన
దివస నాథునితోఁడఁ దెగమచ్చరించి
భువనంబులన్నిటి (బొరినాత్ర) మించి
గగనంబు దాటి-భగణలోక మొరపి
తగ నాకలోకంబుదాటి-సత్యంబు
వెనుకకుఁ దన్ని-నిర్వేలప్రతాప
మునను-వేధోండంబు మొనసిధట్టించి
పెరిగిన, దీవి యచ్చరులకు నింకఁ
దిరుగ భూములులేవు-దివసనాథునకు
గమన మార్గము లేదు_గగనంబునందుఁ
గ్రమమైన గ్రహముల గతులునులేవు
వెలుఁగులేదింక భూవలయంబునందుఁ
జెలఁగవు భూసురావళి నిత్యకర్మ
ములు-మారుతాంకూర చలనంబులేదు
నిలయెల్ల బీడువోయినది-లేదొక్క-
ప్రాణియుఁ బ్రాణంబుతోను-సంవర్త
మీనాడె దోచినట్లైన దోదేవ!
యేనేమి గావింతు నింక నా సృష్టిఁ

గానిత్తునో! లేక కన్నులు మోడ్చి
పవడింతునో! లోకపాలకుండీవా!
కవిసిన వింత్యంబో! కమలాధినేత!
దయపేయు మనినంత దైవతలోక
భయ నివారకుఁడైన వవజాయతాక్షుఁ
డల్లన మొగమెత్తి పుల్లంబులైన
మొల్లలు నల్లినపోల్కి—దయార్ద్ర
ములు గటాక్షమ్ములు నిలిపి-పన్నీరు
చెలువొప్పనంతటఁ జిలికించినట్లుఁ
బలికె నీగతి-జాలిఁబడవేల కుజ్జు॥
నిలుచునే వాడైన నియతి వింధ్యమ్ము
పెరిగినంతటన? భూసురకోటి పేగిఁ
బెరుగంగనిత్తునే! యరసితి మున్న
ధరణీధ్రగర్వంబు దలఁగు నుపాయ
మరుగుండు నా యాజ్ఞ, శిరములఁ దాల్చి
నా యగస్త్యునికడ కాతండు ప్రీతి
మీ యాపదలు దీర్చు మిన్నక యిపుడ
యని యిట్లు వచియింప నఖిలాగమాంత
వనజవనారుణుండనఁ బొల్చినట్టి
యక్కమలాక్షున కజుఁడు గేల్మోడ్చి
తక్కొన్న భక్తి వందన మాచరించి
కదలిన - వెనువెంటఁ గదలిరి సురలు
మదులు సమ్మదమున మదియించి పొదల -
నంత సురజ్యేష్ఠుడఖిల గీర్వాణ
సంతతితోఁ గూడ సరసరఁబారి
శర్వుండు దయతోడ సాక్షాత్కరించి
సర్వుల నిజ జూట చంద్రమః కిరణ
నికర నిష్యందిచంద్రికలతోఁ, దరుణ

వికచాబ్జ నిభనేత్ర విగళితాఽపాంగ
ములను, శారీరకమలములఁ జిత్త
మలముల నడఁచి - నిచ్చలును రక్షించు
నట్టి వారాణసి నప్పుడు చేరి
చెట్టు చెట్టున వ్రేలి చిందిల్లు కావి
గోవణంబులఁ గాంతి గుప్పెడుదా?
భావజ సంహార ప్రస్తుతి గీత
నినదంబులనుఁ బ్రతిధ్వను లీనుదాని -
మిను గప్పికొను హోమమేచక ధూమ
తతిచేతఁ బాప సంతతిఁ దోలుదాని -
నతి ముగ్ధ మునికన్య కాంకతలమ్ము
లందునఁ బండి రోమంథమ్ము సేయు
సుందర మృగపఙ్క్తి నందమౌదాని—
వటుజన స్వాధ్యాయ వర్ణంబులెల్లఁ
బఠియించు శౌకమ్ము వట్రిల్లుదాని
నలువొప్పఁగా మహిమ్నస్తోత్రములను
నులియు నిందిందిరంబుల నొప్పుదాని—
ఖగ గర్భ నిష్కుట గళితనీవార
నిగదిత జీవశాంతియయిన దానిఁ
బరమ పవిత్రలోపాముద్రవైన
చరణ చిహ్నముల, సున్దరమైన దాని
మునిగియమాన వేదనినాద నిభృత
తను సమీర తరంగ తతి వీచుదాని
సిద్ధాశ్రమముఁ జేరి, చిరతపోయోగ
సిద్ధ కాంతిచ్ఛటాఽఽబద్ధాఽపఘనుని
శాంతి కరండ నిశ్చల నేత్రదృష్టి
తంతు సందానితోత్తమ కుటీతలుని
రుద్రాక్ష భూతి వినిద్ర ముద్రాభి

ముద్రిత కృశిత సంపూతావయవుని
లలిత కిసాల పాటల జటాగ్రంధి
కలిత హేమకిరీట కాంతివైభవుని
ప్రతిశివనామ సంభవదార్ద్రిపులక
ప్రతతిని గూహిత వత్స ప్రదేశు -
ప్రతిశివనామ సంభవదార్ద్రిహాస
హితచంద్రికా వితానిత పురోదేశు -
ప్రతిశివనామ సంభవదార్ద్రిబాష్ప
వితతి ముక్తాశీతలిత హృదాకాశు -
ప్రతిశివనామ సంప్రభవదుత్సాహ
గతి తరంగిత కాయకాంతి విశేషు -
ప్రతిశివనామాంకురితర సావేశ
గతనైజ రవకంఠ ఘంటానివేశు
లోకైకధన్యు, త్రిలోకాఽభిమాన్యు
భీకరమన్యు, నిర్భీక చైతన్యు
విగత మాలిన్యు, సంవిద్భాగ్య - గణ్యు
న గణితపుణ్యు, దయైక శరణ్యు,
ప్రమథస్వరూపు, నిర్మథితోపతాపు
ప్రమిత చంద్ర కలాపు, ప్రమదదాఽఽలాపు
బరమ శివాఽఽచారు, భయద హుంకార
భరచలిత విమత భాగ్యవిస్తారుఁ
బంచాక్షరీ మంత్రపరు, లలాటాక్షి
వంచితమధుర శివాఽఽకారు, ధీరు
నయ్యగస్త్యునిఁ గాంచి హస్తద్వయమ్ము
చయ్యనఁద నశిరస్థ్సలినిఁ గదించి
మ్రొక్కుచు నిల్చె - నిరూపింప నీదు
దక్కువెక్కువయను తారతమ్యంబు
బరమపవిత్ర శాంభవవైధదీక్ష

పరుదారఁబొరపిన యట్టి తేజమ్ము -
గనులెత్తి చూచె నగస్తి - యక్కమల
జుని - మఱి దక్కిన సురసమూహమ్ము -
వెలఁది వెన్నెలతేట గిలకొట్టునట్టి
యెలనవ్వుఁదఱచు తెప్పల మస్తరించి -
ప్రవిమల భక్తిసంగతపులకాళి
కవచిత తనుఁడౌచుఁ గడువడిలేచి
తొడరి లోపాముద్రతోఁగూడ నఱుని
యడుగులఁబడి తక్కనమరప్రవరుల
కెరఁగి - పాద్యాది సత్క్రియలుగావించి -
సురుచిరదర్భ విష్టరములయందు
నుపనిష్టులనుఁ జేసి, యొక్కింత ప్రొద్దు
విపుల సల్లాప సద్విధి సేదదేర్చి
వినయ, మానతమైన తనువందు, నిడుఁద
కనులందు - మృదుగళ ధ్వని యందుఁబొందు
పడగ - రూపెత్తిన బత్తియుఁబోలెఁ
గడఁగి బ్రహ్మను గాంచి కలశజుం డనియె; 75
వందనం బిదెచిదానంద! గోవింద
నందన! సురబృంద నంద విధాయి!
శరణంబు లోకార్తిసంహార! మోహ
హర! యోగిదహర పుష్కరమధ్యవర్తి!
చిన్మశరీ సౌధశృంగారరూప
వెన్నెలకోలు! నిర్వేలాఽనుభావ!
యేటికోళ్లు! గుణత్రయోద్ధస్వరూప!
కూటస్థ! వేద నిష్కుట పరభృతమ!
పంచతన్మాత్రరూపా! నమస్కార!
మంచిత కర్మేంద్రియాఽతీత! పంచ
బుద్ధీంద్రియాతీత!—భూమ్యాదిక ప్ర

సిద్ధ భూతాఽతీత!—సిద్ధిస్వరూప!
విషయస్వరూప! నిర్విషయ! విజ్ఞాన
విషయ! మోక్షానంద విషధి! భవార్తి
విషజాంగలిక! పూత! విశ్వాఽప్రతర్క్య
సన్నుతమూర్తి! విజ్ఞానసంపూర్తి!
సుషమాపరిష్కృత! శుద్ధకర్మాధ్వ
తోష స్వరూప! నిరీషణ! ముక్తి
భూషణ! సందేహదూషణ! భక్త
పోషణ! భక్త్యబ్జపూషణ! దుష్ట
భీషణ! శ్రుతితతి భాషణ! శోక
శోషణ! మునితపస్సుందర ఫలమ!
యాశాస్యమయ్యె! మీ యాగమనంబు—
బహుతపంబులనైన, బహుళయాగాది
విహితనిష్ఠలనైన, విధి బద్ధయోగ
మహితశ్రమలనైన, నహరహరుదిత
బహుజపంబులనైన, భక్తిమార్గముల
నైనఁ దాంత్రికములనైన, త్యాగముల
నైన, వ్రతమ్ములనైన, నిత్రులను
నైన, పునశ్చరణంబులనైనఁ
గానరానట్టి పోకడగల నీవు
బొడసూపితివి ముందుఁబొడవయి - నేడు
గడముట్టె నాపుణ్యకర్మంబులెల్ల
గంగపంగువు పైనిఁగడుకొని పాలు
భంగిగానయ్యె నర్వాక్షరాగ్రూప!
జలధికిఁ బాద్యపూజావిధానంబు
సలిపి, యొప్పింపంగఁ దలమగునేమి!
దినకరునకు వికర్తనునకు దీప
గణములచేఁ దృప్తిఁ గలిగింప నగునో!

కొండంతదేవునకునుఁ బ్రయత్నమునఁ
గొండంత పత్తిరిఁ గూర్పఁగాగలమొ!
యఖిలస్వరూపున కఖిల శక్తికిని
నఖిలనిదానున కఖిలైకకర్త
కీ నీకు మా సాయమెంత! మాశేము
షీ నిపుణతయెంత! చేసెడు భక్తి
యెంత! సూపెడు శ్రద్ధయెంత! సన్నిష్ఠ
యెంత! శక్తియదెంత! యెంత మాకూర్మి!
యౌపచారికముగా నడుగుటెగాక
బాపనివర్తి! సద్భావప్రపూర్తి!
యడుగుచున్నాను, నాయడుగునీదొసఁగు
నిడఁబోలదయ్య మీయెడను, నియ్యెడను
బాలచాపలముగా వగచి—సత్కరుణఁ
గిలించి—బదులివ్వఁ గృతమతి నగుదు—
వినవచ్చునో మీరు విచ్చేసినట్టి
పని! వినఁదగునేనిఁ బ్రార్థింతుమిమ్ము
సెలవిండు! నాసేయుసేవ గల్గినను
దలఁదాల్చి యానతిఁ దలకూర్తుననుచుఁ—
దరువాత సరసిజోదరుఁడు—విజ్ఞాన
పరిపూర్ణుఁడగు ఘటభవుఁడన్నయట్టి
మధువులు—పెఱతేనె మడువులు—కూర్మి
పొడవులు—దనపొత్తి తొడవులు—నెఱక
కడవలు—వినయంపుఁబడవలు—శ్రుతుల
మడవలు—దుష్టిసొప్పడ నాలకించి—
యెనిమిదికన్నుల నినుపారి మివులఁ
దనుపారు జూపులఁదపసి వీక్షించి—
చెలువొప్పనప్పుడ చేయప్పళించి
బలు మొగంబున నిట్లు బలికె విధాత—

పరమర్షి! రమణీయతర వినయమునఁ
బరిగుప్తమై జ్ఞానబంధురంబైన
నీయుక్తి పేశల నీరదాఽఽపిహిత
మై, యింపునింపు సుధాంశునిలేఖ
వలె, నలగప్పినత లిరుల వెనుక
వెలసి తావులుసిమ్ము విరిగుత్తివోలెఁ
గరము మాచిత్త మాకర్షించె—జ్ఞాన
భరమెల్ల నినుఁజేరి చరితార్థమయ్యె—
నదెచూడు! సమ్మీలితాక్షుడై, దీన
వదనుఁడై కూర్చున్నవాఁడె జముండు—
హుతవహుండదెగాంచు! వితథకీలుండు
గుత కుత యని లోనె కుములుచున్నాఁడు—
శక్రుఁడాతండె! నిర్వక్ర విక్రముఁడు
నాక్రమితుండయ్యె నలజడి చేత—
వరుణుఁ డాతండె నిష్ఠ రపాశుఁ డిపుడు
వెరవేది—మినువీది—నరయుచున్నాఁడు
యాతుధానుండదే యటుసూడు! శోక
పీతప్రభుఁడు—కచ్చుపీటఁబోయినది
బవనుఁడవ్వాఁడె తీవ్రావ మానమున
నెవమించుచున్నాఁడు నిట్టూర్పుఁ బొగలు
వాఁడె కుబేరుండు! వనట యంతయును
గూడు గట్టినమూర్తి—గూరుచున్నాఁడు
నలిగిన చంద్రమః కళగల్గి—మస్త
మిలవంచె నీశానుఁడీతఁడే సుమ్ము!
మఱిసిద్ధసాధ్య కిన్నరనర ప్రముఖు
లిరుఁగెలంకులనీరె! యిడుమల జడిసి—
మునులెల్ల వీరె చిద్ఘనులు బవిత్ర
తనులు—క్రియానిఘ్న దళిత మానసులు.

వీరెల్ల నీప్రాపు వేడంగఁజేరి
నారిట బెద్దగా నన్నుఁ గీల్కొల్పి—
యిందఱకుపకార మిపుడు నీ వలన
సంధిల్లవలె - లోక సౌఖ్యంబుగూడఁ—
దరువుల ఫలములు దనుపారిపండఁ
దరువులు భుజియింప దొరకొనునేమి?
జలదంబునందు నీళులు పెచ్చుపెరుఁగ
జలదముల్ద్రావునో జనములకీక!
సజ్జనుల్గావించు సర్వతపమ్ము
లిజ్జగముల సేమమిచ్చించి గాదె!
యటుగాన జగములకై నట్టిపేగి
పటుబుద్ధి! నీవనివారింప వలయుఁ
బరికించితివొ లేదొ! పరమర్షి! వింధ్య
ధరణీ ధరమ్ము భాస్కరునకు నలిగి
యంతబ్రహ్మాండమ్ము నావరించినది-
చింతింపు మొకదారి- సెలపిన వింధ్య
మదముదూలింప-నమరులఁబాలింప
ముదము పెక్కువజగమ్ములను దేలింప
లోక హితంబైన యాకార్యభరము
వీఁకున గొని-పిరువీఁకు లేకుండ
నిర్వహించెడువాఁడు నీవు దక్కంగ
సర్వదేవతలకు-సకలైకనేత
వాసుదేవునకు నెవ్వరుఁ దోచలేదు-
ప్రాశితజలధి! దబ్బఱమాటగాదు-
దనుజారి పనుపుచేతనె సురౌఘమ్ము
మునులు-నీ సాహాయ్యమును గోరివచ్చి
రెటులైన నీ కార్య మీడేర్పవలయు
కటకీకృతశ్రుతి! కమలనేత్రుండు

పనిచిన సమ్మతింపక యుండనగునె!
మునిశిరోలంకార! బోధావతార!
యన-నంతఁగల శజుఁడల్లంత ప్రొద్దు
వినుజూచి-మనుజూచి-కనుఁగవమోడ్చి.
యోచించి' వేడి నిట్టూరుపు వృచ్చి
యాచితంబైన కార్యంబు సాధింపఁ
దనచాలుటయు' నిందుధరుఁ బాసిపోవఁ
దనచాలమియుఁ దెల్పు తలఁపులోఁ గలిగి
"యగునులో కావశికైనట్టి యిట్టి
యగచాట్లు వారింప-నగును శ్రీ విష్ణు
నా నతియొనరింప-నా మహాదేవుఁ
డేనన్ను నియమింప నింకనొండేమి?
గాని-శాపంబివ్వఁగాదు వింధ్యమున
కేనిప్డు-దానిచేనింకు నాయోర్మి
క్షమలేని తపము నిక్కము వితయందు
రమలినచిత్తులైనట్టి సంయములు-
మఱి-నయమ్మువఁ జెప్పి మాన్పింతునన్నఁ
దరముగా-దతిదర్పదశ తచిత్తులకు
సామంబుహాస్య భాజనమౌను-గానఁ
బాములవలెఁ గఱువకయున్ననైన
విసము గుప్పెడునట్లు బుస కొట్టవలయు
ననలార నే నిప్పుడా వింధ్యశిఖరి
కడకేగి' యోవత్స! నడువంగఁజాలఁ
బొడవెక్కుడగుటచే వడిఁదగ్గుమన్నఁ
దగ్గునాతఁడు భయంబగ్గలింపంగ
నగ్గిరీంద్రముఁ జూచియనవలెనింక
ననఘ! దక్షిణ దేశయాత్ర గావించి
పునెముఁ బండించినేఁబోదునో?యేమొ

వారాణసికిని-నా వచ్చెదు వఱకు
నీ రీతినే యుండు-మీ నియమంబుఁ
దప్పితివేని దగ్గ మొనర్తుశాప
మప్పుడ యొసఁగి యటంచు-నేమఱల
రారాదు-నెనుదిర్గి వారాణసికిని
నీరీతిగా నెఱవేఱు మీ హితము-
గాని ప్రాణములుండ ఖండేందుధరుని
నేను బాయఁగనోప, నిము సమ్ముగాని"
యని పల్కిన యగస్తి నభివీక్షసేసి
వనజగర్భుఁడు గాఢవాత్సల్య మొనరఁ
బలికెనీగతి సుధాకలిత వాక్యములు-
కులపతి! విజ్ఞాన జలధి! నీ కిట్లు
సామాన్య మానవ సాదృశ్యమొనర
నీ మాటలాడంగ నెట్లు సెల్లినది
వైరాగ్యమున సర్వవాంఛలు గోసి
ధీరులై-నడిసన్నవారు-మీవంటి
వారెమోహము నొంద-ధారుణి నింక
నేరు మోహాదుల నింకింపఁ గలరు!
యా పశుపతి యఖిలాంతరస్థుండొ!
వ్యాపకుండేకత్రవర్తి దానగునొ!
యొకసారి నీ మది యోచింపనయ్య!
సకల విశ్వాత్ముండు; సకలాఽధినేత
సకల హృద్గృహవాసి, సకల విషయుఁడు,
సకల చిన్మయమూర్తి, సకల కారణుఁడు
లేనట్టి తావెందు లేదంచు నేఁడు
నేను గ్రొత్తగఁ జెప్పి నిశ్చయింపుదునొ!
వెలి చూపుఁగాక లోపలిచూపుఁ బూని
తిలకింపు నీ చిత్త జలజంబునందె

వెలుఁగుచునుండు నిచ్చలు దీపకళిక
వలె-మానితానంద వనకోకిలమ్మ-
అది గాక జగములకైన యాపత్తు
మదిగదింపకయ-సామాన్యుల యట్లు
స్వార్థమ్ముఁ బూనిన సకలమునీంద్ర
సార్థమ్మ నిన్ను నేసరికతోఁ గనదె!
తీర్థభూతుఁ డవింత దెలియంగలేవా!
స్వార్థమ్ముకంటె పరార్థమ్మ ఘనము-
గదలి రావయ్య! లోకములెల్లఁగంది
ముదమేదినవి-వింధ్యమదమునఁ బెగడి-
నిఖిలలోకమ్ములు నీయశోగరిమ
సుఖితులై గీర్తించు శుభసమయమ్మ
దనకుఁదావలచి ప్రాప్తముగాఁగ "నేర"
వనెదవె! చాపల్యమున కోహటించి
జడునట్లు-లోకైక శరణుడైనట్టి
మృడునకు నీ పని మిక్కిలి 'సేవ"
యని యిట్లువన జాతతను జాతుఁడంతఁ
బనుపడ విజ్ఞాన వాదమ్మ సేయ
ఘటసంభవునకు నఖంపచబాష్ప
పటలమ్మ జటిలమై బర్వెఁగన్దోయి
నాపొంగునొకచేత నల్లనఁదుడిచి
తాపదిగ్గములు-పృదాకుదీర్ఘములు
పదుపులుగట్టి నిశ్వాసముల్వెడలఁ
బదరవాతెఱ-దుఃఖమ్ముదితమై నిలువు
కళనేద-గాద్గద్య కలితవాక్యముల
జలజసంభవునితో "సరి" మీ యనుజ్ఞ
సేకొంటి ననిరెండు సేతులుమోడ్వ
నాకౌకసులు మహానందంబుతోడఁ

దలలనల్లార్చిరి-ధాతయుఁబ్రేమ
విలసితంబగు కంట విధుశేఖరునకు
నమఁగై నమునిఁ జూచియార్య! మేనింకఁ
జనిమెద మన్న-వాచంయమిశ్రేష్ఠుఁ
డల్లనల్లార్చె నక్షిద్వయంబు
నెల్ల దేవతలతో నేగెవిరించి-
పదపడిమౌనిలో పాముద్రఁగాంచి
మదిదుఃఖ వివశమైయదవదలాఁడఁ
గనుఁదోయి దృష్టినాకట్ట జలమ్ము
దనకరమ్ములు రెండు దలఁబూన్చి పలికె
"వినినావా లోలాక్షి! విధుసూనుజాణ
తనము మాటలయందు-దైవతగణము
దయసేసి వచ్చిన దానికారణము?
నయవిశారదులెల్ల నా కాకసులును
దిన్నఁగాఁ దప్పించికొన్నారు దాము-
వన్నేరికొన్నారు నాతి! యిప్పనికి-
సకలలోకాధీశులకు-విబుధాళి
కొక కొండ మచ్చర ముడివించు టెంత!
దురితరాక్షస మహత్తర కంఠదళన
ఖరకోటి, హరికోటి, వరశతకోటి
శతకోటి సమసుదర్శనమున్న దివిజ
తతిపాలకునకు నా దామోదరునకు
సాధ్యంబుగాలేదా! విధ్యగర్వంబ
వంధ్యవిక్రమమున వారించుకొఱకు?
సాధ్యంబుగానల్లె చపలాక్షి! సిద్ధ
సాధ్యాదులగు వియచ్చరనికరంబు
బడుగుబాపనిఁ జేరఁ బంపించినాఁడు
నుడువంగనేల విష్ణునిపాడియింక!

నతని యానతి దాట నర్హంబుగాదు
సతి! నాకుఁ బార్వతీపతికి మిత్రుండు
హరిహరు లిరువు లేకాకార మనుచుఁ
బరమార్థ విదులైన పురుషుల హితవు
గావున—విష్ణునాజ్ఞను శివునదిగ
భావింపవలె-ముని భావిత రీతి
వారాణశీశ్వరుఁ డీ రూపమునను
సారసనేత్రి! యాజ్ఞ నొసంగినాఁడు
నామదిలో నేమి నలుసుదోఁచినదోఁ
సోమార్ధధరునకుఁ జూడవే బోటి!
నేటికిఁ గాశికా నిర్మల భూమిఁ
జోటులేదని నాకు సూచించినాఁడు-
నని యట్లు పనవెడు తనభర్తఁ జూచి
వనితావిభూష-లోపాముద్ర-భర్తృ
చరణయుగధ్యాన పరతంత్ర వృత్తి-
ధరణి జనించిన దాక్షిణ్యగుణము
ఫాలస్థలము గిలుబాడెడు నలక
జాలమ్ము నొకచేత సవరించికొనుచు
నొకవైపుఁగను బొమ్మనున్న మితంబు
నకియ-గావించుచు క్షణము యోచించి
యోచనాంతరమున నొక కొంత నవ్వి
వాచంయమిని గాంచి వచియించె నిట్లు
"సకలవిజ్ఞానైకశరధి! గాంభీర్య
పరిధి! నీ వెఱుఁగని బహు ధర్మములను
నే నెఱుంగఁగ నేర్తునే! యేటిమాట!
కాని-నా దొక్కటి గలదు విన్నపము
వారాణసీపురిఁ బాయఁ జేయుటయె
యారాజశేఖరు నభిమతంబైన

జంకనేటికి! జంకిసాధించు టేమి?
యంకమై నిలువంగ నగునొ భక్తులకు?
పరమేశ్వరుని మనోభావమ్ము నెదిరి
తిరుగంగ నెవ్వారు దిట్టలు గలరు?
అదిగాక జగములకైనట్టి పేగి
వదలింపలేని తపంబు-నన్నడుగ
ఫలహీనమందును-పరుల దుఃఖమ్ము
నలతిగాఁ జూతురే! యధ్యాత్మవిధులు!
వినఁబడఁగాలేదొ! వింధ్యపర్వతము
మినుదన్ని పెరిగిన మిక్కిలి భయము
దముఁ బొదివిన దుఃఖదళిత చిత్తముల
శ్రమఁజెంది ఘోషించు జనుల రోదనము!
గదలలేదొకపిట్ట-గాలియుఁగూడ
మెదలలేదిటులున్న మేదినిపైని
బ్రదుకంగ నోపుదురా! మర్త్యగణము!
కదలుము వేవేగ గర్వాంధ వింధ్య
పర్వతాటోపమ్ము భంగింపఁజేసి
సర్వలోకములకు శాంతిదానమ్ము
గావింపు-నీ చేయు గహనతపమ్ము
గావింపు నేఁడు నిష్కలుష! సార్థకము
విశ్వసంపూజయే-విశ్వేశు పూజ
విశ్వాత్ముఁడతఁడు సంవిదితవిజ్ఞాన!
యింక నుపేక్షింప నెంత కీడౌనొ!
శంకింప నేటి కీ సమయంబునందె
బదఁడు పోదమ"టన్న భార్యనీక్షించి
యదవదయైనట్టి యాత్మనొకింతఁ
గుదుటనఁ గొనితెచ్చి కులపతి యంత
సుదతి! నీ విజ్ఞానసూచకంబులగు

మాటలలోఁ గొంత మదిదేరుకొనియెఁ
బాటిగాఁ గొందు నీవాక్యమ్ము-బదము
నేఁడ ప్రయాణమై నియతినటంచుఁ
గూడియుండెడు వటుకోటి రావించి
తనతోడఁ గదలంగ ననుమతి సేసె
ముని గొందఱిని-దక్క- మునికుమారకుల
నచటనే నిలచి నిష్ఠాంచితు లగుచు
నచలిత తపము సేయఁగ నానవెట్టెఁ—
దమయాశ్రమము వీడి తరలుచున్నాఁడు
నమితాఽమరేశుండు-శమదమరిక్థుఁ
డ య్యగస్త్యుం డను నా వేడిపలుకుఁ
జయ్యన నెవరేగి చాటినవారొ!
మునితపోమహిమచే, ఘనవింధ్యగర్వ
జనితదుఃఖ మొకింత చవిచూడనట్టి
యయ్యాశ్రమములోని యఖిల జీవాళి
యయ్యవసరమున నలమటఁగుందెఁ—
బూరి మేయదు చింత గూరి సారంగి
మోర పైకెత్తి మబ్బులఁ దిలకించెఁ
గరము ముడ్చినది కుంజరము-కిసాల
పరివార మల్లన భక్షింపఁబోదు-.
మూగవోయినది-సమ్మోదంబుతోడ
రాగంబు వాడదు భ్రమరాంగనయును
ఱెక్కలార్చదు-మెడ నిక్కించి కనదు
వెక్కలి-మ్రాఁగన్నువెట్టెఁ గీరమ్ము-
సరసులలోనున్న సరసీజపంక్తి
విరహదిగ్ధమ్ము-వాతెఱనిప్పలేదు-
దలలార్పలేదు పూవులు-మయూరములు
లలితపింఛచ్ఛత్రముల నార్పలేదు-

దరుణిలోపాముద్ర దయతోడఁ దాన
యరసి రక్షించిన యట్టి వల్లి వి
తానంబులెల్లఁ జింతాధీనములయి
దీన దీనంబుగాఁ గానుపించినవి-
యంత నగస్తి—భార్యామణి, దాను
సంతాపహృతకాంతి సంతానుఁడగుచు
జనకునికై వడిఁ దనుఁజూచికొనుచుఁ
దనవెంట వచ్చు గొందఱు వటూత్తముల
తోఁ బయనింపంగఁ దొడఁగె వా రాణ
సీబంధుఁడగు శివుసేవల విడచి -
వాసవప్రముఖ దివ్యాఽభికాంక్షితము
కాశినివాస సౌఖ్యాతిశయమ్ము
నెలతాల్పు నెనరుఁజూపులలోని చలువ
ఘొలపంబు—శ్రీయన్నపూర్ణాకిసాల
కరవిలసద్రత్న కంకణక్వణన
భరిత భిక్షాదానపరమసౌఖ్యమ్ము
దలఁపునఁ బాఱె నత్తపసికి—మదినిఁ
గులిశంబుఁ గొని తెగగ్రుమ్మినట్లయ్యె—
వణకంగఁ దొడఁగెను దనువెల్లఁ దనుకు
దనికిఁ గంఠమ్ము గద్గదమయ్యె—బిట్టు
విలపింపఁ దొడఁగెను విశ్వేశుగుఱిచి
తలిఁ బాయు బిడ్డవిధంబున నతఁడు—
"బలుకరా! నాతండ్రి! ప్రమథాఽధినాథ!
పలుకరా! నావాఁడ! భక్తనిధాన!
పలుకరా! పార్వతీపతి! చిదాకార!
పలుకరా! వాసుకివలయ! భూతేశ!
భూతభావన! ప్రాణభూత! భక్తుల
తాత! నతత్రాత! శీతాంశుమౌళి!

భవరోగహరణ! దైవతగణశరణ!
శివమూర్తి! విధుతార్తి! చిదచిదానంద!
పదికోట్లు ప్రమధులు బలసి వేష్టింప
నదితిసంభవుల యుతాయుతుల్గొలువ
నసురు లసంఖ్యాకులై చుట్టియుండ
విషమపిశాచులు వేనవేల్గొలువ
భారంబుగాలేదొ! భారమై నావొ!
యేర దయామూర్తి! యేనొక్కరుండను!
రక్షించుఁబోనన్ను త్రీక్షణుండెప్పు
దక్షీణమగు దయ నన్ను నమ్మకము
నేలపాలుగఁజేసి—యీలాగు నన్ను
నేలరా! నా తండ్రి యెడబాపినావు!
వారాణసీపురిఁ బాపుటకన్న
ఘోరాసిఁ గొని నాదు గుత్తుకఁ ద్రెంపఁ
గూడదా! తలఁబొడఁగూడదా! యిట్లు
పీడింపనేలరా! విషజకోటీర!
యన్నపూర్ణాదేవి యమృతహస్తమున
నన్నంబు పెట్టంగ నఖిల చింతలను
బాపి—సుఖంబున్నబడుగు—నాపైని
వేసితీభారమ్ము—వేయఁగారానొ!
నీసుతులందొక్కనికి వారుగాక
నీసరస వసింప నేనె బాహ్యుఁడదొ!
ప్రళయకాలమున్నందు, భయదహుంకార
వలయవిఘూర్ణితాఽచలసముద్రాది
గళితలోకాళిపై—ఘనకరాక్షేప
ముల దిక్కులను మీటి—వలయంబులందుఁ
బిడుగులు నినదింప బెడిదంబుగాఁగ
నడుగులనిడి—తాండవారభటమ్ముఁ

గావించు నీకును—నావింధ్యమదము
ద్రోవంగరాదయ్యెనో! విరూపాక్ష!
నీవుగావలెనేమి! నీయాన యున్నఁ
గావలుండగు వింధ్యుఁ ద్రోవఁగాలేడొ!
ధీరుఁడైనట్టి నందీశుఁడొక్కరుఁడు?
మారమారకుఁడ! ప్రమథకుమారకుఁడు
జాలఁడా! యొక్కండు శైలగర్వమ్ము
దూలింప—జగములఁ బాలింప నిపుడు
పరమూర్తి! నే నేడ దొరకితి నీకు!
వెరవునఁ జూచి మోపెత్తించు కొఱకు!
పోయివచ్చెదనయ్య భుజగభూషణుఁడ!
పోయివచ్చెదనయ్య! పూర్ణేందుధరుఁడ!
పోయివత్తును కృపాపూర్ణ! పురారి!
పోయివచ్చెద నన్న పూర్ణాధికారి!
నీ యిల్లు దాటించి నేఁడు ద్రోపితివి
నీ యాన నికరానులే! యమనియమ!
నా నీడ సోఁకదులే నీకు నింక
కూనపై దాక్షిణ్యగుణము మానితివి!
పోయివచ్చెద నన్నపూర్ణ! మాతల్లి
నీయింట వసియించి—నీపెట్టునన్న
మును భుజించెడు పున్నెమును నోచలేదు
నను వెడలించెనే! నాగారి నేఁడు—
నీవైనఁ జెప్పవే! నిఖిలపవిత్రి!
భావజారికి నాదు పరిదేవనమ్ము!
వినునొ! వినండొ! చందనగంధి! నీకు
ననుఁగూర్చి యేటికే న్యాయనిష్ఠురము
లుడువుము—శివునకేఁ గడయైతి నింక
దొడుకొన నెవ్వరితోనేమి నాకు!

మఱవకువే నన్ను గిరిరాజపుత్త్రి!
మఱల నిన్గను నవసరము లేదమ్మ!
కాలభైరవ! క్షేత్రపాలక! నెనరుఁ
దాలిచి—నీవైన దయసేయవయ్య!
కైవల్యమణికర్ణికా! మణికర్ణి
కా! వచ్చెదను దల్లి! కనికరంబుంచు
మునిజనలక్ష్యంబ! ముక్తిమంటపమ!
నను మఱ్వఁబోకు మనమ్మునయందు
దుర్గ! వశీకృతభర్గ! దత్తాఽప
వర్గ! నే నికఁ బోయివచ్చెదనమ్మ!
లోలార్క! నీమొగసాలలో శాంతిఁ
దాలుచు పుణ్యంబు దప్పిపోయినది
కుక్కుటేశ్వర! నీకుఁ గొదలేని వేయి
మ్రొక్కులు ననుమఱ్వఁబోకయ్య! తండ్రి!
వరకృపాకర! దండపాణి! నీ చెలిమి
మఱవను! ప్రేమనే మఱెదవోయేమొ!
వెడలించితివిగాని—యెడఁదలోఁ బ్రేమ
వెడనూకకోయి! గాశీవిశ్వనాథ!
వెడలివత్తును డుంఠివిఘ్నేశమూర్తి!
యెడవిస్మరింపకు మెపుడు నాతండ్రి!
గంగ! యభంగతరంగ! సితాంగ
సంగశృంగారిత! సకలైకధాత్రి!
జలపక్షికుల కల కల మృదురాగ
కలితమనోజ్ఞ శీతలజలభరిత!
నీయంకతలముపై నిలచి—తానమ్ముఁ
బాయక కావించు పరమభాగ్యమ్ము
దీఱిన దీనాఁడు—దీర్చినాఁడమ్మ!
యారాజకోటీరుఁడతి దయాపరుఁడు!

వోయివత్తును మఱ్వఁబోకమ్మ! సౌఖ్య
దాయకి! యేనాఁడు దరిసెనం బగునో!
గలహంసి! నాతోడఁ గదలిరావమ్మ!
బిలిచిన వచ్చెదవే! నెమ్మినుండి!
కదళికాకాంతర! గదలిరావోయి!
యెదవెతారమున నీవేల వచ్చెదవు!
శ్రీవిశాలాక్షి! విచ్చేయు నాతోడ
నీవేలవత్తు! గాశీవిభుఁబాసి
వటుకనాథా! నీవు వత్తువా! స్వామి!
"యెటువత్తు"నందువో! యీపురిఁ డాసి
హరపదవివశమస్కరులార! దోడఁ
బరతెంతురా! యేలవత్తురు మీర"
లని యిట్టులేడ్చుచు నలజడితోడఁ
బనవినమాటయే పనవుచు-సారెఁ
దల మల్చిచూచుచుఁ-దద్దయుఁ బాద
తలములు వడకంగ నిలుచుచు-నిలిచి
కూలఁబడుచు-భూమి సోలుచుఁ దాల్మి
దూలుచుఁ-దవదైన లోలాక్షిపైని
నొఱఁగుచుఁ బ్రాణమ్ములురుగ కోటీరు
చరణస్థలంబునఁ బరిజుట్టి నిలిసి
తను తనుమాత్రుఁడై తరలె మునీంద్రుఁ
డనుసరించుచు రాగఁదనభార్య-వేద
పురుషుని వెనువెంటఁ బొల్పెపలార
నరుదెంచు శ్రౌతక్రియామూర్తి వోలె-
బలితపాటల జటావిలసితమూర్తి
కులపతి-యీరీతిఁ గులపత్నితోడ
నెల్లదైవతముల కేటికోళ్ళిచ్చు
వెల్లతీర్థమ్ముల నెలమిఁ గ్రుంకుచును

వనములు దాటి-పర్వతములు దాటి
ఘనసరిత్తులుదాటి-జనపదంబులను
దాటి-లోకావన తత్పరత్వమునఁ
బాటింపకేపాటి పథిఁ బ్రయాసమ్ము
ననతికాలమున వింధ్యాఽధిత్యకలనుఁ
బనుపడ దరిసినఁ బర్వతేంద్రంబు
దూరంబునందుండి-ధారుణీతల వి
హార కౌతుకమది ప్రేరేప-రూపు
వడసి-యేతెంచు శబ్దబ్రహ్మవోలెఁ
గడుమించుమునిని-వెన్కనుఁబూతమైన
వాక్కనుఁ బోని లోపాముద్రఁగాంచి
నెక్కొన్న భక్తిచే నిలువు వణంక
వణఁకుఁ దనువునందుఁదొనకంగఁ బులక
లనురాగ మది గొంత-యద్భుతం బింత
సంతసం బొక గొంత-సరళత గొంత
వంతయుఁ గొంత నంతంతఁ బొంగార
నేపార మానవరూపంబు దాల్చి
యాపుణ్యునకు నెదురై వచ్చి నిలచి
వినయంబుతోడుత వినతి గావించి
తనశిరంబునఁ జల్లికొని పదధూళిఁ
గరముల మార్గంబు గానుపింపుచును
వరమునిఁ దోడ్కొనివచ్చెడు నపుడు
జలజల రాల్చెఁ బూవుల లతానివహ
మలనల్ల లేఁతగొమ్మలు దూగియాడఁ
బించగుచ్ఛమ్ములు విప్పి నర్తించె
నంచితగతి మయూరావళి, ముందుఁ
బలికెఁ గోయలపదుపులు-రక్తగాత్ర
ముల నెత్తి పికాసమూహమ్ము వోలె-

మారుతాపూరిత మంజులవంశ
వారమ్ము మ్రోసె నవార్యరీతిగను-
జలధరమ్ములు సితచ్ఛత్రమ్ము లగుచు
నలసంబుగా వెంటనంటి యేతెంచెఁ-
జమరీగణంబు-పుచ్ఛ సుమగుచ్ఛముల
రమణింపఁగాఁ జామరలు వీవఁ దొడఁగె-
నీరీతి రాజోపచారంబు లొనర
ధారుణీంధ్రముతోడఁ దపసి యేతెంచు
చును-డప్పినటు నేలసోలి కూర్చున్న
వనజాతనేత్ర-లోపాముద్ర గూడ
నధరశుక్తికనవ్వు లల్లలనాడ
నదిరిపాటున నేల నధివసించినది-
మునిశేఖరుండంతఁ గనుబొమ లెత్తి
యనె వింధ్యశిఖరితో-ననఘ! యుత్తుఁ
తనుఁడీవు-దుర్బల తపసిని నేను
నిను గమియింపగా నేరఁ గావునను
సామాన్యశైలంబు లీమహి నొప్పు
నేమంబుతోఁ గ్రుంగు నేలకు నిపుడు
గాదంటివా! నే నగస్తి సుమ్మంచు!
నాధారుణీధరుం డల్లలనాడఁ
జేతమ్ము-దుఃఖసంపీతుఁడై-గడు వి
నీతుఁడై-శాపమ్ము నెత్తిపైఁ బడునొ!
పిడుగుపోలిక యని భీతిల్లి-మౌని
కొడఁబడి-తనగర్వ ముత్తుత్తగాఁగఁ
బేరిమి విడచి-కుశీరంబు వోలె
ధారుణిఁ గ్రుంగె-దుర్వార తపోధ
నులకు నసాధ్యంబు గలుగునే! పుడమి;
జలజాప్తుఁ డంతఁ దీక్ష్ణకణాళి బెరయ

నలువుగా-గగనాంగణమ్మున మెఱసె-
బలభేది ముఖ్యదేవాళి-విమాన
పదగతులై బిట్టు బలికిరెన్మంద్రుఁ
జదలు మార్మ్రోయంగ-సాధునాదంబు
లప్పుడగస్తి-వింధ్యాద్రి సభక్తి
నప్పనం బొనరించి నట్టి సేవలను
గైకొని-శిరమంటి కరము దీవించి
"నాకిక నీదక్షిణాశకుఁ బోవ
వలయును దీర్థయాత్రలు దీర్చుకొఱకుఁ
గులమహీధర! సముజ్జ్వలతుంగదేహ!
నావచ్చునంతకు నీవిట్లె యుండఁ
గావలె-నామాటఁ గాదనకుండ
నని ధీరముగ నన్న-నాపల్కుఁ గూడఁ
గొనియె శాపభయమ్ము గూరి వింధ్యమ్ము-
యీరీతి వింధ్యమహీధరాఽహంత
దీరిచి-దయఁజూచి-ధారుణికైన
నెగులు దప్పించి మునీంద్రుండు-వింధ్య
నగపతి సాగనంపఁగ-వర్ణికులము
లటవీస్థలములెల్ల ననువదింపంగ
జటలు గుణించుచు సరిఁజనుదేఱ
వెడలి-నానాతీర్థ విసరముల్గనుచు
మడఁతుకతో స్వామిమలసేరి-కార్తి
కేయు-నజేయు-దైతేయ భీదాయి
కాయు-సత్పురుషాఽనపాయు నీక్షించి-
సర్వాంగములతోడఁ జాగిలి మ్రొక్కి-
పర్వినభక్తి నీశ్వరునకనుంగు
మునినిల్చినంత-నమ్మోదంబుతోడఁ
దన బాహునిబిడ బంధమ్మునయందు

గదియించికొనె నీలకంఠ వాహనుఁడు-
తదుపరి-భామినీ తతి తరళమ్ము
పరమపవిత్ర-లోపాముద్రగూడఁ
గరము భక్తినిమ్రొక్కెఁ గార్తికేయునకు
నాతిథ్యమునుఁదీర్చె నా దంపతులకు
నాతతనుతి గిరీశాత్మజుండంత
మునిఁజూచిపలికె శంభునికుమారుండు
"దనతోడనొక కొన్నిదినములుగడప
లెవ" నని-కులపతి "వల్లె" యటంచుఁ
దలనార్చె-మనము సాంద్రానందమొందఁ
బ్రతివాసరంబు తీర్థాది మాహాత్మ్య
మతి చతురతను సన్నుతిసేసి చెప్పఁ
దొడఁగె మహాసేనుఁడఁకువతోడ
జడదారి వినుచుండ-సతీతోడఁగూడి-
యొకనాఁడు గార్తికేయుఁడు దనతోడ
నకలంక తీర్థమాహాత్మ్య వర్ణనము
సలుపుచునుండెడి సమయంబునందుఁ
గులపతికౌతుక కలిత చిత్తమున
దేవసేనావిభుదృఢభక్తిఁగాంచి
యీ విధంబునఁబల్కె "నిద్ధ విజ్ఞాన!
యీ వెఱుంగనిగాధలేవియు లేవు
భూవలయంబునఁ బురుడు నీకెవ్వ?
రొక్కటి సందేహమున్నది నాకు
నిక్కంబుగాఁజూడ నీవు దక్కంగఁ
దెలియఁ జెప్పఁగ వలంతులు మఱి లేరు
విలసిత వేదార్థ వేత్తలౌ వార
లది యేమటందువో! యనఘ! యీధరణి
సదమల తీర్థముల్గాలఁగఁగలవు

మూర్తులు గలవును-మోక్షదామములు
గీర్తనీయమ్ములు క్షేత్రములగలవు
గాని-తీర్థంబున్న కడమూర్తిలేదు
కానము-క్షేత్ర సంకలిత తీర్థమ్ము-
నీరెండుఁగలిసిన నెనయదు మూర్తి
యారయ నదియున్న నమర వీరెండు
నొకచోటఁ దీర్థమత్యున్నతిఁగాంచు
నొకచోట దైవతంబొనరుఁ బెక్కువను
నమరు నొక్కట క్షేత్రమధిక మాహాత్మ్య
విమలమై-యీగతి వివిధప్రదేశ
ములు దమయంతనఁ బొలుచుచు నుండు
గలసి యేకడ నున్కి గానంగరాదు-
దైవత క్షేత్రతీర్థంబులొక్కటను
నీవసుధాస్థలినెనసి-మాహాత్మ్య
కలితంబులై నెడగలదొ! యెఱుంగ
వలయునో శరవణభవ! దీనిఁదెలిపి
చిరకాలముగ నున్నయరగలిదీర్పు
మనుడుగ'' ననిమునియన్నంతఁగన్ను
లఱమూతవెట్టి-మిన్నంకవీక్షించి
ధరణీతలము గాంచి-యరసి దిక్కులను
యోచించి యోచించి యోరంతప్రొద్దు
దోచక-యామౌనితోఁగుమారుండు
వలికె "మునీ! మంచిప్రశ్న వేసితివి
దలఁపున నేమియుఁదట్టంగలేదు
బదులు-నాకునుఁగూడ నిదిసందియమ్మె
"పదపద మోదము'' ప్రథితవిజ్ఞానుఁ
డైన నాజనకుని యంతికంబునకు
దీనావనవ్రతాఽ ధీనుండు దాను

మనసందియమ్మనుమాన్చ వీక్షణమ"
యని కుమారుండన్న నక్షులవీరు
గుదిగొనె మౌనికిఁ గోటి భావములు
మదిజిత్రదిరిగె-గద్గద భరాక్రాంత
మగు కంఠముననుండి-యపుడూర్పుతోడ
నిగుడెఁ "గానిమ్మ"నునిష్ఠురవాక్కు--
గదలెఁ గుమారుండు గై సేసి యంత
ముదిర నీలంబైన మదదిగ్గబర్హి
నెక్కి - యిర్వంకల నిందీవరాక్షు
లక్కజంబుగఁ జామరాళి వీవంగ
శివపరిచారికల్నెలువొంద-భావ
భవుపడగలు-దమ్మపడి గముల్వట్టి
మదమత్తకుచ విజృంభణముతో-యక్ష
సదమలాంగులు సితచ్ఛత్రముల్వట్ట
సిద్ధసాధ్యాదులు సిద్ధులై వినయ
నద్ధులై-సాహోనినాదముల్సేయఁ
గిట కిట మని కౌను లటునిటుఁ దూఁగఁ
బటు కళత్రమ్ముల భారమ్ముతోడ
ఘలుఘల్లుమను మేఖలలతోడఁగూడి
పలుక వీణెలవలె గిలుకు మెట్టియలు
నొక్కింత వగలును నొక్కింత సిగ్గు
నొక్కింత మదవృత్తి-యొక్కింత దాల్మి
యొక వింతశృంగారమొదిగింప-నమర
వికసితవదనలు-విమలకర్పూర
పరిగంధిలములైన బాగాలుబూని
యరుదేర-మనసిజారాధ్య దేవతలు
బొలయు గుగ్గులు ధూపములును-దిక్కుల
ములఁదన్న-రత్నమంజులహసంతికలు

గొని-యక్షకాంతలు మునుముందు నడువఁ
గనుల వెల్వడు నల్లగఱవలు-నింద్ర
నీల భృంగారువిశాల రోచులును
మేలంబులాడ-విస్మేరంబుతోడ
నొకయెడ మదదిగ్గలుద్వృత్తి రాగఁ
చకిత శారకటాక్షజాలమ్ము-గండ
ఫలకకాంతులు గూడఁబడి-యొక క్రొత్త
పొలుపునఁ బరిసరంబుల నాక్రమింప
జలదవేణులు గొందరలసయానములఁ
గులుకుచు-బుక్కా-ముగొంచును రాగఁ
బలు పాపతలచుట్ట లెలమి గుల్కంగ
వెలఁది వెన్నెల పూవులలర మస్తముల
నొసలి మిక్కిలి కన్నులెసఁగ-ముమ్మొనల
నసలారు శూలంబులభ్రంబు నొరయఁ
బునుక తమ్మంటులు-బునుకపాత్రములు
గనుఁగవలకు విందుఁ గావించుచుండఁ
జర్మాంబరంబులు మర్మరింపంగఁ
గర్మసంహార! కాలకాల! గిరీశ!
హర! మహాదేవ! యంచాఽఽర్భటింపుచును
బరిజుట్టికొనిరాగఁ బ్రమథనాయకులు
దేవతానివహంబు దివినుండి గాంచి
యీ విభవంబున కిచ్చలోఁగరఁగి
ప్రస్తుత విదులు విన్యస్తాంజలులయి
స్వస్తినాదమ్ములఁ బ్రస్తుతింపంగ
నీరీతిఁబోవు కుమారుతోఁగూడ
సారలిచారుండు-సర్వమునీంద్ర
వారవంద్యుఁడు-వెంట వటుసమూహమ్ము
గూరిన భక్తిదన్గొలుచుచురాగఁ

బైనమైవచ్చె లోపాముద్రతోడ
దీనావన వ్రతాధీనుఁడగస్తి-
దరిసిరంతట వారు ధవళకూటౌఘ
పరిచుంబితాంబరుఁ, బ్రమథనాయకున
కనుఁగు మామఁద్రిలోక వినుతుని, మౌని
జనశరణుని, దేవవనితాముకురము
మేనామనోహరు మేదినీధర వి
తానంబులకునెల్లఁ దనయాజ్ఞ పూవు
దండగాఁనున్న యతంద్రప్రతాప
మండితు-తుంగవిమాన సంశోభి
దేవతాపరిబృఢసేవితు-విబుధ
భావితు-హిమవంతు పటుప్రభావంతు
నాతుషార మహీధ్రమందు-విశాల
శీతలకైలాస శిఖరంబుపైనిఁ
గొలువుదీర్చిన వానిఁ, గోరుభక్తులకుఁ
దలముక్కలుగ వరంబులనిచ్చు వాని-
ముక్కన్ను గలవాని, మ్రొక్కువేల్పులకు
దిక్కు-రక్కసుల మర్దించెడు వాని-
వాడని తలపూవువానిఁ, బెక్కువకుఁ
గూడలి మినుకులు గొనియాడు వానిఁ
జక్కి చిక్కనివానిఁ, జిన్మయాకారు
నెక్కటి-ఋషులకు నెక్కినవాని
వెల్ల తత్తడివాని, నుల్లమందెల్ల
మొల్లమై-యనుకంప బొలిచెడువాని
గిరిజామనోహరు-నురగ భూషణుని
సురరాజవందితు, శోభితాకారుఁ
గనుగొని తనువెల్లఁ గనులుగా-విమల
మనమెల్ల భక్తి సమ్మర్దంబు గాఁగ

వెలయఁ గుమారుండు వినయంబు దొలఁకఁ
దలవంచి పాదముల్దాఁక-సర్వాంగ
పరిరంభణము సేసి-పార్వతీశ్వరుఁడు
శిరముమూర్కొని-కురుల్సెన్నుగాఁదడవి
చెక్కుగీటిమఱల నక్కునఁజేర్చి
చిక్కని నెనరునశివఁజూచియనియె
"వీఁడె నీసూనుండు వెలఁది! బృందార
కేడిత విక్రమాఽఽహా తహా తవహుఁడు
వీక్షింపు" మనినంత విశ్వేశ్వరియును
నక్షీణవాత్సల్యమమరఁ గుమారుఁ
గృతనమస్కారు-సన్నుతగుణాఽఽధారు
వితతసంవిద్భారు, విగతవికారు
లోకైకశూరు నాలోకించి-ప్రేమ
దూఁక-బాహులతోడనాఁకట్టికొనియెఁ
దదనంతరం బిందుధారి-దూరమున
మది మదిలో లేక నలఁగుచున్న
వాని-నోడికలెత్తు బాష్పముల్గలుగు
వానిఁ, దానమ్మిన ప్రమథేశుపైనఁ
గోపంబుఁదాపంబుగుదిగొన-మోము
సూపక తారాడుచున్నట్టి వాని
మునినగస్త్యునిజూచి-ముసినవ్వు పెదవి
కొనలందుఁ గనులందుఁ గొనలుసాగంగ
నీశుండు-వాత్సల్యభూషితుం డగుచుఁ
జేసన్నఁగను సన్నఁజీరె నీ గతిని-
"రార! నా భాగ్యమందారభూజంబ!
రార! శైవపురాణ రమణీయభావ
పార నీరధి! జగత్సంరక్షణాఽతి
భారసంవహనైకధీర! మునీంద్ర

వారసన్నుత! మదాభరణ! నాయూర్వ!
రారబ్రహ్మాది నిర్జరశోకభేత్త!
కాశికాపురినీవు పాసినగోలె
వీసమంతైనను వేడుకలేదు
నీరూపు నాకంటనిలువనిగోలె
యేరూపుగూడ నాకిందుచేలేదు-
నీపల్కు చెవులధ్వనింపనిగోలె
యేపల్కువినరుచియింపదు మదికి-
నీతనుస్పర్శంబు నిలచినగోలె
యేతగులముగూడ నింపదుసుమ్ము
యీ నాఁడు వీక్షించి తింకమద్భక్త
మానసం బానందమయమయ్యెనోయి!
భక్తులఁజూడనిభవుఁడు సంతోష
రిక్తుండటంచుఁబాజీ-మునీంద్రుఁగమిచి
గరుపారుమేను-నిర్గతమోదబాష్ప
భరితనేత్రములునై -పరిపూర్ణకరుణఁ
బరిరంభణముసేసి-బాలేందుకుంద
పరిభూషితంబైన శిరమునువంచి
మునివరుమ స్తమ్ముమూరుకొన్నంతఁ
దొనకెఁజంద్రునినుండితోరమ్ముగాఁగ
నమృతకణావళి-యతిరమ్యహేమ
కమలసువాసనాకలిత జలమ్ము
మనమందుఁదనువందు మధురశీతలము.
మునినాయకునకంత మొల్లమౌ-చిత్త
వృత్తి తాపమ్ము-శరీరతాపమ్ము
నత్తమిల్లిన-సమ్మదాఽఽపూర్ణుఁడగుచు
నటరాజపాదవందన మాచరించె
నిటలతటంబును ఘటియించి-మౌని-

పదపడివచియంచె-ఫాలలోచనుఁడు
మృదుమధురంబుగా-మిక్కిలివగపు
గూరినవ్రతిఁజూచి- "గుణములప్రోక!
వారాణసీపురిఁబాచితినంచు
ఖేదమ్ము నొందకు-మేదినికైన
బాధలఁదీర్చుచే బహుతపఃఫలము-
ధనము సంపాదించి-తానునుఁదినక
వనరుచు-నొరులకివ్వకవృథాఽఽయాస
కలితుఁడై -చెడిపోవుకాపురుషునకుఁ
దులయగుఁ-దపములు దొడ్డగాఁజేసి
దానిఫలంబు దీనానాధరక్షఁ
బూనివెచ్చింపక-ముక్కూరు తలిసి-
నిగమాగమంబుల నిశ్చితంబిద్ది-
యగునుఁ గార్యము జగదారాధనంబు-
భక్తులేనాప్రాపు-భక్తులేప్రోపు
భక్తుల విడనాడి బ్రదుకంగఁజాల
నొక్కక్షణం బిదియున్న సత్యంబు
నిక్కంబు దాపంగ నేరనునేను-
కాని-జగమ్ముల కష్టమ్ముదలఁచి
నే నియమించితి నిన్ను శ్రీవిష్ణుఁ
డనుపేర-నీవిరహంబునయందు
ఘనము నాసేగి నీకన్ననోయన్న!
గరువంబుగన్గప్పి-క్రమమునుఁదప్పి
పెరిగినవింధ్యంబు పెంపునుఁ దెంపు
మాయించి-జగములమాయదప్పించి
యాయర్కునకుమార్గమమరఁగావించి
యతికృతార్థుఁడవై తివడల నేలింక!
మతికెక్కె నీభక్తి మానితంబగుచు

సంతసపడుమంచు శర్వుండు మునికి
వంతఁ దొలంగించెఁ బార్వతీదేవి
పరమపవిత్ర లోపాముద్రనర్హ
సరససంభాషణాచాతురిఁ దేల్చె—
తరువాత ఖండేందుధరుఁడునుఁబ్రమథ
పరివారమిర్వంక బలసి నిల్వంగ
గిరిరాజపుత్రి సంబరమున నొక్క-
యురురత్న పీఠిపై నుపవిష్టగాఁగ
నందీశుఁడెదుట సానందుఁడై నిలిచి
మందస్వనంబున మనవులు సెప్ప
యక్ష రక్షఃపిశాచాదులు—భక్తి
లక్షింపఁగార్యముల్గల వేమొయనుచుఁ
గాలభైరవుఁడు ప్రోత్తాల భేతాళ
జాలంబుతోస్థలీ సంరక్షసేయ
మగరాలజిగి—లీల మిగులుముత్యాల
జగిలెపైనుంచిన శార్దూలచర్మ
పరిశోభితంబైన పరమాఽఽసనమున
సరసనితంబి నీచామరాఽఽలోల
కుంతలుండగుచునుఁ గొలువొప్పఁదీర్చి
కాంతస్మితమ్ము వక్త్రమునఁదొలఁకాడఁ
దనయు మహాసేనుఁ దన కుడివైపు
దనరు హేమాసనంబున నున్నవాని
వీక్షించి—దంతవళక్షచంద్రికలు
నక్షికాంతులు మొత్తమై దిక్కులెనయఁ
బలికె మహాసేన! ప్రథితాఽభిధాన!
లలిమీఱఁగా సామిమలనున్నయట్టి
పరివారమునకెల్ల భద్రంబెగదర!
“దురుసుబిడ్డండ! యెవ్వరితోడనైన

నచ్చంబుగాఁజెప్పి పుచ్చఁగారాదొ
వచ్చెడువార్త రవంతముందుగనె!
యున్నదున్నట్లుగా నులికిపడ్డట్లు
కున్న! దూకెడు దానికన్నను—వచ్చి
తైన నేమాయె—నీ యరుదెంచినట్టి
దాని—కేమైన నిదానంబు గలదొ!
తెలియఁజెప్పుమటన్నఁ దలవంచి సుతుఁడు
వలికె—వార్షుకమేఘలలిత మంద్రముగఁ
దను నగస్త్యుం డడిగిన ప్రశ్నవిధము
దనకుఁ దోపమియు—నాతండునుఁ దానుఁ
దనపాలదానికుత్తరమును దెలియఁ
జనుదెంచినట్టి యాచాడ్పును—నంత
సకలజ్ఞుడైనట్టి శర్వుండు—హాస
వికసితముఖుఁడౌచు విశ్వైకమాత
దెసఁజూచి పలికె వింటివె సుతుప్రశ్న
మసదృశాంగి! భవదభ్యర్థితంబు
సదిగాదె! యిప్పుడ ముదముతోఁ జెపుడు
మది సంశయమ్ములు మఱుగిపోవంగ
నవధానమున వినుండని కనుల్మూపి
సొవపి—పండరినాథు శుద్ధరూపంబు
మనముల ధ్యానించికొని—మహానంద
జనిత పులకసంఘ సంభిన్నదేహుఁ
డగుచుఁ బల్కెను శంభుఁ డాదికాలమున
నగణితవిక్రముం డఖిలగీర్వాణ
గణధూమకేతువ ఖర్వగర్వుండు
జనియించె డిండీరుఁడనెడు రాక్షసుఁడు
వాఁడుగ్రతపముచే బ్రహ్మనొప్పించి
వాడిమిగల భుజబలము గాంక్షించి

పడసి - యసహనీయవర్తనుం డగుచుఁ
గడు నిడుమలు గూర్చెఁ గలికిఁ ధారుణికి
నప్పుడు బ్రహ్మాదులైన దేవతలు
గుప్పునఁ బాఱి వైకుంఠమ్ము దఱిసి
కమలాక్షుఁ గనుఁగొని—తమ గోడు దెలిపి
సమితులై 'నీ శరణం'బని వేఁడ
నెలనవ్వు పెదవియంచుల గిలుబాడ
దళితాఽబ్జ మధుర నేత్రంబులయందుఁ
గరుణామధువు దొట్టఁగా—మురవైరి
యరసి దేవతల నిట్లనియె "భయమ్ము
విడువుఁడో సురలార! విశ్వదుఃఖమ్ము
బొడమిన నద్దానిఁ బొడ వడగించి
తెలఁచుటే మా పని - దీనికై యింత
దెలుపంగవలయునే దీనత నిట్లు!
డిండీరుఁడను రక్కసుండు లోకములఁ
జండించి - బాధింప శరణంబు గోరి
వచ్చితి - రవ్వాని వర్తనంబులును
మచ్చరంబును మాకు మదికెక్కినవియ—
యడగింతు మేమింకఁ బుడమి జనించి
యడజడి బడనేటికయ్య మీకిట్లు—
బొందు నిశ్చింతగా నుండుండు మీరు
డిండీరుఁ, డీపైని, డింకినయట్లె"
యని యిట్లు వచియింప నతని వాక్యములు
విని దేవతలు - మహా వినయసంభృతులు
ధృతసమ్మదులు - పరిష్కృతదుఃఖు లగుచు
నతిసేసి మగిడిరి - నాకంబు గుఱిచి—
సకియ! యత్తఱిని శ్రీ చంద్రాఽభిధానుఁ
డొం రాజు ననుగూర్చి యుగ్రతపంబు

సలిపిన - యా షేని సంతతనిష్ఠఁ
గలికి! లోకమ్ము లాకులత నొందఁగ
నాతఱి నేను ప్రత్యక్షమై - నిలిచి——
యాతని వీక్షించి 'యడుగుమా! కోర్కె'
యన్నను——శ్రీచంద్రుఁ డత్యంత వినయ
సన్నమితాంగుఁడై "శర్వ: లోకేశ!
శ్రీమహావిష్ణు సదృశు నొక్క పుత్రుఁ
గామించి - తీ కోర్కె గాదనకుండ
నిమ్ము నాకన్నఁ" "గానిమ్మురా వత్స!"
యమ్మహావిష్ణుం డ, యాత్మజుం డగుచుఁ
జనియించు నేటికి సందియపడగ?"
నని పల్కి వచ్చితి నతివరో! నేను
డిండీరు నసురుని ఖండింపఁ బూను
పుండరీకాక్షుని పుడమి పుట్టుకకు
నా వరమొక సాధనంబయ్యెఁ - జంద్రు
దేవేరి కడుపులో దీపితంబయ్యె
నా మధు మథను నంశాఽవతారంబు——
కామిని కంతటఁ గమనంబు దగ్గె
నెఱకొను బలుపెక్కె - నరుచులు నిక్కె
విరిసెను గోర్కులు - వేవిళ్ళు బెరసె
నీరీతి ధృతగర్భభారయై, వికచ
సారసాక్షి - నవమాసమ్ములు మోసి
కనియె నంతటఁ గుమారునిఁ బూర్వదిక్కు
గనినట్లు - వాసరకరుని - శ్రీకరుని——
వినియె శ్రీచంద్రుండు విమల పీయూష
మున కెనయగు దన పుత్రజన్మంబు
మిక్కిలి సంతుష్టి మిన్నంది-వినుతి
కెక్కి-యాచారసమీహితులైన

ధారుణీసురుల సాదరముగఁ బిల్చి
వారికి దురగాది వస్తుసంపదల
నవ్వారిగా నిచ్చి-యంతన బోక
యవ్వసుధాపతి యన్యులైనట్టి
వారికి నెల్లను వాంఛితంబుల న
పారంబుగా నిచ్చి-ప్రమదంబు నించి-
కడు ముదంబున మల్లికార్జునుం డనుచు
నిడె సుతునకు నామ మెడద నుప్పొంగి—
పుత్రుండు దృఢతరగాత్రుండు — కీర్తి
పాత్రుండు-శాత్రవదాత్రుండు-కమల
నేత్రుండు-సార్థకక్షాత్రుండు-సుజన
మిత్రుఁడే నస్తమోఽమిత్రుండు-పెరిగెఁ
గ్రమముగా శ్రీచంద్రు ఘనపుణ్యజాల
మమరరూపయి నిల్చినట్లు ధారుణిని-
తరుణచంద్రునిఁ బోలు తన తనూజాతుఁ
డొఱపుఁ జుక్కలతోడఁ బురుడించునట్టి
యీడు బాలకులతోఁ గ్రీడించునపుడు
వేడుక బొంగార వీక్షించి-తాను
గావించినట్టి దుష్కరతపంబెల్ల
నీవిధిగా ఫలియించె నేఁడనుచు
జల జల రాల్చు శ్రీచంద్రుండు బాష్ప
సలిలంబు-వనజాక్ష చరణపాద్యంబు—
ప్రేమసరస్సులో వికసించినట్టి
హేమాంబుజము-మితి యెన్నంగరాని
మురువుల తొలిపెంకి-మోక్షగంధమ్ముఁ
బరగించు సరి క్రొత్త పన్నీటి చెంబు
పల్లవింపఁగ లోక భాగ్యంబులెల్ల
మల్లికార్జునుఁడు-గ్రమమ్ముగా నెదిగి

కరితురగాది శిక్షలయందు - శాత
కరవాల చాల నక్రమములయందు
వితత ధనుర్బాణ విద్యలయందుఁ
బ్రతిలేని నృపధర్మపద్ధతులందు
నక్షౌహిణీకల్పనాఽభ్యాసమందు
నక్షీణచాతురి నార్జించి - మల్లి
కార్జునుం డమిత విక్రముఁడంచు నించె
నర్జునకీర్తి దిగంతమ్ములందు——
నొక్కనాఁ డాఖేటనోద్యుక్తులైన
యెక్కటి వీరులు నిరువంకలందుఁ
బరగి సేవింప శబరులు - మృగవ్య
పరికరంబులతోడ బాలభానునకు
జోడైన మల్లికార్జునుఁడు - దా వేఁట
లాడంగ నేఁగె మహారణ్యమునకు
నదియ డిండీరుని యావాసమగుట
మదదురుద్ధరుఁడైన మానుషాదుండు
కలిగిన యాయల బలము నీక్షించి
చెలరేగి నీల్గి - బెబ్బులి వోలె నార్చి
రూక్షకేశములు విద్రుచి - మహాఘోర
వీక్షణమ్ములఁ జిచ్చు పెటులుచు నుండ
నెవ్వరురా! నేటి కివ్వనంబునకుఁ
జివ్వనఁ జనుదెంచి సేగి గావింత్రు
నేరరో కాక డిండీరుఁ డీ వనము"
సేరినాఁడని గర్వచిక్కణ చిత్తు
లడగింతు నీపొంగు, నడకింతు లోక
మడజడినని దిశలదరంగఁ బలికి
పదపదంబునయందుఁ బ్రతినదింపంగ
నదనదీ సహితమైన వసుధాతలము

చనుదెంచి-యాఖేట జనులున్నచోటి
కనుపమరోషరూక్షాక్షుఁడై-నోరు
చప్పరించుచుమ్రింగఁ జనుదెంచునంత
నప్పిశితాశను నల్లంత దూర
మునఁజూచి మల్లికార్జునుఁడు రోసమ్ము
పెనఁగొన నోరోరి! మనుజాద! నిలుము
నిలుమనుచు నె,హ స నిభృతమైనట్టి
బలువింట నరివోపి-కులిశమ్మువోని
బాణమ్ముబరఁగింప-వాని చర్మమ్ము
నేనియు భేదింపఁగా నోపదదియు ___
పదపడి డిండీరుఁడ దలించి-తనకు
నెదురుగా నిలువంగ నిన్నేండ్లకొకఁడు
గలిగెఁబో! యనుతుష్టి, కలిగెనయేని
నిలువునఁ జెండాడనే! యన్నయసము
బలువిడిగిఱికొనఁ బరిసరస్థలిని
నెలకొని-నాల్గుదిక్కులు బారసాచు
నట్టి వృక్షంబొండునెట్టన వెఱికి
యట్టలమగు రోసమెనయంగఁ దాఁకఁ
దెంచిన-భ్రూకుటిదీర్ఘచాపంబు
సంచాలితములొక్క-సారిగ వంగ
వానిపట్టిన వృక్షభంగమ్ము సేసె
బాణంబుఁదొడి భీమబాహు విక్రముఁడు
మల్లికార్జునుఁ, డంత మానుషఖాది
యుల్లంబు నూత్నశౌర్యోల్లసనంబు
వొందంగ-మైవెంచి-పొరినిగర్జించి
గంధసింధురమట్లు గదిసి-వేఱొక్క-
వృక్షంబు విసరిన నాక్షణమందఁ
బ్రక్షీణముగఁ జేసె రాజసుతుండు-

నడుగడుగున యందుఁబుడమి గ్రక్కదలఁ
గడు బెడిదంబు హుంకారంబుతోడ
డిండీరుఁ డంతటఁ జండించి-బాహు
భండనంబునకుఁ బైఁబడవచ్చునంతఁ
గుండలీకృత చాపదండుఁడై-శౌర్య
మండితుండైనట్టి మల్లికార్జునుఁడు
పదిఁబది గుదులుగా బాణంబులేయ
నదలించెనవియెల్ల హస్తమాత్రమున
నా రక్కసుఁడు-గృపాణంబూచిపైవ
వారణ రాజం, బవారణరీతిఁ
దరు శాఖనొడుచు విధంబున నొడిచి
దురుసునద్రుంచె-నుద్ధురముశలమ్ము
నలువుళ్ళ సేసె హస్తాగ్రమ్ముతోడ-
నఱిముఱిసిరీతి నాయుధచయము
దానవుఁడాకి కృతఘ్నునియందు
మానుగాఁగావించును మహితోపకార
మట్లు వితథమైన-నా రాజపుత్రుఁ
డెట్లు సంపఁగఁగాంతునే వీని ననుచుఁ
దలపోయుచును లోహదండమన్పేర
వెలయుగదాదండమలవడఁ బట్టి
యంకించి విసరిన-నర్కసహస్ర
సంకాశదీప్తులు జదలఁదన్నంగఁ
జిటచిట నుఱుముచుఁ జటులాగ్నికణము
లటునిటుఁ జెదరంగ - నలుగులవుట్టి
యఖిల దిక్పాలకు లాక్రోశభరిత
ముఖులయి దిక్కులమొదళులకుఱుక
దిగ్గజంబులు స్రగ్గ - దిక్కులుమ్రొగ్గ
నగ్గిరులునుదగ్గ - నసురులుమ్రగ్గ

జలధులు దెరల - నాకులు వెఱమఱలఁ
గళవళపడి యహికులపతి బెదర
నరుదెంచి డిండీరు మరణసాధనము
శిరమునఁబడిన, నుప్పరమునకెగసె
జల్లున ర క్తమ్ము - సంధ్యారుణమ్ము
మొల్లమై - విబుధులుమోదింప - మృత్యు
నలినాక్షిదాల్చుశోణమణి వితాన
కలితమైనట్టి ముక్కఱయునుబోలె
నాదెబ్బతో శిరమదరి దుర్గర్వ
మేదిన డిండీరుఁడిలమీఁదఁబడుచుఁ
దనశక్తి దళియింపఁ దగినశౌర్యమ్ము
ఘనవిష్ణునకుఁ దక్కఁగలుగదెవ్వరికి
నగునీతఁ డఖిలలోకావనశీలుఁ
డగణితశక్తియైనట్టి వైకుంఠుఁ
డని తలపోసి యయ్యభవునికరుణఁ
దనుగ్రమ్మికొన్న దుర్దమ మాయదలఁగఁ
గరయుగమ్మునుమోడ్చి - శిరమునువంచి
'హరిహరి' యని చరణాబ్జముల్వట్టి
దేవ! దేవాతీత! దివ్యావతార!
భావనందనవనపవన! బ్రహ్మాదు
లకుఁ గానరాని దుర్లభుఁడ వీవొక్క
వికట రాక్షసుఁజూడ వేడుకవడితి
వెంతయద్భుతము! నాదెంతయదృష్ట
మంతమ్ము నొందనీ హస్తంబునందు
నిఁకఁజింతలేదు నాకెప్పుడోవచ్చె
నకలంకమోక్షమనంత! నీవీక్షఁ
గరుణాబ్ధి! తామసాక్రాంతుండ - నాకు
మఱపీకు మఱపించి, యొఱుకనిచ్చితిని

ఘనయోగివర్యులకవిలిమఁజేర్చి
మనసరి! నీకెంత మరులురా! యనుచు
వినుతింపఁ దొడఁగిన విశ్వేశ్వరుండు
దననిజరూపంబు దయతోడఁజూపి
"యోయిదానవ' కోరుమొక్కవరమ్ము
నీ యభిమతమేమి! నెఱిదీర్తు" నన్నఁ
బలికె డిండీరుండు - పరమసౌందర్య
జలధి! నా కన్నులు ఫలియింప ముందు
నిలిచికొంటివి వెన్నెలల ప్రోవ! మునులు
జలవాయుభక్షులై యలుగుల మొందఁ
గనరాని నీదు పోకడగంటి, ముక్తి
వనితాస్వయంగ్రాహ భాగ్యమ్ము గంటి
మృదుపదనూపురీకృత వేదనిచయ!
కొదయున్నదే యింక మదికి గోరంత!
యయినఁ గోరుమటన్న నడుగక యున్న
దయద్రోసి నటు లౌనొ; దానికి వెఱతుఁ
గోరికొందును దేవ! ధీరాఽనుభావ!
దారుణంబగు నీగదాదండమునకుఁ
జిక్కి నే మోక్షంబు సేకొంటిఁ గాన
నిక్కాననమునకు నిడుము నన్నంపి
నట్టి గదకుఁ బెట్టి నట్టి యభిఖ్య-
కట్టింపు మిచట శృంగారమ్ము గాఁగ
నగరమొక్కటి యందు నగధారి! నీవు
నెగడి - భక్తులనెల్ల నిత్యాఽనుకంప
రక్షింపవలయుఁ దీర్థం బొందు నెఱపి
పక్షీంద్రవాహన! ప్రథితంబు గాఁగ
మన్నామమునను - దన్మధ్యంబునందుఁ
బన్నుగా నాపైనిఁ బరపిన యట్టి

గదప్రతిష్ఠింపుము - కలికాల పాప
గదఁ జిక్కి యెవ్వఁడేగాని యా తీర్థ
మున మున్గి - యాగదమొగిఁ గౌగిలింపఁ
దనపాపమెల్లను దలఁగంగవలయు
నిదియ కోర్కి "యటన్న నిందిరాజాని
మది మెచ్చి యిచ్చితి! మహిత విచార!
చనుమంచు దేవతాజనము లాశ్చర్య
మునఁ జూడ వైకుంఠమునకును బంపి -
దళితపాపుఁడు, లోహదండమన్పేరు
చెలువొప్పఁ గానన సీమకుఁ బెట్టి
పురిగట్టి భాగ్యసంభరితమ్ము - దివిజు
లరుదందఁ బైపేర నద్దానిఁ బిలచి
తీర్థంబు నిర్మించి ధృతి - భువనావ
నార్థంబు - దనగద నందుఁ దాపించి
మల్లికార్జునదేవుఁ డల్లన మగిడె
ఫుల్లాబ్జనిభనేత్రములఁ జూచి - దేవ
తలు - జయ జయ నాదములను గావింప
సెలయుచు శబరులు సేవించిరాఁగ
నని యిట్లు గలకంఠుఁడతి భక్తి - లోక
వినుతమౌ వైకుంఠు విక్రమగాథఁ
దెలియంగఁ జెప్పి - వెన్నెలలు పారాడఁ
దలపూవు గదలాడఁ దలనల్ల నార్చి
పలికెఁ బార్వతిఁజూచి - యలికులవేణి
కలిమలాపహము, శ్రీకాంతు జన్మమ్ము
దెలిసెనేగద! దీనిఁ దెలుపఁగారాదు
కలితగర్వులకు బాపులకు, రాగాంధ్య
ఖలిత సత్తనులకు గలిసేవకులకు
జలజాక్ష పాదపూజా వర్జితులకు

నక్షీణమైన రహస్యమ్ముగాఁగ
రక్షింపవలెసుమ్ము - రమణీయగాత్రి!
యధికారులగు వారలాకాంక్షసేయ
నిది సెప్పకున్నచో నెనయును బాప
మని వచిమించిన నార్య, సంతసము
గనుదోయినాన, నోంకారపంజరున
కంజలించినఁ గుమారాదులు గూడ
నంజలించిరి భక్తి నఖిలేశ్వరునకు
ననియిట్లు సూతుఁడభ్యర్థితంబైన
వనజనాభుని పురావర్తనం బెల్ల
మునులకు నెఱిఁగింప మనములఁ గరఁగి
యనిరి సూతునిఁ గాంచి యతిధీసమేత!
జ్ఞానవిఖ్యాత! కర్ణామృతంబైన
యా నలినాక్షమాహాత్మ్యవర్ణనము
వినఁగ వినఁగ మాకుఁ దనివోవలేదు
వినిపింపు మీ సత్రవిధి గృతార్థముగ
నన నప్పు డా సూతుఁ డతులముల్లాస
మెనయ దేవాది దేవున కంజలించి
యీ రీతి వచియించె సారవిజ్ఞాన
నీరధులార! మునీశ్వరులార!
వినుఁడంతఁ బార్వతి విభుఁగాంచి-మధుర
వినయకుంచితనేత్ర-వనజయై పలికె-
పావనచారిత్ర! భవలతాదాత్ర!
భావితహరి! దుర్విభావ్య మాహాత్మ్య!
పాండురంగం బంచుఁ బ్రథగల్గ హేతు
వుండెడుఁబో! యొక్కటుజ్జ్వలంబగుచు
నా కారణంబేమి? యది వివరింపు
మాకాంక్షగల్గిన దాదరింపంగ

ననుచు నర్థించిన నహిరాజభూషుఁ
డనుపమంబైనట్టి యనుకంప వొదలఁ
బలికెఁ బార్వతిఁజూచి ప్రాణపదంబ!
విలపితంబుగ నది వినిపింతు వినుము
లోహదండపురంబులో-వసియించు
నీహావివర్జితుం డిందిరారమణ
పదసక్తబుద్ధి-నిర్వైరుఁడజ్ఞాన
గదవిహీనుఁడు-దయాపదచిత్తుఁ డఖిల
భూతసమ్మతుఁడు-సంపూర్ణసంతుష్టి
పీతపాపుఁడు-భక్తవిహితధర్మాను
యాయి-యాతిథ్యసంధాయి-సమ్మద ని
ధాయి సజ్జనులకు-దాక్షిణ్యవార్ధి
యవునవునని జను లభినుతింపంగ
నవ నీసురుఁడు జహ్నుఁడను పేరు గలిగి-
యాతని సతికి సాత్యకియనునామ
మాతలోదరి పతికనురక్త-పరమ
కరుణావికస్వర-కమనీయ భర్తృ
చరణనిధ్యానతత్పర-మంజుమూర్తి-
యనుభవించిరి వార లర్థకామమ్ము
లనుగతికమ్ముగా నాత్మధర్మమున
కిట్టులెంతయొ కాల మేగెనే గాని
పుట్టలే దొకఁడైనఁ బుత్రుండు. వారి-
కా కొద దప్ప సాత్యకి మదియందు
నే కొఱంతయుఁ గూడ నిసుమంత లేదు
గమనించినాఁడు-కాంక్షావివర్జితుఁడు
కమలాక్షి మదిలోన- గలిగిన కొఱఁత
జహ్నుం-డెఱుంగని చాయగా-భావ
నిహ్నవం బొనరించి-నిలుకడతోడ

నున్నాఁడు-సాత్యకియోర్వలేదింకఁ
దిన్నఁగా నొక్కనాఁ డన్నవ పలికె
పతిదేవ! లోకసమ్మతము నాదైన
మతినున్న కోర్కె-నీ మనమునయందు
భావింపఁగాలేదొ! భావింపనైన 25
నాశావిహీనుండ నైనట్టిదాన
నరకుసేయవొ గాక! వరపుత్రముఖము
నరయు నంతకు నాకు నానందమేది?
చెప్పఁగా నెంచితి జీవితనాథ!
యెప్పుడో నీతోడ నీ చిన్ని కోర్కె
చెప్పనివ్వదు-పాడు సిగ్గింతవఱకుఁ
దప్పదీ నాఁడు యథార్థంబుగాఁగఁ
బలికితి-నాదగు వరము మన్నించి
కులభూషణం బొక్క కొడుకుఁ గావింపు
నాయందటన్న, సన్నలువాఱ నవ్వి
మాయావిహీనుండు మధురాంగి కనియె- 30
నిజము పల్కితివీవు నీరేజనేత్ర!
సుజన పూజితుఁడొక్క సూనుండు వలయు
గమనించినాఁడ నీకాంక్ష నేనాఁడొ
గమనింపనట్టులే గడపుచున్నాఁడ
సకలైకనాథు నిచ్ఛాప్రకారంబు
సుకముఁ జూకురును వచ్చును మానవులకు
వలవని కోర్కెల వలఁబడి-శాంతి
దలఁగి-సర్వేశ్వరుఁ గొలువంగ మఱచి
వితథంబుగాఁగ జీవితమును గడప
సతి! యది ముష్కర జన్మకారణము- 35
చను-యదృచ్ఛాలాభసంతుష్టి-మౌని
జననినుతంబైన సారమార్గముగఁ

బుత్రుండు లేడంచుఁ బొగులకు-వనజ
నేత్రుఁడున్నాఁడ, యన్నిటికిఁ దా కుదురు
నని యిట్లు బోధించు దన భర్తఁ గాంచి
వనజాక్షి మఱి యేమి వలుకక యుండెఁ
గాని చిత్తంబులోఁ గాంక్ష రవంత
మానలే దు-గ్రమమ్ముగా నది పెరిగె
మఱి యొకనాఁడు సుందరి భర్తతోడ
నెఱిగించెఁ దన కోర్కె- సరసమృదూక్తి
నానాఁడుగూడ విజ్ఞానబోధనము
చే-నతివకు శాంతి చిగురింపలేదు-
మఱి యొకపరిఁ జెప్పె మగనితో నతివ
దఱుగని యిచ్ఛ-నాతఁడు దుష్టి వాగడె-
పలుమాఱుఁ బనవును బడఁతి, జహ్నాండు
పలుమాఱు విజ్ఞాన వాదమ్ము సేయుఁ
జెప్పెడుకొలఁదియుఁ జిగురొత్తెఁ గోర్కె-
యప్పురంధ్రికి నింక నడగింప రాఁక
యేకాంతమున నుండి యేడ్చు న ప్పొలతి
యా కంటి నీటిలో నగపడుఁ గోర్కె-
యూరుచు మాటికి నుసురుస్సురనుచు
నీరేజముఖి-దాననినదించుఁ గోర్కె-
పలుకక మౌనంబు సలుపును మగువ
సలుపు మౌనంబులోఁ బలుకును గోర్కె-
శకునంబు లడుగును సకియ-యా యడుగు
శకునంబులను దొడ్డ శకున మీకోర్కె-
వ్రతములు వట్టు సువ్రత-దాను బట్టు
వ్రతములకెల్లఁ గారణమిదే కోర్కె--
కనులనుఁ గోర్కె--నెమ్మనమునఁ గూర్కె-
తనువునఁ బులక సంతతులలోఁ గోర్కె

పలుకులకు నొసంగు బదులునఁ గోర్కె
తలఁపులలోఁ గోర్కె-గలలెల్లఁ గోర్కె
నిలువునఁ గోర్కెలై నెలతఁ యున్నంతఁ
దిలకించె ధవుఁడు గోర్కెలబండియైన
తన ప్రియురాలి నల్లన యిట్లు పలికె
వనిత! నేనెంత సెప్పినను నీ మనసు
శాంతింపలేదు-నిచ్చాఽధీనమగుచు
వంత వీడఁగలేదు-ప్రతిభావమందు
నినదించుచుండె సుతునిదైన కోర్కె
తనుమధ్య! పుత్రుకై తపము సేయుదము
హరిఁ గూర్చి, యాదేవు ననుకంపతోడ
సురుచిరగుణుఁడైన సూనుండు వొడమఁ
గాక-లోకపుఁబాడిగా సుతుఁ బడయ
నీకును నాకుఁ జన్నె! యంచు నొడువఁ
దల నార్చి మోదించెఁ దరుణి-తపమ్ము
ఫలియించి పుత్రుండు గలిగిన యట్లె
యాపైనిదంపతు లఖిలేశు గుఱించి
తాపమ్ము దలఁపక తపము చరింపఁ
దొడఁగిరి-నిష్ఠావిదూ నశరీరు
లెడపక జనులెల్ల దెంతయుఁ బొగడ-
సలిలంబు గ్రోలినసతి-యెలగాలి
సలుపు భక్షణవి నిశ్చలత మగండు
మగఁడు జలము గ్రోల-మానినీమణియు
వగరుకారాకులఁ బ్రాణమ్ములోము
దినముల తరబడి దినఁడేది మఁగడు
తనుమధ్యగను దెర్వ దనుపమధ్యాన
యోగంబునందుండి యోరన్నినాళ్ళ
"బాగు బాగని సురల్ ప్రస్తుతింపంగ

సలసలఁ దెరలు నెండలను జహ్నూండు
అలఘు పంచాగ్ని మధ్యంబున నుండి
తపమొనర్చిన-లతాతన్విసీతువుల
నెపము వెట్టకయ చన్నీటిలో మునిఁగి
కావించుఁ దపము-నిష్కలుషుండు వాఁడు
గావలెనని యొంటికాలిపై నిలచి
కరములు మొగిచి-యాకాశంబుకేసి
యరుణు వీక్షించుచు నటు నిష్ఠ బట్టి
నలివేణి చిటచిట నులియు నిప్పుకలు
సెలయుహసంతిక దలపైని బూని
పంచేంద్రియమ్ముల వశములై చిదియఁ
బంచవాయువులను బంధించిమించి
యొంటికాలనె నిల్చి యుగ్రతపంబుఁ
బంటింపకొనరించుఁ బదునాల్గు భువన
ములు నబగుబలొ-చుఁ జలియింప-దేవ
తలు శబలిత భావతతు లొచుసోల-
నీగతిఁ దంపతులెనలేని తపము
సాఁగింపఁగా వారి సద్భక్తిమెచ్చి
వ్యాసాంబరీష రుక్మాంగదాదులును
భాసురముఖు లిఱుప్రక్కలఁ గొలువ
ఖగరాజు నతమస్తకన్యస్తహస్తుఁ
డగుచు సన్నాహియై యాజ్ఞ నీక్షింప
సముచితరీతి విష్వక్సేనుఁడాన
గమనింపఁ, గరబంధకలిత శస్త్రిండు
ధృష్టస్తన్వాఽఽభోగలిష్టంబుతోడ
నష్టసిద్ధులు-చామరాళి వీవంగ-
మణిమయ కింకిణీ మంజీర
గణవికస్వరపాదకమలయుగ్ముండు

కనకాంబరాఽఽకీర్ణ ఘంటికా ఘటిత
ఘనసప్తకీశోభి కటిచక్రతలుఁడు!
దర సుదర్శన గదాదండ కోదండ
పరనందకోద్భాసికరచతుష్టయుఁడు;
కౌస్తుభశ్రీ కాంతకాంతి సంయుక్త
నిస్తుల వక్షః ప్రణిహిత చందనుఁడు;
ముకురోపమిత చకచకిత కపోల
వికసత్సుధాస్మేర విమలితాళుండు;
కరుణాధరాఽఽపూర్ణక్రమసద్భక్త
నరమోక్షసుఖవై జననలోచనుండు;
సతతలక్ష్మీ ద్విజక్షతగుచ్ఛ విచ్ఛు
రితపక్వ బింబౌష్ఠయుతహ సన్ముఖుఁడు;
చంచరీకమసార సారాఽలకప్ర
పంచదూషిత తుంగఫాలభాగుండు—;
పరమభక్తాఽఽలోకతరుణ చకోర,
పరివారహృత్సుఖంకరలపనుండు—;
అకలంక కంకణహార కేయూర
మకరకుండలశోభి మహనీయమూర్తి;
పొడసూపె నెదుట నా పుణ్య దంపతుల
యెడఁద నిండిన బత్తి పొడవైన యట్లు;
వారు జపించు దివ్యము మూలమంత్ర
మారంగ - మానిసియై నిల్చినట్లు;
వారి యచాల్యవిశ్వాసమ్ము - రూపు
గూరి - కోరిక లేలికొనవచ్చినట్లు;
వారి మానసహర్మ్య వరదీపకళిక
ధారుణిఁ బఱతెంచి దయవెల్గినట్లు
వారి సహస్రార వనజబంభరము
నేరుగాఁ బొడమి - ఝుంకార మిచ్చినటు;

వారి కలలఁ బూతవట్టిన కోర్కె-
కోరిక లివ్వంగఁ గొమ్మ సాచినటు;
వారి సర్వస్వమ్ము - వారి ప్రేమమ్ము
వారి నిష్ఠాపూర్తి - వారి తపస్సు
ఫలియించినది - ముందు నిలిచిన - దరుల
జిలికించినది - వింత వెలుఁగు పూన్చినది;
రమణీయ పీనదీర్ఘములౌచు - భక్త
శ్రమమడంచెడు బాహుశాఖలతోడ-;
భుజశాఖలందునఁ బొలుచు పండ్లైన
యజపూజితం బాయుధావళితోడ....;
తళిపి వెన్నెలల దిక్తటులఁ గుప్పించు
సరిలేని హాసగుచ్ఛమ్ములతోడ;
హాసగుచ్ఛమ్ముల నందంద పొలసి
మాసరంబగు దృష్టి మధుపాళితోడఁ;
దలఁచు భక్తుల కోరికలను గొల్లలుగ
లలిఁ దీర్చు విష్ణుకల్పకము దోచినది;
యాతఱి జహ్నుఁ డత్యాయతానంద
శీతలహృత్స్నముపేతుఁడై, ఱెప్ప
లెత్తి విలోకించె నిందిరారమణు
హత్తిన భక్తి యుద్వృత్తిమైఁ బొదల-;
నావిలోకనముతో నప్పుడు గుప్ప
లై - వఱుగొనె దృష్టు లాత్మేశుపైని;
వనజంబునకుఁ జుట్టు భ్రమరించు తేంట్ల
యనువునఁ జుట్టిన నతని పాదమ్ము;
లతని యంఘ్రుల దోయి నలరారు మధువు
నతిప్రేమమునఁ గ్రోలి యటనె-చొక్కినవి-
కటిమండలం బంతఁ గదియఁ బాఱినవి
కటితటంబున యందు ఘలుఘల్లు మనుచుఁ

బలుమాఱు పలుకు గంటల యెలపాట
చలువల పొలపంబు బొలయఁ దూఁగినవి—
వక్షస్స్థలంబును వలచి పాఱినవి
వక్షోనివాసి శ్రీవత్సకాంతులకుఁ
గనులను జీకటుల్ గ్రమ్మిన పోలె
వెనుకాడి-యచటనే విరిసి నిల్చినవి—
యధర బింబమ్మున కంత దూకినవి
యధరబింబములోని యరుణాంశుతతుల
కనురాగభరితమ్ములైనవి పోలెఁ
దనివిదీఱక యచ్చటనె పెనఁగొన్న—
వచ్చ వెన్నెలఁ జిల్కు- వట్టి యా నగవు
ముచ్చటపడి యాన మొనసి నుగ్గినవి-;
చంద్రకాంతమ్ములై సాంద్రాఽనురాగ
తంద్రమ్ములౌచు నత్తఱిఁ గరఁగినవి-;
పలుకులు పలుకంగవలచె జహ్నుండు
పలుకులు-పలుకులై భావబంధములఁ
గరఁగి-కన్నుల నోడికలుగ నిల్చినవి-;
చరణంబులను దాఁక జరగెను జహ్ను
కరములు, బెనుమత్తుగ విపినఁబోలెఁ
చరము దప్పినవి ముద్రతి సొక్కి- సొక్కి—
యీరీతినే యుపచారంబుఁ దీర్ప
నేరక యవశుఁడై నిలుచున్న వానిఁ
బులకలు గులకరంబులు గొను స్వేద
కలితమౌ కుంచిత కాయంబువాని
నిలువెల్ల భక్తియై నిలచినవానిఁ
దలఁపెల్ల నాసఁ జిత్తడిగొన్నవాని
మనమెల్ల నిభృతసమ్మదమైన వానిఁ
దనకన్న వేఱు నమ్మనివాని-జహ్ను

వునుఁ గాంచి-కరుణ యుప్పొంగు కన్నులను
దనుపార విచ్చి-శ్రీధాముండు పలికె
"బళిర జహ్నుకుమార! బళి భావధీర!
బళి చిత్సుఖాధార! పాపకుఠార!
బళి గళితవికార! బంధనిస్తార!
బళి గుణమందార! భక్తికాసార!
కోరుకొమ్మోయి నీ కోరిక-యేమి
గోరెదవో" యన్న-కోటిబాలార్క-
కాంతులు దనుఁ గప్పఁ-గనులెత్తి-యతుల
దాంతులైనట్టి వేదాంతులకెల్లఁ
గనుఁగప్పి తిరుగు శ్రీకాంతునిరూపు
గనుఁగొనఁగాలేక-కడలొత్తికొనెడు
గరడులతోఁ బైనిఁ గవయు సుధాబ్ధి
తెఱఁగున దూకు నా పరమపూరుషుని
పలుకుల మునిఁగి-దిక్కులు దోచకుండి
తెలిసి కొంతవడికిఁ-దలనల్ల యెత్తి
పలికె జహ్నుండు-జూపులఁ జిత్తమునను
బులకిత కరయుగంబుల నంజలించి-
యెల్ల కోరికలకు నెల్లవీవగుట
నల్లలితాచార! చటులు పండ
నిన్నుఁ జూచిన యప్డనిండికొన్నదిర
నన్నుతరీతి నిచ్చాప్రపంచంబు-
మఱియడుగఁగ నేది వరము దక్కినది;
సురుచిరదేహ! నా చూపులు నీదు
పాదపద్మమ్ములపైఁగూర్కనిమ్ము
నాదైన హృదయం బనవరత మవిధిఁ
బోకుండ-చిత్సుఖాద్భుతమైన యట్టి
శ్రీకాంత! నీప్రాఁపుఁ జేరఁగనిమ్ము

నాకరములు-శుభాఽఽకరములై-భక్త
లోకమ్ములకు శుభాఽఽలోకమ్ములై-స
నకసనందనముఖాఽవికల విజ్ఞాని
నికరసుఖాఽఽధాన నిపుణంబులైన
తావక పదములఁ దరిసి పూజించి
సేవించుటందె మచ్చిగఁ జెందనిమ్ము-
నా పదమ్ములు వేదనాదాఽవతార!
నీపూజకై వస్తునివహంబుదెచ్చు
టందె-చరించెడునట్లు గావింపు-
నందనందన! సుధాకంద! గోవింద!
బృందారకానంద! విమల! ముకుంద!
చందనాఽనిల మృదుస్పర్శలకన్న
సుందరీపరిరంభ సుఖములకన్నఁ
జందు చందురువారు చంద్రిక కన్నఁ
జల్లనై యనితరసౌఖ్యంబుఁ గూర్చి
యుల్లంబు సొగియించు నున్నతంబులగు
తావక కథలు మోదంబునఁ బాడ
నే! వక్త్రమునకెప్పు డిచ్చగావింపు-
నీవు లేనిది నన్ను నిలుపకు మోయి!
భావంబునకు నీవె-పట్టుగా వోయి!
యని యిట్లు భాషింప నరవిరికంట
ననుకంప దొలుకంగ నాజహ్ను శిరము
నిమిరి 'తథాస్తు'ని నీరజేక్షణుఁడు
తమ్మిదొల్కు- నగవులు దరశింపుచుండఁ
దరళాక్షి నపుడు సాత్యకిఁ జూచి "పొలఁతి
వరము గోరుము త్యాగభరితమైనట్టి
నీ తపోనిష్ఠకు నెదలోన మెచ్చి
ప్రీతి వచ్చితి నన్నుఁ గ్రీగండ్లయందు

లలిత లజ్జాభంగములు-వాని వెన్క-
దులకించు గోర్కె-యుఁ దోఁబూచు లాడఁ
"గొడుకు గావలె"ననెఁ గోమలి, మడఁతి!
కొడుకునిచ్చితిఁ దీపికొను మనుపలుకు
వినవచ్చె వార్షుకవనద నినాద
మున కెనయయి-పొల్తి మ్రొక్కి- కన్నెత్తి
చూచెఁ జూచెడులోన సొగసులనెల్ల
నాచికొన్నయది-శ్రీనాథురూపమ్ము
గనులకుఁ జాటయ్యెఁ, గడలెల్ల వెలసె
వనజాక్షిమదికి ఫక్కున నవ్వినట్లు
అప్పుడు జహ్నుఁ డయ్యతివనుఁ గాంచి
తప్పుసేసితిగదే! తపమెల్ల నేలఁ
గలిపితి గదవె! నాకై వట్టి నట్టి
ఫలమంతయును వితపరచితి గదవె!
పొరపాటు పడితివే! మఱచితిగదవె!
పొరిని విజ్ఞానంపుఁ బుట్టుమాల్చితివె!
భవబంధములు మాన్చు ప్రభుఁడు నిల్చుండ
భవబంధములఁగూర్చు వరము గోరుదురె!
విషయాఽతిగుండైన విభుఁడు నిల్చుండ
విషయ సుఖంబుల వెలఁది వేడుదురె!
వేదాంతవేద్యుఁడౌ వెలుఁగునిల్చుండ
బాధాకరము లోక పథము గోరుదురె!
మునిజనంబుల మనోధనము నిల్చున్న
మనసు మరులుగొన్న-తనుజుఁ గోరుదురె!
మోక్షంబొసఁగు పరమూర్తి నిల్చున్న
మోక్షంబు విడిచి యేమోగోరికొంద్రె!
యున్నదే యమృతంబటన్నను గఱుదు
తెన్నులు విడనాడి-మన్నడుగుదురె!

మందారవాసన ల్మలయుచు నున్న
సుందరి! దత్తూర సుమము లాశింత్రె;
దెలినీరు విలసిల్లు సెలలఁ బోవిడిచి
జలముల కెండమావులను జేరుదురె!
నా దురదృష్టమో! నీ దురదృష్ట
మోదందడిగ! నిట్లు పుత్రునడ్గించె
రమ్మికనంచు నారమణితోఁ గూడి
యమ్మహితాత్మకుం డఱగూరి-లోహ
దండపురమ్మును దడయక చేరె-
నండజయానుఁ దా నర్థించినట్లు
సుదతీశిరోమణి-చూలుదాల్చినది-
మది మదిలో లేదు మగువ కానంద
మదిరాఽనుభూతితో-మగనికిఁగూడ
మది మదిలోలేదు-మాయాఽనుబద్ధ
కింసార సంసార సంసక్తివదలి
కంసారి సేవింపఁగాఁ దప్పెననుచు-
కడచెఁ దొమ్మిది నెల ల్పడఁతికి నంతఁ
గడుపు భారంబయ్యె, గమనంబు దగ్గెఁ
జెక్కులు దెలుపెక్కె, నెక్కె శ్రమంబు
దక్కెను రుచులు-గాంక్షలు మేర మీఱెఁ
జన్నులు బలిసె-నిశ్వాసముల్వెలసెఁ
గన్నుల సుఖకాంక్ష గఱవయ్యె-వళులు
గనుపడవయ్యె-విచ్చిన పొన్నపూవు
కెనయైననాభి యంతన బిరుసెక్కె-
సకల గ్రహంబు లుచ్చంబై నగతులు
ప్రకటించు నొకనాటి ప్రాభాతవేళ
మందమారుతములు మలయశైలేంద్ర
చందన గంధ సంబంధమ్ముతోడఁ

జలువలై పొలయుచు-సకల లోకముల
కలఁతలఁ బోకార్చు నట్టి కాలమునఁ
గనియె సాత్యకి యొక్క-కనకాఽవదాత
తనుఁడై నవానిఁ జక్కని కుమారకునిఁ
గొడుకు గల్గెనటంచుఁ గొండంతలయ్యెఁ
బడఁతియాసలుగాని-భగవత్పదాఽబ్జ
సన్నిహితేంద్రియ సంచయుండైన
తన్నాథునకు సమ్మదంబేమి లేదు-
వారు వీరునుఁ జుట్టుఁ జేరి ధన్యుఁడవు!
ధీర! ఘోరంబైన దృఢతపం బూని
వనజనేత్రుని దొడ్డ మనసున కెక్కి-
తనుజుఁ గాంచితి వంచుఁ దనుఁ బ్రస్తుతింప
మస్తక విన్యస్త హస్తుఁడై-దుఃఖ
గ్రస్తుఁడై-యూర్పు లక్కజముగఁ జిమ్మ-
తన ప్రియపత్ని చిత్తాబ్జంబు-జ్ఞాన
వనజాఽఽప్తకిరణ సంస్పర్శంబుచేత
నెన్నండు విరిసి శోభించునో! యాస
లెన్నండు గోయునో! యింక నటంచుఁ
దలపోయు-పుట్టిన తనయు చిత్తమ్ము
కలిపాపబంధ సంగ్రస్తంబుగాక
భగవంతునందు సద్భక్తిచే విరిసి
నెగడునో! నెగడదో! యిగనంచు వందు
నా జహ్ను విట్టుల ననవరతమ్ము
నోజ వేవేలుగా యోచించికొనుచుఁ
గలగంచుఁ-దనపుత్రుఁ డిలపైని సుగుణ
కలితుఁడై-నెత్తమ్మివలె విరియంగ
వలె నంచు-శ్రీపతి పాదమ్ములందు
లలితపూజాకమలంబట్లు వ్రాల

వలె నంచు-మధుధార వనజంబు, భ్రమర
కులముల రప్పించికొనునట్లు-మధుర
గుణములచేత సజ్జనుల గణంబు
బనుపడ రప్పింపవలెనంచు-సూర్య
కిరణసంపర్కంబు నెఱసిన యంత
విరియు తమ్మియుఁ బోలె-విజ్ఞానశాంత
మతులఁ గన్గొనినంత నతుల సద్భక్తి
నతిసేసి-మోదమందగవలె నంచుఁ
దమ్మిలో తేఁకులు దమకర్ణికనుఁ గ్ర
మమ్ముగఁ జుట్టెడు మాడ్కి లోకమునఁ
జరియించుచున్న నేమఱక శ్రీకాంతు
చరణయుగ్మమ్ము లాసక్తి భజింప
వలె నంచు, మనమున దులలేని తలఁపు
తెలయించికొని చెవి కింపుగుల్కంగఁ
బుండరీకుండని పుత్రునిఁ బిలిచెఁ
దండిరి-విజ్ఞాన ధన ధనదుండు-
"పుండరీకా!" యని పుత్రునిఁ బిలచె
నండజయాన సాత్యకి-దన కమల
వెలుఁగులు గ్రుమ్మంగ-వెగ్గల వెనుక
నలిరేఁగుచుండ నానందబాష్పములు-
"పుండరీకా!" యన్న పూర్ణనామమ్ము
నిండు గొంతుకతోడ నినదించె దిశలు-
"పుండరీకా!" యన్న పూర్ణనామమ్మ
ఖండ సంప్రీతితో ఖగములు వాడె-
"పుండరీకా!" యన్న పూర్ణనామమున
మండితగతిఁ దరుల్మస్తమ్ములార్చె-
"పుండరీకా!" యన్న పూర్ణనామమ్ము
గండరోమాంచముల్గ్రమ్ముకొనంగ

ఘోరు ఘోరుమటంచు భేరులు మ్రోయ
సౌరసంతానము ల్పవిగొని పలికె-
"పుండరీకా!" యన్న పూర్ణనామంబు
దండివేడుకతోడ దా మాలకించి
యసదృశవాసన లలమికొనంగ
మిస మిస మధుధార మేదినిఁ గురియ
జల జల రాల్చెఁ బూవులఁ గల్పకములు
దల లార్చి యార్చి మిన్నులతోటలందు-
ఘలు ఘల్లు మంచుఁ గంకణములెల్గివ్వ-
చలిత ద్విరేఫమంజులకైశ్య యగుచు
చలితాబ్జకుచములు చలిత తరంగ
లలితాంచలము, సముచ్చలిత చక్రాంగ
కుల కలకల సముజ్జ్వలపారిహార్య
కల నిక్వణమ్ములు చలితాబ్జ నాళ
కరములు-నెఱ సోయగమ్ములు గురియ
పరమూర్తి-దిక్కుంభ భరిత సత్కీర్తి
జగదేకధాత్రి-యిచ్ఛాసంప్రదాత్రి
గగనవీధులను గంగమ్మయాడినది
కలకంఠ కలకంఠ కులములఁ బోలి
లలిమీఱ నప్సరః కలకంఠులెల్లఁ
బాడిరి-వల్లకీక్వణనము ల్మీఱ
నాడిరి-మేఖలల్గాడి మ్రోయంగ—
పుండరీకునిదైన పుట్టుకలోన
గండరించెనొ లోక కల్యాణమెల్ల!
కనులెత్తుచునుఁ జూడఁగా నేర్చె శిశువు
గనులందుఁ గలువల కాంతులే దూయ-
నెలవులువాఱు నవ్వులు నేర్చె శిశువు
నెలనగవుల- వెన్నెలే- గిలుబాడ-

తలనెత్తి చుట్టుప్రక్కలఁ గాంచె శిశువు
దులలేని నీలాల యలకలే దూఁగ-
కరరుహంబుల నానఁగా నేర్చె శిశువు
కరరుహంబుల సుధాకణికలే చినుక-
పదముల నల్లార్చుటదినేర్చె శిశువు
పదపద్మములఁ డాలె బయలెల్లఁ బ్రాఁక-
కలకల మని కేకిసలు వెట్టె, శిశువు
లలిత వీణానాదములె పలుకంగ-
నలకలు నుదుటిపై నటు నిటుఁ దూఁగఁ
గళనించు బాలు వక్త్రమ్మును గాంచి
నపుడు-పున్నమ వచ్చినట్లై భావించు
నపగతేతరభావ- యా మాతృదేవి-
కర కంకణమ్ముల కాంతులు బయల
నెఱయ- శిశువు కరనీరజంబులనుఁ
గదలించినప్పుడు- కాంతకు దిశలఁ
గదురు సూర్యుని వేయికరములే దోచు-
పలికించు సారెముద్దులుగార జనని
పలుకును జిలుఁగుచూపులలోనె నాఁడు-
గిలిగింత వెట్టును గెరలింప జనని
సుళువుగ నవ్వుఁ గన్నులతోనె నాఁడు
శిశువన్న నా తల్లికి- శుభంకరుండు
వసుదేవసుతుఁ డిడ్డ వాత్సల్యభరము-
బాలుఁ డటన్న నా ప్రమదకు-భువన
పాలకుం డిచ్చిన వజ్రాల మూట-
పట్టియటన్న నా పడఁతికిఁ-గనులఁ
గట్టిన విమల మోక్షానందభూమి-
కూన యటన్న నా గోతికి- జన్మ
మూనిన జ్ఞానవిద్యా నిధానంబు-

యొక తనూజుఁడు దన కుద్భవంబందె
నికలేదు మఱఁతి, కీ రేడు లోకములఁ
గోరఁ దగినదేది- కోరిన కోర్కె
గూరె- సర్వేశ్వరు కారుణ్యమహిమ
రార! నా చనవుల రతనాల బరణి!
రార! నాకనులఁ బొంగారిన కోర్కె!
రార! నా జీవన రమణీయదీప!
రార! నా భాగ్యంబ! రార నా జియ్య!
రార! నా యింట వెల్గారు చంద్రుండ!
రార! నా హృదయ కాంక్షారామ పికమ!
రార! నాయూర్పు! రారా! తపఃఫలమ!
రార! రారా! యని రమణీయనేత్ర
యెలుఁగెత్తి సుతుఁ బిల్చు పిలుపులో-భక్తు
డెలుఁగెత్తి హరిఁబిల్చు సొలపులే దోఁచు-
నెలుఁగెత్తి సుతుఁబిల్చు పిలుపులో-వగలు
దలకొన్న ప్రియురాలి పిలుపులే దోఁచు-
నెలుఁగెత్తి సుతుఁబిల్చు పిలుపులో-కరుణ
బొలయు గద్గద నాదముల తీరు దోఁచు—
నెలుఁగెత్తి సుతుఁబిల్చు పిలుపులో-హృదయ
తలము గప్పినది వాత్సల్యమ్మ దోఁచు—
నెలుఁగెత్తి సుతుఁబిల్చు పిలుపులో-వాని
వలననే బ్రదుకు ద[illegible] భయమును దోఁచు—
సర్వ రసంబులు సంఘీభవించి
యుర్వర పుట్టెఁ దానొక్క సూనుండు—
నిదురఁ గన్నులు మూసి నిదురించు నపుడు
గడలేక-చూచు నప్పడఁతి గుమారు—
మినుకుఁ గాటుక పెట్టి- కనుదోయి బెరుగు
నని యందు రేపాటి యయ్యెనో! చూడ

వలె నంచఁ గములు చేరలఁ గొల్చు- పిల్లఁ
డెలనవ్వు- నవ్వు వెన్నెలఁ దానఁ గరఁగి——
నడుపాడఁ దొడఁగెఁ గన్నయ్య-కోమలికి
నడుపాడఁ దొడఁగె నానాకాంక్షలు హృది——
పలుకంగ నేర్చెను బాలుండు- సతికిఁ
బలికెఁ గాంక్షావల్లకులు మధురముగ——
నాడంగ నేర్చె సాత్యకికొడు కంత
నాడె నామెకు హృదయంబునుఁ గూడఁ
బొరుగిండ్ల కెల్లనుఁ బో నేర్చె సుతుఁడు
వరగాత్రికోర్కె- భూవలయమే జుట్టె——
నీరీతిఁ బెరిగెఁ గుమారుండు-తరుణ
మార రూపుఁడు-కూర్మి మరువంపు మొలక
యంతట నక్షరాభ్యాస మహమ్ము
శాంతియుక్తుండైన జనకుండు దీర్చె——
నుపనీతుఁ గావించె యుక్తకాలమునఁ
గృపతోడ సర్వశక్తి, నిగమమాత,
గాయత్రి బోధించెఁ గలిమలాపహము
నా యాత్మజునకు బ్రహ్మనుబోలు దండ్రి—
నదివించెఁ గొమరుని జహ్నుండు-వేద
మధిక శ్రద్ధాయుక్తి నతఁడు వల్లించె
వల్లించు టననేమి! వరుసగా వచ్చె
నెల్లవేదములు దాషే-వాని వలచి——
పదశాస్త్రమందు- దుర్భరనైకవాద
పదము వాక్యమ్మున- పరమ ప్రమాణ
మందు- వైశేషికమందు- సాంఖ్యమ్మ
నందు- యోగమ్మునయందు-ననేక
మంత్ర తంత్రాధి కర్మమ్ములను-స్వ
తంత్రుఁ డయ్యెను జహ్నుతనయుఁ డప్పాట-

స్మృతులెల్ల నేర్చె-విశ్రుత ధర్మశాస్త్ర
తతినెల్ల కెదికె, సంతతనిష్ఠతోడ
నుపనిషత్తులు పాఠ మొనరించె-లోక
విపదంబుధుల దాట- విజ్ఞాననౌక
నలరించు వేదభాష్యమ్ములు సదివె—
లలిమీఱ వాని కొనలు దాఁకె-వివిధ
మహిత పురాణముల్ మదినాకళించె
మహినీదృశుం డెందు మఱిలే డనంగ—
గానంబు, జంత్ర విధానంబు, తాన
మానప్రధానముల్, మర్దళప్రముఖ
చర్మవాద్యమ్ముల మర్మముల్ నేర్చె
మర్మజ్ఞుఁ డీతఁడే మఱిలే డనంగ—
వివిధ నృత్యంబుల వేత్తయై వెలసె
వివిధ కళలయందు విశ్రుతుం డయ్యె—
పుండరీకుండన్నఁ బుండరీకంబు
పండితులకు-మహా ప్రతిభాప్రభావ
విరచనాదరులు-కవీశ్వరతతికిఁ
గరమర్థిఁ బుండరీకము పుండరీకు
డెల్లసభలయందు నెసఁగెను సాంధ్య
మల్లికామృదుల నిర్మలమైన కీర్తి-
యెల్లగోష్ఠులయందు నెసఁగెను సుకవి
తల్లజుం డనెడునుదారయశస్సు
సకల సంగీత సంస్థలయందు వెలసె
నిఁక-పుండరీకున కెనలేదటంచు-
సకల నాట్యవిచార సందర్భములనుఁ
బ్రకటమయ్యెను వాని బంధురకీర్తి-
చిన్నతనము-మిన్ను దన్నిన బుద్ధి
సన్నుత రూపంబు-సదమల యశము

వినుత సదాచారవిధి-వినయమ్ము
గనుఁగొని-యిటువంటి ఘనుని నల్లునిగఁ
బడయు భాగ్యంబు మాపాల నున్నదియొ!
పొడఁగనవలె నని భూసురు లెంద
రెందరో-గన్యల నివ్వఁ గౌతుకము
సందడిగొనఁగ విచారించుచుండ-
నఖిల భూసురమణియైన జహ్నుండు,
సుఖవృత్తి నొకనాఁడు శుద్ధ విచారఁ
దన ప్రాణసతిఁ గనుఁగొని-కుమారునకు
ననురూప బాంధవ్య మమర వీక్షించి
పరిణయం బొనరింప భావంబు గలదు
అరసి చెప్పఁగదె! నీ యభిమతం బన్నఁ
గ్రీఁగండ్ల వేయి కోర్కెలు గుమిగూడ
నా గజగమన, మందా౽లసరీతిఁ
"గానిండ"నుచుఁ బుత్రుఁ గనుఁగొనె-వాని
మౌనమేయందు సమ్మతముఁ జూపించె-
నంత జహ్నుండు-విద్యాసముద్రుండు
శాంతచిత్తుఁడు-సదాచారవ్రతుండు
గులమును, రూపంబు, గుణమును గలిగి
సలిత లక్షణోజ్జ్వలయగు నొక్క-
కన్యాలలామమ్ము-కాంత సౌభాగ్య
ధన్యను వీక్షించి-తన కుమారునకుఁ
బరిణయ మ్మొనరించె-బంధుజాలమ్ము
వరుని బాలికఁ గాంచి-పరమ సమ్మోద
భరితులై-పార్వతీ పరమేశ్వరులకు
సరియంచుఁ బలుమారు సంస్తుతింపం?
నత్యంత మధురభావౌఘమ్ముచేత
సాత్యకిచిత్తంబు శబలితం బయ్యె-

వర వధూవరులు సుందరహాసములనుఁ
జరణంబు లంటి సాష్టాంగమ్ము సేయ-
తరువాతఁ గొన్ని వత్సరములు గడువ
పురుషపుంగవుఁడైన పుండరీకుండు-
నవయౌవనోద్భిన్న నవ్యలావణ్య
ప్రవిమలతను యష్టిఁ బరగెడు దాని-
శాతశారకటాక్ష జాలమ్ముచే- న
చేతనునకు మరు ల్చిమ్మెడు దాని-
లలిత గండస్థల ఫలకమ్ములందుఁ
జెలఁగెడు శోణకాంతులు గలదాని-
నలకావళీ పరికలిత నిటాల
తలముచేఁ జంద్రుఁద్ర స్తరిసేయుదాని
నరుణమై యాన నాఽఽభరణమైనట్టి
తరుణాఽధరమ్ముచేఁ దగ నొప్పు దాని
మదదిగ్గ మాతంగ మల్లకుంభములు
చదియఁగఁజాలు కుచద్వయి దాని-
ననుభవించెఁ గుమారుఁ డానందసాంద్ర
మనముతో వికపిత వనజంబుఁ దేటి
యనుభవించినయట్టు-లత్యంత ముదము
బెనఁగొనఁ జక్రంబు-ఫెంటి జక్కవనుఁ
గలసినయట్లు-పిచ్చిలర తీచ్చఁ గొని
చలపట్టి మదనాగ మొలసెడునట్లు-
కాయంబు గాయంబు గలిపి-సర్పమ్ము
నోయన సమరతి నొనరించునట్లు-
నీరీతి సుఖములఁ గూరి-యాత్మజుఁడు
సారసనేత్రి స్నుషయును-గృహమ్ము
జీవవంతము సేయఁగా వీక్ష సేసి
భావమ్మునను బొంగెఁ బడఁతి సాత్యకియు-

నిటులుండ నొకనాఁడు విటమనఃపేటి
పటు మన్మథాఽఽగమ పాండిత్యపాటి
రతి సుగంధితశాటి- రతిరాజుబోటి
తత క్రమ కటిపీఠి, తారుణ్యఘోటి
పువువిల్తుదైన యాఱవబాణ- మఖిల
భువనైక మోహన పుణ్యఫలమ్ము
హృదయముల్దూటి యా వృతపల్లవులకు
నదరక, బెదరక, యలజడి లేక
లలిత విభ్రమకళా లతికయ వోలెఁ
బొలపంబు సూపు మిన్కు-ల మెఱ్గుబోలె
మదనడిండిమ మూను మదహస్తి వోలె
పదనైన వలరాజు వంకిణి వోలె
సొలపు గ్రమ్మఁగ వచ్చు కలహంపి వోలె
పొలసు లార్చుచు నొప్పు గల మీను వోలె
కడి వోని వలతేని కిడు దండవోలె
నడపాడు ప్రత్న రత్నశలాక వోలె
వెలయంగ నిఱచున్న వెన్నెల వోలె
పలు గ్రమ్ము-జవ్వాది వాసనవోలె
రమణీయ మగు సాంధ్యరాగమ్ము వోలె
కమనీయ మగు కన్నె కలయును బోలె
తొలి రతిలో వింత సొలపును వోలె
కలరాగమునఁ గ్రొత్త కళయును బోలె
సమరతిలోని యుత్సాహంబు వోలె
క్రమహీన మణిత విభ్రమరేఖ వోలె
స్పష్టంబు గాఁగ-నస్పష్టంబు గాఁగ
నిష్టంబుతోడ సమీహిత భావ
ములనుఁ గుప్పించుచుఁ గిలకిల మనుచుఁ
దలిరుఁ గోయిల పదుపులు వోలె గంట

లులియంగ, మేఖలాకలితముల్; దిశలఁ
బొలసాడఁ జూపులు, పూలనవ్వులును,
మదవృష్టి గురియంగ-మదనాఽభిషేక
సదమల జలకుంభ సదృశంబు లైన
జిలుఁగు గుబ్బలు-నాణి గల ముత్తియముల
బలుహారములు స్రుక్క-వగలును విక్క-
నా విటులకు మనోహరమైన తమ్మ
తావి గల్గిన కావి మోవి చలింప-
కరకంకణంబులు గల కంఠములనుఁ
బరఁగింప రతికళాప్రౌఢ ప్రబంధ
ములు-పద్మముల దోయి నలఁదిన తొగర
జిలుఁగులత్తుక, కావి నెలకట్టు గట్ట-
నిలపైని వస్త్రంపు నెఱికలు దూల
వలయము ల్వలుకంగ-ఘలు ఘల్లు మనుచు-
వివిధహస్తంబులు-వివిధ భంగిమలు
వివిధ తాళంబులు వెరవునఁ గూర్చి
వివిధ ప్రబంధముల్ వెలమించి మించి
చవినించి యొక్కతె-చక్కెరబొమ్మ
చదురు సూపుచు నున్న-సభనుఁ గూర్చున్న
చదురు లెల్లరు మహాశ్చర్యంబుతోడ-
బాళి దువాళింప వశము గాకున్న
నా లేమ నెనువెంట నంటు చిత్తముల
నల్లవో! మృదుగాత్రి! యవు కళాధాత్రి!
యల్లవో! సుఖదాత్రి! యల్లవో! యువతి!
బాపురే! పీయూష పరిపూర్ణసరసి!
బాపురే! మదమత్త పల్లవమహామ!
బాగు బాగని పెద్ద వలుకుచుఁ దాల్మి
వీఁగుచు-నుదులలో లోఁగుచు-దెర్య

మాగుచు-మఱపట్టి తూఁగుచుఁ-గదియ
నేగుచు-నెఱకొంగు లాగుచు-బాళి
సోలుచు నుండంగ-శుద్ధచిత్తుండు
పాలితాచారుండు-బహుశాస్త్రవేత్త
కీర్తి సత్పరివేషమూర్తి-విజ్ఞాన
పూర్తి-మహాస్ఫూర్తి-పుండరీకుండు
పుండరీకాక్షునిఁ బూజించుకొఱకు
మండితసద్భక్తి మధురఁ దాలయము
వంకఁ బోవుచునుండి-బలవద్విధాతృ
సంకల్పబలమున-జనసమూహమ్ముఁ
గాంచి-తద్వీక్షణకాంక్ష నెన్దిరిగి
పంచాస్త్రనిభుఁడు సభాస్థలిఁ జేరె-
చేరిన యంతటఁ జేరిన జనము
ధీరుని-సుగుణమందారుని-పుండ
రీకునిఁ గాంచి-యుద్వృత్తిఁ బోవిడిచి
వీకున నల్లంత వెనుకకు నొదుగ
విరిసెను మునుము-సుందర నీలవేణి
తరుణ ఘనశ్రోణి, వరమృదుపాణి
చకిత చకితనేత్రి, సౌందర్య సార
ముకురంబు, విభ్రమ నికరంబు గూడఁ
గ్రీఁగంటితోఁ బుండరీకునిఁ జూచి
యాగునవ్వన నవ్వనట్లుగా నవ్వి-
కటకాముఖము వట్టి- పటముష్టిబంధ
ఘటనంబుతోడ- నుత్కటశాతశార
మగు దృష్టిఁజిమ్మి-నాట్యాంతరంబందు
నగవుల బరణియై-బిగువుఁ జన్నులనుఁ
గ్రుమ్మెడు గతి ముద్దుగుమ్మ డగ్గరుచుఁ
గమ్మకస్తురి వింత కడిఘుమ్మటంచుఁ

గ్రమ్మఁగ నఱజార్చి కఱుదున కొంగు
బొమ్మల నల్లార్చి పోయిన-దాని
యెడమేని నెత్తాని సుడిసిన-ధైర్య
మెడలిన యెడనున్న యెడ-నెడలేక
మరుఁడు లేఁ దలిరాకు కరవాడియైన
కరవాలు మాసి-యక్కటికంబు ద్రోసి
కరిపించి మించి-యగ్గలిక నివేక
భరమెల్ల నొక ప్రేటఁ బడిపోవ నఱుకఁ
జిడిముడిపడి-మ్రోడుపడి-బేలుపడి-నె
గడువడి-తొడిఁబడి-తడఁబడి-వెఱఁగు
పడి-వెనుబడి-చెఱఁబడి-వెడగునడి
వెడలఁబడంగనే నెరవును దప్పి
యతినేల విక్రమమైన మోహమ్ము
మతిగ్రమ్మ-తాపమ్ము మనసును గ్రుమ్మఁ
దోర్ఘంబులగు నేడియూరుపు లొప్పెదల
ఘోరమైనట్టి వికారముల్మెదలఁ
గన్నులఁ జీకటుల్లప్పుచునుండ
నన్నలినాక్షి మాయాజాలమునకుఁ
జిక్కిన చిత్తంబు సేరుపరాక
స్రుక్కి నాట్యంబెల్లఁ జూచి-యద్దాని
యన్నువ నవ్వును-నన్నువ నడుము
నన్ను గ్రమ్మించెడు నట్టి లేఁ జూపు-
తొగరువాతెఱ, జిగి దొలఁకుఁ గుచంబు
లగణిత మదదిగ్ధమైన సుశ్రోణి
నిటలఫలక పత త్కుటిలాలకములుఁ
గుటిల చంద్రునిఁ గేరు కొమ్మ నెన్నుదురు-
వెడఁదఁ గన్నులు-జొత్తు లదరుఁ జెక్కిళ్ళు
బొడవయి కోఁచేరుఁబోలిన నాస

యచ్చొత్తినట్టులై యాత్మలో నిలువ
నచ్చపలాక్షి పొం దాపించికొనుచుఁ
బొరి గృహమ్మును జేరెఁ బుండరీకుండు-
సరసవాక్యామృత సంసేచనమున
నెదురుగాఁ బఱతెంచె నెలనాఁగభార్య
పదముల మృదుగతి వలయంబు లులియ-
చిఱునవ్వు నవ్వె నెచ్చెలిఁ గాంచి భర్త
యఱమనస్సేనిచ్చె నానవ్వులందుఁ-
దలఁచు నేదియొ బరధ్యానంబుతోడఁ
దలవంచి, తలనెత్తి, తనలోనె వాఁడు
నప్పళించెడు నెదో యాకాశమందు
గుప్పి చూపులు-గుంపు గొన్న తుమ్మెదలు-
పలుకఁ దాలో నేమొ! బలికిన యంత
నళుకు నెవ్వరును విన్నారేమొ! యనుచుఁ
గన్నీరు గార్చుఁ జిక్కఁగ-భార్య బొంచి
కొన్నదో! యని కొనగోటవే చిమ్ముఁ
జిట్టమిడుచు నింకఁ జిక్కలే యనుచు
గుట్టు రట్టుకునెక్కు- నెట్టొకో! యనును
నంతలోననె నవ్వు, నంతలో నూర్చు
నంతలో వెఱఁగందు-నంతలో మిడుకుఁ
బలుకఁడు భార్యతోఁ బలికింపనైనఁ
బలుకు పలుకనట్లు-పలపల గాఁగఁ——
జదువఁ డేదియుఁ గాని- చదివిననైన
మది మదిలో లేక మఱపునఁ జదువు
వాదంబు సేయండు- వాదింపనైన
భేదంబుతోఁ బ్రతివాదికిఁ జిక్కు-
నులుకు వెన్నెలలకు-నళుకుఁ గోయిలకు
బెళుకు నారామ సంకులవాసనలకు——

నీరీతిగా బాళిగూరి-యావార
నీరజాక్షిని మది నిల్పి-యికెట్లు
బారంబు లేక- యా వలరాజు ముందుఁ
దీరి మార్గము జూప దీనాస్యుఁ డగుచు
నొకనాఁడు దుర్వచనోద్యుక్త భండ
నికర నిబిడితంబు-నిష్ఠురద్యూత
కలహపరాయణ కలితమ్ము-నార్ద్ర
పలఖండతోరణాఽఽవళి పరీవృతము
తాంబూల నిష్ఠీవతారకితమ్ము
శంబరశత్రు వసంత హర్మ్యమ్ము—
కాదంబరీ పూతిగంధజుష్టమ్ము
సాధుసంవాద ప్రసక్తి దూరమ్ము—
కుక్కుటనాద నిబద్ధకర్ణమ్ము
కుక్కుట కలహ సంక్షోభసంజాత
రణబద్ధ దుర్విటాఽఽరావసంకులము—
ధన పరిగ్రహణశ్రద్ధాయుక్తజరఠ
మాతృనానావిధ మధుర సల్లాప—
మాతత పాపనృపాఽఽస్థానతలము-
చోరైకనిలయమ్ము- సురతాఽతిరేక
ఘోర గదాఽఽక్రాంతవారాంగనంబు
నటనటీజటిలమ్ము-పటుకామశాస్త్ర
పఠన పాఠనయుక్త భవనాంగణమ్ము
నానావిధాఽఽతోద్యనాద కాంతంబు
నానావిధవిలాస నవ్యకామాఽస్త్ర
సదృశమత్తాంగనా సంచయాంకితము-
పదిలమ్ముగా వేశవాటిలోఁ జొచ్చె-
నావేళయందు- బాహ్యాళిందమందు
నావెలంది- యలంది- యమిత లావణ్య

సేవధి యగుఁ గుచసీమఁ జందనము-
తావిపూవులు జుట్టి-తమకంబు మెట్టి
చెలువారు నుదుటిపైఁ దిలకంబు వెట్టి
జిలుఁగు పైఠాణిపూవుల చీరఁ గట్టి
కులుకు గుబ్బలకుఁ గొంకుచుఁ గొను వడఁక
గిలుకు మెట్టెలు జిలిబిలిగ-గిలుక్కు-
గిలుకు మనంగఁ బంజాలకమ్మల జిగి
తలిరులఁ బూయఁ జెక్కు-లదోయిపైని-
నిడు కనుంగొనల నాగెడు కటాక్షములు
దడఁబడి- త్రెవ్వినదండలై పొదల-
నందంద ముత్యాలచందమై-క్రొత్త
యందంబు జిమ్మ స్వేదాంబుకణంబు
లలమిన నిట్టూరు—పలసభావంబు
నలఁతి సిగ్గును ద్రోపి తలనూపు నిచ్చ—
రతికాంత రణతాంత రమణీయమైన
వితము వోలింప—నున్నత కుచంబులకు
నెత్తు వచ్చెడు నంచు నెంతయుఁ గిన్క-
హత్తినవోలె—హస్తాబ్జంబు తోడ
బంతిగొట్టుచు నున్న బయకారి—యంత
లంతలఁ బుండరీకాక్షునిఁ బుండ
రీకునిఁ గ్రీఁగంటఁ గ్రీడగాఁ జూచి
సాకూత మృదులహాసము కావి పెదవి
యంచుల నొదిగి—ముత్యము వోలె నాడ
మించు విధాన- నాకుంచితగ్రీవ
రమణీయమైన వక్త్రంబుతో-జడయు
భ్రమియింప మదనుని రథచక్రమట్లు
మణిమయమేఖలా మధురకళత్ర
ఘనభారవహన దుఃఖ పరాహతమ్ము—

గమనంబు గడు చెన్ను గలిగింప-గర్వ
తముల కుచద్వయి దొనఁకఁ గంకణము
లెలుగింప-వలయంబు లులియ-జార్వైట
వెలయ-వెన్నెల గాయఁ దల మల్పిచూచు
చూపులలోనె యా సొబగుని హృదయ
మావొత్తి తెగఁ గ్రుమ్మి-యటు మాయమైన
తనువెల్లఁ గన్నులై తడయక చూచి
మనసెల్లఁ గోర్కెలై మఱవుట్టి నిలచి
తలనార్చి-వంకబొమ్మల నార్చి-తఱచుఁ
దళుకు ఱెప్పల నార్చి-తత్తర బేర్చి
సడికోర్చి-తన నడవడి దీర్చి-యిల్లు
వడి నార్చి-పుండరీకుఁడు లోని కేఁగి-
నిలువ-జరద్విసంస్థుల పరీరంభ
నిలయ-కార్కశ్యవంచిత సమాలంబి
కుచయుగ-లాలాక్త గురుదంతనాస
నిచిత కాదంబరీ విష్ఠురగంధి
పలిత శిరస్క—విఫలితాతిహాస
జలపూర్ణనేత్ర—దుర్జన్మనికార
గతి—సమాశ్రితవిటతతి—వేశ్యమాత
యతనున కెనయైన యా పుండరీకుఁ
జేవెలుంగునఁ గాంచి—చిత్తఱువెనయ
నా వెఱ మార్చి—భాగ్యము భాగ్యమనుచు
నటు నిటుఁ జూచి—మాయాయత్నపటు వి
కటహాసమున నెద గంపించుచుండ
"రండు రం డీనాఁడు—రాజీవగంధి
పండు—భుజించు— నా భాగ్యంపుఁ బంట
యెట్టిది నాన, మి మ్మీక్షించె నోటు
పట్టి—యీనాటికి ముట్టదు గూడు

సుదతి దాఁకదు-మూర్కొనదు పూవుఁ, బెదవి
గదుర రేయెండ నవ్వదు—చదురాడ
దాడఁ జూడదు-నడపాడదు-సకులఁ
గూడదు—మఱుమాటలాడదు-దిగులు
వీఁడదు నొక పాట బాడదు- వీణె
వోడిమి గుల్కంగఁ బూనదామిమ్మె
గనులను జిత్రించికొని వగఁ జిక్కి-
పనవుచున్నది-జింగఁ బాసిన పెంటి-
కడకు నేటికి నేను గారింప నెటులొ
గడి యొక్కటి గొని సాపడి-యొక యింత
గయి సేపికొని-నిన్నె గనుల నిల్పికొని
కయికొన్న, దా కందుకం, బేమి పాలు
వోఁక మా బాబులు-పున్నెంబు పండ
వాకిటికే నేఁడు వచ్చి నిల్చితిరి!"
రండంచు నా చండి పుండరీకుని న
ఖండమౌ మర్యాద గలయది వోలెఁ
దొడుకొనిపోయి-చొప్పడిన కప్పురపుఁ
గడు వాసనలు గ్రమ్మి ఘమ్మనుచోట-
నుత్తభిత్తల నున్న మత్తకాశినుల
చిత్తరుపులు మత్తు హత్తించు చోట-
వాసనావాసిత పర్యంక రత్న -
భూషలై-విటమనస్తోషంబు లగుచు
లలితపల్లవ తామ్రములు-యావకాక్త
ములు- బాద ముద్రలు గలచోట-
శయనమందిరమున సంస్థితుఁ జేసి
"యయగారు వచ్చినా రళుకేల రావె
యోలమ్మ" యని పిల్వ-నొకవైపు నింత
దూలిన సైటతో-లీలమై మరుని

బటువు బిల్లలఁ బోని పాలిండ్లు సుంత
పుటమార పైరిణీపూతైక దన్ని-
నిడువాలు గల కీలు జడతోడ-బడుగు
నడుమడు గడుగున వడకంగ-వడిగ
జిలిబిలి నవ్వు జెక్కుల దూఁగ-వచ్చి
తలుపోరఁగా నిల్చి-తరుణి వీక్షింప
నా వెన్నెలలవాఁక యలమినఁ-జిత్త
మావేశితము గాఁగ-నతిప్రయత్నమునఁ
గుదియించుచున్న దుర్మదమనోజాత
విధుత ధైర్యునిఁ గాంచి వేశ్యాసవిత్రి-
యొకచేత నిలుచున్నయువిదఁ జూపించి
వికటహాసమున నీ విధముగాఁ బలికె
"నసుభవించితిమి మేమును జాలి-బాళి
చినతనమునఁ గాని-చిత్రమీమరులు
కనివినికాన మెక్కడ నీజగాన-
మనసుమార్చితిరేమొ మరులుమాతంగి
దినిపించి-మంతర తీరత మిచ్చి-
యనరాదు గాని-మాయమ్మితో ననఁగి
పెనఁగంగఁ గోరి యా పెదసెట్టిగారు
"మనసు వచ్చిన యన్నిమాడల నిత్తు
నీ పొందు నిమ్మ"ని నిలువున వేడ
పాప-నీ పొందాసవడి-మతి దప్పి
చూడ దాతని సుంత చూపులు ద్రిప్పి
మాడ లెన్నైనను-మరులున కెచ్చె?
చెప్పి చూచితి నెంత జెప్పిన నిన్ను
దప్పు యోచింపదుఁ దలిరాకుఁబోఁడి-
వగకాఁడ! నీకునై వగఁజిక్కి-తళుకుఁ
దెగ కన్నులందు నిండుగ నీరు నించి

నీవు వత్తువా! యంచు-నీవున్న దిశకుఁ
దీవెలు వాటించి- తెఱవ జూపులను-
వెలితిత్రోవలు గాంచి-పెదవి చిట్లించి
కళవళపడును-జక్కవ పక్కి వోలెఁ
చూడుమా వీణియ గోడు-మన్నెల్ల
గూడు గట్టెను-కొనగోరు దాకించి
పలికింపలేదు తంత్రులు-సందుపాట
వలె వేయలేదుఁ-గోయల మూగ వోవ-
వచ్చితివింకలే? వగలాఁడి కడకుఁ
దెచ్చికొన్నది నిన్ను-తెగ తపియించి-
చిలుక గోరంకలవలెఁ బూవుఁదాని
వలెఁ-బాలు నీరునువలెఁ జందమామ
వెన్నెలవలెఁ బెనగొన్న కోర్కెలనుఁ
గన్నెయు నీవునుఁ గలిపి వేయేండ్లు
మనియుండవలె నంచుఁ దనబిడ్డఁ జూచి
కనుఁగవ నవ్వి- చక్కఁగ నిష్క్రమింపఁ-
దేనె బూసిన వాలు బోని యా వేశ్య
దా -నిజమైన కాంతాళమ్ము-మరులు
గలిగినయదివోలెఁ గపట బాష్పములు
గలిగిన కనులఁ, జెంగటికి నేతెంచి
కలహంస పోలిక నిలిచి - "యిన్నాళ్ళు
లలచి-యీ నాటికి ననుకంప గలిగి
యరుదెంచితిరో! యంచు" నంతలోపలనె
కరకంకణమ్ములు గడు రవళింప
మెఱుఁగుఁబోఁడియు వాని మెడఁ గౌగిలించి
తఱచుఁ జూపులనుఁ జిత్తమ్ముఁ గ్రుమ్మిననుఁ-
గరమెత్తి తుమ్మెద గఱులతో నెనయు
నెఱికురులనుఁ దీర్చు చరయుచు దానిఁ

బలికె మించులమూట! బన్నీటితేట!
గులుకుచూపుల చాన! కోర్కెలకోన!
తొలిచూపులోనె నా వలపెల్ల దోచఁ
గలిగిన చెలి! నిన్నుఁ గనుల వీక్షించి
యింటి కేగితిఁ గాని-యిం దదేదియునుఁ
గంటికి-నీ మూర్తి గనులకుఁ దట్టి-
పడఁతిరో! నీ వేలు జడతోడు-అవిక
నడఁగని గుబ్బలయాన- నీవలఁదు
లత్తుకసాక్షిగా- లలిమీఱఁ గన్ను
లెత్తి వీక్షింప లే దిల్లాలి నేటి——
కడుగవే! యీ గుండె గడియార మలఁత
బడనేల! దాఁ జేయు ప్రతిచలనమునఁ
బలుకు నెవ్వరి పేరొ! పద్మాయతాక్షి!
నిలుపనివ్వని కోర్కె నిలువునఁ బట్టి
సడికిని వెఱచి——రాఁజాలకపోతి
మెడబంటి యయ్యె నిక్కడికిఁ దాపమ్ము——
యాలపించిన నింక నాసలేదంచు
బాల! యీనాఁడు నీపాలికేతెంచి
తని" పుండరీకుండు-దన యెద హత్తి
కొనియె వామాక్షిని-గుబ్బచన్నులను
హత్తించె వామాక్షి గుత్తంబు గాఁగ
నత్తరుణుని బిరుసైన గుండెలకుఁ——
బలుకు లుత్తరములు-గిలకిల నవ్వు
లొలయించుటలు-గోపములు- చీదరించు
టలు- దనిముద్దులు- నళుకులు జళుకు
లలరుట తెచ్చిన యాలింగనములు-
నింతలో మదదృష్టకాంతాకుచాత్త
కాంతకుంకుమ సదృశంబైన కాంతిఁ

బెరపి-పశ్చిమ ధరా ధరశృంగమందు
వరుణుండు నిలిచె సంధ్యాకాల సూచి-
పుండరీకుండు-పూబోండి మైపూఁత
గండరించెడు నెద-కంపువోఁ గడిగి-
చపలాక్షి వగతోడ సొఁగసంపుచును
గృప దప్పుదురె! యంచు నెచ్చరింపంగ
నళుకుచు నులుకుచు నా మ్రుచ్చు గోర
దలఁకుచు నెటొ దొడ్డిదారి వీధిఁ బడె-
నిటఁ దండ్రి దనకొడు కెన్నఁడే గాని
పటుబుద్ధి-యలువీడి బైటవోవండు-
పోయిన నోరంత ప్రొద్దుండదేమొ
సాయంతనంబైన సరగ రాఁడంచుఁ
జంతించుచుండంగ నింతలో బుణ్య
వంతుండు దయసేసె వరకుమారుండు-
నాయనా! సాయంతనంబైన సంధ్య
సేయవుగాకేమి! చిత్తంబు శాంతి
నుండునే గద! యెట్టులుండిననైనఁ
దండిరి! నెఱవౌనె ధర్మలోపంబు!
పండితుఁడవు- గ్రియాపరుఁడ వీవిట్లు
బండనైతివి—నగుబాటు గల్గెడునొ!
యని యన్న నొక గొంత సణిగి-యా వార
వనితావిలాస సంపదలె భావించి
కొను చెట్లొ సంధ్యవార్చెను బుండరీకుఁ
డననేల! ధర్మక్రియాసక్తి దలఁగె-
నమృతపూర్ణంబైన యట్టి భాండంబు
రమణీయ యౌవనరాజ్యాఽధినేత్రి-
పొలఁతి యేతెంచి-కన్నులఁ బెదవులను
జిలుకు నవ్వులముందు నిలిచె-నా భర్త

దల యెత్తి చూడండు- తల్పంబుపైనిఁ
దల ద్రిప్పికొని పండె-కలిలమానసుఁడు—
వెడవెడ గన్నీరు వెడలంగ—మనసు
దడఁబడ-ధృతి గీడు పడి-పరితాప
భరమునఁ బ్రాణేశుఁ బలికింపఁ బోయి
యరవాయి గొని యూర్పులడర, నవ్వాని
చరణపీఠంబున శిరముంచి పండెఁ
దరుణి యల్లుచునుఁ జింతాతంతువులను—
తెలతెలవాఱె—దిక్కులఁ బక్కిగుంపు
లెలుఁగిచ్చె—విరులు మూతులు విచ్చెఁగాలి
హెచ్చె జగంబెల్ల నెలమి గుల్కంగ
నచ్చపలుండు వేదాధ్యయనంబు
సలుపుచునున్నాఁడు-స్వరసంచయమ్ము
జలిబిలి మ్రోయు-వన్నెల వెలయాలి
మొలనూలి జలుఁగు గంటల మ్రోఁతతోడఁ
బులకలు గ్రమ్మంగఁ బోలించికొనుచు-
ముగిసె భోజన మంతఁ బుండరీకుండు
ముగుద యందిచ్చు తాంబూలంబు నమలి
కనుమూసికొనెఁ దన కనుఁ గన్పడియె
మనసిజ రాజన్య మదహత్తి వోలె
నలసాఽలసములైన యాలోకనములఁ
జెలువు బండించి దిక్కులనెల్లఁ గందు
కము నాడుచుండిన కలికిరూపమ్ము—
తమకమంతటిలోనెదలమీఱె-దర్ప
కుఁడు కో యనుచు నార్చి-వడి వాలుబూని?
జడిపించి పేర్చి-నెవ్వడి నెదఁ గ్రుమ్మె—
పఱునిముసంబె భూసురకుమారకుఁడు
బరుగిడి-సానింటఁ బ్రత్యక్షమయ్యె—

మిడిగల వజ్రంపు మినుకుఁ గమ్మలును
గడియము ల్మివులఁ జొక్కపు హారములును
ధరియించి-గుజరాతు జరబాజు చీర
నెఱికలు మీఁగాళ్ళ నెఱసి యాడంగ—
మొనలు నిక్కిన కుచమ్ములు-గంబుకంఠ
మును—మందచలితము ల్ముద్దులు గురియ
గలహంసవలె వచ్చి-కన్నుల కాంతి
పలువరుసలకాంతి-పరిఢవిల్లంగఁ
గై దండ యొసఁగి-చక్కఁగ శయ్య జేర్చి
యాదినంబును వింత యందము ల్నెఱపె-
సంజకు నిలు సేరె సరసవతంసుఁ
డంజుచు నంజుచు నానాఁడుఁగూడ
జనకుఁడు బ్రశ్నించె జాగేల ననుచుఁ
దనయు ఖారం బసత్యముతోడఁ దీఱె—
మఱుదినంబునుఁగూడ మధ్యాహ్నమందు
సరిగ సానింటఁ గాపురమయ్యె— రోయి
వెలఁదియు-వివిధ మాయలను-విలాస
ములను-మత్తెక్కించెఁ బుండరీకునకు—
నంగ దట్టపుఁ గాంతి చెంగలింపంగ
నంగన దెలిచీర నలరారఁ గట్టి
మువ్వంక దీరి, సొంపుగ నిలుచుండి
నవ్వఁ బరీరంభణం బొనరించుఁ
జెంగావి ధరియించి—చుంగులు దీర్చి
రంగారు మేలిముసుంగు ధరించి—
మొలకట్టు జిలుఁగు గంటలు మ్రోయ వచ్చి
తెలిగన్ను లఱమూసి-కిల కిల నవ్వి
వలిపంపు జైక చన్నుల గదిమించి
కులుకు గద్దువహస్త జలజంబుఁ జేర్చి

నిలచి నా వగకాఁడ! నీకుఁ జిక్కితిర
నిలిపికొమ్మనుచు బొమ్మల వింత నవ్వ—
జడదీర్చి విప్పి-క్రొమ్ముడి గయిసేసి
యడిగెడు నిది మేలొ! యది మేలొ! యంచు
సరిగ తైక సడల్చి-చనుకట్టు గట్టి
యరసెడు నిది మేలొ! యది మేలొ యంచుఁ
దిలకంబు దుడిచి-యిమ్ములఁ జుక్క బూన్చి
యలరించు నిదిసొంపొ! యదిసొంపొ! యనుచు
విరిదండలను-బాణిసరులనుఁ బట్టి
యరికట్టు నివివల్తొ! యవి వల్తొ! యనుచు
నుదుట గండమ్ముల నదిమి ముద్దిడుచు
నదిగొప్పొ! యిదిగొప్పొ! యనుచుఁ బ్రశ్నించు
నెద బిట్టు గ్రుమ్మి పయ్యెద దీపి-కనులు
గదిసి ముద్దిడి మోవి కసివోవ-నడుగు
నది యోగొ! యిది బాగొ! యని లతాతన్వి
గొదలేక-చెక్కుఁ జెక్కునఁ జేర్చి-కనుల
నఱ మూసి-తల యూచి-యఱితి బాహువులఁ
బరిరంభణము సేసి ప్రశ్నించుఁ దరుణి
యది బాగొ! యిది బాగొ! యంచు నీ రీతి
మదన సామ్రాజ్య సమ్మదమునఁ జిక్కి
జహ్నునిసుతుఁడుండ-జనులలో విరిసె
జహ్నుకుమారు నిచ్ఛా ప్రవర్తనము—
నా చెవి కీ చెవి కంటి తండ్రికిని
జూచాయఁగాఁ దెల్సె సుతువర్తనమ్ము
దలమీదఁ బిడుగు చిటిలినట్లైన
పలితశిరస్కుండు-పావిత్ర్యమూర్తి
యలపరించుచును సాత్యకిఁజూచి—"వరము
ఫలియించెఁ గాంచితే! వారకాంతలను

మఱఁగినవాఁడు గుమారుండు-కందు
నెఱఁసె గులంబున నిష్ఠురువలన
నీనాటి" కని పల్కి-యిలపైనిఁ గూలఁ
దా నమ్మనేరక-చాన-కోడలిని
లక్షింప-బాష్పజాల మ్ముబుకంగ
నక్షీణ పతిభక్తి యమరిన వనిత
"యిది కాద-గిట్టక యెవ్వరే బలికి
నది గాక నా ప్రాణనాథుండు-సుగుణ
శేవధి యనుచు వచించె" నాలోన
భావజమదమత్త భద్రగజంబు
నడతెంచెఁ బుండరీకుఁడు-దిక్కులందు
నడరిన సంజ చాయల విలోకించి—
వానిఁ గాంచినయంత మానస మధిక
దూనమై, దీనమై, తోయజనేత్రి
"చూచితే! నాయన్న! చూచితే దండ్రి!
జూచితే! యతివేల సుగుణమందార!
గిట్టనివారు ని న్నిట్టట్టు బలికి
రట్టు దెచ్చిరి-ప్రేమరాశి యైనట్టి
మీ తండ్రి యిలఁ గూలి మిడుకుచున్నాఁడు
నా తండ్రి! నిజమని నమ్మి యా వాదు—
వాదంబులందు నిజ్జ భేదింపలేక
సాధింపఁ జొచ్చి రీసడులు గల్పించి
త్రిమ్మటకాండ్రేమి దేఁబునో! వీటి
గుమ్మమ్ము వదలకు-కోట్యపవాద
ములకు నే బదులిత్తుఁ దలనెత్తి నిలిచి—
కలదు ధనమ్ము బుష్కలముగా-విద్య
గలదు సురాచార్యుఁ గలపంగనైన
గలదు రాసిక్యమ్ము-గలదు విలాస

ములకెల్ల నెల్ల-ముద్దులగుమ్మ-పొలఁతి——
కలరింటఁ దల్లిదండ్రులు-గాపురంబు
నిలుప-బాగోగులు నిర్ణయింపంగఁ
గలుగ నిదేమి నీ కిలపైని గొడుక!
పరదేశముల నుండి పండితుల్వచ్చి
పరికించి నీ ప్రజ్ఞ బ్రస్తుతింపంగ
నా రాజు నీ రాజు యంపిన కాన్క-
లారసి నీ తండ్రి యతి మోదమంద——
యఖిల శాస్త్రమ్ముల నభ్యాసమునకు
సుఖితులై నినుఁ గొల్చుచుండ శిష్యులును-
బందుగు లెల్లరుఁ బరితోషమంది
యందంద నినుఁ గూర్చి యంకింపుచుండ-
నరుదొంద నొక్క మహారాజు వోలె
వరపుత్ర! గొల్వు దీర్పఁగవలెఁ గాక
యాయింటి కీయింటి కరుగంగఁ బోలు
నా! యెల్లవారు ని న్నసదుగాఁ జూడఁ
బోయితి బో! యింత ప్రొద్దుండఁ దగున!
నాయన! దిన మిదే నడవడి దగునః!
జూడుమా! నీ తండ్రి గోడంచుఁ-గనుల
నోడికల్గొన్న బాష్పోదకములను
బలికిన తల్లి-విభ్రాంతుఁడై జూచి
తల వంచి-లజ్జ చిత్తము నాచికొనఁగఁ
జరణంబులకుఁ జక్క సాగిలి మ్రొక్కి-
పరితాపమున నిట్లు వచియించె సుతుఁడు-
"పోనులే తల్లి! యెప్పుడుఁగూడ నింక
రానివ్వలే! యిట్టి రట్టు లొక్కటియుఁ
గనుల బాష్పమ్ములు గ్రమ్మ నేడువకు

వను నలంపకు" మంచు-నాతి, సంతుష్ట
యయ్యె-సుతుని గాంచి యనియె జహ్నుండు
న య్యవసరమందు నలమటఁ జిక్కి-
"కొడుక! లోకపు నడవడి జాల దుడుకు
గడు నేర్చి-యెడలెల్లఁ గన్నులు గలిగి
నడచినఁ దప్పవు నలుసు లెన్నుటలు—
పడుచుఁ బ్రాయంబు-తోఁపదు మేలుఁ గీడు
సవసవగాఁగఁ బ్రచారమైనదిర!
చవిగాని మాట వత్స! పురంబునందు
నినుఁ గూర్చి-నే వింటి నిన్ననే దాని
మనసెల్ల మండి-చుమ్మలు జుట్టెనయ్య!
సామాన్యమనుజు నాచారంబునందు
నేమి గన్పట్టిన నెవ్వరుఁ గూడఁ
గన్నువేయరుర! యోగ్యత గలవాని
కున్న లోపంబెంత చిన్నదే గాని
పదిమంది గుమిగూడి, వ్యాకృతులల్లి
యది సత్యమంచు సిద్ధాంతించి-దాని
జాటించెదరు-బహుజనుల వాక్యమ్ము
పాటికెక్కును దండ్రి! ప్రతియొక్కరుండుఁ
బ్రతి దాన సత్యనిర్ణయము సేయంగఁ
బ్రతినఁ బూనఁడు-దానఁ బని గూడ లేదు
నదిగొ! పులి యటన్న నిదె తోఁక యనెడు
చదురులు లోకంపు జను లెంచికొమ్ము—
బుండరీకుఁడు దొడ్డ మిండఁడై -సాని
ముండల మరఁగెనుబో యంచుఁ బలుకు
చున్నారు-వారిపైఁ గొన్న రోషంబు
కున్న! రవయు నోడఁగూడదు లాభ
మది లోకపథము-గార్యం బాత్మశిక్ష—

మది నుంచికొనర! యీ మాట లటంచు
జనకుమాటలకుఁ బశ్చాత్తాపమంది
కననింక వెలయాలిఁ గనులెత్తియనుచు—
నెడదలోఁ దా నిశ్చయించి-ప్రేమంపు
మడుఁగైన దన సతీమణి గుత్తరించి
తొలినాళ్ళఁ బోలెఁ గోర్కెలు గెడఁ గూడ
వలెవేయ దొడఁగె విద్యల నెల్ల నతఁడు -
ఇటు రెండు మూఁడునాళ్లేగినయంతఁ
గుటిల విచార-నిష్కుటమున నుండి
యెగిరి పోయి మఱల నేతెంచనట్టి
ఖగమునకై పొంచి-కడువెతలొందు
ప్రబల గృధ్రంబు కరణి వెలయాలు
నిబిడ నిరాశచే నిలువునఁ గూలి
మఱల నెట్లైన భూసురకుమారకుని
మరగింపఁదలచి-తా మాతతోఁ గూడఁ
దలపోసి-మఱునాఁడు-తగులంబు గూర్చు
కెలసంబులందు-నిగ్గులు దేరినట్టి
తనమాటవట్టు కుంటెనకత్తెఁ జీరి-
కొనకొని యా యింటి గుఱుతులు సెప్పి
చానతో-సంగమచ్ఛము లెఱింగించి
వానితో భాషించువగలెల్లఁ దెలిపి-
తరుణి మాడను సంచకరునిచ్చి-కార్య
మరయుము-బహుమాన మఱసేయ ననుచు
మఱి-యాస గొల్పి-ముమ్మరముగా వాడి
శిరసు వంచిన యొక్క యరవింద పుష్ప
మును జేతి కొసఁగి పంపిన-నది వోయి
మును పింటి గుఱుతులు పోల వీక్షించి
తల యూచి-మానవ తనువు సేకొన్న

వలరాజుపోల్కి-పోగులు చలియింప
నట యొంటిఁ గూర్చుండి-జట సెప్పుచున్న
పటుధిషణు మహానుభావు నీక్షించి-
కనులతోఁ బిల్చి-క్రీఁగండ్లతోడుతనె
వనజాక్షి వెలయాలి వాలకంబెల్ల
నెఱిఁగించి-గుఱుతుగా నరవింద మొసఁగి
సరసర నేఁగె నెవ్వరు గానకుండ-
నిదురవోయిన యాస కెదికించి-మరుఁడు
మదమెత్తి-విరివింట మదిగాడనేయ
నయ్యవనీసురుం డదరుచుఁ-బుష్ప
మొయ్యన గ్రహియించి-యువిదఁ దలంచి
మెలమెల్లఁ దమ్మిరేకులు విడదీయు
చలలుగాఁ-గడచిన కలలెల్ల రేగ
నీనాఁడ బోయి యా యింతి కైదార్చి
సూనాస్త్రునకుఁ జిక్కి-సొక్కక యుండ
గరఁగించి-కరఁగి-సౌఖ్యరసంపు నిట్ట
నరుదెంతునని నిశ్చయము సేసికొనియె-
కుటిలకుంతల నిల్పికొంచుఁ జిత్తమున
నటు యిటు వార్చి మాధ్యాహ్నిక సంధ్య
సరగఁగా సేసి భోజనము-బాగాలు
గరమున యందె వెల్గఁగ-వలిపంబు
జంగాళముగఁ గప్పి-సకియ వీక్షించి
యంగన యొక గడె-యటు బోయి వత్తు
నమ్మతోఁ జెప్పవే యని పడఁబాఱె
నమ్మగ్గుఁ డింతల నంతల నున్న
కోడెకాండ్రెల్లరీ జాడ బోలించి
వాఁడె! బోవుచున్న వాఁడు-ప్రోయాలి
నిలువీడి-వెలయాలి తళుకులకోడి

తలవంపులనుచును దచ్చనలాడ-
నంతకుమున్న మిథ్యామధ్య-జేతు
లంతలు పాలిండ్ల నానించి యొత్తి
తలదువారమునకు నిలచి-యాత్రోవె
దిలకించుచున్నది-వెలయంగఁ జూచి
కనుసైగఁ బెదవినవ్వునఁ దల్లిఁ దెలిపి
ఘనవియోగభరంబు గప్పినవోలె
నిట్టూర్చుచున్నంత-నెట్టన వచ్చె
దట్టుఁ డయ్యెడ వసుధా-మరసుతుఁడు-
కటివంక బొమలు-చిక్కఁగ ముడివడఁగ
సరసీజముఖి-నాని చాయ వీక్షించి
కృతకబాష్పమ్ములు గ్రేటుకొనంగఁ
గృతకకోపమ్ము గ్రిక్కిఱియంగ-లోని
కేగిన-ననురాగమినుమడింపంగ
నాగు మాగు మటంచు నతఁడు వెన్దవిలె
పలుకదు చెలి- నవ్వ జిలుకదు-మరులు
గొలుపదు-సేవలు సలుపదు-జూపు
నిలుపదు దనపైని-నిలువెల్లఁ గోప
మొలపిన-సొంపులే గళ గదలినవి-
గన్నుల బాష్పము ల్గదలాడ-వాఁడు
కన్నియ నిద్దంపు గద్దువ బట్టి
బ్రతిమాలె-దానికిఁ బలుకలేదాపె
యతి మనోహరములౌ న త్తన్వి గండ
ఫలకముల్ నివిరి-యొత్తిలి ముద్దు వెట్టి
పలుకరించెను-దానఁ బలుకలే దాపె-
యదరుఁబెదవితోడఁ బెదవి గదించి
మదిరాక్షి కన్నుల మధువును గ్రోలి
యెలనవ్వె-దానికిఁ బలుకలే దాపె-

యలకల నొత్తి-కుంతలములు దీర్చి
తలపైని నుదుట ముద్దులు వెట్టిపెట్టి
గిలిగింత లిడె-దానఁ బలుకలే దాపె-
మొగమెత్తి కూర్చున్న ముద్దుజక్కవల
జగడించు చనులు వక్షమ్మును దూయఁ
బరిరంభణము సేసెఁ బలుకలే దాపె-
గరము భరంబయ్యెఁ గాంతకోపమ్ము
పుండరీకున, కంతఁ బొగిలి-త చ్చరణ
పుండరీకమ్ములఁ బొరయించి శిరము
"చండి! దండింపవే క్షమియింపకున్న
మండన భూతముల్ మాటలు వలికి
పలుకకుండిన నాయువులు నిల్వ" వనుచుఁ
బలవరించిన-వారభామయుఁ "ప్రణయ
కోపంబు నొందిన కోమలి-తీవ్ర
తాపతప్తుండు బదంబులం బడిన
వగకాఁడు శమియింపవలయు-లేకున్న
వగల నుదాసీన భావంబు నందు
నతఁడ"న్న కూచిమారాదిక గ్రంథ
మత మెంచి-మతిలేని మమత జొప్పించి-
తగ లేవనెత్తి-లేఁ జిగురుల కావి
జిగి దొలంకెడు కండ్ల నగలించి మనసు
బలికె వామాక్షి-"నేర్పుల కేమిలేర!
పలికెదు పాండిత్యవాసన ల్గ్రమ్మ-
యేవిక్షమింతు నే నింతకుముందు
గావించినవా! గ్రొత్త గావించనవియొ
దొసఁగులు సెప్పరా! యొసపరివాఁడ!
గసి మసి బడెద వొకక్షణంబునకె
విరహంబునకు-నన్ను బేలించుకొఱకుఁ

జిర విరహంబు నోర్చితివి గాదోటు!
నీకేమిలే! యింత నిడివి కన్నులది
బోఁక చన్నుదిల-సొంపులగు సన్నలది
గలదుగా! కన్నియ గౌగిలింపంగఁ
గలుగరుగాక మా కిల నెవ్వరైన
కలిగినవారెల్ల గానివారట్లు
దొలఁగిన-మఱి యెట్లు గలుగుదురోయి!
పైపైని వలపుల భ్రమసి—మోహంబు
జూపుదురే గాక! శుద్ధమ్ము గాఁగ
మనసులు దూఁచెడు మగవాఁడెవండు
గనుపడలేదు—నిక్కము—గాకయున్న
మఱచి యుందువె! నిన్ను మఱువంగలేని
తరుణిని—నీ వొక్క బెరవానిఁ బోలె"
ననుచు జంకించిన యతివ నీక్షించి
కనులార—వెరవార—మనమారఁ దిగిచి
కవుగిటఁ జేర్చిన—కామిని కన్ను
గవ నవ్వి—వాని యంకంబునఁ బండి
నెమలి కన్నుల రంగు లమరిన దృష్టి
సముదయ మతని వక్త్రమునఁ దుల్కాడ
నిడివి కన్నులబొమ ల్మడుచుచుఁ—గీలు
జడకొనవాని యచ్చపుఁ గపోలమ్ము
లలనల్ల వ్రేయుచు ననియె "లోకమున
వలపనుచే చెడ్డ వస్తువు సుమ్ము!
గడు నిర్దయుఁడు బ్రహ్మ—కడలేని యడల
నడరించు వలపు నిప్పుడమి సృష్టించె—
నదిగాక! కామినీ హృదయంబులందెఁ
గదియించె మితిలేని కన్నీటివఱద
అక్కఱగండ!" యంచామీఁదఁ బెదవి

నొక్కించి నొక్కి కై పెక్కి యిట్లనియె
జిలుఁగు సంజలమ తెక్కల నార్చి యేగు
చిలుకపదుపుతోడఁ జెప్పి పంపితిని—
సారె సారెకుఁ గోర్కెలూఱ నర్థించి
గోరంకలను నిన్ను గుఱించి పంపితిని—
మలయసుందర లతావలి రసజ్ఞుండు
వలిగాలితో నాదు పలపు సెప్పితిని—
గగనాన నీ యింటి కడకయిపోవు
మొగులు కన్నెకు నాదు మొఱ సెప్పికొంటి-
రాలేదొ! యొకరైన రమణీయమూర్తి!
రాలేదు! రాలేదు! రామ! యెవ్వారు—
అని యుత్తరం బిచ్చె నతఁ డంతఁ—గొమ్మ
దన వాలుజడ నుంచికొనిన పూ వొకటిఁ
గయికొని—ముడిపెట్టి కటి నంకబొమలు
దయమున వాని యురమ్మున వ్రేసె—
వ్రేసిన తన యెదఁ బెనఁచె బాహువుల
నాసొబగుఁడు—మేఖలాలంకృతంబు
వలిపంబు జాఱె-నప్పొలఁతికి జాఱె
నెలపిగ్గ-చూపుల వొలపంబు జాఱె
కల కలరుతిజాఱె—కలకలాపంబు
లిల జాఱె—బర్హిమంజుల కలాపంబు
దలపించి—కేశసంతతి విడబాఱెఁ
లలిత మనోజకలాపంబుతోడఁ
బురుడించు తొడలు నదరె—ముత్తియముల
సరులును జెరలాడెఁ—శయనించె నపుడు
గనుదోయి—యలపిన తనువుతోఁ దూఁగె
వనితవక్షమునందె వగకాఁడు—ప్రియుఁడు
కలకల పక్షిగుంపులు వల్కె—సాంధ్య

జలజాక్షి దాల్చిన మొలకట్టు వోలె—
ఇంటఁ బ్రత్యక్షమయ్యెనుఁ బుండరీకుఁ
డంటిన యలఁతతో—నఱమ్మదితోడఁ
దన తండ్రియెదుటఁ బడను భయం బంది
తనయుఁ డుండెను—నాఁడు దప్పించికొనియె
మఱునాఁడు భుక్త్యనంతరమునఁ దండ్రి
యరసె సుతుండేడ యరిగెనో యంచు
నెక్కఁడున్నాఁడు వాఁ డక్కమలాక్షి
నక్కనఁ గదియించి యలరుచున్నాఁడు—
బలికె జలజనేత్రి—“పండితులందు
నిలిచికొంటివి నీవు విశదవిఖ్యాతి
గడుముదమున నలంకారశాస్త్రముల
కడగంటి వెందైనఁ గానవోగాక!
భావజ భావనివాసంబు రతుల!
సేవనీయంబేది జెప్పు”మటంచు
బదులిచ్చె వాఁడు నీపెదవి వామాక్షి
పదిలంబు సురతసర్వస్వంబుమోవి—
యదిగాని దొకటి నిన్నడుగుచున్నాను
జదువుల దొర! పల్కు సరిగాఁగఁ జూచి—
సోగలై—ప్రేమంపుఁ దీగలై—మరుని
తూఁగులై—నీ చూపు తూపుల తీపి—
యదిగాని దొకటి నిన్నడిగితినోయి!
మది మదిఁ జేర్చి—నెమ్మదిగ యోచింపు—
సారమై నవసుధాఽఽసారమై భోగ
పారమైనట్టి నీ పరిరంభణంబు—
అదిగానిదొకటి నాయాకాంక్షితంబు
చదురుగాఁ బదరక—సరిగాఁగఁ బలుకు—
యందాల దీవి—యానందాల క్రోవి

సుందరీ! నీ నీవి! సొబఁగులదీవి—
యదిగానిదొకటి ని న్నడిగినానోయి
బదులిమ్ము—చదువులోఁ జవులెల్లఁ జూపి—
కడిమీఱు పూవులపడవయై—మరులు
మడువైన—నీదవు తడిముద్దుతన్వి!
యదిగాని దొకటి—సొంపలరు నీనవ్వు
యదిగానిదొకటి—నీ యమృతంపుమాట
యదిగానిదొకటి—నీయక్షివిభ్రమము
యదిగాని దొకటి—నెయ్యఁపుదిమ్మెనీవె
కాదోయి! కాదోయి! కైలాటకాఁడ!
వాదింప నిది శాస్త్రవాదమ్ము గాదు!
యొప్పుకొమ్మోయి నీయోటమి నిపుడఁ
జెప్పెదఁ జిత్తరువప్పికొనంగ—
వోడిమి యుడివోయి—పుండరీకుండు
యోడితి నేనన్న-నువిద పల్కెనది-
యదిమద్య మానంద సదనంబు సుమ్ము—
గదురదయ్యదిలేని కలయికఁ దీపి
మదిరమూచూడని మంకు—లోకమున
బ్రదుకనివాఁడు—సురతవంచితుండు—
నవకిసలయఖండ-కువలయఖండ
నివహమండితమౌచు-నీరేజనేత్రి
కనుచూపు బ్రతిఫలించిన పాత్రఁగల్లు
ననువుగానపుడప్పుడతివకెమ్మోవి
నొక్కి-నంజుచుఁద్రావనోపినవాని
కక్కఱయున్నదే! యాస్వర్గభూమి!
మాయింటిలోనున్న మదిరకు దీటు
నేయుగంబులయందునేయింటలేదు—
పదరుటగాదు—నా పెదవికినెచ్చు

మదిరలోరసము-నామరుఁలు మన్నించి
చవిచూడుమింత! యాచవిచూచునట్టి
యవసరమునఁ గ్రొత్తలై నీకునెక్కు-
నావిభ్రమంబులు-నానావిధములు-
భావజనిభ! యేలవర్ణింపనిప్పు
డనుమతించితివా! దెత్తున! రతిసుఖముఁ
దనివి దీఱఁగఁ గ్రోలు తమకంబుగలదా!
యనినంత-దానివచనమాలకించి
తనచిత్తమందు మద్యమురుచి జూడ
నాసరేకెత్తిన-నక్షిచాలనము
తో-సకియకుఁదెల్పెఁదోడ సమ్మతిని—
"చిక్కెరావీఁడు నాచేతుల"కన్న
నిక్కు, గతికిఁ గ్రొత్తడెక్కుగల్పింప
మదనుని తరవారి-మానినివోయి
సదమలంబులయిన చషకంబులందు
నానావిచిత్ర గంధద్రవ్యవాస
నానిచితముఁ బురాణంబైన మధువు
నిండించికొని—హేమనిబిడితవజ్ర
తండమండితమైన తట్టలోనుంచి
కొని—క్రొత్తయొయ్యారమునఁ గొనువడఁకఁ
గనుదోయి బెళకులు గడలప్పళింప
గిలుకుమెట్టెలుగిల్కు గిలుకనిమ్రోయ
బెళకుకంఠమునసొక్కులు సొంపుదీర
నలనల్ల వచ్చి—చేతులనున్నతట్టఁ
దలిమంబుపైఁబెట్టి-తనబాహుయుగము
బెనవైచివానికిఁ గనులలోఁబూని
కనుపించునట్టియాకాంక్షలఁజదివి—
చిఱునవ్వి—చషకంబుబెఱచేతఁబూని

మరులునకువజీర! మదపురస్ఫార!
నాఱేఁడ నాసామి! నావగకాఁడ!
రే ఫేనికి నిజోడ! నారంతునీడ!
చవిచూడరార! రసంబులమూల
భవనంబు—మద్యంబు భావజాకార!
యనిచీరి-మదభరేక్షణములనీడ
లెనసి-చిత్రితమౌచు నింపితమైన
మదురువు-మదిరాక్షి-బెదవికందించి
చదురొల్కఁగన్నులసైగ సేయంగ—
నొకగ్రుక్కఁగ్రోలుచు మొకముజిట్లింప
సకియ-వాతెఱగొంత చవిచూపి-మరల
నొకగ్రుక్కద్రావించి-చకచకలాడు
వికచగండ తలంబువేడ్కఁజుంబించి
యొకగ్రుక్కద్రావించి-యుమటుగుబ్బలనుఁ
గికురించి-యెదగ్రుమ్మి-కిలకిలనవ్వి
యొకగ్రుక్క ద్రావించి-యువిదయీరీతి
సుకముల సొక్కించి సురనుఁగ్రోలింపఁ
గనులెఱ్ఱవాఱ నంగములదూగాఁడ
మనసుబారాడ-నే యనువునుఁగాక
శయ్యపైఁదూఁగినఁజయ్యన నప్పు
డయ్యబ్జముఖి మద్యమదియునుఁగ్రోలి—
మదభరాఽలస హాసమంజులమూర్తి
యదలించి-ప్రియుని-సమ్మదముప్రేరేప
మగపనికెలసి-సంభ్రమమునఁగర్ణ
యుగళతాటంకంబులుయ్యాలలూఁగఁ
గదలగనెఱికురుల్, వదలంగ-విరులు
సెదరంగఁదిలకంబు, బ్రిదుల-హారములు
నటియింప నలకలు-చిటులమైఁబూఁత

గటకముల్ బ్రాయ-నుత్కటముగాశ్వాస
ములు గదురంగ-ఁగన్నులమెఱుఁగార
జిలుఁగుసూడిగములు ఘలుఘల్లుమనఁగ
రమియించునలఁత నంగములు దూఁలంగఁ
గమలాక్షి వాని వక్షమునసేబండె-
గడచెను కాలంబు గన్నులు గప్పి
పడమటనీరేజ బంధుండువ్రాలెఁ
గలికిపాలిండ్లయొత్తులతోడ మివుల
నలఁగినయెద-క్రొత్తతళుకులనీన
బొలఁతినొక్కులవిగుమ్మెలు-కావిమోవిఁ
దలసూపు నగవుఁ ద్రస్తరికిఁ దన్నంగ—
నాసకి మైపూఁతలంటినబైర
వాసమ్ము—ఘమ్మని వాసనల్జిమ్మ
లలితాంగిపంటినొక్కులు-జెక్కులిపయి
మలయు పోగులకాంతిఁ దళతళలీనఁ
జిఱుమత్తుతోడుతఁ జరణక్రమములు
చిఱుచలియింప-భూసురకుమారకుఁడు
నడతెంచె నింటికి-నవ్వుచు వెంటఁ
బడిరాఁగ—దారిఁబోయెడుకోడెకాండ్రు—
చూచెను జనకుండు సుతుని వాలకము
గ్రాఁచదేహమ్ము గక్కసముదాపమ్ము—
బలుకరింపఁదలంచెఁ—బలుకుగొంతుకనె
సలసలఁగ్రాఁగెనసహ్యమ్ముచేత—
నంతలోఁ దల్లిసాత్యకి వచ్చి యేఁర!
యెంతజెప్పినఁగాని సుంతయు వినవు!
గట్టినకడపెల్లఁ జుట్టి వచ్చితివి
దట్టుఁడవైతివి! తండ్రి! యిప్పటికిఁ
బడపద" యింటిలోపలికని పలుకఁ

బదుపుగా నాయింటిపై ట్క నిల్చున్న
కొమరులెల్లరుఁ "దుష్పికొనర! నీమేన
గమగమలాడు నాగంధంపుఁబూఁత"
నని కేరుచునుఁబోవ, నాహాస్యమునకు
మనసునఁబాములు మలసి నట్లైనఁ
బిత్రు కంఠగర్తంబుబెకలించి కొనుచు
నతికఠోరములు వాక్యములిట్లువెడలెఁ
"గులనాశనుఁడ! యేలగలిగితి వీవు!
కులగౌరవమునకు గుద్దలిఁగొంటి!
తపమొనర్చిన దానఁ దనయుండుగల్గి
తపనయైనది జీవితంబెల్ల మాకు—
మాపూర్వజన్మకర్మములు—బల్లిదము
లై-పుత్రరూపంబులై గాసిసేసెఁ
బరమేశ్వరుఁడు దాను వరమిచ్చినట్లు
గరమిచ్చినాఁడు—దుష్కరప్రతీకార—
మల్పబుద్ధులయట్టు లఖిలశాస్త్రార్థ
కల్పితసువివేక కలితులైనట్టి
వారు—మారవికారవశవర్తులైన
వారిపాండిత్య మేపాటికి నెక్కు?
నాసుతుండు వివేకభూషితుండగుచు
భూసురాఽఽవళికెల్ల భూషణం బగుచు
వివిధయజ్ఞమ్ములువేల్చి—లోకేశు
నవిగతగతి—ఁదృప్తుఁడవునట్లుజేసి
జ్ఞానప్రకాశుఁడై-సవితకు దీటు
గా-నిలుచునటంచుఁ గరము నమ్మితిని
గాని-పణ్యాంగనా కలుషకటాక్ష
దూనవివేకుఁడై-దూరితలోకుఁ
డై-యిట్లవగదెచ్చె ననియెంచనైతి

నాయుల్లమిట్టులనంతదుఃఖంబు
బొందదీదుష్టుండు-పుట్టిననాఁడ
బొందిబాసిననైనఁ బురుషోత్తముండు
మననిచ్చి-నాకైన మరణంబునీక
మననిచ్చి-నరకయాతన లిచ్చినాఁడు"-
నని యిట్లు విలపించు జనకునిఁగాంచి
తనయుఁడాపానరక్త విలోచనుండు
గలకలనగుచు-నవ్వులతూఁగులందుఁ
జెలి-దానుఁగౌటికియిచ్చిన తెలనాకు
మడుపులతమ్మముమ్మరమైనతావి
గడలుకొనంగ నీ కరణిగద్దించె
"నెవ్వరోబలికిన చివ్వమాటలకు
నివ్విధంబునసుల్కి-యేలయేడ్చెదవు?
నాలయధ్వజఘంట లట్లులోకమునఁ
గూళలనోళులు-గౌఱమాలిపలుకు
ననవరతంబువానినిఁ బాటిగాఁగ
విని-ప్రజ్ఞగలవారు వెలగట్టికొంద్రె
యింటినుండినఁ జెడు, నిలమగవాఁడు
నింటనుండకజెడు నింతియటన్న
పలుకు నేనై సృష్టి సలిపినానేమి!
బలుకుదునోరికి వచ్చినయట్టు"
అని సరసరజన్న నంతకుమునుపు
దనయుఁడెన్నఁడుఁ గూడఁ దన్నునారీతి
గద్దించియెఱుఁగని కారణంబుననుఁ
దద్దయుఁ గోపంబు దాపంబు బొదల
నొకమాటఁ బలుకకయుండె జహ్నుండు-
అకలంకమతి-భూషణాఽఽభూషితాంగి
పుండరీకునిసతి-పూపబ్రాయమున

నిండినకుండలై నీటు దుల్కాడు
కుచయుగమ్ములు సారెకును బుటమెగయ
నచలిత ప్రేమపూజ్యంబై నహృదయ
మున-భుజియించి-శయ్యనుబండి-వార
వనితావిలాస విభ్రమములతెఱఁగు
భావించుచున్నట్టి ప్రాణేశుఁదరిసి
భావజు మదదంతి పాటిగానిలువ-
తలనెత్తిచూచి-కన్నులఁజీదరించి
తలమల్చి పండినఁ దరుణాయతాక్షి
వినయక్రమముగాఁగ విభునకిట్లనియెఁ
"కనులెత్తిచూడరు-గాసంతగాని
నాపై పిదేమి యన్యాయంబు నాథ!
భావాఽనుగుణమైన వర్తనలేదొ!
నాయందు! గాక దిన్నఁగలేదొ హృదయ
మీయెడ మీఽకటులేమైన నాకుఁ
జెప్పంగఁబోలదో చింతయెయ్యదియొ?
దప్పొ వాక్రువ్వ? నర్ధాంగిని గానొ?
పంచికొనఁగరాదొ? వంచన దగునొ?
పంచాస్త్రునిభ! యేమి పల్కు" వటన్న
మదిరానిపాన ప్రమత్తుండు-వార
సుదతీనిశ్శృంఖలాఽశుద్ధవిలాస
మదిరాప్రమత్తుండు-మదకలిలుండు
గెదికింపఁబడిన యగ్గియుఁబోలె-లేచి
తలముడి వీడి-శిఖలువోలె వెంద్రు
కలు నాల్గు దిక్కులఁ గంపించుచుండ
గలకలమని వెట్టిగా నవ్వి-కోప
కలిల వీక్షణములు గన్నులఁ బొదలఁ
బలికెఁ జాలునులేవె! పాండిత్యమెల్ల

యొలుక వోసితివి నీయోరంత ప్రొద్దు-
నర్ధాంగివట! మోసమట! ధర్మపథ మ
పార్థకమట! నీవె యఖిల ధర్మములు
నేర్చితివో? మేము నేర్వఁగాలేదొ?
జర్చింతువో, యూడ, శాస్త్రవాదమ్ము!
దినదినంబునుఁ జూచినదియెగాదోటు!
కనులార నీదుముఖమ్ము? నేడేమి
క్రొత్తవింతలు వచ్చి హత్తికొన్నవియొ?
గుత్తులై మాకను ల్గోరగింపంగ!
నీకఁ జాలు-ప్రొద్దు వోయినది-మానిదుర
సుకమాచికొనకుము-సోదెలు వలికి
పండుకొమ్మనినంత-రెండుగన్నులను
ఏండిబాష్పమ్ములు నిగనిగ మెఱపి-
లలిత గండస్థలంబుల దిగజాఱి
గొలుపారఁ గుచములఁ బుట మెగయంగ
లలితాంగి భూమితలమునఁ గూర్చుండి
విలపించుచుండెఁ గన్నులుమూసె మగఁడు-
గడచెను రేయి-యుత్కటశోకమునవె
పడఁతికి-జక్కవపడతికిఁ బోలెఁ
వెలవాఱెఁ దారకావళి మింట జాఱెఁ
పలకల రుతిమీఱె ఖగగణంబులకుఁ
కమలబాంధవుఁడు-లోకంబునేత్రంబ
గమముగాఁ బూర్వధరంబును దాటె-
నాఁడు జహ్నుండు-నాత్మజుచొప్పు
న బరీక్షింపఁ దలఁచి యుండంగ
జనానంతరంబునఁ బుండరీకుఁ
జవరాలు-మనోంతరంబందు
జవంగ-గామపంకుల మానసుండు

దళతళలాడంగఁ దలిరాకుమోవిఁ
తమ్ములపుందావి-దమ్మంట్లు మెఱయ
నమ్మదనునిఁబోలి-యటు ప్రయాణింప
జనకుండు వెనుకనే జనె-గమనింపఁ
దనయుండు దనయుండు నాతండ్రి తెఱఁగుఁ
జని చని వాఁడు-వేశ్యావాటిఁ జొచ్చె
జనకునిమదిలోని సంశయం బిపుడు
సిద్ధాంతితంబయ్యెఁ-జిత్తంబు మిగులఁ
గ్రుద్ధమై-నిశ్వాసనద్ధమై-మోము—
రుద్ధమై గతి-యసంబద్ధుండు సుతుఁడు
సిద్ధించెఁ గలకీర్తి జీర్ణింపఁజేయ
దైవమా! యనుచు బాధావివశుండు
నావసుధాఽమరుం డఘశంకి-పైని
సుతుతోడఁ బోవక-శుద్ధమానసుఁడు
నతమస్తకమునఁ దిన్నఁగఁ జేరె గృహాం
ణటఁ బుండరీకుని నబ్జాక్షి గాంచి
తటుకున నేఁగి-కైదండ యొసంగి
కెంపుముక్కల నింపు నింపు రాచిల్క
గుంపులు జెక్కిన కోళ్ళతోఁ బాణి
గల ముత్తియముల మేల్కట్టుతో-వజ్ర
ములజాలరులతోడఁ జెలువంబు గులుకు
రవలమంచమున విభ్రమము దొల్కాడ
నువిద, వన్నెల రాజు నుపవిష్టుఁజేసి
రంగుల చిలుక, హొరంగుగాఁ దాను
జెంగట నిలుచుండి-చిఱునవ్వు బొదల
జిలువాఱు చెక్కిటఁ జెయి జేర్చి-మత్త
కలహంసకూజితంబులను సోమించు
పలుకుల-మద్య సేవనముఁ గావింపఁ

దలతురో! యన్నంతఁ దరళాయతాక్షి
కలికిచూపుల కోడి-కల వివేకంబు
దొలఁగి "కానిమ్మ"నె నెలనవ్వి వాఁడు—
చిగురుల జిగి గేలి సేయు హస్తముల
వగలాఁడి యందివ్వ-వసమటె మనసు
దానిలోఁ బ్రతిఫలితంబైన యట్టి
మీనాక్షి కన్నుల మెఱుఁగులు ద్రావు
కరణిఁ దమకమెత్తి గడుద్రావె-మరుఁడు
విరివిల్లు సారించి వేదుఱెత్తింప—
బలుకులు గపురంపుఁ బలుకులు-మోవి
తళుకులఁ బంటి నొక్కులు-జుంబనములు—
దెలియనేలేదు ప్రొద్దులు-వారి కంత
నిలచెఁ బశ్చిమధర నీరేజమిత్రుఁ
డటు దనయుని మదోత్కటవృత్తిఁ జూచి
చిటిలిన మనసుతోఁ జింతాఽవధూత
భావసంతతితోడఁ-బరమ పవిత్రుఁ
డా-విగతవికారుఁడైన జహ్నుండు
గృహమటు సొచ్చి-దుస్సహదుఃఖబాష్ప
పిహితనేత్రుఁడు-సముద్విగ్నమానసుఁడు
దన ధర్మగృహిణి సాత్యకిఁ జూచి-పొలతి!
మనకుమారుఁడు ధర్మమండితుం డనుచుఁ
బొరపడితిమి-కాము చెఱఁ బడినాఁడు
మరగినాఁడే వారమదిరాక్షిసేవ
కులము బొలిసెఁ గీర్తి యలసె-ధర్మంబు
సొలసె-పెద్దఱికంబు దలఁగె-నాకింక,
వలదంటి-సుతుఁగోరవలదంటి-వరము
వలదంటి-యీ లోకవాసనావళత
వినవుగా కబ్జాక్షి! గనుము నేఁ డాత్మ

జునిఁ బొంది నీవు జెందిన మహా సౌఖ్య
మిది కలగాదు-గా కెవ్వరే జెప్పి
నదిగాదు-గల్పించినదిగాదు-నాదు
సేసినఁ గాదు-నేనే సతి! నేఁడు
నాసుతు వెన్వెంట నంటి పోయితిని—
కాంచితి నీనాడు కన్నులతోనేఁ
బంచాస్త్రశితభల్ల భగ్నుండు వాఁడు
వెలయాలియింటికై వెడలిన తెఱఁగు-
కలికి! వికారంబు గన్నులఁ గప్పి
యట నెన్నిరీతుల నార్జించికొనునొ
చటులపాపము వాఁడు సద్గతి దలఁగి-
యేమిసేయుదు! వాని నెట్లు మరల్ప
గా-మనకగు! మనకవుఁ బాముకాటు
దాకినఁ బుడమి మంత్రమ్ములు గలవు
గాక-వేశ్యావిషకలిత కటాక్ష
పాతమ్మునకు సేయఁ బ్రతిలేదు సుమ్ము!
నాతి! యాత్మజుఁడు మనకు దక్కఁ డింక.
తొనకు లేఁ బ్రాయమ్ము-తొంగలిఱెప్ప
లను దొంగిచూచెడు లలితప్రేమమ్ము
గలిగి-పీయూష నిస్తులభాండమట్టు
లలరు నీ కోడలి యలమటకేడ్తు
నా? యన్వయము జెడెనంచు శోకింతు
నా? యశముడివోవు నంచని వగతు
నా? పండితుం డయ్యు నతి హీన కామ
తాపితుఁడై వాఁడు ధర్మంబు దప్పె
నని యూసడింతునా? యాతపః ఫలము
వనజాక్షుఁ డిటులు సూపునె! యంచు గాపి
నొందుదునా? యేమియునుఁ దోచ కిటులఁ

గందితి-నీదైన కందువ దోపఁ
గందించుగ వగలు జక్కఁగ దీర్చునట్టి
చందంబు నెఱిగింపు మిందీవరాక్షి!
యని విలపింప-సాత్యకి గుండె లదరఁ
దన మాతృగర్వంబు దలఁగంగఁ గనులఁ
బెనఁగొన నీరు-గంపనమొందఁ దనువు
గనులెత్తి-పుల్కు పుల్కునఁజూచి-యపుడు
బతికి భాషించె సంభ్రమమున గంటి
రా! తగునా మన కితరులుబోలెఁ గల్ల
నిజమని యెంచక-నీతిఁ దొఱంగెఁ
గుజనుఁడంచును గన్నకొడుకు దూఱంగ?
యే నమ్మ నేరనయ్యెద-నేను గన్న
సూనుండు-సుగుణనిధానుండు-బుణ్య
భానుండు-మన్మథదూనుఁడై-ధర్మ
దీనుఁడై-గతసద్విధానుఁడై-సాని
పంచజేరునా! లోకపతి విష్ణుఁడిట్లు
వంచన సేయునో! వరమొక్కటిచ్చి!"
యనుచునె దోడ నా యబ్జాక్షి గోడ
లినిఁ గాంచి-ప్రేమలాలితరీతిఁ బలికె
"వినకువే యీ వాదు! వినయైకమాన్య!
కనకు వే, కొఱత యొక్కటి ధవునందు
ధీరుండు-సుగుణమందారుండు వాఁ డ
పార విద్యానిధి-పరిణతబుద్ధి
నీపుణ్య ఫలము బండించినరూపు
నీపతి-వేరొక్క నెలఁత గోరెడునె!
దెలియదే నీకు! నుజ్జ్వలమైన-వాని
తలఁపుతీ, రే బూని తెలుపంగవలెనా!
చందరునందైన గందొక్క టుండు

సుందరి! నా పుత్రు శుద్ధ మానసము
నందొక్క కొఱత యెన్నటికైన లేదు
బందెంబు సఖుదు-విభ్రాంతిలో మున్గి
తలిరుబోఁడిరో! తప్పు దలఁచకుమమ్మ!
తలిరుఁ బ్రాయపుఁ బొంగు దలఁగింపకమ్మ!
యని సర్దుచుండంగ నంతలో వచ్చె
ఘనుఁడు-వారాంగనా కఠినకుచాత్త
గంధబంధురితాఽపఘనుఁడు-మైరేయ
మంధరగతి—సమున్మదుడు సుతుండు—
వాని నిరీక్షించి వనితామతల్లి
మానంబు-మరి యభిమానంబు-దుఃఖ
తాపంబు-పాపసంతాపంబు—తీవ్ర
కోపంబు-మరి యనుతాపంబుఁ గన్న
కూరిమి—పోరామి—నేరిమి—దాప
నేరమి-యొండొండ నిబిడంబు లగుచుఁ
జిత్తంబుహత్త-యుద్వృత్తి బాష్పంబు
లొత్తికొనంగఁ బెల్లొదరుచుఁ దండ్రి!
వచ్చితివా! మెచ్చువచ్చెరా! బిరుదు
దెచ్చితిలే దల్లి కచ్చిరాఁ గొడుక!
దయసేయు"మన్న నాతఁడు వెఱ్ఱినవ్వు
గయిసేయుచుండ వక్త్రిమ్మున—ధనువు
వలెఁ దూఁగ దేహ మస్పష్టభాషలను
బలుకుచు డగ్గరింపఁగ—వాని వాల
కము గాంచి—వహ్నిశిఖాఽఽకృతి యగుచు
ధుమధుమలాడుచుఁ దోడ్తోడఁ గటము
లగలంగ—హృదయమ్ము బొగులంగఁ గనలు
మిగులంగ జహ్నొండు-తెగడుచుఁ బలికె
"నోరి కామాంధుండ! యో యభాగ్యుండ!

యోరి దురాచారపూరిత బుద్ధి!
యోరి లజ్జాహీన! యోరి పాండిత్య
భారగర్వగ్రంధి! పరమ పాపుండ!
వెలయాలి మరగి-యెంగిలిఁ బ్రమింగి-దుష్ట
పలలంబు భుజియించి—పరమ నికృష్ట
సురఁ ద్రావి-యింటఁ జొచ్చెదవెట్లు? సుంత
యరగలి లేక మిథ్యాజల్పనుండ!
పుట్టక పుట్టక పుట్టినా వొకఁడ
విట్టలమగు బాపమెత్తిన పౌడవు-
కులము పెద్దటికంబు గూలంగఁ ద్రోసి
నలుగురిలో నన్ను నగుబాటు కీడ్చి
నా యెద దహియించినావురా! జాలు
లే! యింక బుత్రుని లీలావిలాస
ములు-నాకు నీ ముఖమ్మును జూపవలదు—
వెలయాలియింటనే వెలయుము-వోయి
పరమపతివ్రతాఽఽభరణంబు, శాంతి
శరణంబు, మత్ప్రియతరణంబు, బుట్టి
నింటికి-మెట్టినయింటికిఁ గొఱఁత,
యంటనివ్వక-దొడ్డ యశము గూర్చినది
శివురాణి కెనయైన యువిద మీ తల్లి-
యవగుణగ్రంధి! తత్ప్రియమలోదరము
జిచ్చుఁగుంపటిగఁ జేసితివి-నీ మేలు
వచ్చెఁ జదువుకొన్న దిచ్చరి గొట్టు!
కడపద్రొక్కకుము-మాకడుపు ద్రొక్కకుమ
వెడఁగ! బెట్టును వోర వెలయాలె నీకు!
అటు జూడరా? యౌవనాఽఽదృతదేహఁ
గుటిలకుంతల-నీదు కోమలినైనఁ
బలుకరా యేమిలోపమొ! గొఱయైన

యిలువడియో! గుణమెనయదో! ప్రేమఁ
బలుకదో! వన్నెలు జిలుకదో! మనసు
నలరింపదో! సేవ సలుపదో! నీకుఁ
బరులు గన్నమ్మ నిప్పగిదిఁ గారించి
దురుసున, దిచ్చరి మరగితి నీవు
మఱచితి గాకేమి-మఱివచ్చి-ధర్మ
పరుఁడవై నాయింటఁ దిరుగనేర్చెదవా!
గదలు మిచ్చటినుండి-గదలని మాయ
పదలుము-బొంకంగ వలను లేదోరి!
నేనఁ జూచితిఁ గండ్ల నీనాఁడు నిగత
మానుండవై నీవు-మధ్యాహ్నమందు
దానింటఁ జొరఁబాఱు తరుణంబునందుఁ
గానరటంచు బొంకకుము-వేఱొక్క-
పాపంబుసేయ కీ పాపంబె జాలు
నీ పరసౌఖ్యంబు నిలువునఁ గూల్చు''—
నని పల్కుచునె రోష మగ్గలింపంగఁ
దనయుని దరిసెడు ధవుని వీక్షించి-
కన్నని సుంగుపైఁ గనికరంబుంచి
యన్నువ సాత్యకి యడ్డంబు నిలిచి—
తఱుము జలింపంగఁ-గరము శోకంబు
బరిగొనఁ, గన్నుల గిఱికొన జలము—
లన్నువ నడుము దూఁగాఁడఁ, జెమ్మటలు
గ్రన్ననఁ గ్రమ్మవ త్త్రిమ్మునఁ బలుకు
లదుకులై వెడలంగఁ బదములు దూఁగ
నదవదపడి యిట్టులనె నాథుఁ జూచి—
'క్షమియింపు బతిదేవ! సదమలభావ!
దమియింపు గడిది క్రోధమ్ము జిత్తమున
నమరేంద్యవంద్యుఁడౌ యాదిపూరుషునిఁ

గ్రమమునఁ బూజించి-కన్నాను-లేక
లేకొక్క కొడుకు నా యాకాంక్షద్రుంగ
నీ కరణిని నెరియింపకు వానిఁ
జేయరో యాత్మజు లేయెడ దొసఁగు?
లీయిలఁ దలిదండ్రు లెందైన నయము
భయమునఁ గొల్పి-సత్పథముఁ జూపించి
కయికొనరో వారి! గనలెత్తి, పోవఁ
ద్రోతురో! గూరిమినే తునఁ ద్రుంచి?
నీతి దప్పినవాఁడు నా తనూజాతుఁ
డొక్కఁడే గనుపించె నూరికంతటికి
నక్కటా! యిదియేమి యార్భాటమయ్యొ!
బొలఁతి యీ రీతి ధవుని నొత్తిపలికి
యలుకమాయించి-యేకాంతంబునందుఁ
దనయుని దృష్టించి యనె-నెన్నిసార్లు
బనవిన మామాటఁ బాటిగాఁగొనవు
వలదురా! వెలయాలి చెలిమి! సర్పంబు
ములుచలై యెవరైన ముద్దువెట్టెదరె!
మారితో సరసంబుఁ గోరి యాడెదరె!
మూరిబోవఁగ నగ్గి బొమ్మను గౌగి
లింతురే! విషపరిలిప్తపుష్పంబు
నెంతని మూర్కొందురే! మతి దలఁగి!
వెడఁగవే! యుడుగవే! పడుచవే! నీవు!
మిడుకుచున్నాఁడురా మీ తండ్రి! ధర్మ
పథ మటరా! సౌఖ్యపద్ధతి యటర!
హితమటరా! గీర్తి యెఁడబాయదటర!
జదువున కీరీతి సత్ఫలమటర!
చదురటరా! క్షేమసంగతియటర!
మరియాద యటర! ప్రేమపుఁదెర్వులటర!

భరమైన వయసు కావరమదిగాక!
నీవంటివాఁడు సంభావిత వృత్తి
గావించునదియె యిక్కడిది కార్యంబు!
నాకొమరుండు విజ్ఞానశూరుండు
నా కొమరుండు గీర్వ్యాకల్పమండి
తుఁడు-వినీతుండు-సక్తుఁడు ధర్మమందుఁ
గడుఁగూర్చువాఁడు మాకని చెప్పికొందు
నటనట, నవియెల్ల నణఁగి పొల్లయ్యెఁ
గుటల విచార! నీ కొఱగామినిపుడు-
చదివితివే! యెట్టి శాస్త్రమందైన
నుదురుమిడుక! దండ్రినొప్పరికించి
తల్లిఁ గలంచి-సుదతి గాసిపెట్టి
యిల్లు గుల్లయిపోవ-నెక్కడే నొక్క-
పంచనఁ బడునట్టి పద్ధతి-ధర్మ
మంచుఁ జెప్పర! జాత మాశాస్త్రమైన!
బంగారువంటి దా పడఁతి-నీకేల
భంగింప, దాని తీవ్రంబైన ప్రేమ!
వలదురా! వెలయాలిపలుకులు నమ్మి
కులసతి నలగింపకుము-దాని కార్చు
కన్నీరు నీ సిరిగదలించు-నీదు
యెన్నిక నగలించు-నెడఁగుదియించు
నగవులు బిగువులు-వగలు బెందగులు
జగిబిగి-మురిపెంపు సరసంపుమాట
మురకంబు తరకంబు-మురువును హరువు
విరితూపు నెఱిచూపు-వీఁగును బాగు—
తిరమను కొనకు-దిచ్చరిదాని మనసు
వఱదఁ బోయెడునట్టి విరిసుమ్మ కొడుక!
వినుము నామాట! బో విడువుము-చెనటి

మనసువట్టినయట్టి మరులు, నిర్మాల్య
మును బోలె-జగతిపైఁ గొనుము యశమ్ము
గనుము ధార్మికము సౌఖ్యము-చవిగూడ"
నని యిట్లుఁ దల్లి బల్కిన వెడవెడగ
విని యూకొనియె-మనంబున కంటనీడు—
యా రాత్రి భుజియించి-యా వేళ్యపైనిఁ
దీరని తమకంబు గూరి చిత్తమునఁ
దములంబు నమలుచే దడవుగాఁ దనదు
కమలాక్షి తమక మెక్కెంతయుఁ దలఁప
కయ-జాఱుకొనె-మోహగంధిల బుద్ధి
భయము నయము వీడి పండిత బ్రువుఁడు—
సాక్షాత్కరించె వేశ్యాగృహంబందు—
నక్షీణకై తవ హాస నిర్మోక
చెనటి వేశ్యాసర్పిణి నెనరుగల్గు
దాని పోలిక-సురఁ ద్రావించి రతులఁ
దేలించెఁ జాతుర్యధీయుక్తి బొదల—
బాల-కుటిల కేశజాల-సంత్యక్త
మాల-గన్నులు నీటఁ దేల హస్తమునఁ
గిలించి తనదు చెక్కిలి-పుండరీకు
సతి-గాచికొనె-ప్రతీక్షత్ప్రియాఽఽగమన
పతనిహితాశ-ప్రభాతంబువఱకు—
మఱుదినమ్మన వేశ్యమాత-వెచ్చంబు
భరమయ్యె-రొక్కంబు దొరకడదయ్యె
నని గొణ్గెఁ బుండరీకుని దారపించి—
కని—తన వ్రేలియుంగరము నాతండు
నిచ్చె మనంబందుఁ బొచ్చెంబు లేక
యచ్చిన నేమి లేదింతయు నెనరు—
మరి రెండు మూఁడు నాళ్ళరిగిన యంతఁ

గరము దాచెను వేశ్యకాంత 'నాకొక్క
జీర గావలె నాదు కోరిక దీర్ప
వేర! యటంచు గతించెనే తొక్క
యంగుళీయక మంత—నా వేశ్యమాత
హంగునఁ గైకొనె నడిగి చౌకటులు—
యింటఁ దండిరి బల్కఁ దెచ్చరింపఁడును
గంటగించును దల్లి—కమలాక్షి భార్య
గన్నీరు కావేరి కాలువై—జింత
నున్నది-బలుకఁ డయ్యువిదతోఁ దాను—
దిన దినం బది యిది యని వేశ్యమాత
దనచేయిఁ జాఁచుఁ గ్రొత్తఁగ నెళవయ్యెఁ
గితవులతోఁ దన కతి చతురముగ
మతి యీడ్చు—నక్షమర్మము దెలియంగ—
మదురువు లేకున్న మది మదినుండ
దది లభింపదు—ధనైకాయత్తమగుట
బిలువరుఁ దన్ను సభల కెందు—వార
జలజాక్షి మరగెన-న్నడిపిక్క విరిసెఁ—
గనుఁదోయి నంటనిచ్చిన యొక మాడ
దనతోడఁ బల్క వల్కిన యొక మాడ
యనుచు నారంభించె నా వారకాంత
దనతోడ, గ్రొత్త దందనలేమి సేయ
ననువు సిక్కక దొంగతనమభ్యసించెఁ
బొనుగువడ గుణంబు బుండరీకుండు—
గాళ్ళ వచ్చినయట్లుఁ గ్రమముగాఁ గదలె
నెల్లభూషణములు—నెల్ల వస్తువులు
వెలయింతి యింటికిఁ బితృపాదుఁడైన
యలజహ్నుఁ దేమియు ననఁడు—గర్మంబ
వశ్యభోక్తవ్యమన్వాక్యంబు దలఁచి

వశ్యచిత్తుఁడు బరబ్రహ్మంబునందుఁ
దలఁపులు జక్కొల్పి—కలిలసంసార
ఫలములెంచక-దుఃఖబాహ్యుఁడై యుండె—
దల్లి సాత్యకి—శోకదశిత—గుమారు
నల్లన బోధింతు నని యెంచుచుండెఁ
గోడలు—విరహ విఘూర్ణితహృదయ
ప్రోది దప్పఁగఁ బొట్టుపొరలగుచుండె—
నిటులుండ నొకనాఁడు—గుటిలవిచార
ఘటితకూటవిలాస-గణిక-యా పుండ
రీకుని ధనమెల్లఁ గ్రిప్పిన విధము
నాకళించి—యెట్లైన నల వాని వొందు
విడువ నూహించి—దుర్విధఁ దన తల్లి
నడచి పాటున నెల్ల యాట లాడంగ
నెనకొల్పి—తానేమి యెఱుఁగనియట్లె
విసువక యుండ—నవ్వేకలి బ్రాహ్మణుఁడు
దినమునుఁ జనుదెంచు తెఱఁగున-వార
వనితాస్వయంగ్రాహ పరమ సుఖంబు
నూహించికొనుచు-నా యూహలతోను
పాహితమగు నవ్వు బరిఢవిల్లంగ-
వలెవాటు గాలి కల్లలనాఁడఁ-గడలఁ
బొలయఁ గర్పూర తాంబూల వాసనలు
భరమైన యుద్దాల మొరపంబు-వింత
యొఱపు గల్పింప-న య్యొరటు గృహంబు
సొచ్చునంతటిలోన-ముచ్చును గఱవ
వచ్చు తేచునుఁబోలి-వడిఁ బైకి దూకి
కనులు సేతులు ద్రిప్పికొనుచును-నదరు
లనుఁ బోలు నిడుదలౌ జనులు వ్రేలాడఁ
బిఱుదులు గంపింప-నఱపొఱడైన

గొంటుపండులు దోఁప-బరిక వెండ్రుకలు
తుఱుము నీడంగ-వంకరటింకరైన
చరణముల్గదల-నిచ్చలును జొల్లుబుకు
బుగ్గలొ పెదవుల బుడిబుడి విఱచి
యగ్గణికామాత-యదలించి పలికె—
"బాగాయె లేవయ్య! బడబాపనయ్య!
బాగంబు గుప్పించి సాని నేలితివి!
నీవాకండవె యేలినావింక నొరులు
లావుగలరె యేల నీవంటివారు—
దిన దినంబునుఁ గ్రొత్త తీరుగా-బూమె
లనువు పడంగ-నచ్చినవాఁడు వోలె
వచ్చి-తీపారెడు పలుకుల బేలు
పుచ్చి-మాచినదాని పచ్చిప్రాయంబు
నదవదసేసి-యే యయ్య గస్గొనిన
నదలునో! యిలువడి యంచును జంకి
బెదరుఁజూపుల నిల్లు నీడుచే గాని
పదిరూకలిచ్చిన పాపమేలేదు—
విరులు ముడ్చిన వింతయొఱపులు జిమ్మ
సరసీజముఖి కీలుజడ-నల్ల నల్లఁ
దడవి చూచుచె గాని-దయగల్గి-యొక్క-
తడవైనఁ దెచ్చితో దావిపూవులను?
గులుకు గుబ్బలఁ గీలుకొలిపినముత్తె
ముల సరులనుఁ జూచి మురియుచే గాని
కొనితెచ్చితివా! దాని కోర్కి దీరంగఁ
జనవరి! నీవొక్క-సరమైనఁగాని—
చెలువుగులుకు బవంతి చీరఁగైసేసి
తలిరాకుబోఁడి నీదండనిల్చినను
జొక్కి-చూపుల నిల్పి చూచుచే గాని

యక్కటా! యొక్క గోక్కైన దెచ్చితివా?
పిరిగందమును బూపి-చెలఁగుచు నవ్వఁ
గరమూర్చి యూర్చి-యిక్కకుఁ దార్చికొనుచె
గాని-యేనాఁడైన 'గాని' వెచ్చించి
దానికిఁ దెచ్చితో! దావిగందవాడి!
గటియించితివి లేని కలకేతవిద్య
యెటు దాపురించితో యిన్నాళ్ళబోక
కఱటి! మా యిల్లెల్లఁ గొఱిగితివింక
దొరకఁబోదుర! నీకు దొల్లింటి చూఱ—
నడు నడు! నీ కల్లనగవుల బేలు
పడములే! ముందటి భంగి నటంచుఁ
దఱిమిన-గుండెలో ధైర్యంబు దఱిగి
పురపురఁ బొక్కుచుఁ బుండరీకుండు
దలవంచికొనుచు-మన్మథశీతభల్ల
దళితచిత్తుఁడు సానితల్లినిఁ గాంచి
"ఒకసారి బిలువుమా! యొఱపులదీవి
మకరకేతను కీవి-మరులు లేమావి
తలఁపుల తావి-గోర్కెలకెల్ల నీవిఁ
దిలకించి మా నేత్రములు సార్థకముగఁ
బలికి పల్కించి-కెంపులు జిల్కునట్లుఁ
బులకించి-నెనరైన మ్రొక్కుఁ జెల్లించి
పోదుమటంచు నా భూసురుండన్న—
నాదికొనఁగఁ గోప మావేశ్యమాత
వికటంబుగా నవ్వి-వెకలి కన్బొమలు
మొకము-జిట్లించి-పో పోవయ్య బోడ!
చెల్లించితివి లెమ్ము-జెల్లింపనియవి
జెల్లించెదము-నీవు జెల్లించినట్లె—
దలయేరు గదిరినఁ దలకట్లు గట్టి

చెలువ బండినది భూవలయమే మఱచి—
నినుఁబోలు దౌర్భాగ్యునే స్తంబుతోడ
వనితకే ముద్దుసెల్లును! దలయేరు
గాకంచుఁ గసరింపఁ-గఠినాఽవమాన
శోకదగ్ధీకృత శోభుఁడై -యేమి
బలుక నోరాడక-బాష్పముల్గనులఁ
బొలయ గృహము సేరెఁ బుండరీకుండు—
చేరి-దుర్వారుఁడై మారుండు-కులిశ
సారంబులగు శరజాతముల్దొడిగి
'కో'యంచు నెలుగించి—క్రొవ్విచేవీచి
పాయక జిత్తంబు పఱియలు సేయ—
నంగనవెనువెంట నంటిన భావ
భంగులెప్పరుసునఁ బట్టున బరువఁ
బోలక—వానిచొప్పుననె బోవుచును
బేలయై, యా యింతి పెక్కువమెచ్చు
తవులంబు నూహించుఁ, దలఁపుఁ దలంచుఁ
బవడంపు మోవి జుబ్బన జూఱవలచు—
మాటపొం దూహించు—మరులు యోచించు
నీటు గోటు దలంచు—నేర్పులు దలఁచుఁ
గఱివంక బొమల చక్కఁదనము మెచ్చుఁ
దఱిపి వెన్నెలఁ జిల్కు దరహాసమెంచు
విరిసిన నెత్తమ్మిఁ దొరయు మే నెంచుఁ
గరయుగ కంకణస్ఫురితము ల్మెచ్చుఁ
గరములు మెచ్చు శ్రీకరము లటంచు
నురము మెచ్చునుఁ బ్రభాకరమంచుఁ దావి
వలచెడు జడ మెచ్చు—నగలను మెచ్చుఁ
గులుకుఁ జన్నుల మెచ్చు—వలిపెంబులోనఁ
బటువయి శోభాప్రవాహమ్ము జిమ్మ

గుటిలాక్షి జఘనంబు గొమరు దలంచు
మొలకట్టు రవళిసొంపుల నూహసేయుఁ
గలిగి లేనటులున్న కౌనుదలంచు—
రతిమెచ్చు—భావ సంగతి మెచ్చుఁ—మధుర
గతిమెచ్చుఁ గురులసంతతి మెచ్చుఁ—చతుర
మతిమెచ్చు—బంధసమ్మతిమెచ్చు గుసుమ
హతిమెచ్చు—భావసంహతిఁ మెచ్చు జుంబ
నాదృతిమెచ్చుఁ ద్రపాఽఽదృతిమెచ్చు
నాదరంబును మెచ్చు, నలసత మెచ్చు
నీరీతి భావనాపూరంబునందు
మూరిబోవఁగ లజ్జ—మునుకలు వేసి
కనునీరు నించి—వెక్కస మూర్పునించి.
పొనుగు పడఁగఁ గాంతి—పుండరీకుండు
విలపించుచుండంగ వినువీధియందు
జలజబంధుఁడు గ్రుంకె-జిలిబిలి యిరులు
గవిసె-వివేకసంగతి వీడినంతఁ
గవిసెడు కామాంధకారంబు వోలె-
నిఁక నిల్వలేఁడు గాముకుఁడు-మరుండు
గికురించి ధైర్యంపుఁ గీలెల్లఁ దొలఁచెఁ
కనకంబు లేదింటఁ గాసైనఁ గాని-
వనజాక్షి తన ధర్మపత్ని హస్తములఁ
జెలువొందు గంకణంబులుగాక-"వీఁకఁ
గిలుబాడవలె వానిఁ జెలువను దువ్వి"
యని చిత్తమందు యోచనసేసి-యెన్న
డును లేని గొంగ్రొత్త నెనరు సంధిల్ల
దరిసి-తలిరుబోఁడి తన కలికొప్పు
మురిపెంబు దొలుకంగ మునివ్రేళ్ళఁ దడవి
యటు నిటు గొంతసే పలరించి-హస్త

కటకంబు లడిగినఁ గంజాక్షి వాని
యిచ్చకంబుల నెల్ల నెఱిఁగి-చిత్తమ్ము
బెచ్చుగవలవంత వ్రీలిపోవంగ
నాథ! నా హృదయాధినాథ! మద్భాగ్య
పోతంబ! యేటి కీ మునిమ్రుచ్చు విద్య
వెలయాలి కివ్వఁగాఁ దలఁచి వచ్చితివి
జిలుగు కంకణములఁ జేకొనుమిపుడ
వలదందునే! ధర్మపత్నికి మగని
తలఁపున కన్నను దలఁపు వేఱున్నె?
యని నవ్వి-గంభీరమైన చిత్తమునఁ
దన కంకణమ్ములు దడయక దీసి
యర్పింపఁ, దక్కెరా! యని చిట్టమిడిచి
దర్పంబుగదురఁ గందర్పుని నింకఁ
జెంగించినట్టులే! చింతాతిశయము
భంగించినట్టులే! భామ! నే పోదు-
పోయి-వలఁపుఁ జిల్కు-పువ్వారుబోఁడి
మాయలపెంటిఁ బ్రేమమ్మునఁ గదిసి
దాక్షిణ్య మనురక్తి దయయు, విశ్వాస
మక్షీణ బాంధవ్య మమరినభక్తి
నేస్తమ్ము, పోరామి, నెనరుఁ బ్రేమమ్ముఁ
గుస్తరింపును కల్పుకోలుదనమ్ము
జెలిమి-సత్యంబు-మంచితనము-మైత్రి
యలరింపు నుల్లాస మంతఃకరణము
చల్లదనంబు-వాత్సల్యంపుమాట
దెల్లంబు-జెయ్వుల తీపుఁ జుట్టఱిక
మిచ్చకమోలాకు-నెచ్చినబాళి
మచ్చిగ-దాత్పర్యమమతలు జూపి
యలరించి యలరి-సొంపులు గుల్కు రతుల

సొలయించి సొలసి-కోర్కెల నిట్టఁదేర్తు
నీ రాత్రి రతిపుణ్యమెల్ల నీయదియ
బో! రమణీ! యంచుఁ బుండరీకుండు
నతివ బదులుకైన నాగక-దృప్త
గతి-శంబరమువోలె గంతి-కన్మాసె
మఱలవచ్చిన భూమిసురకుమారకునిఁ
బరికించి-జటిలకోపగ్రంథి-వేశ్య
తల్లి-వెలికివచ్చి-తరుమంగఁజూడ
నల్లనఁజూపించె నా పుండరీకుఁ
డపుడు దాఁదెచ్చిన యాభరణమ్ము-
గపటంబులకుఁ దొలిగని-వానిఁ గనుచుఁ
గనుచూపు మార్చి, కక్కసములౌ బొమలఁ
జెనకిన వంపు మార్చి-గళస్వనమ్ము
మార్చి-యన్నువ నవ్వు జేర్చుచుఁ బ్రేమ
గూర్చు మాటల నల్లికొని వచియించె
"నాలుగుఁ జెఱఁగులు నే లెల్ల జుట్టి
గాలించినను నింకొకఁడు నినుఁబోటి
బేల గన్పడునె! యందాల బెన్నెలమ!
యేలాగు బ్రదికెదో! యీ భువిపైని!
యావిడగూడ యమాయకురాలు
నేవిషయము సుంత యెఱుఁగ నేరదును
యిట్టి యిద్దఱ నొక్క-యెడఁజేర్చె బ్రహ్మ
చట్టనఁ బ్రేమపాశములతోఁ బెనఁచి"-
యెటుబ్రదికెదరో! "మీ యిద్దఱు-వట్టి
యటమటకాండ్రున్న యవనిపై నింక-
గలకాలమును మనఁగలన నే నిల్లె!
బిలుచుచున్నది చావుకెలనఁ గూర్చుండి
సతతమియ్యదియె యోచన జేసి చేసి

మతిగుందినది నాకు-మరులుకు తేఁడ!
బరిహాసమన్నదే యెఱుఁగవో! యెపుడొ
బరువెత్తితివి నోటఁ బలుకుండఁగానె!
యని దన్ను గుత్తరించిన వేశ్యమాతఁ
గని-కృతార్థుండై నకరణిగా నవ్వి
పుండరీకుఁడు వెలపొలఁతి చన్గవల
దండ-నానంద సాధన జేయఁదొడఁగె
నిటులుండ నొక్క-నాఁడేతరి వాఁడు
జటిల పాపగ్రంధి-సానింటియందుఁ
దల మొల మఱువంగఁ ద్రావి మద్యంబు
నణుకింతయును లేక యంగంబులెల్లఁ
దూలఁ గన్నులఁ గావి దొనకంగ వచ్చి
మ్రోలనిల్చిన వంశమూలంబు జెఱుప
గుద్దలిఁ గొన్నట్టి కొడుకునీక్షించి
తద్దయుసేగి చిత్తమ్మునఁ గ్రుమ్మఁ
బలికె జహ్నుండోరి! పాపఫలంబ!
కులకులిశమ! నిన్ను గుఱిచి మాకెల్లఁ
దలవంపులయ్యె నీధారుణియందు
ఫలియించె నేమితపంబు! విసంపుఁ
బండువుట్టినది దౌర్భాగ్యమ్ము వలనఁ
బుండరీకుఁడు-జ్ఞాన పుండరీకమ్ము
కులమోము ననుకొంటిఁ గులవృత్తి విడచి
కులమెల్ల బూడిదఁ గలిపివేసితివి!
చదివిన చదువెల్లఁ జవిటిలో విత్తి
నదియయ్యె-నేమియున్నది యనుకొనఁగఁ!
గానిమాటికి నీముఖమ్ము జూపించి
మానసంబెరియింపఁగా నీతి గాదు-
పోర! సానింటనే ప్రొద్దులుగడపి

నోరారఁ జప్పరించుము-దానిమోవి
నని కసరించిన నా తండ్రిపల్కు-
విని-మధుపాన సంవిస్మృతచిత్తుఁ
డనురాగమును బత్తి యఱకును జఱకుఁ
దనయుని ధర్మంబు దలఁగి పోమఱచి
మదమెత్తి పితృదేవు నదలించి పలికె
"వదరెద వే లిట్లు ముది వెఱ్ఱి యెత్తి
రజ్జినంతనఁ బెద్ద యొజ్జవై తేమి!
మజ్జారె! గ్రొత్త ధర్మములు సెప్పితివి!
చదివితిలెమ్ము-మాచదువని క్రొత్త
చదువులెవ్వియు లేవు జగములయందు—
చదురుఁడవై నన్నుఁ జక్కదిద్దెదవా!
పదరు మీమాట దేవతలను గుఱిచి—
ముప్పూట మీచేతఁ బ్రొక్కులు గొనెడు
గొప్ప దేవతవెల్లఁ గుతిలురై-యచ్చ
రల మధురాఽధరంబులకుఁ గాపుండు
కలుచలుగారొ! నిక్కమ్ముగాఁ బలుకు
మనియిట్లు వచియించు తనయునిఁగాంచి
కనుఁగవ మిణుఁగుఱు ల్గఱడులు గట్ట
జనకుండదల్చె "దుష్టాత్మ! దుర్గర్వ
ఫణిదంతదష్ట! దుష్పాండిత్య బధిర
తశ్రుతి! తారుణ్య దళితవివేక!
విశ్రుతులైనట్టి వేల్పులనెల్ల
నాక్షేపణము సేయునంతవాఁడవుర!
దక్షులు విబుధులు-ధర్మైకజీవు
లేవిధిఁ బోయిరయేని—సన్నుతుల
గావు పెఱుంగవే కలిమలార్దితుఁడ!—
యట మిన్నుదాకిన యాతనిమేర

యెటువంటి దనుచుఁ బ్రశ్నించినరీతి
యల్పబుద్ధులు మనమావిబుధాఽఽళి
సల్పిన కార్యముల్ జర్చలుసేఁత—
పాంసులుఁడా! వారు వనజనాభునకు
నంశావతారంబులని యెఱుంగవుర!
చదివిన చదువులీసరణిఁ బండినవి
గదర! యటంచునే గన్నులనిండ
నా గుబ్బు గొన జలం బా బ్రాహ్మణుండు
దీగెదీసినగతి దీనంబు గాఁగ
నేడువఁ దొడఁగిన నింతి సాత్యకియుఁ
బాడిదొఱంగిన పాపాత్ముఁ జూచి
వచియించె" నోరి! దుర్భావపాంసులుఁడ!
బ్రచురమయ్యెను నేఁడు-పాండిత్యమెల్ల
నింటిలోఁ దిరిగెడు నీశ్వరుం డితఁడు
దంటవై, తండ్రినదల్తువే! చిన్న
పెద్దయు లేదె! నా చేసిన నోము
వద్దు వద్దన నిట్లుఁ బాపమై వెలసెఁ
గపటాత్మ! జిచ్చొడిం గట్టినయట్లు
నిపుణత-నీ యవినీతినే దెలిపి
ననుఁ దెలియనియట్లు నటియించి-తండ్రి
కినిఁ దెలుపక దాచితిని-దానిఫలము
గొమ్మలై-రెమ్మలై-కొనకిట్లునమ్మె
హుమ్మని యదలింప నుక్కరంబయ్యెఁ—
బో ఘోర! యిలుదాటి-పురులు దూలంగ
నాపె పంచనె బడి-యా మహాసాధ్వి
యడుగులె శ్రీరంగమై-దాని వెకలి
నుడుగులె గావేరి మడుగువై —యీదు
మిక భార్యయని-తల్లియని తండ్రి యనుచు

మొకము జూపింపకు ముచ్చులగోర!
నావుడు-వారకాంతాదుర్విలోప
భావనోపాసనా పరిభూత సకల
మర్యాదుఁడగు వాఁడు-మదిరాప్రపాన
ధుర్యుండు-కవకవ-దురుసుగా నవ్వి
గణికా పదాబ్జలాక్షారాగములకు
ననువైన జొత్తునెక్కొ-నిన కన్నులను
ద్రిప్పుచు-నెడ నెడ రొప్పుచున్పలికెఁ
జెప్పితి లే ధర్మశీర్షంబులెల్లఁ
జాలింపుమిక-నాల్గుజాలు వాగకుము—
నీలీల ధర్మముల్ నేర్వలే దొరులు—
దానట! యింటిలోఁ దారాడు దైవ
మానట! యన్నైన నేనుగానేమి!
నాకేమిదక్కువైనది! విద్య లేదొ!
పోకడలేదొ! యపూర్వంబు రూప
సంపదలేదొ! యుజ్జ్వలమైన వయసు
బొంపిరివోవదో! పువుబోంట్లుతారె
వలచివచ్చిన-నెట్టివాఁడైనగాని
తలదాచికొని-లేని ధర్మముల్ ద్రవ్వి
యింటఁ గూర్చుండునో! యీ పల్కు-వారు
గంటి కింపైనట్టి కలికి-తా వలచి
వచ్చిన "వలదంచు" నెచ్చరించెదరొ!
స్వచ్ఛంబుగా ధర్మపథము జేపట్టి—
యందనిమ్రాని పండ్లవి, పులుపన్న
చందమ్ము-సామాన్యజనముల వాక్కు-
లీ తండ్రి-వయసులో నెన్నడేగాని
చేతమ్ము జలియింపఁదో! తథ్యముగను?
చలియింపకున్న నాతలఁపు లీగతిగ

వలవనివలల లోపలఁ జిక్కికొనునె!
తండ్రియే బుత్రుఁడై ధరగల్గుననుట
గంద్రలో! వైదికాక్షరములుగాక!
యనియిట్లు తుచ్ఛభాషణము లొనర్చు
తనయుని ధార్ఢ్యంబు తల్లడపఱుప—
పలుకలే కా మాత బాష్పము ల్గ్రిమ్మ
నలిగులియై యేడ్వ—నాథు వీక్షించి
వనజాక్షి యొకమాట పలికెనో లేదొ
గనలెత్తికొని వాఁడు గవిసి-కొప్పవిసి
నేలపైఁ బొరలించి పాలసుండగుచుఁ
దాలిమి దిగఁద్రావి—తన్నె నిల్లాలి—
నప్పుడు సాత్యకి-యవమానభరము
ముప్పిరిగొన వక్త్రమును వంచి-చాల
వణకాడు కొనున-వాలిక కనులఁ
దొఱఁకు బాష్పమ్ములతో నొప్పుదాని-
వన్నెదక్కిన యట్టి పాలిండ్లపైని
గన్నీరు బూరించు చున్నట్టి దాని—
విసమువోలిన మనోవేదనతోడఁ
గుసిలి కుసిలి యేడ్చుకొనుచున్న దాని
ధూళీ పరిప్లుత ధూసరాంగములఁ
బోలింపరాక—యొప్పులు దగ్గినట్టి
దాని-రూక్షాలకతతిఁగూడి—చూడ
రాని నిటాలంబు దాని—నిట్టూర్పు
లానినదాని—మ్రోడైన వల్లికనుఁ
బోని దాని—విచంద్రయైనట్టి రేయిఁ
బోనిదాని—వితంత్రియైన వల్లకిని
బోనిదాని—గళితమైనట్టి భావ
మును-దావులేదిన పూల సరమ్ము

ఘనమైన యపకీర్తిఁ గలఁగిన కీర్తిఁ
బోలినదాని-నపూర్వావమాన
బాలిశమ్మగు నాభిజాత్యమ్ము వోలె—
నరసికజన మహాహంకారభార
చరణ తాడితమైన సత్కృతి వోలె—
దీనయై నిలచినదానిఁ గోడలినిఁ
దా నిరీక్షణసేసి—తనయత్న మేమి
సాగ దీ యింట నిశ్చ్రపచంబంచు
లోఁగలంగియు—నంతలో ధైర్యమాచి
చుఱచుఱమని చూచి సుతుని, సుందరిని
గరమాచి—కనుచాటు గై కొనిపోయె;
ప్రతి దినమింట సాపడుటయేగాని
ప్రతిన బూనెనొ! వాఁడు వలుకనటంచు
సతితోడఁ, దార్చి సమ్మతిగూడ—దాని
మతి సుమింపఁగ నొక్కమాటైన లేదు—
తెలిగంటి—దా బ్రొద్దు తిరుగుడు పూవు
వలె—ధవుముఖమందె వాల్జూపులుంచి
యెటఁబోవ ననుసరించుటెగాని—కనుల
నటు జూడఁడా పౌర్తి, గటకటఁ బడుచుఁ
గన్నీరు కావేరి కాలువై పార
నన్నంబు గుడువదుఁ గన్నార నిదుర
వోవదు—నొక తావి పూవుమూర్కొనదు
రేవగలును శోకమై—వాడుబట్టి
నది-జహ్నుఁదేమి యనఁడు-మనసెల్లఁ
జెదరి-లోలో నేమొ జింతించు చుండు—
నెప్పుడు వచ్చునో! యెవ్వార లెఱుఁగ
రప్పురుషుం, డెప్పు డన్నంబు దినునొ!
సతతంబు గామ శాస్త్రాభ్యాస పరత

మతినాచి—సర్వంబు మఱచెఁ బాలసుఁడు
మాయల గని—వేశ్యమాత—యా నాఁడు
సేయి సాచినది పసిండికై —వాఁడు
రొక్కమెక్కడఁ దెచ్చు! మ్రొక్కినఁగాని
చిక్కని యొక కాసు జిక్క దా యూర—
జను లెల్లరకును నసహ్యమే—బసిడి
గనులఁజూడక యింటి కడప ద్రొక్కింప
దాగణికామాత—యత్యంత కుటిల
యాగని కోపంబుతోఁ గర్వ వచ్చి—
నెటు బాలుపోవక యింటి కేతెంచెఁ
బుటపుటగాఁ జింత—పుండరీకుండు—
దిన్న యన్నంబును దెలియనేలేదు
గన్నుమూసిన నిద్రగాఁ బట్టలేదు—
వెక్కి వెక్కిడ్చి యా వెలది—యిల్లాలు
బ్రక్కన నేలపైఁ బవళించినదియు—
హతచిత్తవృత్తి సాహిత్యకి—దలపోసి
సుఖుఁగూర్చి—యొక మూల శోషిల్లినదియు-
జ్ఞానకూపారంబు జహ్నుండు—గన్నుఁ
గోనల నఱమూసి—కుందు బోఁ ద్రోసి
వేయి జేకులతమ్మి విరియంగఁజేసి
పాయక పవనంపుఁ బట్టుబంధించి
వృత్తులగదిమి—యుద్వృత్తిఁబోనదిమి
చిత్తమేకాగ్రమై—చిత్తరువెనయ
ధ్యానించు చున్నాఁడు—దళితేంద్రనీల
మానితాకారు, రమాహృదాధారుఁ
గృపకుఁ గూడలి—దేవకీ తర్ణకంబు—
చపలుండు—నిద్దుర సాలించిలేచి
పసిఁడికై యిల్లెల్లఁబారాడి—పుడికి

కపిమపిబడి—యేమి గతిఁగానకుండఁ
జేతికందిన నాల్గు చెంబులు గొనుచు
వీతమర్యాదుండు-వెలికిఁగుప్పించె—
'భళిభళి' యని మెచ్చెఁ బాపనిష్కుటము
సలిపినపనికి—వేశ్యాజనయిత్రి—
కొఱనెలతోసాటి—యఱనవ్వుదనికి
మెఱుఁగైన దనమోవి మెలఁత యందివ్వఁ
మదిరాఽను సంధాన మదదిగ్ధుఁడగుచు
మదహస్తివలె వాఁడు మదవతిఁ బెనఁగె—
తెల తెలవాఱె—రోవెలఁది బిత్తరము
దులకింప మేల్కొల్పెఁ దొడలెచ్చరించి—
గణికాన ఖంపచస్తన పరీరంభ
ఘవపై భవాఽఽక్రాంత కనదురస్కుండు
వచ్చెనింటికి వాఁడు—వచ్చుననేమి!
రచ్చకెక్కినవాఁడు—రాకున్ననేమి!
ముగిసె భోజనమింక ముగియనిదేమి!
వగకాఁడు మఱిరెండు బాత్రముల్గొనుచుఁ
బయనమైనాఁడు—దుర్భరశోకదగ్ధ
భయపడి యెచ్చరింపఁగ—మాతృదేవి
యాసేఁత గమనింప నల్లైయుండినది—
పోసరంబెక్కిన పుండరీకునకు
దిన దినంబును నిదే పనియయ్యె—వార
వనితయింటిని గూర్చి వలసగట్టినది—
సంసార—మీబాధ సైరింపలేక
మాంసలితమ్మహంమానమ్ముతోడఁ
దలమొల మెఱుఁగని తనయుని గుఱించి
పలికె నాతల్లి—యోభ్రష్ట; నాకడుపు
పుండుగాఁ బుట్టితి! బోనిమ్ము! వట్టి

దండుగ నీకుగాఁ దత్తపడుట——
గలధనంబుల నెల్లఁగాఁజేసినాఁడ
వలయరుంధతి సాటియైన యీబేల
నగలన్నియును డుల్చి——తెగనమ్మినావు
తగవరి! యాసాని తడిముద్దు కొఱకుఁ——
గడుపునిండెనొ లేదొ గణికకు! నెత్తు
వడినవాఁడన్యుండు వరవుడమోపి
జతపడలేదొ! నీళనితొల్గలేదొ!
పతిపత్ని పుణ్యంబు పండనే లేదొ!
తఱిద్రొక్కియున్నట్టి యిరుగురువులకు
నరపి యేయుపచారమందింపలేదు
తొనఁకనికుండ యీతోయలి——దాని
మనసేమి యౌనన్నమాటయేలేదు——
సరివారు——చెడిననీసరణిఁదర్కించి
పరిహాస మొనరింపబండవై-సాని
ముండయాయెంగిలి మోవికై-లజ్జ
ఖండించి జీవింపఁగాఁబాలుపడితి
వాసానికొంపనే యల్లాడరాదొ!
యాసు పోలికమాటికక్కడికిక్క-
డికిఁ జుట్టనేల!గాసుకుఁగఱవైన
వెకలివై మాపంచవెదకి వచ్చెదవు——
మది మదిలో లేక మల్లాడు చెడిపె!
యదిగూడ, సానినేయడుగఁగారాదొ!
కొంపలపై నిప్పుగూర్చుట దెలియు
సంపాదన మొనర్చుజాడలు దెలియు
మతిమాల్చువింతలౌమందులు దెలియు
పతిసతుల కెడల్చు భంగులు దెలియు
బూకరింపులు——వింతపోకలు——మూతి

నాకుటలల వోక నాగరికతలు—
జీదరింపులు—వింతసిగ్గులునెగ్గు
లాదరింపులు ద్రోపులన్నవనవ్వు—
జళికింపు నెయ్యంబుతులకింపుఁ—గల్ల
తలకింపుఁ—గౌగిలింతలనింపుఁ దెలియుఁ
దనజొల్లు "విరజ" గాఁదలఁచికాపున్న
తనవానికొక కాసుదయ బెట్టి యొసఁగ
మెలపెఱుంగదొ! మెఱనొచ్చులదీవి
వెలపొత్తి! యిఁకనేలవేకారనీకు!
ప్రతిదినంబొక్కొక్కపాత్రగా—దాని
వాతఁబెట్టిన నింకబ్రదుకేదిమాకు!
నావుఁడు-కనులెఱ్ఱనై-గోపభరము
గావఁగలేక చిక్కఁగనవ్వి—చేత
నదలించి సుతుఁడిట్లు బెదరించె—మేలు!
'పదరనిమ్మ' నియోర్పు బాటింపనింత
వఱకువచ్చితివా! యెవ్వరిసొత్తులివ్వి?
నెఱిగాఁగఁబల్కుము—నేబుట్టలేదొ
మీయింటసుతుఁడుగా—నేక్రియనైన
జేయుదు, నేవాఁడుసెప్ప వలంతి?"
వినుచుండె జహ్నుండు విగతవివేకుఁ
డనయుండు—దనయుండు జననితోనాడు
బెడిదంబు, లాతనియెడఁదచీలినది
యడజడి భరమైన దామహాయోగి
యొకనిముసంబైన నూరటనొంది
యిఁకనిల్వఁ జాలఁడాయింట—సాత్యకిని?
గాంచివచించె "నెక్కడిపిచ్చినీకు!
పంచాస్త్రసర్పదుర్భర విషాగ్నులకు
మందున్నదే? వట్టిమమకారమునకుఁ

జిందిలపడిచెప్పి చెప్పి—యేఫలము
మూటగట్టితి? రమ్ము పోదము! వయసు
దాటిననేటి బంధమ్ములు మనకు!
కొడుకుగొడుకటంచాఁగుమిలెదవేటి
కొడుకు! దుష్టుండు నీ కడుపునే దఱిగె—
నేనింకగడెయైన నిల్వఁగాలేను
మానంబుదఱికిన మసణమీఝంట
గాశి—మోక్షామృతరాసి—సంకటవి
నాశనంబులకెల్ల నడుముగట్టినది—
యాశ్వాసమూర్తియా విశ్వనాథుండు
విశ్వసించినవారి వెన్నుబలంబు
నేఁబోవ నిశ్చయించితి—వచ్చితేని
నాబుద్ధివిని రమ్మ—నగుబాటుగాక
నీవు రాకున్న నేనేబయనింతుఁ
ద్రోవబట్టిన సర్వమావిశ్వనాథు
భారమే—యీకొంపఁబట్టెడుకూడు
నేరను భుజియింప—నీరంబునైనఁ
ద్రావనుసుమ్మి దథ్యంబు తథ్యంబు”
నావినిసుతుఁడు దిన్నఁగనవ్వి—లగ్న
మెప్పుడుంచితివనె—నింకేమియెడఁద
నిప్పులుగ్రుమ్మరించిన యట్టులయ్యె
జనకున, ‘కిప్పుడే’ యని యల్లుదాపెఁ
గనుఁగవ దడిగాఁగ-మనసెల్ల మండి
నుసినుసిగా జహ్ను, డసమెత్తికొనుచు
బుసకొట్టె వేడిగాఁ బుండరీకుండు—
దనతండ్రి విడిపోవు తలఁపును గూడ
మనసున కంటించికొనక హాస్యంబు
సలుపు సూనుని గాంచి, జల జల రాల

సలిలంబు రెండు గన్నులయందు-హృదయ
మున వేయి భావముల్ ముప్పిరి గొనఁగ
జనని సాత్యకి యిట్లు బనవె "సర్పంబుఁ
బెంచినట్లయ్యె నీ పెంపక మింత
వంచించునే నన్నుఁ బరమేశ్వరుండు!
తెలుపార నెత్తిన దీపమై-కులము
వెలిగించుఁ గొడుకంచుఁ దలఁపులు బూచి
నేలపై నడువంగనీక-రేవగలు
నాలరి! యీ వక్షమందె బెంచితిని
ఫలితవృక్షముఁ గూల్పఁ బాలవు పాపి
వలెఁగడ సాని-నా భావవృక్షమ్ము
నిలువునఁ గూల్చిన దలఁత లే దింక!
వెలయాలిపంచనే వే యేండ్లు సేవ
సలుపుము-చదివిన చదువుఁ బండించి—
తొలఁగెద మీ నాటితో మేము కొడుక!
యని కోడలిని జూచి-యాయాస మొదవి
కనుదోయిఁదుడిచి-చిక్కని ముద్దువెట్టి
చెక్కిలిపై-నేమి చెప్పంగరాక
వెక్కి వెక్కేడ్చి యోవెలఁది నన్నెంత
దిట్టికొందువా! యిట్టి కట్టడి మగనిఁ
గట్టిపోయినది రాక్షసియంచు-దీన
నలినాక్షి! దోసమ్ము నాది లేదమ్మ!
గలనైన నీసమ్ము-కళఁ గల్గువాఁడు
జదివినవాఁడు-వంశపు వెల్గునిలుపు
నెదగలవాఁడు-చూపది కెదురూప
సంపదగలఁ, డనూచానమాచార
సంపదఁజెడనీని చతురుండటంచుఁ
దలపోసి "వాఁడ"ను దామోదరునకు

గలికి! నీవొక లక్ష్మివలె నుండఁదగుదు
వని చేసితిమి-నేటికైన నిక్కముగ
వనిత! నీవేమొ మా పాలి శ్రీదేవి—
తనయుండుగాలేదు దామోదరుండు—
పొనరేది నా మోము పుచ్చిపోయినది
యిఁక నిల్వఁగాదువే! యెలనాఁగ నాకు
సుఖ దుఃఖములకైన సుకృతంబుకైనఁ
జిత్తశాంతికినైనఁ జెలిమికినైన
హత్తిన దైవమైనట్టి మగండె
బోవుచున్నాఁడట! పూబోఁణి! యెట్టి
వానితో నీయింట నే వసియింతు?
నదెచూడు-నీ మగండావంతయైనఁ
గొదయున్నదే! వాని, కెదురేగి తండ్రి!
దుడుకు మన్నింపు మీతోయంబు-ముందు
నడవడిలో సుంతనయము దగ్గింప
నని వల్కఁగారాదొ! యరవిందములకు
ననుఁగులైనట్టి యాతని పాదములకుఁ
బ్రణమిల్లఁగారాదొ! పాపమో! బాష్ప
కణములఁ జరణముల్గడుగఁగారాదొ!
తండ్రికి వందింపఁ దనయుండు దోస
మంద్రె! యెవ్వారైన నవనీతలాన!
నవనీసురుండుగా భువిఁబుట్టి-వెగ్గ
లవఘళించిన యట్టిఁడై—చదువెల్లఁ
జవిటిలోవిత్తిన చందమైపోవఁ
బవలునురేలు—రూపాజీవ పాద
జలజమ్ములందు న స్తమొనర్చి మ స్త
మలివిమీటిన దోసమందురే గాని!
లలితాంగి! వాని వాలకము జూడమ్మ!

కలువోలె మెకయద్దుఁ గదలకున్నాఁడు—
వాఁడేలఁ గదలులే! వానిఁ బెంచినది
కోడల! యీ యిరు గురువులు గారు—
పాలఁబడ్డట్టిదే పరమాన్న మమ్మ!
పాలవంటివి రెండు వంశమ్ములమ్మ!
పుట్టినింటికిఁబోలె మెట్టినింటికిని
జెట్టరానివ్వక సేవింపు మమ్మ!
యాఁడుజన్మముకన్న నడవిలోఁ బుట్టఁ
గూడును జెట్టుగాఁ గొదలేదటంచుఁ
బలుకుదురే గాని—కలకంఠి లక్ష్మి
యిలుదీర్ప-సడినార్ప-నిఁగ వేఱులేదు—
మగవాఁడు మగువతో మనుజుఁడై తిరుగు
మగువ వోలనిదైన మగనిదే బ్రదుకు?
చలిది నేఁతనుబోలు సౌఖ్యముల్నమ్మి
కలవంటి యీ పుట్టుకల నమ్మి—మగని
నాఱు దూఱును సేయునట్టి వారలకుఁ
దీఱునే! పాపంబు! తీపారుబోడి!
వాఁడు పాలసుఁడంచు వానిపైఁ గిన్క-
గూడి నీ ధర్మంబు గోల్పోకుమమ్మ!
ధర్మంబు—పుణ్యసాధనము—జీవితపు
మర్మంబు—దీని నేమార కేయమ్మ!
యిచ్చి పుచ్చుకొనంగ నింతి! బేహరువా!
యచ్చంపు ధర్మమాధ్యాత్మికంబమ్మ!
యెన్నాళ్ళులిటు నటియించులే వాఁడు!
తెన్నునఁబడు—నోర్పుదింపకేయమ్మ!
యొక రెగ్గుసేసిన నొకరైనఁగాని
కొకిరింపకే—సర్దుకోవలెనమ్మ!
యేదారి యన్నచోఁ గోదారియంచు

సాధింపనింక సంసారమేమమ్మ!
బ్రదుకఁ జూడదుగాని—పాడైన—జగతి
'యదె! యదె!' యని నవ్వులాడునో యమ్మ!
మంచిదానివి! నీవు—మమత పుట్టించి
పొంచి—భర్తయెడంద నొంచికోవమ్మ!"
యనుచున్నదింక సాత్యకి—జహ్నుఁడపుడె
"యనువుగాదంచు దేహళి దాటినాఁడు—
దడవేమిలేదు సాత్యకికి—వేయార్లు
నుడువులు—మదిలోనె యడఁగించికొన్న
దంతమామకు మ్రొక్కెనతివ—బాష్పోప
దంతురితములు నేత్రములతోఁ జూచి—
గంగాతరంగ రింఖజ్జటా జూట
సంగతుండైన యీశ్వరుఁబోలు జహ్ను
వనె నిట్లుఁ" గోడలా! యారాటమేల!
వనదవ్రజంబులు వఱుగొని కురియుఁ
గురియునే! యేప్రొద్దు! గుదికిలఁబడక
మఱునాటి కాకాశమార్గ మచ్చమ్మ
గాదొ! లేయెండదారాదొ! శైత్యమ్మ
బోదొ! కాలానమార్పులు సాజమమ్మ!
యొక కంచుకముపీడ—నొకటిఁ జేకొనును
కకుదమైనట్టి యీ కాల నాగమ్మ—
వచ్చునెన్నడొ మేలు—వనరకు మింక
వచ్చెదనేఁ బోయి—వంశ గౌరవము
ప్రాణంబుగా నెంచి—పద్మయుఁబోలె
మా నోము ఫలియించి—మగువలకెల్లఁ
దలకట్టుగా నిల్చి యిలుఁదీర్పవమ్మ!
కలిమిలేముల మదిఁ గలఁగకుమమ్మ!"
అత్తగారికి మ్రొక్కెనతివ—యుప్పొంగి

యుత్తలపా టామె—యువిదకై వట్టి
శిరము మూర్కొని యంకసీమ గదించి
కరమర్థి వాలారుఁ గనులలోఁ జూచి
తన దుఃఖమును మ్రింగికొని—చిబుకంబు
మనసారఁ దడవి—చెంపల ముద్దువెట్టి
"రణములో వెన్కకు రాఁకమున్మందె
కనుగల్గిపోవు వీరునివోలె—రాజ
దండనంబునకింత తత్తఱపడక
దండి ధైర్యముతోడఁ దడయక యేగు
ధీరునిపోల్కి సంసార గౌరవము
వీరనారిగ నిల్చి వెలయింపవమ్మ"
యని పల్కి నడచె సాత్యకి, జహ్నుఁ దగ్గ
మునఁ బోవ నందీశ్వరుని లోడులేని
హరుఁడుగా—నా కోడ లావు విధాన
నఱచిన దవళయై—యవనిపైఁ ద్రెళ్ళి—
యే కోశమునఁ బ్రేమలేచెనో! బుండ
రీకుని కన్నుల నాఁకట్టె జలము
మలచిన జాతిలోఁ బొలసెనో! యూర్పు!
పెలుచ మొగము దన్నె వేడి నిట్టూర్పు—
గాని యడ్డమువోయి 'కాదంచు' వారిఁ
దానయి గొనివచ్చు ధైర్యమ్ము లేదు—
మనసులో నిలు గట్టికొనిన రోవెలఁది
తొణకునవ్వుల నాపు త్రోవయే లేదు
కరుణ మిక్కుటమయ్యెఁ గాంతపై—గాని
యరుదార నోదార్చు నర్మిలి లేదు—
యఱకొఱగాఁ బుట్టె నణకేమొ గాని
యఱలేక దుర్వృత్తు లణఁగింపలేఁడు

బొస పొస మతి దప్పి పుండరీకుండు—
మగఁడు వోయినతోనె మగనాలు గనుల
నెగచిన బాష్పమ్ము లెగఁజిమ్మికొనుచు
వారు వోయినయట్టి దారులే చూచు
చారని శోకాన నసురుసు రనుచుఁ
దలవోయుచుండెఁ గన్నులమీద దూగు
నలకల మఱి మఱి యవలఁబోఁ ద్రోసి—
ముందేగె జహ్నుండు—ముక్కన్ను లేని—
నందీశ్వరుఁడు లేని—నానా ప్రమథులు
లేని—జటా జూట లీలావిధూతి
లేని గిరీశుండు—మ్లానాఽతి దీన
వదనుఁడై-చలనంబు లదుకక—గుఱుతు
వదలక—కీసంత ప్రిదులక—జాఱు
వడక—కీడ్వడక—తప్పక—తాఱువోక
నడు నడు నడ్గక—నలి నలి గాక
పులుగడిగిన ముత్తెములు నిట్టచూపు
లొలయంగఁ బొడవు ఱెప్పలనుండి బొంగి
భ్రూమధ్యమున యందుఁ-బొలఁతి సాత్యకియు
నా మహనీయుని యండనే నడచె
నడవకేలుండు? నామ్నాయ మాతండు
నడలని యాచార సరణి యాదేవి—
క్రతుమూర్తి యాతండు—గ్రతువునకైన
తత ధర్మవర్తిత దక్షిణ యాపె—
జగదలంకారంబు చంద్రుఁ డాతండు
జగదేకసుందరి చంద్రిక యాపె—
హరుఁబూన్ప ననుపైన యరవిరి యాతఁ
డరికట్టు నచ్చంపు నడితావి యాపె-
యింద్రాదులనుగూడ నెకసక్కె మాడు

నింద్రియంబులు వాహినీశ్వరు ల్గెరల
విషయంబుల జ్ఞానముషితముల్-గర్వ
రసితంబుతో సైన్య మెసరేగి రాఁగఁ
గందర్పుఁ దమ పెద్దగాఁ జేసికొనుచు
మందులై యార్వురు మానవాధిపులు;
తనపైనికెత్తినఁ దనివోని శౌర్య
మున వీర కేదారమును గట్టి-యెఱుక
యను ఖడ్గమును బట్టి-మునుము జేపట్టి
వినతుల విదళించు విమలవైరాగ్య
దివ్యసింహాసనాధీశ్వరుం డాతఁ
డవ్యయమోక్ష మహానందమామె-
యూరిలో నున్నట్టివారు-దిగ్భ్రాంతు
లైరి-దామేమని యనఁగఁ నలారు!
పుండరీకునితోడఁ జండించి-నీది
దుండగమ్మని పల్కు- దొర యెవ్వడుండు!
వాఁడు సామాన్యుఁడా! వనజాక్షు కరుణ
గూడి-జన్మం బెత్తికొన్న మర్త్యుండు-
యాతని చదువేమి యలఁతియా? శాస్త్ర
జాతమ్ము వానిచే-సాఁగు బొంగరము—
వాని కళాప్రీతి-వాని వైదగ్ధ్య
మూనిన నైపుణ్య, మూనిన రసిక
తాగుణం బెవ్వారు దప మొనరించి
యే గాని-పొందఁగా నిల నశక్యంబు—
కలిగిన ఫలమేమి-కడసాని మఱఁగి
యెలసిన గుణమెల్ల నిల్లిగ్గులింకె—
నురగదష్టుని మేన నున్న శోణితము
సరియయ్యెఁ జదివిన చదువెల్ల గూడ—
తీగెలు సోగలై సాఁగిన దృష్టి

పూగముల్-కడకెల్లొ పొరినుజ్జగించి—
మనసునఁ బెనఁగొన్న మమతను గోసి
కొనకొని పుండరీకుని ధర్మపత్ని—
తఱుము—వెన్నున దూలి తుంపిళ్ళు లాఁడ
వఱగొను చలియింప—నటు నిటు దూఁగఁ
బయ్యెద—చెక్కిళ్ళపై జాలువాఱ
ముయ్యేఱులై బాష్పములు—చూర్ణకుంత
లములు నెన్నుదుటిపై లాస్యమ్ము లాఁడఁ
గొనురొఁదుచున్న కుంకుమము జలింపఁ
బన్నీరు చిలికిన పద్మమ్ముపోలెఁ
జిన్నారి వదనంబు జెవరించు చుండ—
నరగవుసెనయూడ్చినట్టి యద్దములఁ
దొరయఁగ పోలముల్—ధూళీప్లుతములు—
కళలనేడినదొక్క-కళగాఁగ—మంచు
నెలకొన్న కమలమ్ము వలెఁ దోచి—లేచి—
తలచుటూర్పులు మోవి దందడింపంగ
కరరుహంబులు మోడ్చి కలికి మ్రొక్కినది
యత్తమామలు చన్న యట్టి దిక్కునకుఁ—
జిత్తంబు తాయి సేసికొని—వెన్దిరిఁగి
జవ్వాది యుడివిన జవ్వాదిపిల్లి
మువ్వంబు దఱికిన మాధవీవ్రతతి
శ్రుతిలేని గానమ్ము, మతిలేని రక్తి
తతి గూడు త్యాగమ్ము తఱుగైన భక్తి
కడిలేని సుమము-చక్కని చాయ లేని
గడితంపు వలువ-ధిక్కారవిమ్లాన
మైన నడంత-వై యాత్మసౌభాగ్య
మానని కృతి-దీనయై పుండరీకు
సతి-జీవరత్నము చలియించినట్లు

పతి నెద్దియ నింటిలోపలికిఁ బోయినది-
నడచుచున్నాఁడు జహ్నుఁడు-నీడవోలె
నడచుచున్నది-యాత్మనాథుని బడిని
ధర్మంబువట్టి సాత్యకి-హృదయంపు
మర్మముల్దన్నిన మమతఁ బోఁ ద్రోసి
తరము గానట్టి తుత్తులెల్ల విడచి
పరమాత్మవెనువెంటఁ బడఁ బాఱుభక్తి-
శాపమూర్ఛితుఁడైన జనుఁడట్లు-సుంత
దోపక-తన చేయు దుడుకుతనంబు-
కడ సాని చూపు చుక్కానిగా సుతుఁడు
పడిఁ బోవుచుండె నీ భవవార్ధిఁ బడుచు-
తల్లిదండ్రుల పీడ దలఁగిన కతలు
చల్లఁగా వినె వార జలజాక్షి-దాని
యుల్లాసమున కింక యెల్లయే లేదు-
కొల్ల దక్కె నటంచుఁ గులుకులు చెఱకు
లల్లికొనఁగ మాయలబూమెలాచి
కల్లనవ్వులు నవ్వి-కరిగొన్న విసము
కపటమోహము గుప్పి-కనులు దేలించి
నిపుణంబు గాఁగ వాని పసిండి యెల్లఁ
గరగించి-యొక సాకు గనిపెట్టి-వాని
బరిభవింపఁగ నుండెఁ బాపంబు పొడవు-
సాత్యకీ జహ్నులు-శమదమయుతులు
మత్యుపహిత చంద్రమఃకోటిభూష
ణులు-నిర్గతాశులు-సలలితభక్తి
ఫలిత వివేకసంపత్ప్రీణితాశ్రి
తులు-దమ మెట్టిన యిలయెల్లఁ బంట
లొలయించి పున్నెంబు-లొలికించి కరుణ-
వార వాణీభవద్బహుల వృక్షౌఘ

దూరిత లోక సంచారముల్-ఘుర్ఘు
రత్పోత్రి నేత్ర నిర్యద్వహ్ని చిటచి
టత్పాదపములు-హఠాదుచ్చలత్త
రక్షుక్షుభితముల్-తరసదృప్తవంచ
కాక్షీణరవసమాహారముల్-సింహ
ఖరనఖరాగ్ర విక్షత జరద్దంతి
శిర ఆత్తమౌక్తి కాభరణముల్ ప్రస్త
రప్రసవాఽతి సౌరభ భరాకృష్ట
విప్రియాశ్యద్ద్విషద్విపులవిషాణ
నిగ్రహోద్భిన్న ధ్వనిస్యూతముల్, స
మగ్రగజాగ్రన్మదోన్మత్తమాతంగ
తుండ ఖండిత చండ కాండ శాఖాప్ర
కాండ ద్రుతండ ప్రకల్పితోత్తుంగ
శైలభ్రమమ్ములు-చకచకన్మఘవ
నీలాఽతివేల దృగ్జాలజాలక వి
హాయస చంక్రమద్ధరిణముల్, భీక
రాయత తనులేలిహానముల్-గహన
ముల దాటి-జలపిచండిలనదుల్దాటి
మల ఉత్తరించి-పల్లెలనుదరించి
జగదద్భుతాఖండ శర్మైకగేహ
నగరముల్వీక్షించి నానావిధములు-
పొలవంబు గల బేడి సలనీటు—దూటు
లలిత కటాక్షజాలంబులై పొదల—
జలపక్షికల కల కల నినాదములు
కలఘంట లులియు మేఖలతీరు గాఁగ—
వాగుబ్బు గొన్న కల్హారముల్—కనుల
వ్రేగైన కుచములరీతి నటింప
కవియ మూఁగిన బలాకావళుల్—తెల్వి

కవరైన నవ్వులకరదులై వెలయ—
మధుదిగ్ధ మత్తబంభర నినాదములు
మదనాఽతిశయ లసన్మణితముల్గాఁగ—
పాఱు నీరమ్ములు పట్టున వఱుప
మాఱొడ్డి స్రవియించు మదధార గాఁగ—
నెలతాల్పు కంట వెన్నెల లుదయింపఁ
దలఁపు దువాళించు తరళాయతాక్షి
రేవాతరంగిణి సేవించి—యామె
పావనంబులగు నంభస్సుల నాఁడి—
సంధ్యాకషాయభాస్వన్మందహాస
వింధ్యవాసిని భక్తి వెలయ నుతించ
వెయినామములవాఁడు ప్రేఁతలతోడ
మెయికొని చిట్టంట్లు మెఱయించినట్టి
నేలలు జూచి—గోపాలబాలకుని
బోలించికొనుచు—నేవో యూహ లల్లి
కొనుచుఁ, బాఱక పాఱు—కూర్మల చెలమ
దిననాథ తనుజాత దీవెన లంది—
తక్కి నక్షత్రముల్దరిపించికొనుచు
నక్కమలాక్షు మాహాత్మ్యముల్—పులక
లొలయింప—సతము కతలు సెప్పికొనుచుఁ
దలఁపుల మఱచి యధ్వక్రమంబెల్ల—
యన్నపూర్ణాదేవి—యఖిలైకమాత
గన్నని సుంగులుగాఁ జూచి—తాప
సులకుఁ బీయూషభిక్షలు వెట్టు నెచట—
నల భగీరథుని పుణ్యమ్ముల పంట
మధుసూదనుని పాద మధువైన దేవి
విధుశేఖరుని శిరోవీధియ న్మింట
వెలయు రాయంచ—పాపులకెల్ల రక్షి

నలినాక్షి-దివిజ గంగ-నిరంతరమ్ము
గలిగెఁ బుణ్యంబని కాపుండు నెచట—
కలిమలసంత్రాసకరమైన యట్టి
గౌరీమనోహరు గాదిలిసాని
వారణాసీపురిఁ జేరిరి వారు—
పుండరీకుఁడు దినంబును దప్పకుండ
గండఁడై—యా వారకాంతాకటాక్ష
ములకు జీవము లమ్మి ములుచయై తిరిగె—
చెఱువపదమ్ములు జేతితో నెత్తి
యంకాన ధరియించి యలసాఁటసముగ
జంక కొనర్చు లాక్షారచనమ్ము—
లలిత కపోలతలమ్ముపై తూలి
కఱగొని చిత్రకమ్ములు లిఖియించు—
నా నెత్తి కుంకుమ కద్దంబు నిలుపు
నానిన కలు ద్రావు నాహా! యటంచుఁ—
గలికి కన్నులయందుఁ గాటుక నలఁదు
జిలుఁగుగ్రొవ్వెదకుఁ గంపుల పూలు ముడుచుఁ
గనుబొమ్మలందుఁ జిక్కని నవ్వు జూచి
మన ముబ్బి 'మేలు'జన్మంబంచుఁ దలఁచు—
దానిమొగంపు బిత్తరమె సూయాణ
మైనది వాని మహానందమునకు—
వాని నెలంత యెవ్వలవను శాంతి
గానదు—జన్మంబె కన్నీటిజాలు—
అడవిఁ గాచిన వెన్నెలయ్యె జవ్వనము
ముదికాఁడు వలుకండు పుండరీకుండు—
అన్నంబు వడ్డించునప్పుడే గాని
కన్నారఁజూడండు—కసిగాటు గుడుచు—
నవ్విన నవ్వండు నవ్వివనైన

కవ్విన తల పూన్చి కసిడిగా నవ్వ—
పలుకరించిన ప్రతి వలుకందు—చాల
యలఁతమై యొకసారి యపిమాట వలుకు
తరళాక్షి యూర్పుల పలుపయ్యె—తుఱుము
విరుల క్రొత్తావికి వీడుకోలయ్యె—
ఎలనాఁగ పొరాడు కలయయ్యె—కనులు
కలఁత నిద్దురకైన నలవడవయ్యె—
పెలుకుఱు బొమ్మంచు పెదవులపైన
కలికినవ్వులు సుట్టె గండవడంబు—
అలరు తంత్రుల వీణె మమరిన హొన్ను
జలపోసనపు వీణెచాయగా—మగని
కరపద్మముల నాడఁగానైన వగలు
కఱతయాటరిచేతఁ గరకరలయ్యె—
కారాకుఁబోలిన కడసానిదైన
యారజంబే తలిరాకుగా నయ్యె—
తలిరాకుఁ బోలిన తనదు ప్రాయంబు
కళలేని కారాకుగానయ్యె-మగని—
కింక నెన్నాళ్ళు వేయించునో బ్రహ్మ
పంకేజముఖిఁ దీవ్రబాధానలమున!—
ఇటుఁ గొన్ని మాసంబు లేగిన—పాప
కుటిలాశయంబుల గూడు రోవెలఁది
పుండరీకునిధనమ్ములుగ్రిప్పినంత
బండతనమ్మున, బరులఁ గాంకించి,
యుడి దేనె యఱు పసియదరని పూవుఁ
దొడరు తత్సంగతి తుదిర్వాలు వ్రాయ
వగచి-తల్లికిఁ జెప్పి-"తెగఁజూడు"మనుచు
నగవులు మలఁగించి—సొగసులు డించి
వానితో వర్తింప వలవనిభంగి

తోన నింగితములఁ దోపఁ జేయుచును—
యింపులేనట్టి బిగింపుల—పట్టి
అంపుల—వెలిసాళగింపులతోడఁ
గాలంబు గడపిన—బోలించి చూచి
జాలి బిట్టేర్చిన—బూలమ్మినట్టి
తావులనే కాష్ఠత తినమ్ము వేళ
లే వచ్చునా! యంచు నింతలింతలుగ
కడిదప్పెఁ బుండరీకుఁడు—వారకాంత
నుడివిన నుడువదు—ముడివెట్టి వాలి
కనుబొమల్ వీక్షించుఁ గడు కఠోరముగ—
తనతోడ గడెయైన తామసింపదును—
వృకముఁ బోలిన యట్టి వేశ్యాసవిత్రి
యొకనాఁడు 'బాపని యొద్దిక యింక
చాలయ్యె' నని 'యోరి! సావాసగాడ!
పోలింప నినువంటి పుణ్యుండు లేడు—
అడిగిన రొక్కమియ్యవుగాని—వలపు
ముడివడ నిరతంబు మూతి నాకెదవు!
పసిడిలేనిదె వేల్పు పడఁతిని బోలు
మిసిమిగుబ్బలది నీ వసపడు నేమి!
పామాడి! యిన్నాళ్ళు బ్రదికిపోయితివి
కామిని నీమీద కైపెక్కియుండి—
పో పొమ్మ! చాలు నీ పుణ్యంబు పండె
రేపటినుండి మా ప్రాపుఁ గోరకుము—
వచ్చినట్లైతివా! బాపడ వీవు
హెచ్చుకుండైన నీదే దోస మంచుఁ
గసరి నూకిన—గుండె గడగడ వడకి
యసమింకి—నిట్టూర్పు లలమి—ధైర్యంః
గిటగిటనై—వంత పుట పుట నగుచు

కటికగుండెది వారకాంత యా వైపు
తల సూపకుండిన—దన గోడు సుంత
దెలుపంగలేక—యుదీర్ణావమాన
దళితుఁడై—యిలు సేరి—దాని వల్వంత
నలజడి పడి—రాత్రి యటువచ్చి—మలయు
మలయ వాయువులకు మతి దప్పి—వేగు
బొలపినంతన రోయి వెలఁది గృహమ్ము
దరి జేర—వాకిటఁ దల నాన్చినట్టి
సరసీజముఖి—వాని జాడఁ బోలించి
మెఱుఁగు పోలిక యింటఁ జొరఁబాఱి-తల్లి
నరసి కన్గిరిసిన—నది దయ్యమట్లు
దాపురించిన—ముఖద్వారంబునందె
యాపెదర్శనము ధైర్యము దూలపుచ్చ
గ్రుక్కిళ్ళి మ్రింగుచు—నక్కి త్తికొనుచు
నొక్కొక యడుగె వేయుచు వచ్చు—పుండ
రీకుని నది జూచి "చీకొట్టనైన
నీకు సిగ్గున్నదే! ని న్నటఁ జెప్ప
నో! రాకుమంచు! నేమో యిచ్చినట్టి
గారాబుదాతవై కడప ద్రొక్కెదవు
పో పొమ్ము! వచ్చితివా! పుట్టుట్రుంగ
నా పద్దు జెల్లించి—నా నోటఁ బుక్కి
లించిన కల్లు జిందించి నీ తలను
పంచల నున్నట్టి పఱచలు నవ్వ
సాఁగనంపెదనంచుఁ జండించి పలుక
మూగయై వాఁడూర్పు ముమ్మరమగుచు
వచ్చినత్రోవనే బట్టి గేహమ్ము
జొచ్చి—కోష్ఠాగ్రశవుల్ జొబ్బిలు కండ్ల
నన్నంబు ముట్టక—కన్ను మూయకయు

నన్నువ తలపోత నా రాత్రి గడపె—
మఱునాఁడు వంత దైప్పరమయి—దాని
చరణంబులకు నమస్కరణం బొనర్చి
యైన నొక్కంతసే పాత్మసుఖమ్ము
బూనంగఁ దలఁచి దబ్బున గెంతి వచ్చు
నది చూచి గణిక, యే యనుకంప దాకి
నదియొ చిత్తము—వాని యదవద గాంచి
తలవాకిటనె నిల్వఁ—దన తపస్సులకు
నెలవైన యా యింతి నెలమి వీక్షించి
"యడుగులతోడ దురక్షరంబులను
దుడువుమన్నట్లుగాఁ దోయజనేత్రి
పదములఫాలంబు గదియించి మ్రొక్కి
గుదిగొను కన్నీరు గుప్పి—వెక్కెడ్చి
కై వట్టి దీనంబుగాఁ జూచి యూర్పు
లావటించి వచించె నల సాంగి! నేటి
కలరింపు లేని పూవైతినో యేను!
యొలికి బూడిద యయ్యెనో! వలపెల్ల
కలలెల్ల గడచెనో! కనకంబుఁ గమ్మ
వలచినట్లున్న నీ వాలకంబెల్ల
మన్నయ్యెనో నేఁడు మాయెడ! పసిడి
యున్న నే మనసా! యీ జన్నియ గొన్న
రాసిక్యమున కెన్ని రత్నమ్ములైన
వీసమ్ము సరివచ్చునా! సడికోర్చి
కులమమ్మి—యింట బోకులు తెక్కలించి
వెలకమ్మి—తల్లిదండ్రుల విసర్జించి—
యింక సేయని దేమి యింతి! నీ కొఱకు!
అంకించు నీ తెప్ప లవ్యయానంద
మై యున్న నాకు—నీ యతివేల విరహ

మే యుర్వి పాడైన చాయ దోపించె
నదలింపకే నన్ను నలఁతిగాఁ జూచి
మదిరాక్షి! నీ మృదుపదములకైన
లలిత లాక్షారసంబులు సేర్చుకొలుకుఁ
కొలువుకాఁడుగ నన్ను గూర్చుకో! యడప
మును బట్టనుంచికో! పూవుబెత్తులను
తనికంపు పీడక—తనకలికొప్పు
నను గూర్ప నుంచికో! నవ్య లావణ్య
మునకు నేడుగడైన మొగమున బొట్టు
దీరిచికొను వేళ—నేరుగా ముకుర
మారజంబుగఁ బట్టు నట్టి నా సేవ
దిలకింపవే! రోయి వెలఁది! నిరాళఁ
గలుచైన నా యూర్పు గానంతగాని
తోపనివ్వను లెమ్ము"—తోడ్తోడఁ బలుకు
నా పుండరీకుని యసదతనమ్ము
భావించి వేశ్యయు ఫక్కున నవ్వి
తావి తమ్ములమున దళుకారు పెదవి
విఱచి—" శాస్త్రమ్ములు కడముట్ట నీది
మెఱుగాఱుబోడి చిత్తరపు మనస్సు
చదువైతినిగాక—సానికి నొక్క
మది యుండునా? యున్న మనికి సాఁగెడున!
వడి బాఱు జలమున కొడలెల్ల నోళ్ళు
కడిదిరూపాజీవ కొడలెల్ల మనసు
లొకమదితోఁ జూడ—నొక మదిఁ జూడ
దొక కంట జూచిన నొక కంటఁ జూడ
దది సర్వతోముఖమైనట్టి రక్తి
యది సర్వతోముఖమైన విరక్తి—
తళుకుఁ గన్నులఁ బట్టి తాళించు నవ్వు

వొలపంబు వలచు చూపులు—లేని మరులు
కన్నీరు-విరహంబు-కల్ల కోపంబు
పన్నిదంబులు—తాల్మి—ప్రతిమాలుటలును
పడియవెట్టును మాకు భావసంతతులు—
విడి ముడి లేకున్న ప్రేమమ్ము లేదు—
పసిడిలేకున్నచోఁ బ్రద్యుమ్నునైన
గసిడిమాలయుఁ బోలెఁ గాల దన్నెదము—
"వీడింతవాఁడని—వీని ధనమ్ము
తోడ మనితిమని—కూడదు విడువ
వని"—ధర్మశాస్త్రముల్-మనసున్న యితర
జనములకే మాకు మనసులుసున్న—
శిలలకుఁ బోలునే గిలిగింత లిడఁగఁ
దలయేరు గాక మీ ధర్మశాస్త్రములు
జాలిమాటలు-గృతజ్ఞతలు-మాయెడలఁ
దాఁకునే? మా జార ధర్మాసనంపుఁ
బోక లే వేఱు—పో పొమ్ము వే రొకఁడు
నాకుఁ గైవసమయ్యె—నీకింక నిచటఁ
జోటు లే దింట నాబోటి—యెన్నాళ్ళ
కాటుక డిగజాఱు కన్నీటితోడ
కంకటిపై యిందు కళవోలెఁ బండి
యంకిలి గుడిచెనో! యా ధవళాక్షి
కై వట్టితివె గాని—కడ కొక్కసారి
భావించి సుకముల పట్టులంటితివా!
మనసరి! నీవు నా మనసు లెంచెదవు!
మనికితపాఁటేల మఱలుము—పసిడి
దొఱకెనా రమ్ము! చక్కెరమోవి నొసఁగి
యరసెద నొక్క మహారాజు బోలె!"
నావుడు దీన దీనంబులై—నీటి

ప్రోవులా కనులతోఁ బుండరీకుండు
తనవైపు జూచిన—దగదింక వీని
యనునయ మంచుఁ దా నాత్మలోఁ దలఁచి
పడుపుకత్తియ గొప్ప పనియున్న వోలె
పడి జన్న—వెంటనే వచ్చెను వేశ్య
మాత-సురాపానమదకలితాంగి—
యాతెంపి యింకేమి యాడునో! నయము
భయమెఱుంగక యంచుఁ బామును గన్న
కయివడి-పడఁ బాఱి-కాముకుం డచట
జాఱి-యింటికి వచ్చి-బోరన నేడ్చు
యూరార్పు లేక నిట్టూరుపుల్ గ్రుమ్మ
'తను నమ్మి చెడితి'నం చను-మాయ మనసు
తనకను, నైన నద్దాని కూటమ్మ
రసకూటమను-మదిరకు వాచె మోవి
వసపడు నెట్లని వసరు-నవ్వాని
దురవస్థ జూచి-దుర్భరదుఃఖ మాచి
ధరణికి నెనయైన తరుణి యా భార్య
దరిసి మాటాడించు ధైర్యమ్ము లేక
తెఱఁ గేది దోపక-పొఱపుగాఁ దాల్మి
యల్లంత దూరంబునందుండి చూచు—
చల్లఁగాఁ బలుకరించఁగ నెంచు-సేవ
సలుపంగ నెంచు-నా జాల్మండు దాని
వల నొక్క-సారైన బఱపండు దృష్టి—
తనలోనె వాదించికొనునేమొ వాఁడు
తనలోనె భావించికొనునేమొ వాఁడు
తనలోనె యూరార్చికొనునేమొ వాఁడు
తనలోకమే భిన్నమయి-యన్న మన్న
కనులెత్తి వీక్షించి-గండరువట్లు

కనులు దించును గాని-కరము సాచండు
సలిలంబటన్న వెచ్చని యూర్పు గ్రమ్మి
చలియింపఁ గెమ్మోవి "చాలు చా లం"చు
నిరసించు-పిగ వీడి నిర్నిమేషముగఁ
బరికించు-రో పొత్తి బ్రదికియేగాని
దయ్యమై పట్టి-సంతతము నవ్వాని
డయ్యించుచున్నది-డగరంపు గొంటు-
గడచెను రెన్నాళ్ళ-కడి యంటలేదు
కడగండ్ల పుండరీకుఁడు దాని వలను
బోవంగఁ దలఁచుఁ దాఁ బోయిననైన
కావరించినయట్టి గణికాసవిత్రి
పైఁబడునే యంచుఁ బ్రాల్మాలు-దాని
యాబలలో వింత యంజనంబున్న
దలుపంబు పలుకు వేశ్య-పురాకృతంబు
చెలిమి గతించిన కలయయ్యె-పూత
సీరయ్యెఁ బసిడి-తిండికిఁగూడ నింట
భారమైనది-యెంత పనికత్తె గణిక!
ధనమూడ్చి-తిన్నని తనుపూడ్చి-తనదు
మనికార్చి తెగడె నిర్మాల్యమ్ము వోలె—
కప్పురంబసద్దాడియుప్పు చేకొన్న
చొప్పున-ధర్మైకశోభిని గృహిణి
తనకుఁగానిది గాఁగ-తానేమొ వార
వనితాస్వయంగ్రాహబద్ధుఁడై గడపె—
అడిదప్ప దాయింతి యాత్మధర్మంబు
నెడఁదలో నీ భావ మెనసి చలించెఁ
బుండరీకుఁడు-దన పొత్తి భాషింప
నండఁజేరిన-తాల్మి నల్లటుఁ జూచె
తనయింటఁ బారాడు తరుణేందుధరుఁడు

జనకుండు-గౌరికి నెనయైన తల్లి
యుస్సురుమని పోయి రోగైన తాను
దిస్సువారఁగ నవ్వు దీర్చి మొగాన
బరిహసించుచె గాని-పాప! మంచనఁడు
పరమాత్ముఁడగు తండ్రి పాదముద్రలకు
ననఁగని యిల్లు-త్రెప్పిన హారమట్టు
అనువు దప్పినది-యీ యనరు గప్పినది
వాని మొగంబుపై-పరి పరి విధుల
నాన బశ్చాత్తాప మాతఁడున్మాది—
సంజకెంజాయ పుష్కరమప్పినట్లు
కంజాక్షి-యా వారకాంత చిర్నగవు
భాసించు వాని భావనయందు-వెంట
నీనడించి మరల్చు నెదవాఁడు-మెఱుఁగు
నపి యున్న నేమి! పాషాణాన బసిడి—
మిన మినలాడు నమ్మేని క్రొంబూఁత
లెసలారుఁదలఁపులో-నెంతైన నేమి
విసమంటిన మధూళి-యసువులు బాచు—
నా పొత్తి నయ్యాట, లల దాని పలుకు
లాపెనఁకువలు-స్వయంగ్రాహసుఖము
లెలగాలిపోలిక నలనల్లనంటుఁ
దలఁపులు-లోన నాతఁడు దెప్పరిల్లు—
చూడలే దీ బాధ సుదతి-నిట్టూర్పు
గూడఁగఁ బుల్కు పుల్కున జూచు-వాఁడు
బలుకరించునొ యంచు-పరితప్తచిత్తుఁ
డల వాఁడు నిడుదకన్నులనెత్తి పలుకఁ
దలఁపఁడు-ముందటి తన వికారములు
దలఁచి లజ్జాసమాకలితుఁడై యుడువు
దాక్షిణ్యపూర్తి సదాచారమూర్తి

త్రిక్షణునకు బోడు తెలివికి వీడు
తన తండ్రి యుస్సురుమని పోయినాఁడు
దనపుణ్యములు శాపదగ్ధం బొనర్చి-
నెనరునఁ జెమటయే నెత్తురై తల్లి
తన దౌష్ట్యగాధ-చూచిన చూడనట్లు
మూరిబోయెడు నది ముగ్ధచిత్తమున
మూరిబోవాత్సల్యము-నితాంతదుఃఖ
సలిలావగాహ కశ్మలమూర్తి దాను
వలసవోయినది-పూవులతోటవంటి
యిల్లు పాడిల్లుగా-నిఱుగురువులకుఁ
దల్లడంబునుగూర్చి-తానేమొ-మంచు
కుంచంబులకుఁ దెచ్చి కొల్వంగఁ బూను
కొంచెగాఁడునుబోలె-కొమరుఁ బ్రాయంపు
వెలయాలి వలపేలఁ దలఁచె-వీడెల్లఁ
గలకల నవ్వంగఁ గట్టెలు మోసెఁ
బూవు లమ్మినచోటనే-వాపి దలఁగి
యావిద్య లన్నియు నారకూటమున
మాటిన మణులయ్యె-మాటయు మనువు
నేటి పాలయ్యె నిం కెక్కడి బ్రదుకు!
తలపోత బెదరి కన్నులు మూయు వాఁడు
పలపలఁ దొరఁగు బాష్పములతో-గౌరి
కెనయైన దన తల్లి యనువుగా నిలచి
పనవినట్టులు దోచు-బ్రమసి కన్దెఱచు——
ఖండేందుధరు ననుగలమైన తండ్రి
యండను నిల్చి నీవా! యెట్లు చెడిపె
పైతివన్నట్లౌను-నా భావభరము
నాతలఁ ద్రోవ-భార్యను జూచు వాఁడు-
ఆమెకన్నులు "ధర్మమా! యిది నీకు

సామేను గద భార్య-చర్చింపఁ బురుష
సంగంబులో-నట్టి నాకుఁ గన్గప్పి
భంగించి-కాసున్నపలుచలకెల్ల
ఘంటాపథంబైన కదసానివెంట
నంటి, ధర్మేతరంబైనట్టి సుఖము
ననుభవింపఁగ నన్న యటౌను-వగలు
గొనసాఁగి పుండరీకుఁడు-మ్రోము హస్త
తలఫలకంబున నిలిపి నీరారు
తెలికన్నుఁగవలతో-తెక తెక నుడుకు-
దినదినమ్మును గ్రొత్త తీరుగా వంత
మన మెరియించె-చిక్కని వెలసాని
పైనున్న వలపెల్ల పలపల నయ్యె
దాని దుర్భావంబు-దాని పేరాస
దాని టక్కులు-దాని తతిగొన్న వగలు
కాని వాపులు డోచెఁ గవరఁగా-నపుడు
దనయాలి మేనియందము చందమెడఁదఁ
గనుపట్టఁ దొడఁగె నిక్కపు రూపుతోడ-
గవుసెన యూడ్చి-ప్రక్షాళితంబైన
నవరని ముకురంబున వలె—నా వెలఁది
పలికిన జాలు దెప్పరమైన తావి
కులుకు కస్తురివీణె గోసిన కరణి—
కెరలి యావిడ గటాక్షించిన జాలు
విరవాది పొట్లంబు విడిచినమాడ్కి-
యాపెకట్టెదుటఁ బారాడిన జాలు
కైపెక్కి కార్మొగుల్ గదలాడినట్టు
లాపుండరీకున-కాత్మనిష్ఠమ్ము
లేపున దులకించు నెల్ల భావములు—
తల్లిదండ్రులు లేక-తన మనుగడకె

యొల్లఁబోయెను కాంతు-లూర్పులు పెదవి
పదను దలంగించెఁ బ్రతినిమేషమ్ము
ముదమేది పారాడు పుండరీకునకు—
కోరి ముప్పదిమూఁడు కోట్ల దేవతలు
తారసిల్లి యఖండ దయఁబూని యింట
నిలచినగాని-కన్నులనిండ దీవె
నలతోడ నడుగడ్డునను-సుధా ధార
గురియించి-వాత్సల్యభరము గుప్పించి
వెరవాఱఁ దన్నోమ్ము పితృదైవమునకు
సరియౌదురే! పూజ సలుపనేగాని
కరుణ జూపింపరు కలుగు నిర్జరులు—
పూజాదికమ్ముల పోరామి లేక
సాజంబుగా, దయాఽఽచరణుండు దండ్రి—
యరకాసు సేయని యట్టి నాకమ్ము
కరమర్థితో నివ్వఁ గలరేమొ గాని—
మలినంబుగాని బ్రహ్మానందసుఖము
కొలఁదులే యివ్వంగఁ గోటి దేవతలు!
వారె నోచనియట్టి పరమ సుఖమ్ము
నేరుతురే! భక్తనివహంబు కిడగ!
జనకపాదుఁడు దన చరణనీరేజ
జనిత ధరాధూళి చమరిన యంత
నదె వత్తు 'నిదెవత్తు' ననుచుఁ బేరెముగ
మది గదియించి బ్రహ్మానంద లక్ష్మి
పితృభక్తుఁ డైనట్టి సుతుని గట్టెదుట
నతిసేసి నిరతంబు నట్టువుల్ ద్రొక్కు—
పదివేల యేడులు బాటిగాఁ బూని
మదిని గామాదుల మద ముడిగించి
యా త్రిమూర్తుల మెప్పు లందగా నంది

ధాత్రిని జరియించు ధర్మదేవతలు
పరమర్షు లశ్రాంతభావుఁడై, తండ్రి
చరణముల్గడుగు నిశ్చల ధర్మమూర్తి
యగునట్టి సుతుఁడొక్కఁ డవనిపై గలుగ
నగుబాటు లేదంచు నా తపోమయుని
వరపుడ యొనరింత్రు-బ్రహ్మాదులెల్లఁ
గురియింత్రు వానిపై గోటి వరమ్ము—
లేయుపాయమ్మున నేమి కోపమ్ము
బాయగిల్లగఁ జేసి-పరదైవతముల
తాతపాదులఁదెచ్చి-దత్తాఽవధాన
చేతస్కుఁడై-సేవ జేసి తరింప
వలెనంచుఁ గాంక్షించె భావంబునందుఁ
బొలుపారఁ బుణ్యంబు పుండరీకుండు—
తనపత్ని నీక్షించి తరుణాఽనురాగ
వినిహిత చిత్తుఁడై విగళితాఽజ్ఞానుఁ
డా పుండరీకుఁ డిట్లనియె "పొలంతి!
చేపడు మోక్షమ్ము-సిద్ధాన్నమట్టి
తల్లిదండ్రుల సేవ నొల్లమి సేసి
యుల్లంబులోన విద్యుల్లతాచపల
మైనట్టి వెలయాలి యరులు చేపట్టి
ప్రాణమై-నను గొల్చు-పరమ పవిత్ర
మైన నీహృదయంబు 'నచ్చనపుచ్చి
కాననివాఁడనై-కడగండ్లువోయి
తిని-నేఁడు కడకు విచ్చినది యీ యెఱుక—
తనుమధ్య! యెటులైనఁ దలిదండ్రులింట
మఱివచ్చి-దేవిదేవరవోలెఁ దృప్తి
వఱపులైఁ బారాడవలె-నంతవఱకు
నన్నమిందదు నాకుఁ గన్నెర్గి వారి

మన్నన గొనివత్తు-మఱలి నేవత్తు
వారాణసీపురి వారుందు రంచు
ధీరహృదయ నీకుఁ దెలియునే గదవె
పోయివత్తున! తాల్మి బూని యొకంత
పాయక యీ గృహవ్యవహార మెల్ల
సరిదిద్దుకొని-నాదు విరహంబు సైచి
పరమార్థ మెంచి-డెప్పర మనుకొనక
యుండుము పిలుగుల నోర్చినా వెన్నొ
ఖండేందుఫాల! యీ కొసంత తాల్మి
ధరియించి నను దేర్పు నఱసేయ కనిన
నరవిరి బాగులై దరహాసభరము
పెదవి దొల్కాడ నవ్వేలఁది వచించె
"సదమలభావ! నా సర్వంబు నీవు
నీయాన బాలింప నేర్చుటకన్న
నాయాన పుణ్యంబు నాకు వే ఱెద్ది!
యత్తమామల చరణాంబుజములకు
నత్తమిల్లెడుపుణ్యమదినాకుఁగలుగ
వలదందునే! భక్తివశుఁడౌచుఁగోర్కె-
లలరింపుగా నిచ్చు నబ్జ కోటీరు
మలిరూపుగాదె! మా మామయ్యగారు!
చలిమలకూతురే జగతికి దిగిన
చందంబు మీ తల్లి సందేహమేల!
తొందరగాఁ బోయి తోకొనిరందు
వారల-నీయింట వారుండనైనఁ
గోరికతోఁ బదికోట్ల దేవతలు
మనతోడ నున్నట్లె-మనుగడ సఫల
తనుజెందివట్లె సత్యంబుగాఁ జూడ"
నినిన నాతన్వంగి నలవడఁ జూచి

కనుల సమ్మోదమ్ము గాలువ ల్గాఁగఁ
బుండరీకుఁడు-దన రెండు బాహువులు
నిండుగా జాచి పెన్నిధిని గన్నట్టు
లిఱి కౌగిలించినఁ దరుణి మేనెల్ల
గిరికొన్న పులకలై గిలకిల నవ్వె—
నాపుండరీకుని యంగంబులెల్ల
నాపోయె నమృతంబునం దోలలాడి
తెలతెల్లవాఱె-చీకటులల్ల జాఱె
మలయమారుతయాన మధురిమల్ మీఱె
దెసలఁ దెల్వులు సేరె-నసమెత్తి యొడలు
విస విస జాడించి-బిరుసుగా నీల్గి
చాలింక మాన్మథ సంగరంబనుచుఁ
దాలిమివో ధర్మదారలు వట్టెఁ
కొక్కొరో కో! యని కుక్కుటవ్రజము—
దిక్కు-డుంగమ్ములు దిగ్గురు మనఁగఁ
గంచు గీసినగతి ఖగగణంబులును
మించి యెలుంగించె-మింటిపై నేగ
దొరకొన్న దినరాజు నరదంబునందుఁ
గరడులు గొని ఘంటికలు మ్రోపినట్లు—
తమ్మితావులు విచ్చెఁ-దమకంబు హెచ్చెఁ
గ్రమ్మ తుమ్మెదలకుఁ-గడసారి గాఁగ
జిపిధాతు తాత్పర్య మెసగించి పంపఁ
గుసిగుంపులుగఁ గాముకులు-మోవి సొబగు
గరువంబుపెడఁ గండ్లు-గాటుక ల్పెదర
విరులు పీడంగఁ గ్రొవ్వెదజాఱ-నదియు
నందమై-నడపాడె నప్సరోగణము
చందమై-పణ్యయోషాకదంబమ్ము—
బుద్ధి మళ్ళినయట్టి పుండరీకుండు

దద్దయు భక్తి సంధ్యావందనాది
క్రియలెల్లఁ దీర్చి-పర్విన నిష్ఠ నింట
నయముగా వేదమంత్రములు వల్లించె—
శారదాకంకణస్వనములే-పదుపు
గూరెను బుండరీకుని గాత్రవీణ—
పుండరీకునిభార్య మోదబాష్పములు
నిండిన కనులతో నిజవిభుఁ జూచు
నా పొల్తి వీక్షించు నతఁడు ధర్మమ్ము
రూపెత్తినట్లు-నిరూపించి మార్పు—
లోహదండపురంబులోని జనమ్ము
దోహలితాశ్చర్యధూతమానసులు—
"మాఱినాఁడీవంశమందనుండింకఁ
బూరించుఁ దపము సర్వజగమ్ము నందు
నీతనికోసము వేదవితతి కోటీర
వితతాంఘ్రియుగుఁడైన విష్టరశ్రవుఁడు
దమి మీఱ నూత్నవేషము దాల్చి-భువన
కమనీయములు గ్రొత్త గాథలు గూర్చి
నిలుచుఁబో వైకుంఠనిలయంబు విడచి
తలడింప నఘము మధ్యమలోకమందు"
నను దేవవాక్యంబు లభ్రంబునందు
ననుపమంబగు రీతి నా గుబ్బు గొనియె—
తండిరి-విజ్ఞానధనదుని దేగఁ
బుండరీకుం డంతఁ బోవంగ నెంచి
చెలువకు బుద్ధులు సెప్పి-సాయంబు
నలుపంగఁ దగువారిఁ జర్చించి నిలిపి
వేగవత్తు నటంచు వెలఁది నూరార్చి
తాఁ గడుకొని, కొని, దారిబత్తెంబు—
ననుకూలదినమున నటు ప్రయాణించె

జనకదర్శనభాగ్యసమ్మోదితమ్ము
మన మనుక్షణము-పేరణము సూపంగ___
వనజాయతాక్షి-పావనవృత్తి-మగని
తెన్నులే సూచుచుఁ గన్నుల నిండఁ
గొన్నట్టి కోర్కెలై-కోమలి యుండె___
పుణ్యంబు పండిన పుండరీకుండు
గణ్యతైర్థిక జనగ్రామంబుతోడ
దినమున కొక కొంత తేకువ నడచు
చును-దారివెంటల శోభిల్లు సత్ర
ముల సేదదేరుచు-ముచ్చటించుచును
గొలఁది మాసములకుఁ గొఱ నెలతాల్పు
కైవల్య ధామంబు-భావనాతీత
మావిష్కృతానంద-మస్తమితాత్మ
భవగర్వభారంబు-ప్రమథమండితము
శివరూపమైనట్టి చిత్కాశ వెలుఁగు
వారణాసీపుర ప్రాంతమ్ము సేరె___
నూరివెల్పల నున్న యొక సత్రమున
విడిసి-దైవికకార్యవిధులెల్లఁ దీర్చి
కడుకొని యా రేయి గడపి యచ్చటనె
బోదమటంచును బుద్ధి జనింప
సాదమొందఁగ శ్రమ-శయనించి యుండె
శయనించుటే గాని సరసకు రాదు
దయలేని నిద్ర-నితాంతమ్ముఁ గుపిత
యైన నాయక వలె-నహరహస్తప్త
మానసునకు-నిద్ర-కేనాటి వావి'
యఱనిసి దరిసె ఘూకావళీకంఠ
పరుషహుంకార నిస్వానము ల్సెలఁగె-
బ్రహ్మరాక్షస వేదపాఠన పఠన

జిహ్మగధ్వనులు-చెచ్చెఱ పెచ్చు పెరిగె—
ప్రమథనాయక వీరభద్రాఽట్టహాస
ఘుమ ఘుమితము లయ్యెఁ గూలంకషములు-
చండీశతాండవోద్దండవేతాళ
తండు తమ్మట వాద్యధంధణ ల్విరిసె-
నాయవసరమున నల్లంత మేర
ప్రాయంబు నలిగిన పడఁతులు మూవు
రరుదెంచి రతి వికలాంగము ల్గల్గి—
కలకుచూపులు-కండకన్నులు-కళలు
దఱికిన పెదవులు-తప్పెట మొగము 95
లిఱిపిన చెవులు-గ్రిక్కిఱిసిన కురులు—
యల మృత్యుదేవి వాహ్యాళికై వెడలఁ
బెళపెళ నినదించు బిగువు నవ్వులను
పలఖండపూగీవిభాసితంబైన
ఫలితకీకస సుధాబంధురంబైన
కాళంజిధరియించు-కలకలధ్వాన
చాలితాళలు-వయస్యలవంటి వారు-
బండిచక్రమ్ములఁ బగటించు వారి
దండిదన్నులు-నిండు దంష్ట్రిలు-కాల
పూరుషశంఖముల్ బోలు కంఠములు
దారుణ హాసముల్-ధైర్యమ్ము గలఁచు
జఘనకూటమ్ములు-సంతవాకిళుల
విఘటించు నెదలు-దా వీక్షించి-పుండ
రీకుఁడు-ధైర్యంబు ప్రిదిలిన-వీఁక
నాకట్టి-పూర్వపుణ్యములు గల్గినను
బ్రదుకు కద్దీనాఁడు-బాపిన బాయు
నద వద లేటికంచెద నిశ్చయించి
గమనించు చుండె-నా కాంతలు మూగు

రమిత మాలిన్యవీక్షాఽశక్యమైన
యాననంబులతోడ నల్లంత నున్న
మానితంబగు నొక్క మౌనియాశ్రమము
సేరుచు-వినయసంశ్రితరీతి-మ్రొక్క-
దీరిచి రటనున్న దివ్యతాపసున
కాతఁడు మందమౌ హాసమ్ముతోడ
నాతతంబగు దయ నాశీర్వదించె-
అంతట నా మూవు రత్యంత మోద
దంతురితాశయల్-దడయక యచటఁ
బరిచర్య లొనరింప దొరకొని రొకతె
పరక సేపట్టి యూడ్వఁదొడంగె-నొకతె
కడివల్చుగందంపుఁ గలయంపిఁ జల్లె
నుడుగక మూఁడవ యువిద యందంబు
లత్తమిల్లఁగ ముగ్గు లందందఁ దీర్చెఁ
జిత్తరువెనయంపఁ జేతిలో మెలఁపు-
వారివికారముల్ వారింపఁబడియె
దారున నొక్క మంత్రముచేతఁ బోలె
నంతట నామూవు రలతి నవ్వులను
దంతురితములు బెదవులు-గర్ణములఁ
జొరఁబాఱు గన్నులు-సోగ చూపులను
గరమరుదైన మొగంబులు-బటువు
లైనట్టి జఘనంబు-లన్నువ నడుము
లా నీలమృదుల కైశ్యములు-సర్వాంగ
విస్తారి లావణ్య విభవంబు-కాంతి
నిస్తులకుచములు-నీరేజములకు
నన్నదమ్ములు వోనియట్టి పాదమ్ము
లన్ను గ్రమ్మించెడు నంచలఁ నడలు
నైదోప-నెడఁద మహాశ్చర్యమునను

బూదోట పోలికఁ బులికింప-వెంట
మొల్ల మై భక్తి వల్లిల్లఁగా-నొడలు
జల్లన-బాష్పముల్ జల జల రాల
బుడ బుడ బరువెత్తి పుండరీకుండు
కడు వేగమున వారి యడుగుల శిరము
మోపి-తాత్పర్యమ్ము సూపి-యాశ్చర్య
మో పుణ్యవతులార! యోరంత ప్రొద్దు
నుండి-మీవృత్తంబు నుల్లంబు సేర్చి
గండారపుం బొమ్మ కరణినై కంటి-
నతి వికారములైన యాకృతు ల్గల్గి
యతివలు వచ్చు టె ట్లంతలోపలనె
సురుచిరరూప సుందరు లగు టెట్టు!
లరుదయ్యె నమ్మ! మీ దైనవృత్తమ్ము
ధరణిపై నసివాఱు జరియింపవచ్చు
తెఱఁగైన తెఱగంటి తెఱవలా! మీరు!
పరమేష్ఠి దివ్యభావన-రూపమెత్తి
పరితృప్తి నడపాడు భంగులా! మీరు!
మదనుండు శాంబరీమంత్రమ్ముచేతఁ
బదను గూర్చినయట్టి ప్రమదలా! మీరు!
రతిదేవి మదనసంభ్రమహాసమునకుఁ '
బ్రతికృతులైనట్టి వడువులా! మీరు
శ్రీ విశ్వనాథుని చెంగట వెలుఁగు
దీవియ లలవోక దివ్యరూపములు
ధరియించి మెలపాడు కరణులా! మీరు!
తరుణులారా! నాకుఁ దగఁజెప్పరమ్మ!
యీ యాశ్రమంబేది! యిందుండునట్టి
యాయతతేజు దివ్యాఽభిధానంబు
దెలుపంగఁ గూడునో! దివ్యులా మీర

లల మౌనిసేవ సేయఁగ హేతువేమి?
దేవతాప్రమదలౌ మీ వికారములు
ద్రోవంగఁ దా నెట్టి దొడ్డ తపమ్ము
సలిపెనో! యా యోగి తెలుపరేమమ్మ!
కలుముల చెలికి హెగ్గడికత్తెలార!
యనవుడు నవ్వాని నలుగంట జూచి
తనుపారు దరహాసధాళధళ్యములు
గ్రొన్నురువులకాంతి గుస్తరింపంగఁ—
బ్రన్ననౌ చూపులు, పారాడు వాలు
గలజాలు బురుడింప-కమ్రకపోల
తల కాంతి పగడాల తళుకులు జిమ్మ—
నెత్తమ్మి మొగడల పొత్తులౌ-కుదురు
గుత్తంపుఁ జన్నులు గున గున లాడ
మూవురయం దొక్క ముద్దియ పలికె-
"కావరమాచి-చిక్కని వంశగౌర
వము ద్రోచి-యిల్లాలివలపుల రోసి
క్రమహీనమైనట్టి గణికావిలాస
ముల నాచి-తల్లిదండ్రులఁ దెగఁ ద్రోసి
పలుగాకిపైనట్టి బ్రాహ్మణబ్రువుఁడ!
యడగితిగాక మా యాత్మవృత్తంబు
నుడివెద విను మిఁకనుండియే గాని
తలఁగుము పాపవర్తన, మటు సూడు
మలసాలసాలోల చలితకటాక్ష
పరమ సుందరమూర్తి, వ్రజవల్లభునకు
నెరవాలు నెచ్చెలి-తరుణార్కదుహిత
శమనుసోదరి యాపె-సరసాంగయష్టి
యమునా తరంగిణి-యటువైపు గనుము
లలిత లజ్జాభంగచుళుకితాపాంగి

వలనుగా బంగారువన్నె పుట్టంబు
గట్టిన యది-హేమగర్భునికైన
పట్టంపురాణి-భావాంబరాలోల
రసికతామూర్తి సరస్వతి యాపె—
తనుకు లే లింక సత్యము నేను గంగ—
మూఁడు లోకమ్ముల మ్రొక్కు లందంగఁ
గూడిన పావిత్ర్యగుణ మగ్గలించి
మా మువ్వురకునైన మాన్యుడౌ సుమ్ము
ధీమహితుం డిందుఁ దీరిన మౌని
ప్రతిదినమ్మును దమ పాపముల్దలఁగు
మతిబూని-వేలాది మర్త్యులు-మమ్ము
దరిసి తానములాడి-తరలెడుదాన
భరియింప బరువైన వారిపాపములఁ
గూరును-మా కిట్టి ఘోర రూపమ్ము—
లారూపముల బాఁచి-యచ్చంబులైన
మారూపములఁ జెంద మౌనియాశ్రమము
సేరి-యీ సేవలు పేతుము మేము—
పోయివత్తుము నీదు పూర్వపుణ్యమున
బాయక మాదు రూపమ్ములు జూడఁ
గంటి వటంచు నా కాంతలు-కమరు
గంటలు మ్రోయంగ-కరకుశేశయము
లందుఁ గంకణము లానందలాస్యంబు
జిందింపఁ-బెదవులఁ జిఱునవ్వు లొలుక
యలవోక నేగు రాయంచలదైన
చెలువంబు గులుకఁ, బుష్పితము లైనట్టి
జంగమలతలట్లు సాఁగిపోయినను—
పొంగులువో భక్తి పుండరీకుండు
కరములు మోడ్చి-యా కాంతలు చన్న

హరిదంతరంబుల కటు నంజలించి
కన్నుల నానంద కమలంబు లుబుక
దిన్నఁగా సరుదెంచి- తెలవాఱువెనుక
నా మౌని దరిసించి-యాతని వృత్త
మేమొ! యెఱుంగ నూహించుచు-తల్ప
మున మేను సేర్చి యుండిన-నంతలోన
మనములు జిగురింప-మాలేయ గంధ
వాహముల్ వెదచల్లె-పరితస్సుగంధ
దోహలై లా రజోధూళిచయంబు-
చూడఁ జూడఁగఁ దోచె సూర్యుండు-జగతి
చూడంబుపై నొక్క- సూసకంబట్లు
బ్రొద్దువోవక మున్నఁ బుండరీకుండు
దద్దయునాసక్తిఁ దల్పంబువిడచి
కాలకృత్యంబులు గడువడిదీర్చి
వేళాను గుణసాంధ్య విధియొనరించి
శరదిందు కోటీరచంద్రికాస్తబక
పరిహృతభక్త తాపమహాగదునకు
గౌరీ ధవునకు-నిష్కలుషమౌభక్తి
పేరెముల్వారంగ వినుతు లొనర్చి
మునియాశ్రమముసేరి-ముక్తిసుఖమ్ము
గొనకొని కరిగట్టు కొన్నట్టులున్న
యా మహితుని గాంచి-యఞ్జలియందు
తామరతంపరై తనువునయందు
వినయంబుదట్టాడ-విధియుతంబుగను
దనగోత్ర మెఱిఁగించి-తలవంచిమ్రొక్కి-
నిలచిన-నామౌని-యెలనవ్వుగనుల
నిలువంగవీక్షించి-వెలయాలి వలపు
గడచెనా? పితరులఁగడగంటఁజూడఁ

బోడమె నాచిత్తంబు? పుణ్యంపుఁ బ్రోవు
సతితోడి సంగతి సహ్యమయ్యెనొ? వి
తతవిద్యల ఫలంబు దట్టెనో మదికి!
రారమ్మటంచుఁ గరమ్ములఁ దాచి
యేరాళముగ వాని నిఱిగౌగిలించి
యొకయాసనమ్మున నుపవిష్టుఁ జేసి
మొకమున నాదరంబులు తొంగలింప—
నుండిన, గరుపాఱి పుండరీకుండు
నిండినభక్తిఁ దానిత్యంబు గొలుచు
శశిశేఖరుఁడు దయసన్నిధి సేసి
వశుఁడౌచుఁ గూర్చున్న వడువున నున్న
పరమర్షిఁ జూచి యాపగిది భాషించె—
నరుల పాపమ్ములు నాశమ్మొనర్చు
దివ్యస్రవంతులు దినమును వచ్చి
యవ్యయమంగళాఽఽయతనమైనట్టి
మీ పదంబులుగొల్చి-మెయికొన్నభక్తి
పాపంపు రూపుల బ్రాచిఁ బోఁద్రోచి
తమరూపములు దాల్చి తరలుటే గంటి
శమనిధి! మీ తపస్యావరివస్య
కై-దేవతలు పడిగాపులుగాయ
నాదేమిభ్రాంతి! విజ్ఞానహీనునిది
మీరన్నయట్టులే మితిమీఱుకామ
భారంబుగను గప్పి-కంపలఁబడ్డ
కాకినై-నేటికిఁ గన్నులు దెఱచి
శ్రీకరులైనట్టి శివరూపులైన
పితరులఁగొనిపోవ వెడలివచ్చితిని
తతితోడ మీదగు దరిసెనంబబ్బె
నాయఘమ్ములు నేఁడు పాయంగఁ గలిగె

మాయని యజ్ఞానమాలిన్యమత్త
మిల్లె-ధన్యుఁడనైతి నుల్లంబునందు
నల్లన నొక కోర్కె-యావిర్భవించె.
మనవి సేతున "యన్న మౌనివతంసుఁ
డను పమంబగు కూర్మియాగుబ్బుగొనఁగ
సందేహమేల స్వేచ్ఛగఁ జెప్పవన్న!
విందును వీనుల విందుగా నన్నుఁ
గరములు జోడించి-కన్నులయందుఁ
బొరలంగ బాష్పముల్ పుండరీకుండు—
పలికె-తావక నామ భాగ్యంబునోచి
ఫలిత జన్మములైన వర్ణమ్ము లేవి?
ఏకాలముననైన నేమహాపుణ్య
రేకృత్యముననైన నెనగంగఁబొంద
గారాని యేత్తైఱ గలిగె మీకెట్లు!
కారుణ్యమునఁ జెప్పఁగాఁ దగు నన్న
నామౌని శిరమల్ల నంకించి-కనులఁ
గామితంబులు చల్లు కల్పశాఖికలు—
నల్లని చూపులు త్రుళ్ళింతలాఁడ
మెల్లన వచియించె మేదినీసురుఁడఁ
పేరేమి వెట్టిన పేర్మిదానేమి!
ఒరొక్కటేగాక తెలివికి గుఱుతు—
ఒక్కటుండంచు వాకొందురు నన్ను
ఒక్కారణంబున నీయభిధాన
మునరెనో! యే నెఱుంగను-నాయొనర్చు
ఘనతపంబేమని గలదువర్ణింప!
న్ని వేదంబులు నన్ని శాస్త్రంబు
న్ని నయాదైవ, మేలోకమందు
న్నాఁడొ: వానికేనొక్కసారైన

కన్నడించుచెగాని-కై మోడ్చియెఱుఁగ—
కాశి, కైవల్యవారాశి యటంచుఁ
గాశి ధిక్కృత పాపరాశియటంచుఁ—
గాశి ముక్త్యంగనా కర్ణపూరంబు
కాశి విశ్వేశుని గాదిలియనుచు
బహుపురాణంబులు వర్ణింపనైన
విహితధర్మలు వేనవేలకు యాత్రి
కులు-దినంబును గోరి కోరి దర్శనము
సలుపంగ నీ త్రోవఁ జనుచునేయున్న
నొక్కసారైన నాయుల్లంబునందుఁ
దక్కనియాకాశి దరిసింపఁ దలపఁ
విశ్వనాథుండెట్టి విధమునవాఁడొ!—
విశ్వేశ్వరి-భవాని-వెలసినవడువు
దానెట్టిదో! లేశమై ననేనెఱుఁగ—
నానెమ్మనంబు నిత్యానందమందుఁ
దేలించి-పాలించు దివ్యదైవములు
మ్రోలనే గలరట! ముక్కోటిదేవ
తలతోడ నాకేమి కెలసంబు! నరుఁడు
జలజంబు విడచి నత్తల నేటికోనునె!
యన్నంతహృదయంబునందు నచ్చెరువు
వెన్నడింపగ, మౌని విభుతోడఁబలికెఁ
బుండరీకుఁడు - "మీరు ముప్రొద్దుఁ గొలుచు
దండిదైవతములు దామెట్టివారొ!
యరయంగవచ్చునే! "యంచు, నాక్షణమ
యరమర లేటికి! యవసరంబిపుడ
రమ్మంచుఁ జివ్వున నమ్మునిలేప
నమ్ముని వెనువెంటనరిగెనుపుండ
రీకుఁడు-మోదంబు-ప్రిదులునుల్లంబు

నాకట్టి నాశ్రమాభ్యంతరమ్మునకు—
నటవోవనొక్కటనతి వృద్ధులగుట
గిట గిట నై చూపు-క్రిప్పి బలమ్ము
కేవలమాత్మజు సేవలతోన
భావంబు తనుపంగబ్రదుకుచునున్న
వారి-పంచాక్షరీ పరనైక పరుల
దారితాఘులఁ దల్లిదండ్రులఁజూపి—
యనియెఁగుక్కుట మహాముని-వీరెచూడు
మనఘ! నాచేయు నత్యనుపమతపము
వీరెనాదైవంబు-వీరెకైవల్య
సారంబు-సకలశాస్త్రజ్ఞత-విశ్వ
నాథునిరూప-మ్మనంతపుణ్యమ్ము
చైతన్యమును దాల్చిచరియించువడువు—
వీరిసేవలతోన, విశ్వంబుమఱచి
యోరంత ప్రొద్దు శరీరంబుమఱచి
యుందునుగాని వేఱొక్క మంత్రంబు
పందెంబునకునై నబతియింపనేర!
వీరి పల్కులె నాకువిమలవేదములు
వీరిచూపులు సముద్వేలకైవల్య
వారాశి భంగముల్ వీరిసాన్నిధ్య
మారాజకోటీర సంకంబు-వీరి
చరణపద్మమ్ము లేసకలమ్ము నాకు"
భరమైన భక్తితోవలగొంచువారి
కాకుక్కుటుండనె నమరాఽఽపగాఽది
లోకదుర్లభ, దేవలోకంబు నన్నుఁ
గొలుచుట-నాతపస్సులమెచ్చికాదు—
తలపైని నీదేవతలరజో భరము
ధరియించుదాననే-తల్లిదండ్రులకు

వరవుడ యొనరించువానిక ప్రాప్య
మైనట్టిసుఖమేది! యఖిల దేవతలు
వానిడాకాలిసేవకులు-కై వల్య
మవ్వాని కింటిలోనాపు-విజ్ఞాన
మవ్వానికడఁగంట నాడెడుచెలువ
పుండరీకా! భూమిఁబుట్టి తానేమి!
చండించివెల యాలిసరసమ్ము నమ్మి—
కులదైవములు పితరులవెళ్ళనూకి
పలవల విజ్ఞాన వాదమొనర్తు;
పోపొమ్ము! నీతండ్రిపుణ్య లోకముల
దీపంబు-తను వెత్తిదీపించు శివుఁడు
కమనీయమణికర్ణికాఘట్టమందు
శ్రమమేదునొక్క-యశ్వత్థంపునీడఁ
బొడవు తెప్పలతోడి పెడఁదలొకనులు
గడుపూన్కి బొమ్మలనడుమఁ గీల్కొల్పి—
సెలవులయందుఁ గ్రొన్నెల వెన్నెలలను
గిలుబాడు చిఱునవ్వవెలఁది గాఁగాయ—
తాను గూర్చున్నాఁడు దపములోమునిఁగి
ధీనిధి! యామౌనియూనిన దీక్ష
తనకొఱకై గాదు-తనయుఁడై పుట్టి
వినయంబుదొలిఁచి-వేవేలపోకలను
మరగిన నీబుద్ధిమాన్చెడుకొఱకు—
పరమేశ్వరునితోన భాసిల్లుగౌరి
నీమాత-యతని సాన్నిధ్యమందునవె
శ్రీమహితంబుగాఁ జెలఁగుచున్నదియు—
విడచితివేగాక పెడదారిఁబట్టి
విడచునే! వారలవిశ్వనాథుండు"—
కుక్కుటఋషియన్నయొక్కొక్కమాట

యొక్కొక్క శూలమైయుల్లంబుకుదుప
నాతని పితరుల కాతతభక్తి
సాతత్యమనువొంద సాష్టాంగ మెఱఁగి
కుక్కుటునకువలగొని పడఁబాఱెఁ
బొక్కుచు మదిలోనఁ బుండరీకుండు
వారాణసీమార్గవర్తియై-తండ్రిఁ
జేరెడు పఱికింక దీరునేవెతలు!
కాశి ప్రవేశించి-కనపడ్డదారి
నాసతోఁ బ్రశ్నించి-యటునిటుదిరిగి
మణికర్ణి కాఘట్టమునుజేరి-కుక్కు
టుని పల్కు బడిఁగనుగొనెతాతపాదు
నాతనిసవిధంబునందె గూర్చున్న
సతిఁదనతల్లి-విశ్రాంతిధామమ్ము—
పులకలుదనువెల్లఁ దిలకంబులొత్త
జలజలగనుల బాష్పములురాలంగ
కడువడి నెదయెల్లఁ గంపనంబొందఁ
దడఁబడుచుండఁ బాదమ్ములు-పుండ
రీకుఁడు పెనగొన్న శోకంబు-నళుకు
నాకట్టుజంకు-నాహ్లాదంబు—లజ్జ
పదివేల భావముల్ ప్రామకొనంగ
మదినెల్ల—పేయనే మార్గంబుదోప
కటునిటు దిరుగ—సాత్యకిగమనించి
పుట పుటనై యున్న పోలికజూచి
తనసుతుండే' యన్నతలఁపులోఁగలిగి
చనవునఁ జేరఁబిల్చిన—పరువెత్తి
శిరమంటమ్రొక్కి "నాదురుసుతనమ్ము
మఱచి—నాసేమమ్ముమదినిచ్చగించి
తిరిగి రావలెమీరు—దేవి, దేవరయు

విరుల పాన్పునఁ బెట్టివరవుడిదీర్తు—
గడచిన కతలెల్లఁగదుపఁబోకమ్మ!
యెద చెఱుపై పోవు"-నింతలోఁగనులు
దెఱచె జహ్నుఁడు తపోదీక్షచాలించి
ధరణిపై దేహంబుదాల్చినయెఱుక—
కనులు విప్పినతోన గడువడినేగి
జనకుపాదమ్ములు జడిగొనదడిపి
పొదివి-యాలోననఁబుండరీకుండు
మదిఁగూడఁ దెచ్చి యీమాడ్కి బ్రార్థించె-
జనకరూపంబెత్తి సాక్షాత్కరించి
నను దనియించెడి నాగకోటీర!
యాకాశమున కన్ననతి విపులమ్ము
నీకై వడిగ్రహింపలేక-సామాన్య
మానవబుద్ధితో మదితీరుదలఁగి
కానని కన్నులఁ గామమ్ము గప్పి
వెడఁగనై వేవేల విధులఁబోయితిని
విడిముడి కొఱకునై వెలయాలఁజిలుఁగు
నవ్వులునవ్వ-మానంబుడివుచ్చి
యవ్వేలంది మెఱుంగులామతించుచును
శిరసుండమో కాలసేసలు వెట్టు
బరవిడి-మిమ్మునొప్పరికించి' దాని
చరణ లాక్షారాగ భరితమైబ్రదుకు
పఱచనైతిని–నేఁడుభావమ్ముమాఱె
పితరుల కన్నను పేఱెద్దిలేదు
బ్రతుకు దీర్పఁగ-మోక్షపదవినివ్వ
నాచేసినట్టి యన్యాయముల్మఱచి
నాచేతి సేవలనందికో దలఁచి
రండు! దేవతలార! రహిగుల్కమీరు

పుండరీకుండింక పుట్టువుమాతె
నదియొకజన్మ, మాయాఽధీనమలిన
మిదియొక్క జన్మ, సమీహిత ధర్మ
మనియేడ్చికొని చెప్పునా పుండరీకుఁ
గనులారఁజూచి-పొంగినదయాభావ
మునవవ్విజహ్నునిట్లనె 'మార్గమధ్య
మున—కుక్కుటుని దపోమూర్తిజూచితివా!
యామహితునియట్టులని తరసాధ్య
మౌ—మహత్త్వము నీవునందంగ వలయు
పదము! పోదమునేఁడ భవ్యమైనట్టి
పదముజెందఁగనీకుఁ బ్రాతియేమన్న!
యని పల్కనాతండ్రి కంజలించుచును
జనని పాదములకు సమ్మతిమ్రొక్కి—
శ్రీవిశ్వనాథునిఁ జేరివందించి
యావిధుశేఖరు ననుగులంబైన
శ్రీవిశాలాక్షికిఁ జేయెత్తిఁ మొక్కి
భావజాంతకు జటావాటికినెక్కు
వగలు గల్గినదేవవాహిని కెఱఁగి
బిగువు నవ్వులతోన-పృథు పాపములను
గడగడనడకించు కటికంటివాని
పడిగాపు—శ్రీవీరభద్రుని గొలిచి
తక్కదేవతలకు దండంబువెట్టి
నెక్కొన్న భక్తితోనిలువెల్లవడఁక
నందలంబునయందు నాతల్లిఁదండ్రి
నందంబుగానుంచి-యతివినయమున
నడచెను-పుండరీకుఁడు వారితోన
యొడలు దాల్చినభక్తి నడచినయట్లు—
ఆకలిదప్పుల నరపియవ్వారి

నేకాంత నిష్ఠతోనెలమి గొల్చుచును
దినమునకామడతీరుగానడచి
జనకుల కాయాసమును దోపనీక
దండితేంద్రియవృత్తి తతశమధనుఁడు
పుండరీకుండాత్మ పురమును దఱిసె—
తలవాలమునయందె దర్శించి కొంద
రలఘువేగమ్మున నా యూరఁ జొచ్చి
పుండరీకుఁడు వచ్చెఁ బుండరీకుండు
రండు రండో! చూడరండంచుఁ బిలువ-
తరుణులు-మగలును దండడిగాఁగ
బరిగట్టి-యెదురుగాఁ బరతెంచు చుండ
దననాధుఁ దరుదెంచె నను వార్త-చెవులఁ
దనికిన-మధురసుధా ధారయగుచు
నెన్నఁ డెన్నఁడు వచ్చు నిఁకనంచు వాని
తెన్నులే సూచుచు దినములు గడపు
చున్నది-విధియుక్త శోభనాఽఽచార
సన్నయ, సన్నుతచాతుర్యమూర్తి
బుండరీకునిసతి-బొంగారుచుండ
రెండుకన్నులు, బుల్క-రింపులు దనువు
దనియింపఁ, బైపెచ్చుదట్టాడు కుతుక
మునకుఁ దాలిమి యను బెనుకట్ట వెట్టి—
తలవాకిటనె నిల్చి-తరళితాపాంగ
ములతోన నాథుని ముందెర్వునందుఁ
గలువదంబులు గట్టి-యెలనవ్వు ముత్తె
ములఁజల్లదయసేసెఁ బుండరీకుండు
దల్లిదండ్రులతోడ-మొల్లమై గనుల
జల్లించుకొన్న బాష్పమ్ములతోడ-
పొలఁతి నమ్మఁగలేదు బుణ్యంబులిట్లు

ఫలియించునే యంచు-నలినాక్షి నమ్మ
కుండనులేదు-నాకొన్నట్టి కనులు
రెండును దీర్ఘ దీర్ఘీకృతమ్ములుగ
మొకమెల్లఁగాఁ జూచె మోక్షఫలమ్మ
లకలంక మతివచ్చినట్లున్న వారి—
సకలదేవతలయంశము లొక్క యిర్వు
ర కుటిలమానసులైనట్టి వారి
నత్తమామల-నంతరానందమునకుఁ
జిత్తంబుదుసికిల్ల శీఘ్రంబుగాఁగ
నెదురేగుదెంచి తా నిలఁ జాగి మ్రొక్కఁ
గుదురు గుబ్బలు భూమిఁ గునిపి యాడంగ-
మ్రొక్కిన కోడలి ముదమారఁ గాంచి
యక్కమలాక్షి సాత్వకి-మనసార
దీవించెఁ గులమేలు దేవుండు జహ్ను
"నా విశాలాక్షినీవై బుండరీకు
నభవుఁగావింపు మంచాడె"-నక్షీణ
విభవమ్మ దపము దీవెన గ్రుమ్మరించి-
యంత నా ప్రియపత్ని-యనురాగభార
దంతురితాపాంగి దన మనోనాథు
చరణంబులకు మ్రొక్కి సరసంబులైన
జిలునవ్వుతుంపురుల్ చిందులాడంగఁ-
నత్తమామలదైన యడుగులదోయి
నత్తమిల్లంగ భక్తి యర్మిలిఁ గడిగి
తత్తీర్థమును శిరస్థలముపైఁ దాల్చి
చిత్తమ్ము చిగురింపఁ జిగురాకుఁబోఁడి
త్రోవఁ జూపించినఁ దోడ్తోడ నడచెఁ
కైవల్యకామినీ కర్ణ కల్హార
కమనీయ తరకటాక్షములతో-జహ్నుఁ

దనమలిన చిత్తసాత్యకి వెంట నడువ-
తల్లిదండ్రుల వెన్కఁ దా వచ్చె-వారి
సల్లలితాంఘ్రి నిశ్చలదృష్టి యగుచుఁ
బొడవైన వినయంబు బుండరీకుండు-
పుడమిలో నింక నా పుత్రున కెట్టి
దలఁపును లేదు, శ్రద్ధాబంధురముగఁ
గలకాల మాపి తరులఁ గొల్చి-వారి
పాదమూలములఁ గైవల్యసుఖమ్ము
సాధించుచే దక్క- శమదమనిధికి-
దినములు గతియించె దివ్య విజ్ఞాన
ధనుఁడైన గొమరుండు దాను సాధించె
బడిబడిఁ గ్రొత్తతపమ్ము-దేవతలు
గడు వెఱఁగందఁ జొక్కపుభక్తి నిలిపి-
జనకుని మొగముపైఁ జూపు ల్నిలిపి
తనలో నెగరఁగు శ్రద్ధామూర్తి సుతుఁడు-
పితృపాదముల నిష్ఠ వీక్షించి-బాష్ప
తతిమజ్జనమ్ము సంధానించుఁ గొడుకు,
జనకుండు భాషింప సరవితో నమృత
మునఁ దోగినట్లైన మోద సర్వాంక
షంబైనహృదయంబు జలజలఁ బాఱ
నింబుగా వీక్షించు, హితమెంచి సుతుఁడు-
దల్లియంఘ్రుల చెంతఁ దలవాన్చి-సుఖము
మొల్లమై రోమాంచములఁ దోగుఁ గొడుకు;
తెలతెలవాఱ నెత్తులు వోవ భక్తి
తలిదండ్రులకు మ్రొక్కి- తత్పరత్వమునఁ
దానంబు లాడించు, దనినీట వారి
మానసంబులు మోదమత్తమ్ముల్గాఁగఁ-
బ్రన్నని శుభ్రాంబరమ్ము లందించుఁ

గ్రన్ననఁ దనికంపు గలిగిన పూలు
ముడుచు,నాయాసంబు గడమగా విసరఁ
దడయక-తాళవృంతమ్మును బూని-
గడచెఁ గాలంబిట్లు, ఘనతపోగరిమ
బొడవైన తనయుండు బుండరీకునకు-
పితరుల సేవయే గతియయిపోయెఁ
బితరుల నామమే విధిమంత్రమయ్యెఁ
దల్లిదండ్రుల పూజ దనబ్రదుకయ్యె
నెల్లసౌఖ్యంబుల కెల్లఁగా నయ్యె-
నేమి వచించునో! యేదిక్కుఁ జూచు
నో! మానసంబున నేమి యూహించు
నో! యెట్టిసేవఁదా నొగి నిర్వహింప
నై యున్నదో! యంచు ననిమేషదృష్టి
వఱపి జహ్నువుపై ని-ప్రమథేశ్వరునకు
సరియైన దండ్రిపై-సర్వకాలమ్ము
లతిజాగరూకుఁడై యాయాసమనక-
మతిసేవగింపక మాంద్యమ్ము లేక
గండరువునుబోలెఁ గాపుండు సుతుఁడు;
దిండితీర్థమ్ములు దినిపించుఁ ద్రావు
నేర్వెఱ రుచులెల్ల వివరించి-జలము
వార్వఁగా విశ్రమింపఁగఁ జేసి-యల్ల
నల్లఁ బాదములొత్తు నానందబాష్ప
పుల్లవక్త్రాబ్జుఁడై-పుండరీకుండు;
నిదురగూర్కిన తండ్రి నెలమి వీక్షించి
మది బొంగి-యంఘ్రుల మస్తమ్ము వంచి
తల్లిదగ్గఱి భక్తి దట్టాడుచుండ
నెల్లసేవలు దీర్చు ఋజుమూర్తి సూనుఁ
డాకొమరుని గాంచి యద్భుతానంద

శీకరాఽఽపారపిచ్ఛిలమూర్తి మాతృ
దేవి లోలోననే దీపించుఁ గోటి
దీవెనల్ ప్రేమంబు దీగెలు సాఁగ—
మతిఁ జొక్కి, రతి దక్కి, మధులిహా లున్న
శతపత్రములు వోలెఁ జక్షువుల్మోగిచి—
యనుకూలపతిప్రేమ కాత్మలోఁ గరఁగు
వనిత పోలికబాహ్యావర్తనల్మఱచి—
గురుదిష్ట మంత్రంబు పరశిష్యుఁ డట్లు
హరు మూర్తిఁ దనలోన నైక్యం బొనర్చి
పరమ భక్తుఁడు దన ప్రాణలింగమ్ము
విరిపోటు లేకుండ వీక్షించునట్లు—
జహ్నుమూర్తినిఁ దన సరసాఁర్ద్రచిత్త
నిహ్నుతం బొనరించి నిట్టక నిలుచు
పులకలై-ముద్బాష్యకళికలై గనుల—
నలలుడిందినయట్టి జలనిధి వోలె
జలదాప్తిలేని సత్సరణియు బ్రోలె
చలనంబు నేదిన వలిగాడ్పు వోలె
మూతి విచ్చనియట్టి ముకుళంబు వోలెఁ
జేత మివ్వనియట్టి నాతియుఁ బోలెఁ
నల్లలాడని యట్టితిల్లికవోలె
నల్లనిమదియింద్రియాఽఽసక్తిదలఁగి
గురుపాదములయందెగుబుతుగానిలువ
వరముగానట్టి యీధరగల్గుపూలు
వదటికేయని భూమినొదవనిచెట్ల
వెదిగి, సాయుజ్యసంపదయనుతావు
ండరు సహస్రదళాఽబ్జంబుపూన్చి—
మొడఁగూడు ధూపధూమోద్గమంబులకు—
పాదులపాదతలములుగంది

చేతంబు నొద్చు నచ్చింత-విజ్ఞాన
ధూపంబులెసకొల్పి, తోద్తోడ ధరను
బ్రాపించునట్టి నీరాజనజ్యోతు
లనఁగవేడిమియంటి యదవ దలగువా!
యనువంతవెన్నెల కనుగులంబగుచు
నలరు నాత్మజ్యోతి నళినివాళించి—
ఇలఁగల్గురుచులలో నేమున్నదంచు
నిరపించి-యెన్నండుఁదఱుగ నిరుచులు
పరిఢవిల్లెడు ప్రాణపదమునర్పించి—
యదరించు ప్రతిదృష్టి యాత్మదేశికుల
యడుగులకొక దీపమై-మదిఁదలఁచు
ప్రతిభావనయు నొక్క పద్మరాగముల
ప్రతిసరమై-సేయు ప్రత్యుపచార
మతుల మాత్మార్పణంబై-భక్తి సురభి
యతిమాత్రరక్తిఁజన్నవిపిచేపంగ
నీరేడు లోకంబు లెలమి నంకింప
నారజం బొల్కంగ నర్చించు సుతుఁడు
ప్రమదేశభక్తుండు బాహ్యలింగంబు
నేమంబు నిష్ఠించి-నిఖిలసద్వస్తు
తతిఁగూర్చుకొని నిహిత్రంబుగాఁ గొలుచు
గతిఁ దండ్రి పాదముల్ గాంక్షతోఁ గొలుచు
సకలోపచారముల్ సంఘటిల్లంగ,
పశుపతి భక్తిభావాఽఽవేశదివ్య
రసికుండు లోకతంత్రమ్మువోనాడి
యడుగడుగను రక్తి యావహిల్లంగ
నుడురాజకోటీర! యూర్జితాచార!
కైవల్యసుఖసార! కంధిగంభీర!
దేవాఽఽదిదేవ! భూతేశ! నమో న

మో యంచు హస్తాబ్జములు దట్టిపాడు
చాయగా-విష్ణురూపాయ-దయైక
సింధవే! మన్మనోబంధవే! జ్ఞాన
సంధుక్షణాయవిశ్వాత్మనే! జహ్ను
రూపాయ! నిత్యాత్మనే! పితృరూపి
ణే! పినాకధరాయ! నిభృతం నమో న
మో! యంచు నెలుగెత్తి యోరంత బాడి
చేయెత్తి నర్తించుఁ జెలువొల్కఁ సుతుఁడు—
గనుమోడ్చినపుడుఁ గాంచు లోలోన
జనకునిరూపు మోక్షాఽఽనందజలధి;
గనుదెర్చినప్పుడుఁ గాంచుగట్టెదుట
జనకునిరూపు నిల్చిన మోక్షఫలము—
గనుఱెప్పలార్పక కను-ఱియునవ్వ
దనుకంగఁ జూచు-ముగ్ధముగాఁగఁ జూచు
నలఁతఁగాఁ జూచు-మిన్కులు గ్రమ్మఁ జూచు
నలనల్ల జూచు-నోరఁలజూచు; దేహ
మంతయుఁ గన్నులై యటుసూచు-భక్తి
దంతురితుఁడు గొడ్కఁ దండ్రి పాదములు—
జనకుండు భాషించు సమయంబులందుఁ
దనయున కొడలెల్లఁ దనుపారుఁ చెవులు—
పితృపాదములను సేవించెడునప్డు
హితబుద్ధి కొడలెల్లనెనయు హస్తములు—
నుతపడ, జనకు సన్నుతిసేయునపుడు
మితివెట్టరాకుండ మేనెల్లనోళ్ళు—
దలిదండ్రులకు సేవ దలకొల్పునపుడు
మెలయుఁ బో, గిఱికొని మేనెల్లఁ గాళ్ళు—
పరరూపుఁడైన దండిరిఁ జూచునపుడు
మెఱయునెత్తమ్ములై మేనెల్లఁ గనులు—

దలిదంద్రుల వ్వానితాత్పర్యమతుల
ఫలమైన సాయుజ్యభాగ్యసారమ్ము—
దొలిదిక్కు జవరాలు వలిపెంబు దీసి
కలికి నవ్వుల భూమిఁగాంచకమున్న—
తొలికోడికంఠంబు నిలవంచి పొగరు
గులికించి ముమ్మాఱు గూయకమున్న—
తొలికొండచఱులపైఁదోతెంచి సూర్యుఁ
డలరార రాగంబు నిలుపకమున్న—
తొడలెచ్చరించి నేస్తులఁగూడు సతుల
ముడివడు హుంకృతుల్ ముగియకమున్న—
వెలుఁగుల గనికరంబులు సోకి తమ్మి
చెలువ-గ్రొన్న గవులు చిలుకకమున్న—
పొరలేని భక్తితోఁ బుండరీకుండు
పరమార్థ పితృరూపభావనామధుర
మధుదిగ్ధనేత్ర పద్మమ్ములు విప్పి
తదుపరి వేగంబుదానంబు దీర్చి—
బుడి బుడి యారామముల కేగి, తావు
లడుగు వట్టగఁదేటు లంటనిబూవు
లందంబు దుపికిలమందవాయువుల
గ్రందువ జేకులు గదలని పూలు—
మడఁతిచెక్కులపైని మదరేఖపోలు
గడుతియ్యనగు దేనెలెడలనిపూలు—
వృంతబంధమునుండి విడివోని పూవు
లింతైన చందంబులిడివోనిపూలు
శోధించితెచ్చి విస్ఫూర్జితాఽఽనంద
బోధరూపుఁడు-పార్వతీధవుఁబోలు
జనకునకుపచార సరణివేఁదీర్చి
జననికూడిగములుసల్పి-యిర్వురను

నుపవిష్టులనుజేసియు త్తాలభక్తి
సఫలంబుగాఁగఁ బూజలొనర్చుఁదనదు
పడఁతితోఁగూడి శాశ్వతమోక్షసుఖము
లుడివోక సిద్ధించె, నో జగానందు—
జనక పాదములందు నరిక్రొత్తపూలు
మనసారమంచుచో మాధుర్య భరము
లత్త మిల్లనిపూవులై యుండు మనసు—
హత్తుకోనుద్వేగ, మావలీ వలను
దీపార్చన మొనర్చి-తీపారుఁజూపు
లేపారవీక్షించి-యిచ్చలోఁగరఁగు
నావేళలందుఁజీమంతై నగందు
లావహిల్లని దీపమైయుండుమనసు—
వాసనాద్రవ్య సర్వస్వముల్-జలము
లాసదులాక్కడఁగాఁబోసి-తానమ్ము
లాడించునపుడుఁ దీవ్రానురాగమ్ము
గూడంగ జలములై గొనురొందుమనసు;
యిది స్వాదువిదివోలునిది భేషజంబు
నిది కోరికను దెచ్చినది, యంచురుచులు
వలికి-నైవేద్యపూజలొనర్చునప్పు
డలరారభోజ్యంబులై యుండు మనసు—
గనులు చిత్తడిగ, శిఖాగ్రంబునందుఁ
దనిపూలుముడుచుచోఁ దావులువోని
యలరుల బంతిగానై యుండు మనసు—
యిలపై ని సర్వాంగ మిరవొంద-శిరసు
వంచి మత్పుణ్య త పః ఫలాయ! జగ
దంచితముక్తి మహాయ! సర్వాత్మ
నే-నమోమహసేయనింద్యరూపాయ
దీనావనవ్రతాధీనాయ-వేద

పురుషాయ, సాత్యకీపరమార్ధహాంహ్న
వరతనుధారిణే-వాసుదేవాయ
సోమాయ-రాజీవశోభినే! దివ్య
సామోదితాయ! యంచాఽఽవేళభరము
గిరికొనఁ బ్రణమిల్లుతరుణంబులందు
సరిదిప్రణామంబునై యుండు మనసు
యీరీతిసద్భక్తి తోరహత్తులుగ
దూరితాఘుఁడొనర్చు దొడ్డతపమ్ము
సర్వమానవుల కాశ్చర్యదంబగుచుఁ
బర్వెఁ, దత్కీర్తి, సుపర్వలోకమున—
ననుఁబిల్వ లేదంచుసణిగెఁ బోవహ్ని;
ననుఁగొల్వ లేదంచుఁదనికెఁగుబేరుఁ;
దసమాక్షు నంశమై నట్టి యీశానుఁ
డసమంజసమ్ము, నన్నర్థింపకుండ
నాపోవుటనియుండె, నాపోనియసము
రూపుకట్టినవాఁడు-తీపైనవింటి
తీపులతోఁబువ్వుఁ దూపులతోనె
యేపునఁదపముల నింకించువాఁడు—
వలరాజు-దనకేమివచ్చునో; లేని
యలజడి" యనినవయౌవనాఽఽభోగ
మధురిమ సీమ-లున్మదకటీభార
విధుతమౌనీంద్ర సంవిచ్చిత్తులింద్ర
ఘనసార్వభౌమతుక్షారముల్ఁకాంత
తనువలగ్నలు-మన్మథాఽఽగమాభ్యాస
మధురిమాఽఽశయలు-సుధామందహాస
నిధులు-చాతుర్య సన్నిధులైన-వార
మదవతీచయముతో మంతనంబాఁడె—
సదమల వేదార్థ చర్చామచర్చి

కావ పితాననుండా విధాతయును
భావించి-తనుఁగూర్చికావించుసేఁత
గాదనితలపోసెఁ, గాలకంఠుండు
గాదిలిసానితోఁ గలిపియోచించి
'ననుఁగూర్చి పిలుపుగాద' నిశ్చయించి
తనువునఁబులకసంతతులు దట్టాడఁ
దలవంచి మ్రొక్కెనిస్తులవనమాల
దులకించునెదతోడి తో యజాక్షునకు-
దేవతలెల్లఁ బ్రత్యేకాఽభిమాన
భావరూషితులు విశ్వాత్మకత్వంబు
వారితరం బౌనె! వామనుం డెట్లు
బారసాచిన నభః పటమంటుకొనునె!
జలము తలమ్ము, దిగ్వలయమ్ము మేఘ
నిలయమ్ము, మారుతమ్ములు, జంద్రసూర్యు
లఖిల నక్షత్రమ్ములఖిలలోకమ్ము
లఖిల భూతమ్ములేయాత్మ స్వరూపు
నకుశరీరమ్ము, లానందైకధాము
నకుఁ, గూలముద్రుజ నవ్య సౌరభ్య
ఘనతరకల్యాణ గుణపరీతునకు
వినమిత వేదాత్మ విహగాఽధినాథ
వితత శిరస్స్ఫుత విమల పాదునకు
నుతికెక్క నారాయణునకునుగాక—
జిలిబిలి నేర్పులు చిలికించిసేయుఁ
జిలువాయనపుఁదపస్సులతోడఁ గరుణఁ
దొఱయునే! దక్కనిర్జరులట్లు, లివ్వఁ
గొఱకొలిచ్చునే! వరము విష్ణుండు!
సకలజీవముల హృత్సరసీజములను
నికరంబుగా నిండినిల్చిన వెలుఁగు

దానొటఁ బుండరీకా నీతమైన
మానిత పితృసేవమదిని దాకినది-
పుండరీకుని భాగ్యపుండరీకమ్మ
ఖండసౌరభములు గమియ విచ్చినది-
వేంచేసెవిష్ణుండు—వేంచేసెమౌని
సంచయానందంబు-సర్వగీర్వాణ
భావనాఽవిషయంబు, పద్మాకటాక్ష
పావనాఽఽరామశోభా వసంతమ్ము—
వేంచేసె సన కాది విబుధహృదబ్జ
చంచరీకము-భక్తచంద్రికామంద
హాస సాభోగమాయా పరిష్కార
భాసురంబాదృత భూసురంబైన
వెలుఁగు-సాయుజ్య శీతలము-మాధుర్య
ములసీమ-యనుకంపదొలఁకెడుటెంకి—
శశవిభూషణ జటాశాలాఽభిరామ
విస్మృమరపాటల్య విభవంబులకును
నసుబలంబగు జొత్తులదరించి-ై
తనయాస్మితాఽఽసారతారళ్యములకు
నొరవడులై-యొసపరులై నగోప
తరుణులవీఁగుచిత్తరపుఁ జన్నులకుఁ
దొడవులై-యందాలమడుగులైనట్టి
యడుగులతో వచ్చెనంబుజాక్షుండు—
కాంబవోద్యచ్ఛ్రీవిడంబికంఠాగ్ర
లంబమానాంశుమాలా కీర్ణమై జ
యంతితో మాలియయట్టిటుదూఁగ—
దంతుర కారుణ్యతరళితాపాంగ
చకచక ద్రోచిరుత్సవములు, చదల

లలిత పీతాంబరోజ్జ్వలచారుకాంతి
కళికలు-దిక్కడుంగముఁగై సేయ-
జలధిజా చరణలాక్షారేఖవోలి
కలికి వన్నెలతోడి కౌస్తుభంబమర—
జగజంపు గడితంపుజలతారుచేల
నిగనిగల్మిట్టింపనిండైన యెడఁద
తీరైనకస్తూరి గీఱునామమ్ము
జాటిబొమ్మలతోడ సాళగింపంగ—
భ్రమరక వ్రాతంబు ఫాలంబుపైని
గుమిగూడి ప్రెక్కణంబులుహావణింప—
పులుగడిగిన ముత్తెములువోలెమేన
దులకించి స్వేదబిందువులు వర్తిల్ల—
నెమ్మెదోలంకెడు గెమ్మోవిపైనిఁ
గ్రమ్మిన చిఱునవ్వు గలకలలాఁడ
మకరకుండల విభాని కరంబుమఱపి
ప్రకటింప గండముల్ బలియుబీరెండ—
పుంజితశింజాన మంజిమానూన
మంజీరములు సూర్యమకమకసేయ
బహిరబహిః పూర్ణుఁ, డహిపపర్యంకుఁ
డహరహరుదితుఁ, డ హస్కరచంద్ర
నేత్రుండు-ధవలతాదాత్రుండు-వినుతి
పాత్రుండు,ప్రజలోకభాగ్యభండార
మేతెంచెఁబుటపుట నై తుందపుటము
దొంతరల్గాముద్దు-దుంపెసలాఁడ
వేదాత్ముఁడై నట్టి విహగాధినాథుఁ
డేదిదోపకయడుగెంటసేబాల—
పనియేమిగల్గెనో! స్వామివేంచేసె
ననిసుదర్శనమూర్తి వెమవెంటనంట—

ధీరతో దారదుర్వారఝాంకార
చారురూపము పాంచజన్యంబునడువ—
పసనిపయ్యెదదూఁ గన సదునెన్నడుము
విసవిసగాలక్ష్మిపిరుపీ కులాఁడ—
సైన్యాఽధి నేత, విష్వక్సేనమూర్తి
యన్యదుర్దముఁడు దోడై సందడింప—
కంకణహుంకారఘన పరిష్కార
సంకుల సంఖ్యావి శంకటవిక్ర
మాటో పమైనగవాగ్య్రమేపాటు
వాటిల్లెనో! యంచుదూటికొనంగ—
నగ్రజాగ్రజ్జ్వాలితోగ్రమై విక్ర
మాగ్రియంబగునందకాఖ్యంబుగొలువ—
కనకకంకణ సముత్కట ఝణత్కార
ఘనఘనాఘనరవాఽఽకర్ణ వోద్భ్రాంత
వినతదైత్యాంగనావేతాళ మగుచుఁ
బనివినుశార్ఙ్గమ్ము బలఁగమైయంట—
వైకుంఠవాస సౌభాగ్య సుశ్రీకు
లాకులంపడ వైష్ణవాఽఽచారయుతులు—
పంచమంగళమైన భద్రగజమ్ము
వంచించుగమన సౌభాగ్యంబుతోడఁ
బరతెంచె వేదాంత పరమ పిద్ధాంత
మరుదైన నారాయణాఽభిధానుండు.
ఆసమయమ్మునసత్యంతభక్తి
భూషితుండై నట్టిపుండరీకుండు
దనబోటి గోమయమ్మున శుద్ధిసేసి
కొనసాఁగురక్తి మ్రుగ్గులు దీర్చినట్టి
నెలవున జోడుపీటలువేసి-గురులఁ
జెలువారఁగానుపస్థితులఁగావించి

కనులందుఁ, దను నందు, మనమందు, వినయ
మనుగతికంబు గానల్లన మ్రొక్కి—;
ఘనసార వాసనా కలిత నీరములఁ
బనుపడభావంబు పాదముల్గడిగి—
యాజలంబమరులకైన దుష్ప్రాప్య
మీజన్మమునఁ దక్కెనింకేటిముక్తి
యను భావమశ్రాంత మాక్రమింపంగఁ
గనుదోయి జలము లాకట్టగాఁ గ్రోలి;
యలరారఁగా శిరస్థలిఁదాల్చి-కావి
దొలఁకు చందనము నిగ్గులు వారఁబూన్చి;
యక్షీణ పాపసంధుక్షణా కార్య
దక్షాంఘ్రులకు నక్షతలు వేసి మ్రొక్కి—
మొలతేర రాగంబు మొనలావులించి
యెలదేటిగములెంగిలింపనిపూలు—
గరువలిసుడిపి దెప్పరముగాఁగవియఁ
బురిగొన్న పుప్పొడుల్వ్రోలివోనిపూలు—
తరణికూటమున మేయెరలి దళోష్ఠ
మొరసెడు మధుమదంబొలుకని పూవు
లావటించుచును సహస్రనామార్చ
నావ హితుండునై యటు సొక్కుచుండి—
ఘలు ఘల్లు మనుపాదకటకనినాద
ముబు రెండు చెవులలో బోరుకలంగఁ
దలమల్పిచూచినఁ, దనయెట్ట యెదుట
జలజనాభుఁడు-భక్తకులమనోధనము
మొలకట్టు గజ్జెలు జలధిజాస్మేర
కలగీతముల కనుక్వణనముల్గాఁగఁ;
గరకంకణమ్ములు ఘలుఘల్లుమనుచుఁ
బొరలేని సాయుజ్యముక్తిఁ గీర్తింప;

శిఖిపింఛదళ పరిష్కృతములౌ కురులు
ముఖమండలమ్మున ముగ్గినలాఁడ;
సరుదైన రతనాల సరులచే వెలుఁగు
బురుసారుమాలు చూపఱసొగియింప;
నొసపై వనసిగమీగపహొయలు గూడంగ
గొప్పముత్తియముల కుచ్చులాడంగ;
మాంజిష్ఠ వర్ణంపు మగఱాలచేత
రంజిల్లుగలికి తురాయి దూగంగ;
గరువంపుఁగడినింపు గరువుపై, మురువు
మెఱయింపులగుఁ గ్రొత్తమురువులు వెలఁగఁ;
బులుగడిగినముత్తెముల జగాజగలు
ఝళిపించు మదికించు చౌకట్లుమీఱఁ;
జాలకుఁ గెంపులతోడ జోడైనగంట
సరికంఠము నయందు సరిగాఁగనొప్పఁ;—
గట్టాణిముత్యాలు గట్టనందాలు
మిట్టించునఱచట్ట మేలిల్లుగాఁగ;
బుగబుగమనితావు తెగమించి-యింపు
పగటు సీరాజిదుప్పటి దుపికిల్ల;
వలనొప్పు వజ్రాలవంకి, యుత్తరిగె
లలిమీఱుజాతిపచ్చల చిల్కతాళి
మెఱుఁగైన గెంపులమేల్పతకములు
గరమొప్పు నక్షత్రకంఠమాలికయుఁ
బంచరత్నమ్ముల బాహాలపురులు
పంచాణములమేలి వజ్రాంగుళీయ
కమ్ములు-నొసపరికడియముల్-తావి
జిమ్మెడిజీవరత్నమ్ముల చేస
రమ్ములు-బిరుదుపెండెమ్ము గ్రొత్తాని
ముమ్మరించెడు నట్టిబొందుతోమాల

ధరియించి-నడుముపైఁ గరములనుంచి
కరుణాకటాక్ష ముల్గడలసారించి
ప్రత్యక్ష మైననప్పరమపూరుషుని
నత్యాదరంబుననభివీక్ష సేసి
తల్లిదండ్రులసేవఁ దనియంగఁదీర్చి
యల్లననరుదెంతు నంతకాలమ్ము
చెఱవార నీశిలాఫలకంబుపైని
నిలిచియుండు మటంచుఁబలికిన, బుండ
రీకునిధర్మాఽతిరేకత మెచ్చి,
శ్రీకాంతుఁడాశిలపై కెక్కి-నిలువ—
“నాదినారాయణా! యనుపమానంద
బోధైకరూప! సంపూత మౌనీదు
నడుగు సోకినదాననడఁగె నాయఘము
లోడఁగూడె నారూపమో! నిర్వికల్ప!”
యనుప్రార్థనముతోడ నమరనాయకుఁడ
గనులింపముందు నిల్చినఁగటాక్షించి—
“సౌమ్మ! దేవేంద్ర! నీపుణ్యంబువండె
నిమ్ముగానాకమ్ము నేలికొమ్మింకఁ
బాతాళమునఁదపః పథముసేకొన్న
పీతచాపల్యుఁ డౌవృత్రాఽసురేంద్రు
వజ్రాయుధమ్మున వ్రచ్చినదాన
వజ్రకల్పమ్ము శాపమ్ము బ్రాప్తించి
శిలగాఁగఁబడియుంటి విలపైనినేటి
కలఁదురుదీరె-భక్తాఽగ్ర గణ్యుండు
పుండరీకుని దపమ్ములతోన ముక్తి
మండపంబయ్యె నీడిండీరభూమి”
యనియా నతిచ్చిననమరాఽధినేత
వినమితుఁడై మ్రొక్కి, విబుధులకెల్లఁ

గొండాడఁదగినట్టి పుండరీకునక
ఖండితంబగు భక్తిఁగై మోడ్చియేఁగెఁ—
గులమౌళి పుండరీకుఁడు పితృదైవ
ములకు సంతృప్తిగాఁబూజలిడిచ్చి
విశ్రమింపఁగఁజేసి వినయంబుదొలుక
నశ్రాంతయోగ విద్యానిషద్యలకు
దొఱుకనివస్తువై, యఱలేనిభక్తిఁ
గరగించువారికిగడి కొమ్మటంచు
గడనకెక్కిన యట్టి కమలాక్షుఁజేరి
యడుగులంటినవాని నత్యనురాగ
భాసురంబుగఁజూచి వడిలేవనెత్తి
హాసపేశలము గాననియెవిష్ణుండు
"యిలమీదఁ దొలివెల్గు మొలచినదాది
కలగొన్నయింతటి కాలంబుపఱకుఁ
బితృదైవతమ్ములకతిభక్తినిట్లు
సతతసేవలతోడ, సంతృప్తిసలిపి
నట్టివారలులేరు; దిట్టమౌ తపము
వట్టిననీయోర్మిఁబండెను నేటి
కటమట లేవికుక్కుటుబోధ-దివ్య
పటహమై దెసలెల్లఁ బ్రాఁకెనీయశము;
మేలువచ్చెనుసుమ్ము-మేలిల్లువైతి
కాలమ్ములో, బ్రహ్మకల్పమ్ము లెన్ని
గడచినఁగడివోని గడనవార్జించి—
పుడమిపైఁగల సర్వభూతమ్ములందు
నణురూపముననున్న యాత్మనేనగుట
గుణివౌచు నీవిఱుగురువులఁ గొలుచు
కొలుపు-నాకెత్తిన గొలుపు గానయ్యెఁ
దలఁపూన్చి పలుకుమీ వలయునదేది

వరమున్నదో! భక్తవరులకప్రాప్య
మిరవొందఁ, గాన, మీరేఁడు లోకముల"
ననియన్న విష్ణునియభిభాషణంబు
విని పుండరీకుండు వీనులయందు
నమృతంబు వఱ్ఱోడి, హస్తముల్మోగిచి
"కమనీయరూప! నాకన్నులయందు
సతతంబువర్తించు జహ్నస్వరూప
మతిమాత్రమాత్మఁ జిదాకారమగుచు;
భాసించు నట్టులే-ప్రకృతియైసాత్వ
కీసతి, బురుషుఁడై గీర్తింపఁదగిన
జహ్నవు, సగుణపక్షమునఁదోపింత్రు
నిహ్నవింపఁగనేల నిగమస్వరూప!
యామూర్తి నాకంటనాడినయపుడుఁ
గామధేనువుపాలు గార్చినయట్లు—
ఆనామమీమదినంటిన యపుడు
సోనలై యమృతంబు చూఱగొన్నట్లు—
నాతండ్రిసేవకై ప్రీతిగొన్నప్పు
డీతనువునయం, దహీన సాయుజ్య
మోక్ష సుఖమ్ముల మూఁగినయట్లుఁ—
చక్షుశ్శ్రవాఽధిపశయన! నాకింకఁ
గోరనేమున్నది! గోరుకొమ్మన్న
నేరకుండుటయన్న నిన్నెన్నకుండు
టగునో! యిప్పట్టుననుకంప దొలుక
యగపడినిల్చినహంగుతో-సతము
నిలిచి సద్భక్తులఁ గొలుపులుమెచ్చి
కలకాలమునుఁగామ్యములఁ జిల్కవలయు
పుండరీకుని భక్తిపుష్పించినట్టి
డిండీర వనమింకఁ బౌండరీకాఖ్య

సేకొనవలె, నన్నుఁ జేకొని బ్రోచి
వాతులకందనివాఁడ! రక్షించి
నందుకుఁ, బుండరీకారనుండనుచుఁ
గ్రందున నీకు సార్థకమైనపేరు
పాండురంగఁడటంచుఁ బ్రథయొక్కటబ్బుఁ
బండరిపురి 'లోన భాసిల్లుదాన;
నొకతీర్థమిచ్చోట నొడికంబుగాఁగఁ
బ్రకటింప' వలయుసర్వాఽఘనిబర్హ
ణమ్ముగా నివి నాకు నెమ్మదిఁదోచుఁ
గమ్మనికోరికల్ గమలాక్ష!" యన్న
వినిసంతసించి యావెన్నుండు 'నట్ల'
యనిజహ్నుసాత్యకులనుఁ గటాక్షించి
పుండరీకుని పత్నిఁబోలఁగాఁజూఁచి
యండకుఁబిల్చి యాయమ మనంబలరఁ
బలికి యాశీర్వాదములునించి-చెంత
నిలుచున్నలక్ష్మితో నెలమినంకించి-
తమిమీఱఁ గృష్ణావతారమ్మునందుఁ
గ్రమముగాఁ దాల్చినకళలనుబూని
కమలోదరుఁడు దక్కుకళలుజ్జగించి
యమలాత్మకుఁడు దైవమానాటినుండి
పాండురంగండన్న ప్రథఁబూని-సొగసు
గండరించిన రూపుగానిల్చినాఁడు;
కటితటీ విన్యస్తకరుఁడౌఁచుగరుణ
బుటమెగయఁగనున్న బురుషోత్తమునకు
ననుగుణంబుగ, లక్ష్మి, యాదివై దర్భి
యనుకంపదొలుక రుక్మిణిగాఁగనిలిచె
శ్రీకాంతకృత పుండరీక తీర్థమున
లోకమ్ములో నఘాఽనీకవిస్తార

చెఱములై వెలసిన సకలతీర్థములు
గనుకని బఱతెంచికలిసె నప్పాట—
పాండురంగఁడు భక్తఫలకల్పకంబు
పాండురంగండు రూపంబుసేకొన్న
పరతత్త్వమీ నాదుభావనయందు
గిఱికొన్నమూర్తి, యోగిరి రాజపుత్రి!
దెపిసెనేగద! భక్తకులమనోధనము
ఫలితాఽవతారుండు పాండురంగండు
వెలసిన విధము-దజ్జలజాఽక్షుచేత
వెలయింపఁబడినట్టి విమలతీర్థమ్ము
జనితాఽఘములబారి సమరెడుచొప్పు;
యనియిట్లు శంకరుండానందపులక
పరిమిళిత తనుండు భాషించినట్టి
పరుసున సూతుండు పరమవిజ్ఞాన
యుతులై నమునులకు నొడికంబుగాఁగ
నుతపడఁ జెప్పిన, వితతసంతోష
వికసితి నేత్రులై యకలంకమూర్తు
లకుటిల భావార్ద్రిమగురీతి-నంద
నందనునకుఁ జిదానందరూపునకు
బృందావనాఽఽభీరబృందాఽవనునకుఁ
దలవంచి మ్రొక్కి-యిమ్మెలసూతుఁజూచి
పలికిరీ విధమునవలఁతు తౌమునులు-
"మాయందుఁగరుణించి మానాథుఁజరిత
దీయని పలుకులఁ దెలిపితివీవు
మామనంబులలరె మఱియొక్కకోర్కె
ధీమహితా! సూత! దీర్పుమయ్యదియు
చంద్రరేఖామనోజ్ఞంబుగాఁబారుఁ
జంద్రభాగానది సతతంబుఁబండ

రీపురమందు, నయ్యాపగయెట్లు
ప్రాపించెనచట నిరూపింపు'' మనగ
మునులయా నతిఁదలఁబూన్చిసూతుండు
వినయసుందరముగా వినిపించెనిట్లు——
''త్రిపురంబులందున దీపించితొల్లి
యపకర్తలగు రాక్షసాఽపశదుల్ 'మ
దించి' నాకంబుమర్దించి, వేలుపులఁ
బంచారముగ విభాళించి, గుబ్బెతల
గబ్బిగుబ్బలఁగ్రుమ్మి, ఘనముగాఁగ్రమ్మి
పిబ్బితులెగఁజిమ్మి, చెలువుదొలంకు
కట్టడంబులు గూల్చి, యట్టడుల్ డుల్చి
కట్టుగ్రముగరేఁగి కాఱియల్గూర్పఁ
ద్రిదశులందఱుఁగడు దీనులై యపుడు
మదనాంతకునిఁబ్రోవు మంచుఁబ్రార్థింప
నలికాక్షుఁడెసరేఁగి, యాదైత్యవీర
కులములఁగూల్పంగఁ దలఁపునఁదలఁచి
ధరణీత లంబెల్ల నరదంబుగాఁగ
నరుణచంద్రములు చక్రాఽఽకృతుల్గాఁగఁ
దొలిపల్కు—, లనికిఁ గోత్తలసేయదూటి
జళికించు ఘోట్టాణములుగాఁగ-విమల
ప్రణవంబుగనగోల-బ్రహ్మసూతుండు
సనుచతుస్స్వరములు జానువగ్గంబు
లగపతివిల్లు పన్నగపతిగుణము
జగదేకగతియైన శౌరిబాణమ్ము
గా-నడచి కఠోరకహకహారావ
దూనదైత్యాంగనా మాన సుండగుచుఁ
గల్పాంత కాలవిక్రమమూర్తి-పోరు
సల్పి-యాదైత్యులఁజదిపి-పురమ్ము

లఱగాల్చి-యమరులయదవదల్మాల్చి
హరుఁడుద్రిలోక శంకరుఁడౌచు వెలసెఁ—
దెంపరియైనిల్చిత్రిపురదానవులఁ
జంపినదాన దోషము సంక్రమించి—
దానిఁబాపికొనంగఁ దపమునుబట్టి
మానితంబుగను 'భీమాశంకరి' యను
తలమున నిల్చిన, నెలఁదాల్పు మేన
వెలలిన చెమట నిర్వేలమైపొంగి
యాపగయై-భీకరాఽఽరావమెసఁగ
నాపన్నఖగమృగమై-యావులించి
పుండరీకుని గృహమ్మును మ్రింగరాఁగఁ
బాండురంగనియానఁబట్టి, తత్క్షేత్ర
పాలకుండై యున్న భయదహుంకార
శీలుండు-మొగి 'భీమసేన భైరవుఁడు'
గనుబొమ్మలార్చి-యుత్కటముగానార్చి
వణఁకదిక్కరు, లేచి బాహాస్ఫళించి
గదఁబూన్చినంతన గడగడ నడుకి
బెదరియానదిరసావేశంబు వదలి.
మొరయుటమాని-సుందరచంద్రరేఖ
పరుసన నిత్యయౌవనమూర్తియైన
నందనందనునింటిముందట- భక్తి
కందళితానంద కలికలధ్వనులఁ
బాఱుచున్నది, పాపపంకనిష్కాన
నారూఢయైనరెండవ గంగవోలి;
దానిచెంగటనున్నభాను తీర్థమ్ము
దానమాడిన నఘదాన చణమ్ము
హరిఁజూచి శాపంబుదొఱఁగినయట్టి
హరిహయుఁడచ్చోటఁ బురము నిర్మింపు

మనిపంప, మయుఁడు దదాజ్ఞ భావించి
కనులకుఁ జిఱుతలు గ్రమ్మించుశిల్ప
మెసలార నిర్మించె నించుమించులను
బసరింపఁగాజేయుపండరీపురము;
ననియిట్లు సూతుఁడభ్యర్థితులైన
మునులకు వినిచినపోఁకచొప్పార
వైష్ణవభక్త నిర్వ్యాజసంస్తవన
నిష్ణాతుచేత-సన్నిహితశబ్దార్థ
భావనామయుచేతఁ, బరిడరీనాథ
జీవనౌషధుచేత-జిరకాలజప్త
భాసురాష్టాక్షరీ పరమంత్రవర్ణ
భాసిత జ్ఞానవిభాతృప్తుచేత——
శ్రీపతిప్రతిరూప శ్రీనివాసార్య
పాపనుత్కొండమాంబాపితృపాద
వందనామోద సంభవుచేత-భక్తి
తుందిలుచేత-నిర్ధూతాంధకార
పండరినాథది వ్యాంఘ్రునిపేరఁ
బండువుగాఁ గళాపరిణాహమునకు——
శారదాకింకిణీఝుణఝుణత్కార
పూరపూరిత శబ్దవారంబులెసఁగఁ
బలికిన పండరీభాగవతమునఁ
గులమౌళిపుండరీకుని చరితమ్ము
చెలువాఱుగాఁత భక్తులకుబండరువు
కలిమలాపహంమానకులి శోపమమ్ము

(పుండరీక చరితము సమాప్తము)

# పండరీభాగవతము

## (చొకామేళుని కథ)

ఆతని పంచముండందురే గాని
పాతిత్యరహితుండు బ్రాహ్మణుండతఁడు——
ఆతఁడజ్ఞానియంచందురే గాని
యాతతబ్రహ్మవిద్యావేత్త యతఁడు——
ఆతఁడనాచారియందురే గాని
వీతకాంక్షుఁడు యోగవిత్తముండతఁడు——
ఆతఁడు మలినుఁడంచందురే గాని
పూత మానసుఁడైన పుణ్యుండతండు——
అతఁడు దరిద్రుఁడంచందు రేగాని
యతనుకైవల్య రాజ్యాఽధీశుఁడతఁడు——
అతఁడు సామాన్యుఁడంచందురే గాని
యతిశయగుణుఁడు-భక్తాఽగ్రేసరుండు——
వెలివాడ కడవీధి నిలచిన గాని
యిల సకలంబును వెలిఁగించునతఁడు——
సంసార బంధసంసక్తుఁడే గాని
కంసారి పదయుగాఽఽకల్పుండతండు——
పాండురంగని ప్రాణపదమైనవాఁడు
పాండురంగనిసేవ ప్రాణమౌవాఁడు——
భక్తాగ్రగణ్యుండు, భక్తిజీవనుఁడు——
భక్తిప్రకాశుండు, భక్తైకతనుఁడు——
పరిహాసమునకైన బలుకఁడుమృషలు
పరకాంతలన్న తెప్పలనెత్తి కనఁడు——
పరుషభాషణములు వలుకఁడెన్నండు
పరుషవర్తనుల సంస్పర్శసేయండు——

ఉపకారపరుఁడు ప్రత్యుపకృతిఁగోరఁ
డపచారములుసేయఁ డార్యులయెడల—

శాంతి భూషణుఁడు-విసర్జితేషణుఁడు
దాంతిసంయుక్తుఁడేకాంత రక్తుండు
కరుణైకరిక్థుండు-పరతత్త్వవిదుఁడు
పరమభాగవతుండు-పరమవైష్ణవుఁడు
పావిత్ర్యపరివేష భాసురముఖుఁడు
దేవవిప్రార్చనాధీనమానసుఁడు

దండితాక్షోద్వృత్తి, దర్ప వర్జితుఁడు
పండరిపురమున వసియించువాఁడు

మెచ్చనర్హుఁడు-'చొకామీళ' నాముండు—
మచ్చులేనట్టి సన్మాన్య చరిత్ర—
యర్ణవగంభీర-యార్ద్రవాక్పూర
వర్ణనీయ విచార వానియిల్లాలు—
పలుకదెవ్వరితోడఁ బలికెనయేని
కలుషసంహార భక్తగాథలువలుకు—
చూడదెవ్వరివైపు-చూచెనయేని
చూడాశిఖండుడ జ్జూడ్కులఁజూచు.—
తలపదెయ్యదిగూడ-తలచెనయేని
తలచునురాధికాధవుని వైభవము—
నవ్వదెన్నఁడు గూడ-నవ్వెనయేని
నవ్వు సంకీర్తనానందైకవళత—
మనసునందంతట మాధవు భక్తి
కనుదమ్ములంతట గాంభీర్య భరము—
చేఁతలన్నిట రంగసేవాఽభిరతియుఁ
బ్రాఁతిగవెలుఁగ నప్పద్మాయతాక్షి—
దారిద్ర్య మొకయలంకారమైయదుక
యోరిమి రూపెత్తియున్నదో యనఁగ

నిలువడిదీర్చు-నిజేశునిదేర్చు
కలహాసములనె పిల్లలబొజ్జనింపు
వారికెన్నఁడు మనోభార మేలేదు
వారికెన్నఁడు వేడియూరుపే లేదు—
కలదు లేదనుచింతకలనైన లేదు
కలుగని దాని, కాకాంక్షయే లేదు
సుకములమత్తెక్కి సొక్కుట లేదు—
వికటాపదలఁ గ్రుంగి వేగుట లేదు —
మఱువఁ గూడని భక్తిమఱచుట లేదు—
మఱువంగఁదగువాని దఱచుట లేదు —
పాండురంగఁడువారి పరమదైవమ్ము
పాండురంగఁడువారి భాగ్యైకఫలము—
వారిసంసారమ్ము పండరినాథ
కారుణ్యపూర్ణ కేదారతలమ్ము—
వారితలంపులు పండరినాథ
చారుకాంచనమయా స్థానసౌధములు—
వారిచిత్తమ్ములు-పాండురంగఁడు-వి
హారమ్ముసేయునుద్యాన వాటికలు—
వారిజీవితములు-పరుఁడనుసూత్ర
కారుఁడాడించు గంభీరఘట్టములు -
భక్తియేజనకుండు-భక్తియేజనని
భక్తియేచెలికాఁడు-భక్తిసద్గురుఁడు—
భక్తియేదైవమ్ము భక్తియేరక్తి
భక్తియే ప్రాణమ్ము-ప్రాణబాంధవుఁడు
భక్తిపీడిన వారిబ్రదుకులేలేవు—
భక్తి గాకున్న బ్రపంచమేలేదు—
వారిదాంతత్యచాపల్యమ్ము భక్తి
వారిలక్ష్యమెభక్తి-భక్తియేసిద్ధి—

పాండురంగని కన్నపరుఁడంచులేఁడు
పండరిపురికన్న వాసమే లేదు—
తావి పూవియుఁబోలె-తాళమ్ముగాన
మై-విశ్వనాథసేవాఽభిరక్తియును
గై వల్యమట్లు-నిష్కలుషమ్ము వినయ
భావమ్ము గీర్తియువలె-తత్త్వచింత
వైరాగ్యమునుబోలె-పరిణతంబగుచు
ధీరమౌయనురాగ పూరంబు బొదలఁ
జరియించుచుందురు-శాంత్యైకపరులు
పరమభక్త్యావేశ భరితమానసులు—
విషమాక్ష వనజాక్ష భేదవాదంపుఁ
గసటు సోకనియట్టి ఘనభక్తివోలె—
వారిదాంపత్యమ్ముదూరితాఘమ్ము
సారవన్నిశ్రేయసైకఫలమ్ము—
పులకలు మల్లికా కలికలువోలె
నిలువెల్లఁదలలెత్తి నెట్టికొనంగ—
వర్షస్నపితము శాద్వలభూమివోలె
హర్షాశ్రువులను దేహముదొప్పదోగ—
స్వేదబిందువులు, విచ్చిన తుమ్మిపూల
మూదలించుచు, ఫాలమున బారుగట్ట
నెలుఁగురాపడఁగఁ గన్నులుమూతవడఁగ
లలితహాసంబు జెక్కులనీడఁజూడ
మేనుమఱచి చొకామేళ భక్తుండు
దానుగానముగాఁగఁదన్మయంబంది—
కండోలవీణపై గరములు జార్చి
పాండురంగనిగూర్చి పాడెడువేళ—
అతనిభార్య-భక్త్యావేశవశతఁ
జేతంబు జల్లనఁ, జిగురింపఁదనువు

కుచ్చెళ్ళభువిఁగుప్ప గూరయై పడగ
నచ్చెరువుగఁగాలియందెలుమ్రోయ—
పారవశ్యంబున బై టదొలంగి
తోరంపుఁగుచములుగ్రుళ్ళింతలాఁడ
నడుగులుబుడిబుడి తడఁబడుచుండ
మెడను గమ్మనిసోగ మెలికెలుదీర
నుదులయందున వింతనొక్కులుగూర
నడుగడుగందు నెన్నడుమువడంక—
కొప్పులో దురిమిన కుసుమస్రజంబు
గుప్పిళ్లలిడఁగఁ, జెక్కులు పూతబూయ
తలకొనిచూర్ణకుంతలములు ఫాల
తలమును గమిచి నృత్యమ్ము సేయంగ—
నంకురిత స్వేదపంకిలంబైన
కుంకుమరేఖ చెక్కుల జాలువాఱ
సుకుమార యగు నదీసుందరి వోలె
ప్రకృతిమనోజ్ఞ దివ్యపురంధ్రివోలె-
నాడును మధురభావావేశవశతఁ
బాడును-పాటలోఁ బాటను గలిపి-
పాండురంగనిపాదభజనంబు విడచి
యొండుకార్యము వారి కున్నదిలేదు
వారి సంసారనిర్వాహంబు-భక్త
భారవాహకుఁడైన పాండురంగనిది-
ఈరీతి నవసుధాధారాఽనుకారి
వారిజాక్షుని భక్తిపారతంత్ర్యమున
దినములానందసందీప్తముల్-గడియ
లను బోలెఁ జిటికెలోఁ, గనుమూయునంత
గతియించుచుండె-నేకాంత భక్తులకు
మతి లగియించునే! మాయాఽనురక్తి!

లలిత వీణారాగవలితమౌ నెడఁద
బలిపుష్టరావంబు భావించునేమి!
రసపూర్ణకిసలయగ్రాహి కోకిలము
విసపుటాకులు గొన్ని మెసవునా యేమి!
తరుణ కల్హారగంధాఽఽకర్షితాఽళి
బురదగుంటలయందుఁ బొరలాడునేమి!
చాతుర్యవతిపొందు చవిచూచి నతఁడు
మూతి విప్పని ముగ్ధఁ బొందునా యేమి!
లలితేందుఖండకలాపని ధ్యాన
కలితుండు-చిటివేల్పు కొలము గొల్చెడునా!
పంచాక్షరీమంత్రపఠనపరుండు
వంచితుండగునొ శాబరమంత్రములకు!
గరుడవాహనభక్తిగాథాపరుండు
పరికించునేమి నశ్వరచరిత్రములు-
ఆర్తరక్షకకీర్తి కీర్తనారతుఁడు-
ధూర్తమానవుల సంస్తుతు లొనర్చెడునొ!
శౌరి సద్గుణగణశ్రవణతత్పరుఁడు
సారహీనులతోడఁ జర్చించునేమి!
మఱువఁ డెన్నఁడు భక్తవరుఁడు గోవిందు
మఱువండు భక్తులఁ బరమకారుణ్యుఁ
డా చౌకామేళున కండగా నిలిచి-
కాచికొన్నాఁడు లోకైకప్రభుండు-
తన భక్తు చిత్త ముత్తలపడెనేని
తన దొరతనము రిత్తకు రిత్త గాదె!
యిటులుండ నొక్కనాఁ డేకాంతమందుఁ
గటితట విన్యస్తకరుఁడైన వాని
రంగని దనచిత్తరంగంబునందు
పింగారముగఁ బ్రతిష్ఠించికొన్నపుడు

మెఱుగారు తొలకరి మెఱపును బోలి
పరువెత్తె చొక్క భావమ్ము చిత్తమునఁ-
"దినదినంబునుగూడ దేవాలయంబు
గనులు చల్లఁగఁ గాంచఁగంటినే గాని
గుఱుఁతైన బంగారు గోపురంబునకుఁ
గరపుటంబులు మోడ్వఁగంటినే గాని-
యిష్టదైవమ్ము దర్శించు ధన్యులకు
సాష్టాంగపడు నదృష్టము గంటిగాని-
పరమభాగవతుల చరణరజంబు
గర మర్థి ధరియింపఁ గంటినే గాని-
తారకమనువు, సంసారబంధన ని
కారంబు, భజియింపఁగంటినే గాని
తారకనామ గంభీరకాసార
వారితరంగవిహారి హంసమ్ము
తారకమంత్ర దివ్యాంగనాహృదయ
పారమ్య నవనవప్రణయవర్ధనుఁడు
తారకమంత్ర నిత్యానందదాయి
శారదీకమననీహారకరుండు
తారకమంత్రదుగ్ధార్ణవశాయి
తారకమంత్ర ముక్తాహారహారి
తారకాద్యక్షరోంకారపంజరుఁడు
తారకమనువనీతరుణమాధవుఁడు-
తారకైందవకలాఽఽదరశివతాతి
తారక దివ్య భాగీరథీజలధి
తారక పుష్పగంధమ్ము, పవిత్ర
తారకమ్మృదుహాసతారకితుఁడు-
తొలిపల్కు మొదవుల వలపించువాఁడు
చిలిపి నవ్వుల సుగంధిలమైనవాఁడు

పాలబుగ్గలఁ గళల్బండినవాఁడు
ఫాలాక్షునకు వేఱుపడరానివాఁడు
వల్లవీమానై కపళ్యతోహరుఁడు-
కల్లరి, చిక్కిచిక్కని మాయలాఁడు-
అర్చావతారుఁడై యమరినవాఁడు
చర్చింప దేవతాసార్వభౌముండు
వాని మూర్తిని జూచు భాగ్యంబు నాకు
నీనాటికిని గల్గ దేనాఁడు గలదొ!
గోపురద్వారంబు దాపున జేరఁ
గోపగించెద రర్చకులు పొమ్మటంచు
నాపూర్వజన్మ పుణ్యములెప్డు బండి
గోపాలదేవుండు గొలిపించికొనునొ!
కన్నులు జల్లఁగాఁ గనుగొను నియతి
యున్నదో! లేదొ! నాకొక్కసారైన
యెన్నాళ్ళ లిటు బరీక్షించునో గాని
కన్నులు కాయలు గాచె నిప్పటికె
కారుణ్యమెన్నఁడు గలుగునో గాని
తీరని విరహంబు భారమై తోచె
నేమిసేయుదు నింక యెట్లు వేగింతుఁ
గామితంబొడఁ గూర్పఁగలుగువారెవరు!
పాలపొంగులువోలెఁ బైనెత్తివచ్చు
నేలీల నీయాసలింకింపఁగలను!
పాయక సద్భక్తవరుల రక్షించు
తోయజాక్షుఁడె నాకు దూరమైనాఁడు
హరి హరీ! యెంతటి యపచారమయ్యెఁ
దరుణార్కనేత్రు నిందయొనర్పనగునె!
తోయజాక్షుండేమి సేయునొ విధికి!
చేయంగ లేదేమి చిత్తమే యున్న——

చేయునో! సేయఁడో! సేతుఁ బరీక్ష
పాయునో! డాయునో! భక్తవత్సలుఁడు—
పండునో! యెండునో! నిండుభాగ్యములు!
పాండురంగుఁడు గృపాపరుఁడౌనా! కాడా!
కనుగొనవలె నేడు కచ్చితంబుగను—
నను భావములు హృదయంబున దోచి—
శివమెత్తినట్టులు చెంగున లేచి—
యవయవంబులు తూల-నడుగులు సోల
గనుగవ బ్రాల్మాల-గన్నీరు జాల
దొనకంగ-నెలుఁగును వణకంగ-దనుకు
దనుకంగ-మోదమ్ము బెణకంగ-నెడదఁ
బెనఁగొన్న వలఁపులు బిరుపీకొనర్ప—
పిగముడి వీడి విచ్చిన కల్వపూలు
మొగముపై వెండ్రుకల్ మొనసియాడంగ—
దీనదీనములైన దృక్కులు ముసర
దానమాడినయట్లు ధారలుగాఁగ
స్వేదంబు గురియంగఁ జేతులనెత్తి
యాదిపూరుషుని నాహ్వానమ్ము సేయు
వడువున-భావంబు పొడవైనయట్లు
నడచుచుఁ దనవెంటఁ గడువడివచ్చు
జవరాలితోనైన చర్చింపలేక
యవశుఁడై రంగదేవాఽఽయతనంపు
చరమ మహాద్వార సవిధమ్ము జేరి
వరధూళి ఫాలంబుపై ఘటియించి
తోరంపు భక్తి చేతోవీధి వెలుఁగ
ద్వారపాలకులకు దండంబువెట్టి—
భవరోగహరునకుఁ బాండురంగనికి
భవభావితుండైన పాండురంగనికి—

భక్తి జీవనుఁడైన పాండురంగనికి
భక్తసత్త్వుండైన పాండురంగనికి—
శ్రుతి వధూసీమంత శోభాయితునకు-
శ్రుతి వతంసిత చరిత్రోదారునకును—
ధరఁజాగి మ్రొక్కి- సాదర భక్తి యుక్తి-
కరములఁ గన్నీటి కరడులుబట్టి
నిలఁబడి-రుద్ధమై యెలుఁగు వణంక
పలుకులు వస మఱి-పలపలగాఁగ
పెదవులు చలియింప-పదములువణక
వదనంబువాడ-సమ్మదముతూగాడ
నెదనాన్చికొనియున్న యిల్లాలికండ్ల
నుదయించి స్రవియించు నుష్ణబాష్పములు
దలపైని బడి-తారకలఁ బురుడింప—
నిలకు వాల్చిన హృదయేశ్వరిమూపు
దనపదంబుల దోయిఁబెనఁగ-నిశ్చలత
బొనుపడినట్టి చూపులపూలు సల్లి
తనదైవమైన రంగని కర్పణముగ—
మనసులోపలి నెగుల్మాన్పంగలేక
పలుకఁగలేక-పల్కక యుండలేక
పలవించె నీగతిఁ బరమ వైష్ణవుఁడు-
"యేమిరా రంగయ్య! యేమిరాజియ్య!
యేమిరా! నాభాగ్య భూమిగోవింద!
లోకంబు చీఁకటిఁబో కార్చు నీవు
చీకటి కోనలోఁ జేరినావేమి?
సకలంబు నీవుగాఁ జరియించు విభుఁడ
వొకమూర్తిలో నిల్చియున్నాఁడవేమి?
కొలచు భక్తుల మనంబులు రెచ్చగొట్టి
కులుకు తావుల గర్భగుడిలోనఁజేరి

దాఁగినావేమిరా! దయలేనివాఁడ!
యోగిపుంగవ మానసోర్మ్ములలేవా!
కమలామనోజ్ఞ వక్షస్థ్సలి లేదో!
తమకింపనునుబావ తలిమంబులేదా
విహగ నాయకపక్ష వీధీవిహార!
గుహవంటియొక చిన్ని గుడియేమి నీకు!
మడుగు గోపురముల మధ్యలోఁజేరి
మడిగట్టికొన్నావా! మాతండ్రి! నీవు!
ఉడుకు వేదన తూగిపడు భక్తికన్న
మడుగెక్కువేమిరా! మాధవా! నీకు!
అతి పవిత్రము హృదయార్పణ కన్న
వితయైన పిలుపీచ విద్దెలే ప్రియమొ!
యెదజీల్చికొనివచ్చు నేడ్పులకన్న
వదరెడు కైతవ వాక్యంబులితవా!
మాసంస్తుతులు నీకు మనసునకెక్క
వో! సర్వ భూతదయోద్రిక్త హృదయ!
నా భక్తిలోనె యున్నదొ లోపమొకటి!
నా భాగ్యమందెయున్నదొ లోపమొకటి!
కోపమ్ము లేదు నాకు మునీంద్రవంద్య!
లోపమేమిటికి నిరూపింపవోయి!
యేభక్తిఁ జూపెనోయీ! కుబ్జ తొల్లి!
యేభక్తి జూపెనోయీ యుద్ధవుండు'
నేభక్తి జూపెనోయీ! గజేంద్రంబు!
వ్రేతల మనసులు వెలిఁగించినావె!
నాతండ్రి యేలరా! నన్ను గన్గొనవు!
యెన్ని రీతులుగాఁగ నిన్ను నొప్పించి
యున్నానొ! దయజూపవోయి! రంగయ్య!
నీవు గోపము సేయ, నిల్చునా! లోక

జీవ కోటులు దయాపింధు! రంగయ్య!
మావంతు దోషసమాచరణంబు
నీవంతు సైరణ నిజము రంగయ్య!
తప్పులన్నిటిఁగూడ దయనక్షమించి
యొప్పులుగాఁ జూడవోయి రంగయ్య!
శరణాగతులనేలు దొరనీవుగాక 55
మఱి యెవ్వరున్నారు మహిని రంగయ్య!
శరణాగతత్రాణ బిరుదంబుగట్టి
పరికింపవేమి నీభక్తు రంగయ్య!
కనుపింపరా! కండ్లకఱవులుదీరఁ
గనుగొందు నిందిరాకాంత! రంగయ్య!
కనుపింపకున్న నీక్షణమందెబోయి
పనిబూని-నీభక్త పక్షపాతంబు
మెఱమెచ్చులంచును, మేదినియెల్లఁ
దిరిగి చాటింతు నుద్దురత రంగయ్య!
కనుపింపరా! భక్త కల్పవృక్షంబ! 60
కనుపింపవోయి! లోకైక ప్రభుండ!
కనుపింపరావోయి! కజ్జల నీల!
కనుపింపవోయి! శ్రీకామినీ కమన!
వినబడలేదా! నావేదనాధ్వనులు!
వెనుకాడు చున్నావా? విచ్చేయుటకును!
గరుడదేవుఁడులోన గాచికొన్నాఁడా!
గరుడసాహ్యములేక కదలవో! స్వామి!
కరిమొఱవిన్నప్డు గరుడుడేమాయె!
త్వరపడి నీ యాయుధమ్ములు మఱచి
పరుగెత్తినావు కావుర! పాండురంగ! 65
యరమరలేల సేతుర! నాకుఁగాఁగ!
అలఁత గూరినదా! నీయంగ కంబులకు

నలకాలమూర్తి! కినలఁత మెక్కడిది!
మఖమూర్తి నిద్రనే మఱితివోయేమొ!
నిఖిలసాక్షికి నీకు నిద్రయెక్కడిది!
శరణాఽఽగతుల మమ్ము మఱచితివేమొ!
పరమ చిన్మూర్తికి మఱపులెక్కడివి!
మాన సమన్యచింతానిఘ్నమేమొ!
యానందమూర్తి దుఃఖాంశసంగతుఁడె!
కనుపడనేవలెఁ గన్నులముందుఁ
గనుపడకున్ననే గదలనోస్వామి!
రార! దీనాఽవనాఽఽచార భండార!
రార! శ్రుత్యంగనారసకర్ణపూర!
రార! దుర్వారసంసార నిస్తార!
రార! నిష్పారకూపార గంభీర!
రార! ధారా ధర రమణీయదేహ!
రార! నాయూర్ప! రారా! పాండురంగ!
పసిడి గజ్జెలు కలక్వణనంబులీన
రసమయంబగు వంశిరాగముల్వాడ
నెమలికన్నులగుత్తి నెత్తి పైగులుక
కమనీయ దృక్కులఁ గాటుకలొలుక
పదములు బద్మసంపదలు జూరాడ
బెదవిపై జిఱునవ్వు వెన్నెలేగాయ
కలవోలె-కలలోని కఱిమబ్బువోలె
నెలవోలె-నెలలోని తెలినవ్వువోలె-
నిలువరా! నా ముందు నీరేజనేత్ర!
కలకలనవ్వరా! కఱి గొల్లవాఁడ!
వత్తువో రావో! యాపన్నులయెడలఁ
జిత్తమున్నదో! లేదో! జెప్పరా! స్వామి!
పలుకరా! నా తండ్రి! పండరినాథ!

పలుకరా! నాభాగ్యఫలము! గోవింద!
పలుకరా! నాకంటిపాప! నావెలుఁగ!
పలుకరా! నాపాలి పారిజాతంబ!
తలకొనినవసుధాధార జిందెడునొ!
మదిలోని బిగువెల్ల మాయమయ్యెడునొ!
యెదలోని కడితెరలింకిపోయెడునొ!
దాచియుంచిన లిచ్చతఱిగి పోయెడునొ!
పూచిన చిఱునవ్వు పొల్లువోయెడునొ!
యేమి నా ప్రాణంబ! యేర! కన్నయ్య!
కామితార్థములిచ్చు ఘనుఁడీవుగావొ!
పలుకనే వలెనీవు, బలుకకయున్న
పలికించు వఱకు నా పంతంబుసుమ్మ!
పాండురంగని నమ్మి భక్తునికోర్కె-
బండనేవలయు నెప్పటికైన సత్య
మనుచు నీగతి వివిధాఽద్భుతరీతు
లను-మేనుమఱచుచుఁబనవెడువాని-
నెఱిజూచి-విస్మయభరితమానసులు
పురివారలెల్ల గుంపులు గాఁగఁగట్టి
యవునవు నద్భుతంబని యెడువార
లవనిలో నిట్టిడు లఱుదనువారు-
ఔర! మహాత్యాగమనియెడువారు
దూరంబు నుండియే దొఁగెడువారు
పాండురంగని నమ్మి బ్రదికినవార
లుండిరే! యని నెచ్చనూర్చెడువారు-
పాండురంగఁడు భక్తపరుఁడేనివచ్చి
యుండఁ డేమనిగ్రుడ్లనుఱిమెడువారు
పాముకాళ్ళను గూర్చి పామేయెఱుంగు
భామపాతివ్రత్యమామెయే యెఱుఁగు

నిలకున్న యోరుపు నిలయే యెఱుంగు
జలధిగాంభీర్యంబు జలధియే యెఱుఁగు
గగనవైశాల్యమ్ము గగనమేయెఱుఁగు
నగజాతలోకశక్తి నామెయే యెఱుఁగు-
రంగనిదైన యభంగురచరిత
రంగఁడే యెఱుఁగు నిర్భాగ్యమానవులు
దెలియుదురే! యని పలికెడువారు-
'తెలిపితి' వని కలకల నవ్వువార
లగుచునాడుచునుండ నంతకంతకును
నెగచిన సవ్వడి నింగిఁదట్టాడ-
ఇంతలో దేవాలయాంతర్నివిష్ణు
లంతర్గతజ్ఞాను, లతి వక్రగతులు
క్రోధ ధూమ్రాక్షులు-కుటిలకటాక్ష
బాధిత సద్భక్తవరులు-జల్పకులు
శాంతిహీనులు-లోభసంకీర్ణమతులు
దాంతివర్జితులు-నితాంతాఽఘయుతులు
రంగపదధ్యాన పంగుమానసులు
భంగురసౌఖ్యచాపల్యరూషితులు-
హరివినిందకులు-బాహ్యాచారరతులు
పరమార్థ మూర్ఖులు-నరనుతిపరులు
దేవాలయార్చకుల్దెలిపి-యసహన
భావంబు విసమట్లుఁ బ్రాఁకనివ్వెల్ల
బలువిడి పరుగెత్తి బయటికివచ్చి
యలజడిఁ జేయెత్తి యదలించి నిలిపి
పలుకు పల్కునఁ గ్రోధభరధూమ భూమ
దలకొన వివశులై-తరటిరీగతిగ
యోరి! దురాచార! యోరి! చండాల!
యోరి! దుర్వాద గర్వోద్రిక్తహృదయ!

ఓరియున్మాది! యోరోరి! బాలిశుఁడ!
యోరికపటవేష! యోరి యజ్ఞాని!
తలకొని కన్నులు దలకెక్కె నేమి!
చిలిపికావరము గన్నులు గప్పె నేమి!
మద్యంబు చేమేను మత్తెక్కె నేమి!
యాద్యునిసేవ నీ కబ్బునా! యేమి!
నిత్య స్వరూపుండు నీయింటికాపొ!
సత్యంబు వలుకు మసత్యవర్తనుఁడ!
నక్కచేరునయేమి నాగలోకంబు!
ముక్కిడిగనునె యామోదసౌష్ఠవము!
కుక్క కాశికిఁబోవఁ గూడునా యేమి?
కొక్కెరనేర్చునే గుప్తధర్మములు!
బధిరుండు గాన మాస్వాదింపఁగలఁడొ!
యధ మాధములు ముక్తి నందంగఁగలరొ!
ఖండదుర్భాషా ప్రపంచదూషితుఁడు
చండాలునకు నేటి సన్మార్గవృత్తి!
యతినింద్యమృగపలాఽఽహారదృప్తులకు
మతిఁగల్గనేర్చునే మాధవభక్తి!
యాసవజటిలదుర్వాసనాగ్రంధి
యాసరోజాక్షునాహ్వానింపఁ గలదొ!
మలజుష్టదేహాఽభిమానకష్టుండు
మలహరునామ సంస్మరణ కర్హుండొ!
యంగజారికి దృష్టి కందనివాఁడు
దొంగముక్కులతోడ దొరకునా! యేమి!
శ్రుతివధూస్తనముల జొక్కెడువాఁడు
పతితులమనసులఁ బవళించునేమి!
వేదాంతవాక్య సంవేద్యుఁడౌవాఁడు
ఏధిజోగులఁ గూడి నెతనొందునేమి!

నిత్యసూరులయెద నిల్చినవాఁడ
సత్యవాదుల నంటి చరియించునేమి!
యోగీంద్రహృదయాఽనురాగియౌవాడు
భోగులకంటికిఁ బొడసూపునేమి!
నారదగానసానందుఁడౌనాఁడు
వీఁడిపాటకు వేకారునేమి'
భళి భళీ! నేటికి పాండురంగండు
వలచినాఁడయ్య! వలలఖాదిభక్తి!
వాఁడెట్టులో భ్రమపడినాఁడ నుండు
చూడనేర్చితిరెట్లు సుండు మీరెల్ల!
వచ్చినప్పుడె మీరువానితోఁగూడ
మెచ్చి పచ్చనిపులు మేసినారేమి?
యెద్దీనె నన్నచో నిదియును కద్దు
కద్దని గాటికిఁ గట్టుండనెదరొ!
వీనితో నిప్పుడు నిర్థలేశ్వరుఁడు
బూని-యాభాషణములు సేయునేమి!
వాలినరతివెంట వచ్చునా! యేమి!
చాలు చాలిక యపచారవాక్యములు-
తరలుండు-లేకున్నదరలించు మిమ్ము
పరభయంకరుఁడైన పాండురంగండు-
ఓరి చొకామేళ! యోరంత ప్రొద్దు
పారంబు లేనట్టి వాదముల్ద్రవ్వఁ
దీరికెగా లేము, సారమేయంబు
సేరనర్హంబొ యజ్ఞీయస్థలమ్ము!
పూతంబు రంగగోపురమును దాకి
బ్రాఁతె! జండాలుండు బనివడి నిలువ
రంగదెచ్చట! నీదువంగడం బెచట!
సంగతి, యేరీతి సరిపడునోయి!

వెలివాడలోపలఁ బలికినయేని
వెలవచ్చు నీపాటి వెలఁతిమాటలకు-
వెఱ్ఱిభక్తుల వెఱ్ఱిమొఱ్ఱియాటలకు
గుఱ్ఱఁడే మావాఁడు గోరిక పడఁగ?
నంతఁగానీ వాఁడెయైనప్డుసూత
మింతకుఁ బలుకకు మిట్టిమాటలను
గదలు మిచ్చటినుండి-కదలలేవేని
గదలింతుమిపుడ నీకాళ్ళు బంధించి
యని యిట్లు బూజారులాగ్రహోయత్త
మనముల బెదరింప విని చొకామేళుఁ
డంత దిక్కుల నేత్రకాంతులు జిమ్మ
నుంత శీర్షంబెత్తి-యంతకాంతకున
కాదిపూరుషునకు-యజ్ఞమూర్తికిని
వేదవేద్యునకు సం విత్స్వరూపునకు,
నంధకాంతక భావనాంబర మణికి,
నంధకారైక సంహర్తకు, నిఖిల
కర్తకు, యోగవిహర్తకు, మఱి య
కర్తకు, విష్టప భర్తకు మ్రొక్కి-
తనకట్టెదుట నిల్చి తఱుముచు నున్న
వనరుహాభవవంశభవుల నర్చకులఁ
గరమర్థి గనుగొని-కరములు మొగిచి
శరణార్థినని నమస్కారంబుసేసి
పరమార్థగంధబంధురములు-వినయ
వరణీయపీయూష పరిపూరితములు
శాంతిశీతలములు, సరసస్ఫుటములు
దాంతిపూతములు, ముక్తాప్రతిమములు
వేదాంత రాహస్యవీధిదీపికలు
బోధవారణ కర్ణమూల ఘంటికలు

తుందిలరసము, లానందకందములు
సౌందర్య సౌధశిల్పమ్ములు, ముక్తి
కాంతామనోహర కర్ణతాటంక
కాంతమ్ములైన వాక్యమ్ములు గూర్చి
పలికె సాయుజ్యభావానందభరము
నలువొప్పననుభవించిన పుణ్యులార!
దేవతాంశజులు, భూదేవులు మీరు
భావింప మీకన్న భగవంతుఁడున్నె?
యాదిపూరుషు ముఖంబందుద్భవించి
వేదముల్ నేరిచి, విమలవిజ్ఞాన
బోధకులై లోకములఁ గడ తేర్చు
సాధులు కారణ జన్మలు మీరు
మీకట్టెదుట నాయమే మాకుఁబల్క—
లౌకిక సౌఖ్యసమాకర్షితులకుఁ
దాపయుక్తులకు నిర్వాపితదీపి
కోపమజ్ఞానుల, కురుపాపరూషి
తులకు బద్ధులకు-మూర్ఖులకు మదాంధ్య
ఖలిత వర్తనులకుఁ, గలిసేవకులకు
బహుజన్మవాసనా పరిదూషితులకు
కహ కహ నినదహంకార బద్ధులకుఁ
జరణరజంబుల శిరసావహించి
యరిగెద, మఱలుట కన్నముందుగను
నాదొక్క-మనవి విన్నప మాచరింతుఁ
బాదస్థలిని, బ్రహ్మవాదులు మీరు
వహియించి దయ యనుగ్రహము సేయుండు
దహతహ నుడుపు నుత్తరమొండు నాకు
మాలనంటిరి నన్ను-మాలనే యౌదు.
మాలవానికి రక్తమాంసముల్లేవా?

మాలఁడన్నంతనే మనుజుఁడుగాఁడొ!
మాలవానికిఁ బరమాత్ముఁడు లేడొ!
మాలని హృదయంబు మడిగట్టలేదొ?
మాలని చూపులు మాలలే యౌనొ?
వెలివాని కన్నీరు వెలలేనిదౌనొ?
వెలివాని భక్తియుఁ గులహీనమౌనొ?
సర్వభూతములందు సమముగా వెలుఁగు
సర్వేశునకు నివాసము సేయ యోగ్య
మౌనొ! కాదో! యేమి మాలని మనసు
దీనావనవ్రతాధీన మానసుఁడు
దీనులందఱఁగావ దివురునే గాని
మానునే యార్తుని మాలవాఁడనుచుఁ
గడలినెల్ల జలంబు గలియునో లేదొ?
గడలికి నంటునే గశ్మలమింత?
పావకుండన్నిటి భక్షింపఁడోటు
పావిత్ర్యమునలోటు వాటిల్లెనేమి?
యక్షరోచ్చారణం బందరౌనర్తు
రక్షరం బంతట క్షరమాయెనేమి?
యిలపైని మలినంబు నిలిచినయంత
నలవసుధకుఁ బూజ లడుగంటెనేమి?
గాలి సర్వంబును గప్పు బక్షముఁ
గూలెనే దానితోఁ గులగౌరవంబు
సకలంబుపై ప్రభాచయముగుప్పించి
వికలమైనదియొ సవిత్రుని బ్రదుకు
సత్త్యైకవశునకు సర్వేశ్వరునకు
నిత్యరూపునకు నీ నియమ మెక్కడిది?
"కాదు-కాద"న్న వాక్యమ్ములు గూడఁ
గాదన్నవానికీ భేదమెక్కడిది?

ధరణి సర్వంబును దాసుగా వెలుఁగు
పరమూర్తికీ యేరు బందర మేమి?
తాకుటయేదొడ్డ తప్పుగానౌనొ?
తాకకయే మమ్ముఁదామున్న సృష్టి
జేసినాడా? యేమి? జీవేశ్వరుండు?
యాసకు పాదుదివ్యస్వరూపుండు
నామహో మహాందల్ప నైతిమయేని
యామూర్తి వీక్షింప హక్కులేదేని
వానిపూజకు మేము బాహ్యులమేని
వానిపాదమ్ములు బట్టరాదేని
వానిప్రసాదనం పాదమునకు
దీన మర్త్యులు బ్రయత్నింపరాదేని
మమ్మేల సృజియించె మహిపై నిదానుఁ
జుమ్మలు చుట్టు దుఃఖమ్మున నలిగి
కాలునెడందల కన్నీట దడిపి
సోలియూర్పుల చింతగూరి నశింప
వలెనంచునో! భక్త వత్సలత్వంబు
ఫలియించునో భేదభావమేయున్న
నేకస్వరూపుఁ డనేక రూపుండు
శ్రీకాంతునకు నిట్టి చిన్న తలంపు
లుండునా? కరుణకు భండారమైన
పాండురంగఁడు భక్త పరతంత్రుఁడెపుడు
మారంగని యెడంద మలినంబు గాదు
మారంగమూర్తికి మడుగు లేసున్న
మావాని ప్రేమకు మచ్చయే లేదు!
మావాని లీలకు మరియాదె లేదు!
యలనాఁడు శబరియెంగిలి దినలేదా?
వలనొప్ప రంగఁడు వానిలోమైల

వెలి "పులికాపులు" దొలుచునాయేమి?
యిల బుట్టినట్టి భక్తుల నోళ్ళయందు
నానిన రంగని నామమంత్రంబు
ధ్యానంబొనర్పంగఁ దగునయ్య! మీకు—
మలినంబుగాలేదొ? మైలగాలేదొ?
గులము నుచ్ఛేదింపఁగోరిన ద్రోణి
శరమును దొడిగి రోసంబున విడువ
పఱచి యా యభిమన్యుపడతి గర్భంబు
నరిది యస్త్రంబు శతారమ్మువోలె
దఱుగనుద్యోగించు తరుణంబునందు
నుదరస్థుఁడగు బిడ్డఁడో కృష్ణ! కృష్ణ!
సదయత నన్ను రక్షణ సేయుమయ్య!
శరణాగతుఁడనంచుఁ బొరిపొరినేడ్వ
మఱువక యంగుష్ఠ మాత్రశరీర
మునుదాల్చివెసఁదూరి జననిగర్భంబు
చనవుదొలంక రక్షణముసేయండె?
రంగఁడాపొత్తిగర్భంబున నెంత
యెంగిలి యంటెనో యెవ్వరి కెఱుక!
మనవలె నేగ్రోధమాత్సర్యలోభ
గుణములఁ జిక్క స్రుక్కునె ప్రేమమూర్తి!
యగధారి కాక త్రోవ యన్నదేలేదు
పగబట్టి మీరేల పట్టి కట్టెదరు?
భక్తుల భృకుటి సేవకుఁడు రంగండు
భక్తుల కరిగాపు పాండురంగండు
భక్త సద్భక్త్యేక వశుఁడురంగండు
భక్తులతీరని బలము రంగండు
భక్తులహృదయమే భగవంతు గృహము
భక్తుల భావమే పరుని భావమ్ము

భక్త సంతోషమే పరుని సమ్మదము
భక్తునిదుఃఖమే పరుని దుఃఖంబు
భక్తుల యెదలనే భగవంతుఁడుండు
భక్తులువసియింత్రు భగవంతునందు—
నిరువురకును భేద మిసుమంతగాన
మొఱ పెట్టియేరీతి పరికింపనైన—
చిక్కఁడు వ్రతముల చిక్కండుశ్రుతుల
జిక్కఁడు మఖముల నొక్కభక్తునకు
నిరతంబు ప్రభువు సన్నిహితుఁడై యుండు—
మెఱమెప్పులకులోగి మరగఁడుశౌరి
భగవంతుపై భావ బంధమ్ములేక
వెగడు వేషమ్ములు వేసినయంత
దొరకదునిజముగా, దుర్లభమైన
వరముక్తి సామ్రాజ్య భద్ర వైభవము
భక్తియోగము పాప వనకుఠారమ్ము
భక్తిసక్తుల కెందు బాధలేలేవు.
పాండురంగఁడు నేఁడుపలుకునోలేదో
పాండురంగఁడుగాన వచ్చునోలేదో
జూడనిండొకసారి జూతును గాని
చూడాకలాప విచ్ఛురితుఁడౌ వాని
చంద్రభాగా మనస్స్వామియౌవాని
చంద్రికామధురహాసము జిల్కువాని:
గోధూళి ధూళిత కుంతలశాలి
రాధాస్తనాశ్లేష రతుఁడైనవాని
ఫల్గునరథజయ ధ్వజుఁడైనవాని
వల్గునేత్రముల చాపలముల వాని:
వ్రేపల్లెవాడల విహరించువాని
గోపగోపీ మనోగుప్తుఁడౌవాని

కారుణ్య మంజులకాంతియౌవాని
తారుణ్య వలిత మంధరశైశవాఢ్యు
బంధు జీవక బంధుపాటలాధరుని
సింధుకన్యాపతి సింధురయాను
నదె! వచ్చుచున్నవాఁడడ్డంబు దొలఁగుఁ
డధరబింబపుఁగాంతి యదిగో! ముందటను
బదముల గలకలక్వణనంబుఁ విగో
వదన బింబము నందు వలఁతి నవ్వదిగో
పోవనిత్తురుమీరు పోనీకుఁడయ్య
భావవాగురులచేఁ బట్టంగ నిండు
శ్రుతులకందనివాఁడు చోద్యమౌవాఁడు
పతిత పావనుఁడైన పాండురంగడు
వచ్చుచున్నాఁడు నాపాలిదేవుండు
మెచ్చికొన్నాఁడు నేనిచ్చుపూజలకు
ననిముగ్ధుఁడగుచు దేహంబును మఱచి
పనవుచుండెడి వాని భక్తాగ్రగణ్యు
గనుకొని యర్చకుల్ కలకల నవ్వి
కనుపించినాఁడయ్య కన్నులలోనె
రంగధాముఁడు వెఱ్ఱివెంగళయ్యలకు
నంగంబులో భక్తిపొంగి పోయినది
వినువారలున్న చెప్పెడి వారికేమి?
వననిధి మోకాలి బంటిదేయంద్రు
నడునడురా! మాల! నవ్వులచేటు
నడువీధిలో నిల్చి నాట్యమాడెదవు
ముచ్చటేమిది వీని మొనపి త్రోయుండు
రచ్చకెక్కిన నింక హెచ్చు కుందేమి?
యని పల్కి నడుముల నంగవస్త్రములు
బెన పైచి బిగియించి వీరులై నిలిచి

మొదట నా యిల్లాలిఁ బున్నెంపుఁ బ్రోవు
సదమలభక్తి కాసార నరుంధ
తినిబోలు సాధ్విని, దేవసంభవను,
దనికిన కచ్చి, ముందలపట్టి యీడ్చి
మెయిఁగ్రుద్దియాచొకామేళుని దరిపి
పయిపయిఁబడఁదన్ని బరబర నీడ్చి
యెక్కడున్నాఁడొ నీ నిక్కంపుదేవుఁ
డిక్కడలేడు పొమ్మి" యంచుఁద్రోవఁ
గాయంబు బేటెత్తి కమిలిపోవంగ
గాయంబు లందుండి కారెడురక్త
పూరంబు జాల్గట్టి పాఱనుచ్చ్యాన
పారావతాంగుళి పాటలనేత్ర
పరిసరంబులనిండి బాష్పముల్ దొరఁగ
శిరమున కుంతల భరమువ్రేలాడ
నంగముల్సొలసి యుయ్యాలలూగంగ
భంగంబునొంది కోపంబింత లేక
బలవంతముగ నగ వెలయించి, వారి
కిల జాగిమ్రొక్కి యంఘ్రుల ధూళిగొంచు
శిరమున ధరియించి, మఱలనుంకించి
మఱలని చరణముల్ మఱలింప లేక
యక్కడె నిల్చి ధైర్యమ్మును లేక
యొక్కటే సారిగ "నోరంగ! రంగ!
కనిపించె నీ ప్రేమ కపటమే నోయి!
పనిచేటు నీ భక్తి పనికిరాదోయి!
నగధారి!" యనిగొంతు బగులంగనార్చి
వగనిండుకొన తన మగువపై నొఱఁగి
యవశుఁడై సేరెఁగృహంబు భక్తుండు
నవమానమున జిక్కియలమట బొందు

శౌరిభక్తుని జూడ నేరక యస్త
ధారుణీ ధరమందు జేరెను సవిత—
యర్చక తతి హృద యమ్ములఁ దమస
బేర్చెనో యన బర్వె మింటఁ జీకటులు
అక్షమ పరమభక్తావజ్ఞఁజూచి
పక్షులు గూండ్లలోఁ బారాడ కుడిగె
బీరపూవులకాంతి దారాడి-మింటఁ
దారకానికరంబు దందడి వెలిఁగె
విదిత భక్తుయెద వికసింపలేదు
నదవద యైన దేహంబున నుండి
దొరఁగు శోణిత ధార దరుగనే లేదు
ధరణి ధూళీపాళి దనికిన కన్ను
గవనిండికొని, వానకాఱులు గట్టు
నవమాన బాష్పంబు లాగనే లేదు
పరమార్థ భక్తిసేవలు సేయఁబూను
తరుణి చేతలు మదివాకనే లేదు
బుడి బుడి నడలఁబైఁ బడునాసబఱచు
బుడుతల ముంగురుల్ దడవనే లేదు
ఖండితమ్మైన వృక్షమ్మును వోలెఁ
బాండురంగా! యంచు బడినాఁడు బుడమి
నెంతజేసితివోయి! యిందిరారమణ!
పంతంబు నాపైనె పట్టినావేర!
నేనుతాళుదునేమి నీ పరీక్షలకు
హీనుఁడ జడుఁడ దుర్మాన దూషితుఁడఁ
బిచ్చుక పైననా విధునస్త్రము! సుమ
గుచ్ఛంబుపైననా గ్రూరాగ్ని శిఖలు!
వనశాఖిపైననా వజ్రాయుధమ్ము!
గొనబు తీగెకునౌనా గొడ్డలిపెట్టు!

ముసలమ్మతోడనా బసికీలజోడు!
పసివంటివారిపై ప్రబలపరీక్ష!
యవునోయి! నీవు మున్నార్జించి నట్టి
ప్రవిమలకీర్తిసార్థక మయ్యె నేఁడు!
సలలితమ్ములు తంతు సంతతుల్నేసి
తళ తళలకు లోఁగితఱియు కీటములఁ
జలపట్టి భక్షించు సాలీడువోలె
చిలిపి చేతలమెఱుంగులఁ జూపి-భక్త
కులముల మొగ్గ కన్నులు మోసపుచ్చి
వలపు లేనట్టి చేతల వలపించి
పారమ్ములేని విభ్రాంతిలో ముంచి
ఘోరదుఃఖమ్ముల క్రుంగ దీసెదవు!
నిన్నునమ్మి యెవండు నిర్వాణసుఖము
గన్నాఁడు గన్నార? గన్నార లేడ్పు
నీవుబూనిన రమణీయ హారములు
బావనపదభక్త బాష్పవ్రజంబు
నీవేణురంధ్రవి నిర్గతరవము
దావక భక్త సంతతి పెట్టుమూల్గు
నీపదంబులను క్వణించు గజ్జియలు
దాపరూషిత భక్త తతిమానసములు
నినునమ్మువారల నిఖలంబు 'నాదె'
యని కొందు వెన్నఁడో యప్పిచ్చినట్లు
యెన్ని జీవులు నిన్ను నెదల ప్రేమించి
కన్నీట నీపాద కంజాతములను
గొలిచి నీకయి సుఖంబులు బలివెట్టి
ఫలియింపనట్టి యాశల గూరి, మిడికి
మట్టిలో నైక్యమై మాపియున్నారొ?
నెట్టన లెక్కింప నేర్తురెవ్వారు?

కరుణావిదూర! నీచరితంబులందుఁ
బరమాణువంత ప్రేమరసంబెలేదుఁ
నిన్నునమ్మిగృహంబు, నిజసతిసుతులు
నన్నల, దమ్ముల, నందఱవిడచి,
మానుగా నీయభి మానంబునకును
ప్రాణమానములు నీరాజనమిచ్చి
యున్నారె! కద! గోప యువతులు మున్ను
గన్నారె! సౌఖ్యంబు గన్నీరుగాక!
కడవచంకను బూని గాళింది జేరి
కడుమరులేర్చి నికయి కాచికాచి
తడఁబడినట్టి రాధా సతీమణికి
నొడగూడెనే సౌఖ్య మూర్పులుగాక
ధర్మవిహీన! నీ కర్మంబులందు
ధర్మలేశంబు తథ్యంబుగాలేదు——
బనులన్ని దీర్చి సంబంధమ్ములేని
మనుజుని పోల్కి భాషణములాడెదవు
హితులహితులని లేకెవ్వరికేని
సతతంబు న పకృతి సల్పు చుండెదవు
భీభత్సమొగము దప్పించిదంభమున
సౌభద్రుఁగల నిలోఁ జంపింపలేదొ?
ధరలోన గర్ణురథమ్ముగ్రుంగించి
శరముల నరునిచే సురిగింపలేదొ?
తఱిమిఃశిఖండి ముందరనిల్పి ధర్మ
పరుఁడు గవ్వడికి నుపాయంబుసెప్పి
యమరనదీసూను నడిగింపలేదొ?
సమరంబులో గర్ణుశక్తి నడ్డు
వారలెవ్వరు లేరు బార్థుగ్రమింగెడునొ?
గౌరవులను దీర్పఁ గలుగువారెవ్వ

రనుభయంబున భీమ తనయునిరేపి
కానికాని శక్తిచే గూల్పింపలేదా?
పాండవులను మాత్రమొండుచోఁ జేర్చి
పాండవేయులను నశ్వత్థామచేత
గోఱమాలి గొంతులు గోయింప లేదా?
యఱకాలిలోఁగన్ను నదుమగాలేదా?
భృగుమౌని చరణముల్ బిసికెదునల్లె
తగవరి! నీకింక ధర్మమేదోయి!
నిన్నన నేటికి నీప్రేమ నమ్మి
కొన్నవారినిఁ దిట్టఁ గూడునుగాక!
దినమురాత్రియు నేక దీక్షతో నాదు
మనమున నమ్మి కొల్చిన గాని, నీకు
కరుణగల్గకపోవఁ గారణమేమి?
పరహితాచరణ సంఫలితావతార!
ఈనాఁడు దర్శనం బీకున్ననాదు
మేనుదొఱంగనే మిక్కిలి ప్రతిన:
యని కృతనిశ్చయుఁడైనట్టి వాని
కనుగవయెదుట రంగఁడు కాంతిపూర
పూరితసకల కుటీర భాగుండు
ధీరమందస్మితహారి నేత్రుండు
మధుకరకుల వశంకర కాకపక్ష
మధురిమసీమ, సమ్మాన్యపిశంగ
వాసుఁడు భువనైక కోశోదరుండు—
శాసితదేవతా సార్వభౌముండు—
వల్లవీహృదయదీపమ్ము! కటాక్ష
పల్లవోల్లాస సంపాదిత సురభి
మురళీ సుధాభవ్య సరసి-వేధోండ
ఖురళికామల్లుఁ, డక్రూర నిధ్యాన

వనభూమ్యనల్ప కల్పక పాదపమ్ము
వనమాలికాదామ వాసనాయుతుఁడు—
తెరచిరాజన్నట్టి దేవుండు, మౌని
వరతపఃఫలదివ్య పాదపద్ముండు—
కుణుకుణుక్వణన సంకుల రత్నరోచి
రనుబద్ధ మంజీరు, డవ్యయానంద
ధామాంగుళీధామ దామ ప్రకల్పి
తామేయ కృతక సాంధ్యస్ఫూర్తి-దేవ
కీతర్ణకము, రాధికాతనూవల్లి
కాతంద్రసురత రేఖాబద్ధమూర్తి
రాసపండితుఁడు—దిగ్వాసుఁడైనట్టి
వాసుకి భూషణు పాలిదైవమ్ము
పరతత్త్వమెదుట సంభ్రమముననిల్చి
కరములుదట్టి చౌకామీశబిలువ
నిలువెల్ల పులకల పొలములురేగ
తలఁపెల్ల నానంద తరళంబుగాగ
మొగమెల్ల నగవులు మొనసికొనంగ
నగవెల్ల గరువంపు వగలుగారంగ
గన్నులు నిలువెల్లఁగప్పి కొనంగఁ
గన్నులఁ గన్నీరు కాల్వలుగట్ట
శ్రవణముల్ మెయినిండ జనియించి నిక్క-
శ్రవణంబులను సుధా స్వనములు మ్రోయఁ
బదములు నిలువెల్లఁ బిరిఢవిల్లంగఁ
బదములలోఁ ద్రొట్టు పాటుసంధిల్లఁ
గరములు నిలువెల్లఁ గవిసికొనంగఁ
గరతలంబులు సముత్కృత చలియింపఁ
జలితాంగములు క్రమవలితముల్ గాగ
వలనంబులో నూత్నభావముల్ రేఁగ

గాలిలోఁ దిరిగెడు కరణిగాయంబు
లీలసమ్మదమున దేలియాడంగ
పరిఫుల్లనేత్రముల్ గిరగిర దిరుగఁ
దిరుగు కన్నులవెంటఁ బరిచుట్టఁ గాంతి
మదియెల్ల సంతోష మదమునఁదూగి
కదలి కదలకపైని గడ్డకట్టంగ
నవనియంతటను బ్రహ్మానందవార్ధి
కవిసి నృత్యముసేయు కరణిదోపంగ
ధరణీ సర్వంబును దానయైనట్లు
ధరణిసర్వముగూడఁ దానుగానట్లు
దనదన్నభావమే దఱిఁగినయట్లు
దనదన్నభావమే బెనగొన్నయట్లు
దానెరంగనియందు లీనమైనట్లు
బూనిరంగఁడు దనలోనె యున్నట్లు
దఱఁపులంతంతకు మెలికెలు దిరిగి
తలమేది వేగ తంద్రములొచు నుడుగ
దనచుట్టునొకవేయి తరళ తారకలు
గనుగొనలందు నవ్వెనయించి చూడ
తనమేన వేయి సౌదామనీ లతలు
గనకన వెలుగుఁలఁ గడగి ప్రాకంగ
తనయెద శత ఘనాఘనములు విరిపి
కొనకొని యమృతంబు గుండలగురియ
చూచి కాంతుల దారి చూడగాలేక
పూచిన భావముల్ దాచుకోలేక
పలుకఁగఁబోయి పల్కులు గొంతులోనె
గలకలనది యించి గడ్డకు రాక
నిలువెల్లవణక చేతులు దాచి యాళ
ఫలియింప నాభక్తపారిజాతంబు

పదములు గమిచి పేరెదహత్తికొంచు
వదలించుకొనరాక బాహులబిగిచి-
పడియున్నవానిని భక్తాగ్రగణ్యు
గడుతాల్మి మొగమునఁగళలీనుచుండఁ
గనులందుదొరఁగు శుఖాశ్రులఁజెప్ప
లనునప్పళించుచు లసమానపులక
కంటకి తాంగియైకాంతుని యడుగు
లంటిసిల్లఁగ నంక మందున దాల్చి
కనులుగూర్కిన కసుగందులవైపు
గనుద్రిప్పియెడనెడఁగను చున్నదాని
నిజనాథచరణ నీరజపూతమైన
రజము భాసించు శిరస్థలిదాని
మనసు మాయనిదాని, మాసినకైశ్య
మును జీర్ణ చీరయుఁ బూనినదాని
బతిసేవసేయుటే వ్రతమైనదానిఁ
బతిజీవలకు మేలు బంతియౌదాని
దరుణి, చొకామీళ ధర్మపురంధ్రిఁ
గరమర్థిగనుగొని పురుషోత్తముండు
చిలిపి నవ్వుల నిగ్గుచెలఁగియాడంగఁ
బలికె నీగతి భావబంధురంబుగను
"మెలఁత! నీభక్తికి మెచ్చినానమ్మ!
వలయుకోర్కులు బిండవచ్చినానమ్మ!
వరణీయమగు బ్రహ్మపదవి గోరెదరా?
పరసుఖాకరమింద్ర పదవిచేకొండ్రా?
ధనదునకున్నంత ధనముగావలెనొ?
వననిధికున్నంత వసుమతీరాజ్య
భరముగోరెదరా? వేగిరము వచింపు
మరమర లేక మీయాసదీర్చెదను?

పరమ భక్తులుగోరు వరము చెల్లించు
పరిపాటి మాప్రాణ పదమైన దబల!
యని పల్కవదనంబు నడ్డంబుద్రిప్పి
మనసులోపలియసమ్మతిసూపి భక్తి
పరిమళభారబంధురములు, తృప్తి
సురుచిరములు ప్రేమ సుఖశీతలములు
వైరాగ్యవాటికాప్రసవగుచ్ఛములు
ధీరతాగుణ పరిస్ఫోరకంబులగు
పలుకుల నీరీతి వచియించెఁ బడఁతి!
"తొలి మినుకులుగూడ వెలకట్టలేని
నీచేతలకు టీక నిర్మించుటకును
నాచేతనౌనొ? నానాచిత్రవృత్తి
వెలయింతువెన్నియో వింతవేసములు
చిలికింతు వెన్నియో చిన్నెలు వన్నె
లలరింతువెందరో యార్త భక్తులను
పలికింతువెన్నియో భాషణంబులను
నీమాయలకు జిక్కినెగడులోకములు
నీమాయలను దాట నేరరు సురలు
నాకథయే బ్రాఁతినానావతార!
లోకమ్ములందు నాలోకమ్మువిండి
చీకటియాక్రమించినవేళలందు
నేకమై వెలుఁగు నీకిచ్ఛ జనించి
సృష్టించితివి లోక చిత్రనాటకము
నష్టస్వభావంబు విష్టపాధార!
జెడును బిడౌజుండు జెడుపరమేష్ఠి
జెడును లోకములు గిడ్వడు గుబేరుండు-
జెడనివారొక్కరే-జివేళ! నిన్ను
విడువ నేరని భక్తవీరలోకమ్ము!

పారదరసపరి ప్లవమైన సుఖము
గోరదు నీభక్తకోటియెన్నటికి
నీపదపంకజ నిర్మలధ్యాన
కూపారభంగడోలాపారవశ్య
సరససౌఖ్యమ్ములేశ ముబోలునెట్లు
ధరణి వైభవములు దత్తస్వరూప!
నన్నేటికాశలు బన్నిలోభింప
నున్నావు ఫలమేమి? యోపాండురంగ!
నాతుల కిల ప్రాణ నాథుఁడేసర్వ
మాతని భావమేనా తలఁపోయి!
మెచ్చిభర్తకు శాంతి నిచ్చిన నాకు
వచ్చినట్లే సర్వవరములు తండ్రి!"
తదనంతరంబ భక్తావన పరుఁడు
సుదతి పల్కెడి ధీరసూక్తులకలరి
తలపోసి తలపోసి తడవకు మెచ్చి
కలగనుచున్న చొకామీళ జూచి
"లేవవోయీ! దివ్య భావైకసంగ!
లేవవోయీ! భక్తిలీలానుషంగ!
పరమభాగవత శేఖర! యంచునొడిని
కరములదట్టి లేపె రమాధవుండు
తొలితాకు గురిపిన తొలకరివానఁ
బులకించు నిలువు గన్నులై మొగమెల్ల
యైగనుంగొని యంతరానందమునకుఁ
బ్రాఁకిడనేరవి బాలిశత్వంబు
దలకొన నెట్టులోదొలఁగించి నిలిచి
సలలితమగురీతి సాష్టాంగ మెఱఁగి
నేనునేనని ముందు నిలచి దూకంగ
బూనెడు దనతలంపులఁబిగ్గ బట్టి

వినయంబు, నయమును వేకారితనము
దనవాఁడనె స్వతంత్రతనిష్ఠురతయు
భక్తియు ప్రేమ సంబంధంబు నిండు
రక్తి సంభాషణా సక్తియుగూడి
పదపదంబున యందుఁ బరువువెట్టంగ
పెదవులే నవ్వులై వికసింప సాధు
వరుఁడు చొకామేళ భక్తుండు పలికె
కరుణగల్గినదేర! కంజాతనేత్ర!
వెలవచ్చెనేమిరా వెట్టి పాటలకు
ఫలమిచ్చె నీనాఁడు గుణహీనభక్తి
కడజాతివాని యా కాంక్షగుర్తించి
గడపద్రొక్కితి వేర కమనీయదేహ!
యరుణాంబుజముల కొయ్యారమ్ము దిద్దు
చరణముల్గందెనో! సమసెనో స్వామి!
కరుణకై సర్వంబు మఱచెదునిన్ను
పరమపూరుషునింతవఱకు రప్పించి
కొన్నాను నేనెంత క్రూరుఁడనోయి!
యన్న! నాయఘమున కవధిలేదోయి!
తరసదుర్గంధ బంధురమైనదాన
నరుణశోణిత సిక్త ధరణియౌదాన
విశసితమృగ చర్మ పిశున మౌదాన
బహుకరోటివ్యూహ భరితమౌదాన
మైరేయపాన దుర్మత్తచండాల
ఘోరపరస్పరాక్రోశమౌవాన
కలుషపిశాచి కాకరమైనదాన
వెలివాడలోనెట్లు వెడలివచ్చితివి
శ్రుతిసతీ హృదయసంస్తుతుఁడైననీవు
పతితుల ప్రేమకు వలచినావేర!

శ్రుతిశిరః కోటీర శోభియౌనీవు
గతిలేనియింటికిఁ గదలినావేర!
భవమనశ్శయ్యలఁ బవళించు నీవు
భవబంధితునిఁ జూడవచ్చినావేర!
కలిమి పొలంతి చూపులఁదేలు ఱేఁడ!
గులకరానేలను నిలిచినావేర!
తలఁపులతోట కావలివేవెలుంగ!
తలపోఁతలకుఁ జిక్కి దక్కినావేర!
నానావికస్వరనాదాఽవతార!
నానోటి పాటకు మానసించితివా!
కామితపూర్తి! సత్కారుణ్యమూర్తి!
నామూఁగ నోములు ప్రేమించినావా!
జలధికైనను జెలియలికట్టగలదు,
కలుషమారకము నీకరుణకు లేదు
స్వామి! నీదైన దర్శనమబ్బెఁగాని
యేమి నీకాతిథ్యమే నివ్వఁగలను!
బడుగు పచ్చడమైనఁ బరువంగలేదు.
గుడిసెలో నిన్నెట్లుఁ గూర్చుండఁజేతు!
నర్చింప నొక పుష్పమైననుఁగాన
మర్చి స్స్వరూపున భ్యర్చింతు నెట్టు!
లని దీనవ దనుఁడై యలజడినొందు
దనభక్తుఁగనుఁ గొని దామోదరుండు
"భక్తాగ్రగణ్య! సద్భక్తిపై నున్న
రక్తి నా కితరమార్గములందులేదు—
పరమభక్తికి నేను వశుఁడౌదుఁగాని
బరికింపఁదద్భిన్నవర్తనంబులను
రమ్ము బోదము దేవళమ్మున"కనిన
సమ్మోదమున మేను చమకితమునుగ

మెలఁతఁగన్గొనెఁ జోకామేళభక్తుండు—
దెలిగన్నుఁగవయందుఁ దులకింపశాంతి
వనజసంభవుని బొడ్డునఁగన్నవాఁడు
కమలాకుచస్థలాఽఽకల్పమౌవాఁడు
శమదమయుతులైన సంయమీశ్వరుల
భావపుష్పమ్ములపై వ్రాలుదేఁటి—
భావజహరమస్త భాసురంబైన
జలముగన్నట్టి యంఘ్రులవాఁడు గొల్ల
చెలువలఁ బ్రోచు నంఘ్రులవాఁడు-దివ్య
మురళీనినాద భాసురుఁడు-శ్రుత్యంత
తరుణీవిదగ్ధతాతాత్పర్యపాద
ధూళిరక్షితలోకపాళి-దుర్జ్ఞేయ
కేళి-నందవ్రజకీర్తి సౌరభము—
దేవర్షి విమలవీణావాద్యగీతి
కావార్ధిశయనించు గంభీరమూర్తి—
శాస్త్రాఽనుగత సదాచార దుర్వార
నిస్త్రింశ విదళిత నిఖిలచాపల్య
దివ్యవైష్ణవ భక్తి దీక్షాఽధ్వనీనుఁ
డవ్యయప్రేమభరాపూర్ణాఽవతారమ్ము—
పరభావధన పరాశరపుండరీక
కరిరాజ మునిరాజ ఖగరాజ, రాజ
రాజితప్రముఖ నీరాజితచరణ
రాజీవుఁ, డతి కఠోరశితముఖాఽగ్ర
ఖండితదశకంఠ కంఠఘంటాప
థుండు—దుర్లంఘ్యపాథోధి గర్వాంధ
కారతిరస్కార కఠినహుంకారుఁ
డారజ్యమాన సేవాఽఽసక్తహనుమ
దాదివానరతోషణైకనిరాకు

లాదివ్యదక్షికోణాఽపాంగరోచి
యఱవిరి చూపులు విరియఁబూఁదేనె
పెరవోని నగవులు బెదవిపై జేర
నిరువురకునుఁ జుట్టుదిరిగి మొగిడ్చి
కరయుగమ్ములు, నమస్కారంబుసేసెఁ
బ్రమదాశిరోమణి భక్తునిల్లాలు—
'యమృత నిర్వాణాఽఽప్తిరస్తు' నిదీవె
నలపూలు గురిసెదీ నాఽవనశిలి—
యలపాండురంగనిఁ గొలచుభక్తులకుఁ
బడయంగ రానట్టి వరములు గలవె!
పడఁతి! నాజన్మకుఁ దొడవునీవంచుఁ
బలికెఁ జొకామీళ భక్తుఁడిల్లాలిఁ
దెలినవ్వు బొలసె బొమ్మలయందుసతికి—
'వైశమరమ్మ! బోవలె' ననుచున్న
శ్రీలాలితాకారు జిత్తమ్ము దెలిపి
కనుసన్న సేసెఁ జొకామీళు మడఁతి
గనుసన్నతోడనే గదలెభక్తుండు—
భక్తునివెంటనే పాండురంగండు—
ముక్తిలీలావతీ మోహంకరుండు—
నీరాడుఁ గన్నుల నిలచినతరుణి
వారిచాయలగనంబడు నంతమేఱ
దెలిచూపుమల్లె పూవులఁ బూజసేసి
పులకరించెడు జిత్తమున వెన్కమఱలి
యానందమే లోకమై పాడుచుండె
దీనాఽవనాఽఽధారుదివ్యగీతములు—
పరమ భాగవతుండు పరమేశ్వరుండు
నరిగిరి చీఁకటు లల్లినదారి—
సనకాదులకు మనోధనమైనవాఁడు

ఈరేడు లోకంబు లేలెడువాఁడు
వారిజాక్షుఁడు- వెలివాడలో లలిత
చరణముద్రలుపైచి చనియెడువేళఁ
దళితోడలేచి యొక్కరుఁగాని బూజ
సేయవోపర- మోహజీర్ణబుద్ధులకు
సాయుజ్యసక్తియేచాడ్పునఁగలుగు!
పులకించె భక్తుండు చలివెల్గువెన్న
లలనోనయగుఁగమలాధవుస్పర్శఁ-
దలిరించెహరియు భక్తస్పర్శచేత
నిలవులకించె నీయిర్వురి చరణ
రాజీవములు సోకుఁబ్రతిని మేషమ్ము-
తేజస్స్వరూపముల్ దివినున్నతార
కలు- నేత్రములు విచ్చి కనియెననంత
ఫలదమప్పటి భగవంతునిలీల-
నీరీతి నాలయద్వారమ్ముసేరె
వారిజాక్షుఁడు భక్తవరునితోఁగూడి-
విరిసెడుఁబువులట్ల విచ్చెవాకిళులు
బరమేశ్వరునకు దెప్పరమైనదేది!
యమలవిజ్ఞానదివ్యప్రభానిచుళి
తము- ఘోరసంసారతారకమగుచుఁ
గొమరొందు నాగర్భగుడిలోనఁజేరి
యమరంగఁ బ్రతిమలోనైక్యమైనిలచి
భాషించె నీగతిఁ బండరినాథుఁ
డీషల్లసితహాసభూషితాధరుఁడు
"ఫలియించెనేమిఁగోర్కులపంట! భక్త
కులదీప! చూడరా కులదైవతమ్ము—
పాండురంగఁడెనీకు వరవుడమోసెఁ
బాండురంగఁడు భక్తభావైకవర్తి"

యనియెచ్చరించిన నజులసీరు
దనువున కమృతసేచనముఘటింపఁ
‘పాండురంగా! యంచుఁబడియెఁబాదముల
యండ నవ్వాఁడు, దేహమువిస్మరించి—
కలలఁ బోలిన భావములు చిత్తభూమి
నొలుకంగఁగడిచిన దోరంతప్రొద్దు—
ప్రమదా మదోల్లాసపాణింధమంబు
రమణీయ రతిరాజరథసితచ్ఛత్ర
మమరనాథాంతః పురాంగనా లలిత
సుమరజః పరిపూర్ణ శుద్ధమంజూష
వాసవాశాకైశ్యభరపారితథ్య
ప్రాశితాంధంతమోవార్ధి-తంద్రికినిఁ
గన్నుల ఫలమైనగాదిలిసుతుఁడు
మిన్నను గొలఁనిలో మించురాయంచ
కించివారుణ్య సమంచితపాండ్య
చంచలాఽక్షీ దంతసమకాంత కాంతి—
దళిపివెన్నెలఁబంచి-ధరణిపాలించి
యవునవునితఁడంబు జాసనుండనఁగ
సరియైన సన్మార్గ సరణిచేమించి—
భువిగీర్తి నించి-విస్ఫూర్జితుండగుచుఁ
బ్రాయంబుగై వ్రాలి-పడమటిచఱులఁ
గాయంబు జార్చెదాక్షాయణీధవుఁడు—
చందనాఽచలసముజ్జ్వల పుష్పవల్లి
కాందోళికాతల్ప హర్షాఽతివేల
రతిమల్ల సుఖసుప్తరాజత్కిరాత
వితతవక్షః కూట విశ్రుతాఽఽమోద
తతిచేత ఘుమఘుమాయితమౌచు-శబర
శతపత్రదృక్పరిష్వంగ సమ్మోద

మదభారవిహ్వల త్పదమౌచు-వీచె
మదిగగుర్పఁగఁ జేయుమలయమారుతము;
దెలతెలవాఱె దిక్కులఁ గాంతిసేరెఁ
దలఁగెరిక్కలు-మెడల్లాచి త్రిభంగి
నెలఁగించెఁగుక్కుటంబులు ఱెక్కలార్చి—
కొలఁకులలోని కల్వలుమూతిముడిచెఁ
గలకల నవియించెఁ బులుఁగుల గములు
నెలకొనెఁదమ్ముల నిండుగౌతుకము
ముగురుమూర్తులకునుమూలమౌవాఁడు
జగతీ సతికిఁదెల్వి సవరించువాఁడు
మొగుడుఁ దమ్ములఁజిక్కమగతేఁటిగముల
వగమాన్చి-ఝంకార పరిపాటిఁబూన్చి
శార్వరమగ్నవాసరరమాశ్రీల
సర్వతోవ్యాప్తిఁబిసాళింపఁజేసి
చక్రవాకాంగనాసంచయమ్ములక
వక్రసమ్మోదమ్ము వరదాన మొసఁగి—
కాంతిదారిద్ర్యదుఃఖాఽఽక్రాంత హరిదు
పాంతంబులకునెల్లవసువులుగురిసి—
జరఠహర్యక్ష కేసరకాంతికాంత
వరమయూఖమ్ములవాఁడు-శృత్యంత
కామినీ కఁమ్రమేఖలవోలు మేని
గోములవాఁడు, దన్గొలుచు భక్తులకు
దివ్యమాహేయి-దుర్దినభేది-హవ్య
కవ్యాత్మకుఁడు-జగత్కారణంబు-గర్మ
సాక్షి-మందేహాదిరాక్షసవ్యూహ
విక్షేపణుండక్షి కౌక్షేయమూర్తి
జగతీ సుపర్వనిష్ఠాపూర్తి, పూత
నిగమతనుండు-సన్నిహితధామైక

ధాముండు-గర్వాణతతివంద్యమాన
ధాముండు-గమలాక్షు దాక్షిణ్యదృష్టి——
తొలి చదువులు మేనవలచినవాడు
వెలుఁగులగని—ప్రొద్దు వెలచినవాఁడు
గలనిలోఁబొలియు వీరులతొలిపెంకి
తొలికొండచఱియఁ దోచెను సవిత——
పదపడివంచనాపరులైనవారు
మధునిషూదన భక్తిమార్గవర్జితులు
చలమునడిందునర్చకజాతి-నీటు
దళుకొత్తువేషమ్ము పలపలఁబూని
పులుగడిగిన ముత్తెములువోలెవచ్చి
తలుపులు దీసిలోపలఁబ్రవేశించి
పొద గాంచిరచ్చటఁబడియున్నవానిఁ
గడలేనివాని పోకడఁగన్నవాని——
భవబంధములకెడబాసినవానిఁ
బ్రవిమల భక్త్యేక భాగ్యమౌవాని——
ధరణికి శ్రవణావతంసమౌవానిఁ
సురలకునైనఁబూజ్యుండైనవానిఁ——
జండాలుఁడైనను సనకాదిభక్త
మండలికెల్ల సమ్మాన్యుఁడౌవానిఁ——
బండరినాథుఁడే ప్రాణమౌవానిఁ
బాండురంగని ప్రాణపదమైనవానిఁ——
గని విస్మయాఽఽకృష్టమనములఁ గలఁగి
క్షణములోనన యహంకారము పొంగఁ
కటములుచిట్ల-భ్రూకుటి సంచలింప
నిటలతటంబున నెరయఁ జెమ్మటలు
గన్నులలోఁ బొగల్గప్పికొనంగ
మిన్నంత కోపంబు మిడిగాళ్ళనిలువ

బెదరించి-ధరణిపైఁ బదములుగొట్టి
రదములు గొఱికి-గర్జలుచెలఁగించి —
తమలోన నందఱు దండుగాఁగూడి
కమిచివెండ్రుకలీడ్చి-కాళ్ళతోఁదన్ని
"రంగని గుడిలోకి దొంగవై వచ్చి
భంగంబునొందిన భ్రష్టుఁడ! లెమ్ము!
కడజాతివానికిఁ గావరమడ్డు
పడినదంచును వాని బయటికినీడ్చి
దారిఁ బోయెడువారిఁ జీరిరప్పించి
చేరిచి యవ్వారిఁ జెప్పంగఁ దొడఁగి
"రవునవు నిపుడు భక్త్యాఽఽవేశమెల్ల
సువిదితంబైనది-జూడుండుమీరె—
జగతి కన్నులు మూసి సంతమసంబు
మగులుగా నిల్చిన మాపటివేళ
గుడిలోనికెట్లుఁ దిమ్మఁడుదూకినాఁడొ!
యడుగుండు మీరె నాయంబు చర్చించి—"
యనిపల్క విప్రులయా భాషణములు
విని చొకామేళుండు వినమితుండగుచుఁ
బరమపూరుషు దయాపవనముల్వీచి
భరమైనయాఘాత బాధ దొలంగ
నలఁత దీరిన హృదయంబునఁ బల్క
పలుకునఁ గ్రొత్త తావులు వెలయించి
పలికె నీగతి భక్తిభావబంధురుఁడు—
"కలిమాయలకుఁ జిక్కి కానరుగాక
గలదె! సర్వేశు చేఁతలకుఁబారంబు!
కలహాసములను దిక్కులు వెలిగించు
మెఱపులు దీర్పనేర్పరియైనవాఁడు
చిఱుచీఁకటులను నిర్జింప లేదేమి!

యెవ్వని వెలుఁగూని నవ్వును జంద్రుఁ
డెవ్వని కుడికంట నెసగుఁ సూర్యుండు—
యెవ్వని దయ నింగిఁబువ్వులు వెలుఁగు
నెవ్వని తెలివిచే నెనయు లోకమ్ము
లెవ్వని కనుమూయ నింకు సర్వమ్ము
నెవ్వని కరుణచే నింద్రాదిసురలు
నివ్వటిల్లఁ దలంతు రెవ్వఁడనంతు
డవ్వాని తలఁపుల కాటంక మేది?
చీఁకటికావల నేకమై వెలుగు
లోక పాలకున కాలోకంబు గొఱయె!
కాలుష్యమునఁ గన్నుగానరుగాక
కాలమొక్కటి వేఱుగలదె తలంప!
కాలస్వరూపంబు గాదె రంగండు!
నీల నీరద రమణీయ దేహుండు
మాయాసతికిఁ గన్నుమఱఁగించువాఁడు
నాయింటికేవచ్చి, నాపూజమెచ్చి
కోవెలకునునన్నుఁ గొనివచ్చినాఁడు
గావలివారడ్డఁగలరె దైవమును!"
నీరీతివచియింపఁజేరినవారు
దారు-రంగని కథల్దలపోసి-భక్త
పరుఁడౌట జర్చించి-భక్తులక్షణము
లరిది చొకామేళునందుంట గాంచి—
పాఱులకెదురొడ్డి భాషించుధైర్య
సారంబు గొఱవడి-సానునయముగ
బలికి రీగతి విప్రవరులార! యేల
గులహీనుతో వాదములు సేయమీకు
శాంతిభూషణులకు సందడిమేలె!
బంతంబుతో భక్తిబరికింపఁబడునె!

విడచుట లగ్గగు వీనినటన్నఁ
జిడిముడి వడుచు-వచ్చినవారిభావ
ముద్రలు గమనించి "పొమ్మురా! మూఢ!
భద్రమెప్పటికి రావలదిందుసుమ్ము
పండరి నాథ దైవము నీకులేఁడు
పండరి పురిలోన వాసమ్ము లేదు
పరమ పూతము చంద్రభాగకావైపు
జరియింప వలెనిది సమయంబటన్న
నందఱు 'వల్లె' యంచనిరి విజ్ఞాన
మందులకీ భక్తు కుందేమియెఱుక!
పదపడి, యంతిమ స్పర్శదోషమ్ము
వదలించికొనయుక్త వర్తనల్సలుపఁ
జనిరి బ్రాహ్మణు లెల్ల జనములుగూడ-
వినమిత శిరుఁడైన విష్ణుభక్తుండు
తలయెత్తిరంగనిఁదలపోసియూర్చి—
పలపలఁగన్నుల బాష్పముల్గురియ
సాష్టాంగముగ నమస్కారంబొనర్చి
యిష్టదైవంబ! నీవింతచేసితివి
కానిమ్మటం చానబూనిగోవిందు
దీనవ్రతాధారు దివ్యలీలలను
స్మరియించికొను చవశాత్ముడుడువోలె
సరగఁ బ్రవేశించెఁ జండాలవాటి—
నల్లంత దూరంబునందె వీక్షించి
యుల్లాస వశమున నుబ్బొంగమేను
బిల్లలుదన నీడవెంటనే బఱవ
నిల్లాలు లక్ష్మియైయెదురేగుదెంచి
క్షతజపూరితగాత్రుఁగని యంఘ్రులంటి
వెతగూరిజరిగిన వృత్తాంతమేమి

యని మాటికినిఁ గ్రుచ్చి యడుగవచించెఁ
దనసతికెల్ల గాథయువిస్తృతముగఁ——
దరుణియు నాయుదంతము నాలకించి
సురలకునైన భూసురులకునైన
నియతి దాటంగరానిదని గ్రహించి
భయనివారకుఁడైన పాండురంగండు
గతిగల్గనాపదల్గలుగవటంచు
మతినమ్మి-వారెట్టిమానిసులైన
పాఱులు మాన్యులఁ భావంబునూది
వారిజాక్షుఁడు భక్తిపరులందె గాక
పెఱచోట వెలయునేవింగడంబుగను
దెరువేదియనియెంచి-దేవుని సేవ
నణఁగిన ఫలమేమొ! యంచునూహించి
పఱఁతిపైనమొనర్ప భర్తకుఁజెప్ప
వనితసమ్మతిగొని దినములోపలనె
బనుపడ నా చంద్రభాగకావైపు
గుడిసె నేర్పఱచె నక్రూరసన్నిభుఁడు——
కడఁగంటికొలుకులఁ గారుబాష్పములఁ
దననిసుంగులఁబూని తరళాయతాక్షి
వెనువెంట నడువంగ విదితభక్తుండు
చండాల వల్లకి సారెసారించి
పాండురంగనిఁగూర్చి పాడంగఁబోయి
యెలుఁగు చలింపంగ నెదపట్టుకొనఁగ
నిలువెల్ల వణకంగ నిలువంగలేక
పాండురంగాయంచుఁ బడిలేచియార్చి
పండరిఁ పురితోడ వాసంబు దీఱె
భాగ్యహీనునకంచు బావురుమనఁగ
యోగ్యవాక్యమ్ముల నూరార్చెఁబత్ని

తరువాత రంగ గోపురమును గాంచి
ధర ఫాలములు సోకదండముల్వెట్టి
ప్రమదామణియుఁదానుఁదన నిసుంగులును
క్రమముగా నొసట ధరా ధూళిదాల్చి
పలుమరుఁగన్నులు మలపి చూచుచును
దలఁపులు వెనుకకుపరలంగఁ, బాద
ములముందు కీడ్చుచుఁబురివైభవంబె
వలసవోయెడునట్లు భక్తరత్నమ్ము
పురిసాధు జనులయూర్పులె దోడుగాఁగ
నరిగె-సాయుజ్యభాగ్యమ్మునుబోలె——
జరిగెను గొన్నివాసరములు-చింత
మఱచెను భక్తుండు-మానసంబందు
నీరజాక్షుండు సన్నిధిసేసి-వాని
కూఱట గలిగించియున్న విధంబొ!
చెలఁగె భక్తుని గీతములు ముందటివలె
నలినాక్షిరసముగ్ధనాట్యముల్వెలసె
నొక్కనాఁడాతండు నిక్కంపు భక్తి
నెక్కొనమనమందు నేత్రముల్మొగిచి
తనకుటియెదుట శీతలశాఖినీడ
నొవరఁగూర్చుండి లోకోత్తరుగుఱిచి
ప్రణుతి గీతములను బాడెడువేళ
వినమితమస్త దేవేంద్రకోటీర
మణికాంతి దంతురమంజులపదుఁడు;
దనయోరచూపుచేతనె జగంబులను
కలిగించి వెలయించి బొలియించువాఁడు
తలఁపులుగుఱియించి తనసోఁకలెంచి
తనువుపీడించి, నెట్టనదివ్యమునులు
వనములఁ దపములు వట్టిన, చొఱకి

దొలుకక-యనద భక్తులవెంటఁబడుచు
దొలకెడు వాఁడు-చిత్తరువైనవాఁడు—
నారాయణాఖ్యఁ జెన్నారిదేవతల
తీఱని కోరికల్ దీర్చెడువాఁడు—
తొలిమిన్కు-వీణె తంత్రులనదియించు
మొలకనవ్వుల రాగముల నిగ్గువాఁడు—
గలిమలంబులనెల్లఁ దొలఁగించువాఁడు
జిలుగుమువ్వంక నేర్పులయూటబావి—
కటి తట విన్యస్తకరముతో-లలిత
కుటిలంబులగుఁ జూపుకొనలతో-ఘల్లు
ఘలుమంచుఁ బలుకు గజ్జెలతో-నెసంగి
సెలవులఁ బొదుగు నవ్వులతో-నటించు
నెఱిగొన్న ముగుద ముంగురులతో-కాంత
కరవేణుదండ సంగంబుతో-వడకు
నడుముతో-చెన్నారు బెడగుతో-నెమ్మి
తొడవుతో-మదరేఖతొణికిసలాడు
నడుగులఁబెన గొన్నతడబాటుతోడఁ
గడుముచ్చటగ నిల్వఁగనుదోయితార
కలువిచ్చికొనఁగఁబుల్కలు గ్రమ్మదేరఁ
దలఁపులుగముచు సుడులఁ జిక్కి - హృదయ
వనజంబు దిరుగుడువడగ - సంతోష
మునఁ దోగితనువు కంపనమొంద - బాష్ప
జలపాద్యమునఁజేసి చరణముల్గడిగి
తలవంచి మ్రొక్కి ముగ్ధమనోహరములు
బలుకులుగొంతులోఁ బారాడఁదిగిచి
పలికె నీగతి భక్తిపండినదేహి
"యేమిరా! రంగయ్య! యేమిరా! తండ్రి!
యేమిరా! నాభాగ్యమింత పండినది!

తరుణారుణాఽబ్జసుందరములు - ముక్తి
పరిమళభారబంధురములు-భక్తి
స్రోతో వికస్వర శుక్తిపేటికలు
చేతస్సమాధానజీవ నౌషధులు—
పరమ భాగవత జీవంజీవ జీవ
ధరణైకపటువులార్ద్రజ్యోత్స్నలు-శ్రుతి
లీలావతీ శక్రనీలసౌధములు
ఫాలాక్ష చిరతపఃఫలములు-భాగ్య
కూలముద్రుజములు-ఘోరసంసార
కీలితమాదృశ కృపణ జీవులకు
దొఱకనియవి-భవచ్చరణముల్ నేఁటి
కెఱుకలేనట్టి నాకొఱకయిపూని
యెంతదూరమురాఁగ నిచ్చగించినవి!
సంతతభక్త్యైకసంగ! నారంగ!
యిన్నాళ్ళు ననువీడియెట్టులుండితివి!
కన్నులఁ గపురంపుఁగాల్వలుబాఱఁ
జేయు నీదర్శనంబాయె నీనాటి
కాయాసమెల్ల మాయంబైనదోయి!
పరమ పవిత్ర! నీచరణరజంబు
శిరముపై పిరివోలెఁదుఱుముకోఁ గలిగి
పురుగైనమదికిఁ దొందరలేదు-శాంత
నిరవధికానంద నీరధి! స్వామి!
నీవులేకున్నచో నిఖిలంబులేదు
నీవున్న లేనివి లేవురా! రంగ!
దీపప్రకాశంబు దివిరి వీక్షించి
త్రోపడిశలభంబుమాకి నశించు—
కలుషముల్ లౌకికాశలు వానివెంట
నలిగి-విజ్ఞానంబుమలచునుజీవి—

నామదియెప్పుడా నందకందంబు
శ్రీమానినీబాహుచిహ్న చిహ్నితము
పతితైక శరణమ్ము-పతితపావనము
నతమౌనిమస్తమందార దామమ్ము
శ్రుతికామినీముగ్ధచుంబ నాశ్రయము
శతధృతి కల్పనాసంధ్యాంబరమ్ము
నీయడుగులదోయి నిలుచునుగాఁత
నీయడుగులయందె మాయును గాఁత
యని పల్కి-కనుదోయిఁగొనకొని పాఱు
వినయ బాష్పములర్ఘ్యవిధి దీర్చుచుండ
లలిత దృష్టిక్షేపములు రత్నదీప
ములనిల్ప-నగవుల బొందుతోమాలె
లలరించి-ఫాలంబు నిలవంచిమ్రొక్కి
చెలువెల్లదనయందె నిలిపినవాని
చెలువు కందోయి నాసలు దీఱఁగ్రోలి
పులకలుదనువెల్లఁ బొలయుచునుండ
లాలితా కారనిల్లాలినిఁజేరె
కాలుష్యరహితచొకామీళుడపుడు—
"చూడవె, నవనీత చోరుఁడౌవాఁడు
వీఁడెదర్శన మివ్వవేంచేసెనిప్పు
డనిపల్కి-నమృతార్ద్రమైనట్టిమాటఁ
దనువెల్లశ్రవణముల్ దలకొననినుచుఁ
దనశరీరంబెల్ల మనములుబూయ
మనముల యందెల్ల మమతబొంగారఁ
దనదేహమెల్లఁబాదంబులైనట్లు
వనజాక్షియవశయై బరుగిడివచ్చి
మొగమెల్లఁగన్నులే మొనసికొనంగ
నగవెల్ల భక్తియేనాట్యమాడంగఁ

బులకసస్యంబులు ఫలించియున్న
యిలఁబోలి-యొర్వెరూపెత్తినయట్లు
నిలిచి-రంగనిపాదతలములయందు-
తలవంచి మ్రొక్కిన-తలనూచి-కమ్ర
భక్తిజీవనుఁడైన పాండురంగడు
రక్తిదొల్కాడ శారదచంద్రికలను
బురుడించు చూపులు బొంపిరివోవఁ
బరమవైష్ణవుల దంపతులను జూచి
తాను భక్త్యేకసందాని తుండగుట
తానువిచిత్ర వర్తనుఁడునగుట
భక్తి పరీక్షణాసక్తుఁడునగుట
భక్తమనోరథ ప్రదుఁడగుటయునుఁ
బ్రకటింపఁ దలఁచియిప్పగిదివచించె
వికసింపవాదర విస్మేరమైన
మొగముపై నొకవింతముగుద తనమ్ము
ముగుద తనమ్ములో మొనయ గ్రొత్తావి
"పరమ భాగవతుఁడ! పరతత్త్వవిదుఁడ!
పరమ పాతివ్రత్య భాగ్యైకపేటి!
సంతసించితిని-మీసచ్చరిత్రము-ది
గంత విశ్రాంతమై-కమలినీనాథ
యామినీనాథులున్నంతకు వెలుఁగుఁ
బో! మహాకవి భావపూజావిధాన
ధామమై-కృతజగత్క్షేమమై-సుజన
కామమై-త్రిగుణనిష్కాసకంబగుచు——
పక్ష్మలితత్యాగ లక్ష్మీకమగుచు
లక్ష్మణంబగుమీకులాగ్రియ చరిత
నరులెల్ల విని భక్తిసురభితులగుచు
విరసమ్ము సంసారవిధముదలంగి

పరమార్థ మౌ నిష్ఠ భక్తిసాధించి
పరమపదంబును బడయంగఁగలరు,

కనుగవల్ముకుళించి-తనువుబుష్పించి
మనసురసావేశ మాంద్యమ్ముదాల్చి
మహతిపై మీగాథమధురగానముగ
రహినేర్పరించె నారదుఁడు గీర్తించు
చిరకాలముగఁదానుజేసిన తపము
గరకట్టి వచ్చినకైవడి, మీరు
బుట్టినదావనీభూమినాకమ్ము
ధట్టించు ధన్యతఁదాల్చెసత్యముగఁ—
బరమ భక్తులు నాకుఁబ్రాణమ్ములోయి!
పరమభక్తులయింటి పరవుడనేను—
నను మఱువకమనంబున నెంచువానిఁ
గనులఁజూడక పూటగడువదునాకుఁ
బదునాల్గులోకముల్బాలింతునేను
విదిత భక్తుఁడునన్ను వేడ్కఁబాలించు—
వాని కాపదవచ్చుపట్టుననేను
బూనిరక్షింతును మోసలనిలిచి
పండరిపురిఁబాపి వచ్చినయంతఁ
బాండురంగఁడునిన్ను వదలలేదోయి!
నీవేడనుండిన నీవెనువెంట
నేవచ్చి నిల్చెదనిక్కమీపలుకు—
పాండురంగడేడనుండెడునదియె
పండరి-యిప్పుడిదే-పండరియయ్యెఁ
బాండురంగఁడులేకఁ బండరిలేదు
దండిభక్తుఁడనీవు ధన్యుండవోయి!
పాండురంగనియంత వానిని నిలిచి
యుండఁజేసితివొక్కయుట జంబునీడ—

నీవు ధన్యాత్మవనిర్భిన్నశాంతి
దేవతవైనిందు దీవెనలొసఁగి
నడపించినా వాత్మనాథుని మనసు
చెడకుండ మోక్ష లక్ష్మీ భద్రపురికి
నీకఁబోవవచ్చునేయింతి! మఱచితి
"నకనకలాఁడుచున్నది యుదరమ్ము
గడువడినడచిన కతననో కలికి!
పిడికెడన్నము దెచ్చిపెట్టుమా! జూత
మనిపల్క-వనజాయతాక్షి శిరమ్ము
వినయావనతముగావించి-మొగమ్ము
ముసిముసినగవులమురిపెమ్ముగులుకఁ
బశుపతి వందితపాదపీఠునకుఁ
జలిదియన్నములోనఁ జల్లనుఁజేర్చి
తలఁపులలోని శైత్యమ్ము బూరించి
తెచ్చి-లజ్జాభరాఽధీన మానసము
పచ్చియానలెడందవాదు లాడంగ
నిలిచినరంగండు, బొలఁతినీమగఁడు
వలనొప్ప భుజియింపవలె సుమ్ముముందు
భుక్తశేషమునేను భుజియింతునన్న
భక్తుని కనులలోఁ బలపలగారె
వారి ధారలు-దీనవత్సలుండైన
వారిజాక్షుండొక్క ప్రక్కఁ గూర్చుండె
బలవంతమునఁజేయిబట్టె భక్తుండు
లలనయర్పించెనుఁ దొలుతటిముద్ద
పదపడి సకలజీవవ్రాతములకు
మదిలోని కోర్కెలు బిదికెడువాఁడు—
నానాజగన్నేత నారాయణుండు
దానప్పు డరుణహస్తతలమ్ముదాచెఁ

జలదికై - భక్తవాత్సల్యమెంతటిదో!
యిల బులకించె వీక్షించి దృశ్యమ్ము-
చంద్రభాగాభంగచయమ్ములు మధుర
మంద్రధ్వనులఁ బాడె మంగళగీతి—
తరుబారు ఖ కటిలి ప్తములౌచుదవిలి
బుడివిచ్చినవ జలధరములాఁడెనవి—
సకలదిక్కులయందునొక క్రొత్తతెలివి
సకల తీర్థములందునొక క్రొత్తచవులు
సకల పుష్పములందునొక క్రొత్తతావి
సకలజీవులయందునొక క్రొత్తభావ
మావరించినది - మాయాబ్రహ్మచారి
భావనాతీతుండు-పాండురంగండు
మాలనియుచ్ఛిష్ట మధురాన్నమునకు
మాలెత తల్లిప్రేమకు నిచ్చగించి
చవులెంచి-భుజియించు సమయంబునందు
దివినుండి వీక్షించి దేవతలెల్ల
రానంద బాష్ప పుష్పావళులిచ్చి
యానంద నందనునరిగొన్నవానిఁ
బరమ భాగవతశేఖరుఁడైనవానిఁ
గరమర్థితోడఁ జొకామేళుఁబూజ
గావించిరంతట గంజాక్షదర్శ
నావేశమునఁజేసియబ్బులుసాఁచి
కనుదోయి చెమరింప-గబులుసుమింప
మనసులుగాయ్యొక్క-మాంద్యము విక్క-
లలితకషాయకిసలపంక్తిరక్తి
మలుగూడ దీర్ఘసాంద్రమ్ముగాఁ బాడఁ
దొడఁగెను బక్షిసందోహమ్ము-స్వామి
నుడులు స్పష్టముగ విన్పడకుండునట్లు-

అంతఁ జొకామేళుఁ డంతరంగమున
శాంతి దొల్కాడ శీర్షంబెత్తిపలికె
"సనకాదిమునిమనస్సంచారియైన
వనజాక్షు దర్శించు పరమభాగ్యంబు
నడిగికొన్నట్టి మహామహులార!
పుడమిపై నిదికడపుట్టువుగాఁగ
మోక్షంబుగైకొను పుణ్యాత్ములార!
వృక్ష సంస్థితులైన విహగమ్ములార!
పలుకుచున్నాఁడేమొ పరమాత్ముఁడిపుడు
పలుకు పల్కిన సుధాభరమును చేసి
విననిండు భాషలు-వినుఁడుమీరెల్ల
మనములానందైకమగ్నముల్గాఁగ
నను పల్కితోన విహంగమ్ములెల్ల
ననుమతించినవి భక్తుని దైన్యయాజ్ఞ-
నాసమయంబున నర్చకుండొకఁడు
పావనమతి-చంద్రభాగలోమునిఁగి
మడిదోవతులుగట్టి వడిఁబోవుచుండఁ
బడినవి చెవుల నీ పలుకులు శూల
ములవోలె-హుమ్మని మొనసిగర్జించి
కలకలనగి కండకావరమెంత
మాలవాని కటంచు మదిలోనఁ గలఁగి
ఫాలంబు ప్రస్వేదభరమునఁదోఁగఁ
దనువుగంపన మొందఁగనుదోయినిండి
మునుకొని నిప్పులుముసరంగ-సిగయు
ముడివీడ భీషణమూర్తియై-వేగ
నడుగడుగున భూమి వడకంగఁబాఁ
"కలికాలమలబద్ధకం కాళుతోడ
నిలిచిమాటాడునో! నీరజాక్షుండు!

చూపింపరా! ముగ్ధచూడా శిఖండుఁ
జూపింపకున్న నిశ్శూలమెక్కింతు"
నని పల్కి యుత్తరంబునకైన నిలువ
కనయుండు-రోషధూమ్రాక్షుండు-మీది
కఱుకుచుఁబొరిఁ బొరిఁదఱటుచు వామ
చరణంబుతోడ వక్షస్స్థలంబునను
నడచిన 'హరి! హరీ! యనియిలమ్రొగ్గి
వడియెఁ జోకామీళ భక్తవర్యుండు
భాగవతునియెదఁ బడినయావ్రేటు
శ్రీగణనీయంబు-చిత్సుఖాకరము
గోపాంగనాకుచకుంభోభితామృ
తాపాన మత్తమధ్య ప్రదేశంబు-
సురసుందరీరసోచ్ఛ్వాన కటాక్ష
వరపుష్పమాలికా వరణాంచితంబు-
ముక్తికవాటంబు-మునిజననివహా
సక్తంబు-దోషవిరక్తంబు-పద్మ
వాసినీ లాక్షిక పదముద్రికా వి
శేషక తారకా చిత్రిత నభము-
కలుముల చెలివన్నుగవ యనుకరులు
సెలవెడికోట,-మిన్కులపూపగుబ్బె
తలకడగంటి చూపులు విచ్చుతోట
వలపులకెల్లఁ దావలమగుచోట
సరసి జాక్షునియురస్స్థలమునఁ దగిలి
పరమ భక్తునిబాధ బ్రతిఫలించినది-
గనుపడలేదు పాఱునికంటికపుడు
ప్రణుత పాలకుడైన పాండురంగండు-
కలిమలదూరుండు గర్వాభిమాన
మలిన మానసులను మన్నించునేమి!

సంచితపాపసంచయరుద్ధులైన
వంచకులకుఁ గానఁబడునో! రంగండు!
ధరణిపైన వశుఁడై యొరఁగినవాఁడు
ధరణీరజోబద్ధతనుఁడైన వాఁడు
గళమున నడఁగు నీరెలుఁగుగలాఁడు
పొలసినక్రొవ్వేడిమూలుగువాఁడు
చీలిన యెదనుండి జిమ్మురక్తంపు
జాలుతో-వికలలోచనములనిండి
పారు గన్నీటితో-భక్త వర్యుండు
నీరసుండయిలేచి నిలిచి హస్తములు
నిటలతటంబుననిలిపిఁ మ్రొక్కినను
గుటిలవర్తనుఁ డర్చకుఁడు-పెద్దనవ్వి
మఱలెఁబండరికి ధర్మంబుననిలిపి
బిరుదుగట్టిన యట్టి నెఱవాదివోలె-
మాలెత శాంతిసమంచితమూర్తి
మాలెత యఘ లేశమంటని పొలఁతి
మాలెత విరిగుత్తి మచ్చయంటనిది
మాలెత మాలనిమనుపు పుణ్యంబు
మాలెత యానంద మహిత సౌధమ్ము
మాలెత, పతి జీవమహిళాఽగ్రగణ్య
మాలెతమాలని మనసులోఁ దలఁపు
మాలెత మాలని మనుగడమెలఁపు
మాలని తలఁపుల మలసెడు తావి
మాలని ప్రాణంబు-మాలనిక్రోవి
మాలని మనసు పంటల యూటబావి
మాలని బ్రదుకులో మలయుతొల్దీవి
మాలెత, విప్రుదుర్మదముచెద్దయమ్మ
బోలవీక్షించియు మొనసితితిక్ష

బూని పాఱునిఁదిట్టిపోయద-యేన
మౌనని కోపంబునరిగించికొన్న
దెంత పండినదౌర! యింతి జీవితము!
అంతట భర్తృసేవాయత్తచిత్త
మానినీతిలకంబు పతిఁమాఱువగచి
పూనిచేసినది బాధానివారణము-
పాఱుఁడావయినిల్లుజేరి ఫాలమున
గీరునామమ్ముల దీరిచి-తెల్ల
మడుగు దోవతులు సంభ్రమమునఁగట్టి
నడుమునఁబై పంచెతొడవుగాఁజుట్టి
యడుగులఁ బొగరుట్టిపదఁ జిఱునవ్వు
దడఁబడవాకెలపైనిఁ జెక్కులను
మకరకుండల కాంతిమలయఁ, గందోయి
సెకచూపులుమియ-విచ్చినపూలఁబోలు
తెలిజందెములప్రోవు తెగమెఱయంగ-
కలిమల ప్రబలాంధకారజుష్టుండు
దేవాలయముసేరి-దేవునియెదుటఁ
గావరంబులుగూడుగట్టిన యట్లు
బుడిబుడిమ్రొక్కి-బాపఁడు నిల్చియుండ
నుడురాజకోటీరునొడయఁడౌవాఁడు
తొలిపల్కు-మొదవులవలపించువాఁడు
కలుముల చెలితపః ఫలమైనవాఁడు
ముగురు మూర్తులకును మూలమౌవాఁడు
జగములన్నియును బొజ్జనుగలవాఁడు
పొడగానరానట్టి నడవడివాఁడు
పొడసూపిసూపక యడఁగెడువాఁడు
వలచిన యట్టులై వలపించువాఁడు
తలఁచిన యటులుండి తలఁపనివాడు

నియతికి లోఁబడి నెగడెడువాఁడు
నియతివానయి సృష్టి నియమించువాఁడు
పరదైవతం బైన పాండురంగండు
వరముక్తిదుం డైన పండరీశ్వరుఁడు
భవమూర్తియైనట్టి పాండురంగండు
పవిధారికాయుస్సు పండరీశ్వరుఁడు
భాగవతులవేల్పు పండరీశ్వరుఁడు
వాగతీతుండైన పాండురంగండు—
పాపతాలువుపంట పండరీశ్వరుఁడు
పాపాటవీవహ్ని పాండురంగండు—
పాఱుని గర్వంబు భంగింపఁదలఁచి
వీరభక్తునికీర్తి వెలయింపనెంచి—
తడయకయొక యద్భుతము సేసెనపుడు—
బడి బడి రంగని వక్షంబునుండి
ధారలుగట్టి రక్తాశోకపుష్ప
ధోరణి రక్తమ్ముబాఱె-నేత్రములఁ
గారెఁ బాష్పములు ముక్తాప్రతిమములు
బేరెదయందుఁ బూజారి పాదంబు
తన్ను గుర్తులను నద్దంబునబోలె
గన్నులఁ బడియె-ముష్కరుఁడైన యర్చ
కుని యంతరక్షియుఁ గొనకొని విరిసె
వనజంబు ప్రాభాతమునయందుఁబోలె,
నిందిరాపతియాన కెదురేది జగతి!
తుందిలదర్పుండు-మంద వర్తనుఁడు
దివిరి వీక్షించెనా దృశ్యంబు-తోడఁ
గవిసె భయమ్ము దుఃఖమ్మాక్రమించెఁ
గనుల చీకఁటివిచ్చెఁ గావర మణఁగె
మనసులో నుడికె వెచ్చనివంత-తనువు

గంపించెఁ గంఠంబు గద్గదమయ్యె
కంపాలతా సహస్రమ్ములవోలి
నిలిపి కొనంగను దలముగాకుండఁ
దలలోన మెదలెఁ జింతలు-దీనుఁడగుచు
బికిరిచూపులు జూచి తెకతెక నుడికి
మొకమునఁగళలేని భూమీసురుండు
సేయంగనేమి యుపాయంబులేక
సేయెత్తి యెగ్గెత్తి చీఱెనందరను—
అంతలింతలనున్న యర్చకశ్రేణి
స్వాంతముల్ సంభ్రమాసక్తముల్గాఁగఁ
బఱుగిడివచ్చి చూచిరి-శోణరక్త
భరపరిపూరిత వక్షుఁడౌవాని—
రెండు గన్నుల నీరునిండినవానిఁ
బాండురంగని భక్త పారిజాతమ్ము—
పరికించి వదనంబు వఱువట్లువార
తరతర కాయమ్ము తల్లడమంద
కనులు మబ్బులుగ్రమ్మ-మనసులభయము
బెనఁగొన వెరవేది-వీఱఁడులగుచు
నిలవ్రాయుచును-వ్రేళ్ళఁదలగోకి కొనుచుఁ
బలపలనై యర్చకులు నిల్చియుండఁ
దాను భక్తుని యెదఁదన్నిన దుడుకు
మానసంబుననిల్చి-మదముడిందినది
యతిదురాగ్రహబద్ధుఁడాయర్చకునకు—
నతశీర్షుఁడగుచు రంగని పాదములకు
నిలువెల్ల దుఃఖమై నిలచినవానిఁ
దలరి పశ్చాత్తాప దగ్ధుఁడౌవాని
మొగమెల్ల నశ్రులు మూఁగినవాని
వగపుటూర్పులఁగందు వాతెఱవాని—

గళమెల్లఁజుట్టు గాద్గదికంబువాని
నిలువెల్లఁ జెమ్మట లొలపినవాని—
దీన దీనమ్ము లౌదృక్కులు వఱపి
యానతికై: గాచినట్టి పూజారి
గుఱిచి పల్కెనుసుధా గుణబంధురంబు
పరతత్త్వమైనట్టి పండరీశ్వరుఁడు
పలుకు-రతిశ్రాంత లలనా దృగంత
ములఁబోలి-కనులలో నెలయరక్తిమము—
"ఓరి గర్వగ్రంథి! యోరివితండ!
కారుణ్య నిస్స్వంద! కర్మచండాల!
పరమ భాగవత శేఖరుడైనవానిఁ
బరమసాత్త్వికుని-శాంతిరసాధిరూపుఁ
గడజాతివాఁడని-కావరమూని
యడుగునఁదన్నిన యపరాధఫలము
ననుభవించెదవు నీవక్షరక్షరము—
మనుపంగ నేర రమర్త్యులు-నిన్ను
నాకపరాధ మొనర్చిన నైన
నోఁకదు హృదయంబు-వీఁకమద్భక్తు
బాధించు నెవ్వండు-ఫాలాక్షుఁడైన
వేధింతువానిని భీకరలీల—
పూనిభక్తావనమున కునై దీక్ష
బూనిన నాదైనయొక్క నిట్టూర్పు
ప్రళయ కాలానల జ్వాలలఁబోలి
యిలసర్వమునుఁ గాల్చునిది నిక్కువంబు-
వినలేదొ! దుర్వాసముని పరిభవము!
వినలేదొ! కరినిఁగాచిన యట్టిగాధ
పొమ్ము! చొకామేళపుణ్యుని పద ర
జమ్మునుదీర్చి ఫాలమ్మున వాని

కుంవార్చి-కడతేర్చుకొమ్ము జన్మమ్ము
మందుఁడై-యిచ్చోట మసలెద వేల!
యనిపల్కి వ్రేటుదిన్నటుల బిట్టులికి
ఘనమగ్నిపండమై మసలంగఁ-దనువు
మఱచి-పేమరు గొన్నమాట్కి-దయ్యంబు
శిరమునఁ దాండవించెను పోల్కిఁ-గనులఁ
జీకటుల్గ్రమ్మిన చెలఁపునఁ బెద్ద
యాకలిగొన్నట్టు లాబ్రాహ్మణుండు
వారి వొంకనిలేక దడయక యుఱుక
పారులెల్లరును సంభ్రమున-కురులు
వీడ-వియమ్ము ద్రోపాడఁగ-వాని
తోడఁ బారిరి-వాన వీడి వేగమున—

ఆ యప్పకుండట్టు లతిశయంబునను
బోయి-బాధకు దప్పి మూల్గుమనున్న
వాని-ధరారేణు పరిధూసరంబు
మేను దాల్చినవాని-దీనంబులైన
కనుఁదమ్ములందునఁ గళలేని వానిఁ
దనదైన సతియంక తలమున శీర్ష
ముంచి పండినవాని-నూర్చెడు వానిఁ
పంచమజాతి నుద్భవ మొందనైన
నిత్యముక్తుల తల నిలచిన వానిఁ
నిత్యరూపుని యెదనిండారు వానిఁ
గపి మొగ్గలను బోలు కనుచూపు లెసఁగి
మునరంగ రంగ గోపురమునుఁజూచు
వాని-రంగని నామ భజనంబు తోడఁ
బ్రాణముల్వాటిన వాని-సద్భక్తు
వీక్షించి-'సద్గురవే నమో' యంచు
నాక్షణంబునఁ జరణాంతికంబందు

సాఁగి యెఱఁగిన, నర్చకులెల్లఁ దోడ
మూగిఁ ద్రొక్కెడులోన ముందుగాలేచి
పరమ భక్తుఁడు దండపడి తలవంచి
"హరిహరీ! యెంతటి యపచారమయ్యె!
ధరణిఁబుట్టిన త్రయీతనులైనయట్టి
పరతత్త్వ విదులు-భూసురులు-దండంబు
పెట్టంగఁ జెల్లునే అట్టి మానిలకి!
నెట్టన శిరము ఖండింపఁ గారాదొ!
నాపయిఁ బగయెయున్న! మహాదురంత
పాపంబు నాతలపై నెత్తనేల?
సరిగించి కొనఁగందు హాలాహలంబు
నరిగించుకొనలేఁడ యవని దేవుఁడది
యవమానభరము బ్రహ్మాస్త్రమై గాల్చుఁ
బవిఁబోలె వంశగర్భంబులు జెఱచు
నని పలవించెడు నంత్యజుఁజూచి
వినమితముఖులైన విప్రులు పలికి
రపరుద్ధ చాపల్య! యపవర్గకైశ్య
నవమల్లికాదామ! నాట్యసంరంభ
పరిణాహి భక్తి భావావేశపూర
భరిత జీవిత! పూత భాగవతాగ్ర
సర! రంగనాథ చంచత్పాద పద్మ
పరిమళవాసిత శిర! మాలవాఁడ
వన నపచారంబు-సనకాదిమౌని
జనగణనీయుండవనెదము నిన్ను!
నవనీ సురులయేల! యఖిల దేవతలు
తవిలి యర్చింపగఁ దగినవిసుమ్ము
భవదీయపాదముల్-పాండురంగండె
యవశుఁడై నీభక్తి కాకలిగొనియె

నెంతపుణ్యుఁడవోయి! యిందిరాజాని
స్వాంతమ్ములో నిల్చి-పండిపోయితివి
అఖిల శాస్త్రార్థ సిద్ధాంతముల్దెలిసి
యఖిల వేదమ్ముల నంగడికెక్కి-
మతిమందులై తిమి మదముగ్గప్పి
గతిదప్పి-జ్ఞానంబు కడగానలేక
గడుపులోపలజల్ల గదలకుండగనె
బొడగంటివీవు నాపూర్ణ పురుషుని
నెంత ధన్యుఁడవోయి! యెంత ధన్యుఁడవు!
యెంతకట్టడిరోగ మీ యభిమాన
మవనీ సురులమన్న యాగ్రహమూని
యవమాన మొనరించి యలయించినాము
నిన్నుభక్త్యావేశ నిబిడమానసుని
నిన్ను మానవ వర్ణనీయచారిత్రు
నిన్ను బ్రహ్మేంద్రాది నిఖిలసంసేవ్యు
నిన్నుఁ బండరి పురీనిటల కుంకుమము
నిన్ను సాత్త్విక భావ నిబిడజీవితుని
నిన్ను రంగఁడు ప్రేమ నించినబరణి—
నెంత పాపులమోయి! యెంతపాపులము!
యంతమ్ము లేని మాయఘముదహించు
నేమొ జీవితమెల్ల, నిందిరారమణు
ప్రేమకుబాహ్యులై నామభాగ్యులము—
క్షమియింప వలెమమ్ము శాస్త్రదుర్గర్వ
తిమిర నష్టులను-తుందిల పాపవృత్తు
లను-జ్ఞానలవహీనులను-జాతిదంభ
మునలోఁగి-యపరాధమునఁ గ్రుంగినాము-
చెప్పనే వలె నీవు శ్రీపతితోడ
నొప్పింపవలె మమ్ము నొకకంటఁజూడ-

విలుచు చున్నాఁడయ్య విఠలేశ్వరుఁడు
గొలిపించి కొనుకోర్కె గూరియున్నాఁడు
నిన్ను దన్నినతన్ను నిఖిలేశ్వరుండు
గొన్నాడుఁ-నీపైనిఁ గూర్మియెంతటిదొ!
చిమ్మనగ్రోవితోఁ జిమ్మినయట్లు
గ్రమ్ముకొన్నది రుధిరమ్ము వక్షమున
గనులలో జలములుగాలువగట్టె
మనసులో వాడెంత మథనమ్మువడెనొ!
రావయ్య! తీర్తువు రంగని యలఁత
పావన విఠలేశ్వర పాదభక్తి!
పరమ భాగవత శాశ్వత భాగ్యబంధు
ధరణీ సతీహార తరళంబ! రమ్ము
రమ్మంచుఁ జీరు నర్చకులవాక్యంబు
లిమ్ముగా నాలించి యిద్ధతేజుండు
దనతాఁకుఁగొన్న రంగనికూర్మినెంచి
మనము నిస్సీమ సమ్మదమునఁదోఁగఁ
దనతాఁకుఁ గొన్న రంగని బాధ దలఁచి
మనసులో దుఃఖమున్మత్తమైరేఁగఁ
గనులఁగన్పట్టునఖంపచబాష్ప
గణముల సుఖము దుఃఖమ్మునుగలియ-
శరముపోలిక సరాసరిఁబోవ-భక్తు
పిఱుఁదనఁ బారిరి భీతులర్చకులు-
శాంతిదేవత-భర్తృచరణరాజీవ
చింతనాభ్యాస నిర్జిత బాహ్యవృత్తి-
యాచొకామీళని యర్ధాంగ లక్ష్మి,
చూచెనాథుని తెన్నుఁజూపులకందు
మేరకు విరిమల్లె బారులుదీర్చి-
కోరికలేనట్టి ధీరచిత్తమునఁ

పాండురంగని గుడిఁబడతి వీక్షించి
దండంబు వెట్టినఁ దడయక గురిసెఁ
గోటివేల్పుల శతకోటి దీవెనలు—
గాటంపు వేదన గదలింప హృదయ
మామెయిఁ బాటిన యార్తభక్తుండు
ప్రేమైకనిధి రంగవిభునిగట్టెదుట
నిలచినఁ బెదవిపై మొలచెను నవ్వు
ఫలితావ తారుఁడౌ పాండురంగనికి—
మొనసి యీగలువోలె ముసరిరి జనము
గనులున్న పున్నెంబు గాంచుట కొఱకు
అంత భాగవతుండు హస్తముల్మోడ్చి
వంతలోఁగూరినఁ బలుకుచలింపఁ
బలికె నీగతి భక్తిభావ బంధురుఁడు
"జలనిధికైనమేరలు గలవోయి!
రంగ! నీదయకు మేరలు లేవుసుమ్ము!
చెంగలించును సర్వజీవులపైన—
నాయూర్పువేడిలో నలిగినదెబ్బ
నీ యెద నాచిగొంటివిగదా! దేవ!
యెంత నిర్హేతుకమెంత చల్లనిది!
యెంత గంభీరమోయీ! భవత్కరుణ!
యేలగల్గినదోయి! యిందిరారమణ!
మాలవానికి వింతమమత! నాపైని
నేల నింపెదవోయి! యింత మిక్కుటము
జాలి-లజ్జాభరాచ్ఛాదితమౌచు
భూమిలోనికిఁ గ్రుంగిపోవునాశిరము
స్వామి! భరియింపలే నీ మహానంద
మీయెడ ప్రీలునేమో! యనిపించు
నా యెదలోజ్యోతి! నాయింటివేల్పు!

నాకంటిలో తార! నామనోధనమ!
నాకలలోనియున్నత భావశిఖరి!
నాకోరికలసీమ! నాపరంధామ!
నాకుఁగాఁ బుట్టిన నారాయణుండ!
నానోటిలోమాట! నాసేయుచేఁత!
నానామధురవృత్తి! నానావతార!
యేలఁ జేసెదవోయి! యింతయాగడము
లేలఁజూపెదవోయి! యిన్ని వింతలను!
గనులలోఁగన్నీరు గార్చుటమేమి!
వననిధిసృష్టిసేసినవానిబాష్ప
ములనిల్పఁగలుగువారలు గలరోయి!
జలజాసనాదినిర్జరకోటికెవఁడు
గన్నీరుదుడుచు నాపన్న శరణ్యుఁ
డెన్ననాతఁడె గంటఁ గన్నీరువెట్ట
నెవ్వరు తగువారలింకనోదార్ప!
నెవ్విధమ్మున నిల్చు నీ సృష్టి తండ్రి!
నిలుపరా రక్తమ్ము నీరేజనేత్ర!
నిలుపరా జగములఁగళలకాకరమ!
పాలింపరా! మమ్ము పండరినాథ
యాలింపరా! పల్కులఖిలలోకేశ!
దీనావనవ్రతాధీన చారిత్ర!
మౌనిమానసగుహామహితహర్యక్ష!
సనకాది భక్త మండన దివ్యనామ!
వినతాతనయ పక్షవీథీసకామ!
గోపగోపీమనః కుట్మలసురభి!
తాపింఛ మధుర పింఛాఽఽపీతకేశ!
యనిపల్కు భక్తుని వినయమాలించి
కనులలో వెన్నెల కాంతులువిచ్చి——

ప్రత్యక్షదైవంబు పాండురంగండు
ప్రీత్యతిశయమ్ము జొబ్బిలఁ బల్కెనాఁడు
"వినవోయి! కారణజని! చొక్కామీళ!
ఘనమైన నీభక్తికిని లోఁగియిపుడు
పలుకుచున్నాను-నాపలుకులువిన్న
తులువలైనను మోక్షఫలమొందు భంగి
నినుము-పరుసవేది నెనపి సువర్ణ
తనుజెందునట్లు-సజ్జనబాంధవమునఁ
దరియింత్రు ఘోరాఘదళితషణ్యులును—
పరమ భాగవత శేఖరుడైన నిన్ను
గారించుకతన దుష్కరమైన ముక్తి
వీరికిఁగలిగెఁ బూజారులకెల్ల
ననుతాపపరిపూతులైనట్టిదాన—
సనకసనందనాద్యనిమిషమౌని
నదృశుఁడౌ నీకు మోక్షము సందియంబె!
నదమలత్వత్కటాక్షము బ్రసరించి
పాపియైనను భక్తిపంథనుబట్టి
యోపును సంసారమూడ్చితరింప—
నారీలలామ-గంభీరవాగ్వృత్తి—
ధీరతాస్పద-మోక్షసారమూర్తి మతి—
కైవల్యమునుగూడఁగంటఁజూడనిది
తావకచరణ విధ్యానార్ద్రి హృదయ
మానవులేమి! యమర్త్యులు దలలఁ
బూనంగఁ దగినయద్భుతచిత్త-జెలఁగు
నీతపస్సునఁ బంట-నీకుఁబెన్రక్ష
నీతాల్మి-నీముక్తి-నీసకలమ్ము
భవదర్ధ తనువు జీవన్ముక్త నిజము—
భవదీయసుతులు నిష్పాపుల-వారు

దరియింత్రు క్రమముగాఁదవిలిమద్భక్తి—
పరమపూజ్యంబై నభావత్కభక్తి!
ప్రకటమొనర్ప నే, పన్నితీవిధము—
సుకముండు" మనినంత చోద్యంబుగాఁగఁ
బేరెదలోనుండి గాఱెడు రక్త
పూరంబు నిలిచిన, భూసురులెల్లఁ
గలగని నటులొకక్షణమునిల్చుండి
కలకలలాడఁ మోముల వింతశాంతి
జయజయా కారముల్ సనిపిరి భక్త
భయనివారకుఁడైన పాండు రంగనికి—
పురజనులెల్ల సంబరమునఁగూడి
పరమ భాగవత శేఖరుఁడైనయట్టి
యాచొకామీళునియంఘ్రుల కెరఁగి
ప్రాచీన సనకాది భక్తసంఘాత
గణనీయుఁడని వాని గుణములుపొగడి
పఱఁతుల మేల్బంతి-పతిజీవయైన
వానియిల్లాలి నభ్యర్చించి ప్రీతి,
పూని తోడ్తెచ్చిరి పురమునకపుడు—
పండరి పురిలోన వాసంబుగూరె
పాండురంగనియందె భావమొప్పారె
భక్తిజీవనుఁడైన భక్తవర్యునకు—
రక్తితో భర్తనారాధించుచుండె
నాచొకామీళుని యర్ధాంగలక్ష్మి
యాచరణంబె నెయ్యపుఁ జెలిగాఁగ—
పాఱులెల్లరును గర్వంబు వోద్రోలి
వారిజాక్షుఁడు భక్తివశుఁడన్న యెఱుక
గమనించి-విజ్ఞానకల్పవృక్షంబు
నమల చరిత్రుఁడౌనాచొకామీళు

సేవించి కల్యాణసిద్ధినిఁ బొంది
ఏవానికడఁగంటనెసఁగులోకమ్ము
ఏవానిపాదమ్ము లింద్రాది సురలు
భావింత్రు-హృదయదీపమ్మును బోలి
యావిట్ఠలుని కన్ననన్యమౌదైవ
మీవసుమతిఁజూడ నెందును లేదు—
"పాండురంగా!" యంచుఁ బల్కినఁజాలు
ఖండితమజ్ఞానగాఢకాననము—
పాండురంగనినామభజనంబు-పాప
షండనిర్మూలనజ్వాలానిభమ్ము—
పాండురంగని నామ భజనంబు-ముక్తి
భండార-మానందవారిధి-వానిఁ
దలఁచెడువాని కోర్కెలు దీఱుసేమి!
గలుగునద్వైతమోక్షానందసిద్ధి—
పరముచొకామేళచరితంబు నెవ్వ
రరుదారఁ బఠియింతురట్టిపుణ్యులకు
నావిట్ఠలేశ్వరుం, డఖిలసంత్రాత
పావననాముండు, భవరోగహరుఁడు
పాండురంగండు దివ్యానందవార్ధి
యండగా నిలిచి నిత్యమ్ము రక్షించు—
శ్రీకరంబఖిలవశీకరం బమృత
శీకరభరితంబు-చిత్తజవైరి
భావనాంబరపరిభ్రాజమానేందు
పావన జ్యోత్స్న-యాపండరినాథ
నామంబుజగముల నలువుగా మెఱపి
కామితములు చిల్కఁగాఁత భక్తులకు
ననియిట్లు వైష్ణవజనపదాసక్త
వినయభూషణుచేత, విజ్ఞానిచేత

కఠినతపోవాటికా కల్పవృక్ష
శఠమఠణర్షిశాశ్వతగోత్రుచేత—
పాత్రమాపస్తంబసూత్రునిచేత
మిత్రహితునిచేత, మివులయత్నమున
లలితశిరీషపేశలమైనధారఁ
జెలువమరంగ రచింపఁగఁబడిన
పరమంబు పండరీ భాగవతమున
గరముచెన్నారు చొకామేళచరిత
భావబంధురమౌచు-శ్రీవత్సధారి
సేవానుసక్తుల జీవనంబగుచు—

(చోకామేళుని కథ సమాప్తము)



# పండరీభాగవతము

## (నామదేవ చరిత్రము)

తనపొడ బ్రహ్మాదులు̃ను గానరాక
తనయంతవాఁడుగాఁ దానున్నవాఁడు—
తానందఱికినైనఁ దనకెవ్వరేని
యేనాఁడు నేరీతి లేనట్టివాఁడు—
తనయందు నఖిలంబు దానఖిలమునఁ
బెనగొన్న, నెందున్న విధిలేనివాఁడు—
రూపనామక్రియాదీపితుండైన
రూపనామక్రియారోపబాహ్యుండు—
అట్టిదిట్టి దటంచు నెట్టువచించు
దిట్టలులేనట్టి తీరుగలాఁడు—
భక్తైకవశుఁడౌట భవబంధములను
రక్తిఁజేకొన్న యర్చావతారుండు—
విదితగోపాంగనా ప్రేమవాఙ్మయము
విధుశేఖరధ్యాన విశ్రుతమహము—
పుండరీకుని భాగ్యమండపంబందుఁ
గొండగా నిలిచిన గోపాలమూర్తి—
కలికియశోదకుఁ గతకారిబిడ్డ
తొలిపల్కు తొట్లలో పలి వింతశిశువు—
పాండురంగఁడు - లీల పండినరూపు
పండువై నెలకొన్న 'పండరి' యందు—
సరసిజోదరదయా శరణచిత్తుండు
పరధర్మవరధర్మ పాతితానేక

చాపల్యుఁడ్రశాంత సాత్త్వికదృష్టి—
కాపట్యరహితుండు - కామినీకనక
వంచనాఽతిగమతి - వైష్ణవోత్తముఁడు—
చాంచల్యవిముఖుండు – సత్పుణ్యఫలిత
శివకేశవాఽద్వైతశీలకలాపుఁ
డివతళించిన దయనీశుండుదనకు
దయచేసినట్టి శూద్రత్వమేచాలు
భయనివారకుఁడైన పండరీశ్వరుని
యడుగులు గొలువంగనని తృప్తిపడుచు
వెడపోఁకలుడివిన వినయగంధిలుఁడు—
శాంతంబుదనకుఁ బుచ్చనిబందుగగుట
మంతులాడెడు జాతిమాత్రోపజీవు
లైన విప్రులకన్న సత్యోత్తముండు—
'తానన్న' వాసుదేవాఽను భావంబు
నెఱపు 'గుణాబాయి' నిండుటిల్లాలు
తరముగా వసియించు - దామాజియనెడు
పరమభక్తుఁడు నిరంతరము గోవింద
పరమనామము దనప్రాణమ్ముగాఁగ—
గడచెను కాలమ్ము గలుగలేదొక్క
కొడుకైనవారికిఁ గోర్కెల మొదవు—
'దామాజి' యెదకిది తగనికొఱంత
యై-మానసంబును నలమటపఱప—
పలుమాఱు పసవెవిఠ్ఠలుచెంతఁగోర్కె
ఫలియించు కాలంబువచ్చెఁ జెంగటికి—
కలలోనఁ బాండురంగఁడు – చిప్పకూక
టులవాఁడు - వెయినామములవాఁడు – వెడఁద
కన్నులవాఁడు - చిక్కని నవ్వులాఁడు—
మిన్నంతవాఁడైన మిక్కిలిభక్తిఁ

దనుపువారలయెద దర్పణంబందు
నణఁగెడు నిభమట్టులణకమౌవాఁడు—
నిరుకళంబుగ మ్రోయని గమఁనూపురము
లరుదెంచి 'దామాజి' నభివీక్షసేసి
పలికెనోయీ! నీకుఁ గలిగిన కొఱఁత
ఫలియించుకాలమ్ము వచ్చెనీనాఁడు—
కులదీపకుండైన కొడుకుఁగోరితివి
కులమునకేగాదు - కుతలంబుకెల్ల
వెలుఁగునిచ్చెడువాని - వేలదేవతలు
గొలిచెడునట్టి ఫోకలుగలవాని—
నిచ్చితివో సూనునింతైనవెనుక
పిచ్చపాటిగ - తొలువిటిచేరమేమి!
ప్రత్యూషమున 'చంద్రభాగ'కుఁ బొమ్ము
మత్యుపహితమై నమరులు సిద్ధించు—
కమలంబుపై నూత్నకమలంబనంగ
రమణీయమొకటి యార్ద్రంబైనశుక్తి
దేలియాడుచువచ్చుఁ దీరైనదానఁ
బాలపాపఁడొకండు - పవళించియుండు
నిదురకన్నులు - యోగనిద్రయేగాని
యది లోకసహజమైనట్టిదిగాదు
వాఁడుద్ధవాంశ సంభవుఁడు - లోకంపుఁ
గీడులు - యోగుల క్రీగాలినంట
నేర్చునే! కోరికల్ దీర్చునే వారి!
నర్చిస్స్వరూపులకంటునే! కనటు!
నామామృతము వాని ధామంబు-దివ్య
సామోదితంబుల సవరసావాని
పలుకులచే - పురాభాగ్యంబు బలిసి
పలుకులచెలి - క్రొత్త భంగిమల్ నేర్చు—

పట్టిన తాళముల్వదలక - పలుకఁ
బట్టిన కవితలెప్పాటనిల్పకయ——
మదిఁ జేర్చియున్న నా పదములు - కీస
ప్రిదులక - భావంబుల దవదగాక-
పదబంధములు దామె పడఁబాఱియదుక
మృదులార్థములు గండ్లమెదలఁజురాఁగఁ
బలుకఁబోవాఁడు రిక్కలఁ బోలుపాట
లెఁచమించి భక్తులకులము పాలించి-
నామదేవుఁడువాఁడు - నామసన్నిష్ఠ
శ్రీమహితంబుగాఁ జింతించి పడసి
నట్టి భాగ్యమ్ము - వేయాఱుత్రోవలను
బట్టి - చిక్కులఁబడి - భంగమ్ము నొందు
సాధకాళికి నామసరణి బోధించి
బాధదొలంచెడు వ్రతమూనుదాన
నామదేవుండు - మన్నామంబుదాల్చి
యీ మహిజనముల హితమునూహించి
యరయ నిరాకారుఁడైన దైవమ్ము
కరుణసాకారుఁడై తిరిగెడు దాన
నామదేవుండు - మన్నామ నిధ్యాన
సీమాతిగంబైన చిత్కళతోడఁ
దనసీడ సోఁకిన తావులనెల్లఁ
బ్రణవంబు పండించి భాసిల్లుదాన-
నామదేవుఁడటంచుఁ బ్రేమతోఁ బిలిచి
యాముద్దులాని భాగ్యముగాఁగఁ దలఁచి
పెంచుము-పుణ్యముల్ నించి కొమ్మోయి!
పంచాప్త గురునొక్క పాపనిఁజేసి-
యని పల్కి పోయిన నఘలువిప్పి
తనువెల్ల గరుపాఱ 'దామాజి' లేచి

తనబోటి నెచ్చరించి - నితాంతకరుణ
పనుపడ రంగండు పలికినయట్టి
తెలఁగెల్లఁజెప్పి - చెచ్చెఱరమ్ముపోద
మరుదారవీచె గంధాంధ వేదండ
యానసుందరముగా నలసమారుతము
చాన! యనుచుఁబల్కి - సతితోడనడువ
బరమపూతము చంద్రభాగనుచేరి
పెలవాఱు కన్నుల వీక్షింపుచుండ——
నల్లంత దూరంబు నందుండివచ్చె
నల్ల నల్లనఁ బక్వమై తన పూర్వ
పుణ్యముల్ - గరకట్టి పొడకట్టినట్లు
గణ్యమైనట్టి ముక్తాస్ఫోటమొకటి-
యాశుక్తి లోపల నఱమూతకనుల
పేశల దృగ్విభావిసరంబుతోడ-
వెడవెడ నలఁతిగాఁ బొడము చిర్నగవు
తొడపైన తొగరు ముద్దులమోవితోడ-
ఫాలస్థలమ్ముపైఁబడివింత యొఱపు
పాలించు భ్రమరక వ్రాతంబుతోడ-
బంధుజీవకరాగ బాంధవ్యములను
సంధించి కొనుగండ చకచకద్యుతుల-
మహియంతయును మాటుమణఁగినవేళ
గ్రహతారకలు - దేవగణము - బ్రహ్మాదు
లడపొడగనరాక యాఱినవేళఁ
గడలిలోఁ దానొక్కకసుగందువోలెఁ
బవళించి యుండెడి పరమాత్మురేక
నవహితుండై - వక్త్రిమందుల్లసిల్లు
బొటవ్రేలితోఁగూర్కి - పొలుపొందుశిశువు
నటుగాంచి - యానందమై హృదయమ్ము

కనుదోయముద్బాష్పక మనయమగుచు
తనువెల్లఁ బులకదుర్దినమౌచు - జీవ
నంబు కార్తార్థ్య సాన్నాయ్యమై - కంటి
నంబు జోదరుదై నయనుకంప బొడవు
నదెవచ్చె నిదెవచ్చె నవ్యయానంద
పదము మానుషమైన భంగిదాననుచు
'దామాజి' సంతోష తరళితాపాంగ
దామసుందరుఁడౌచుఁ దత్తరం పడఁగ
నటుతూఁగు చిటుతూఁగు చలలపై వచ్చెఁ
గటకీకృతశ్రుతి కంజాక్షకరుణ—
దగ్గరించిన శక్తి - దామాజి పొలఁతి
దిగ్గునలేచి - మాతృప్రేమయుబికి
చనుమిట్టలను పాలుజల్లింపఁ, గనులు
దనుపార మెఱపులై - ఘనముగాముదము
కరములుదాచి - యాకసుగందునాచి
యురమున హత్తించి - యూర్పులునించి
చనుమొనవక్త్రిమ్మునను జేర్చ - కందు
కనుదోయిదెఱచి చిక్కఁగఁజూచి - యింద్ర
నీలముల్ జల్లించి లోలాక్షియెడఁద
పాలు ద్రావఁగఁజొచ్చె, భక్తసంతాన
పరిపాలనాచార పండరీనాథ
పరమ కృపాదత్త భక్తిపీయూష
పానంబుచే క్షుత్తుపాయనియట్లు
దానెంత దొడ్డదో తల్లిప్రేమమ్మ!-
ఆకలిదీరిన యట్లైన - చంద్రు
రేకల కనుగలంచౌ కన్నుగవలు
మూసినబుడుతండు - ముప్పేటలగుచు
దూసినప్రేమతోఁదోయజాక్షి

యాచెంప యీచెంప నంటుచుసారెc
జూచుచు - చుంబించుచు - నెదందహ_త్తి
కొనుచుc బాడుచునున్న - కోమలిcజూచి
తననోము ధన్యమై 'దామాశి' నామ
దేవా! యటంచును దీయcగాబిల్చి
భావమ్ము సమ్మోదపరవశంబగుచుc
బాండురంగనిగూర్చి భ_క్తి నందించి
తండిరిసుతు కొక్క_తని ముద్దువెట్టె— 85
ననఘపుణ్యములు చన్నవిసిచేపంగc అలఘు
జనవునసుతుcడైనన సాయుజ్యసుఖము
పొసcగనింటికిcదెచ్చి పుణ్యులౌపితరు
లెనకమెక్క_cగనున్న యెడcగుమారుండు—
తనతండ్రి శ్రీరంగధాముcడేకాక
తనకు నెక్క_డి తండ్రియనుమాడ్కి_నవ్వ—
కమలోదరునిమూ_ర్తి కన్నులcగట్టి
యిమిడినగతి, యూరకేవిలోకించు—
శ్రీపథ_క్త్యమృతమ్ము చేగ్రుమ్మరించి
సొపడు కరణిహ_స్తములారగించు— 90
శ్రీకాంతభజన నిశ్చేష్టితావస్థ
దాకిచందాన దావెలంగందు—
కలగనియజ్ఞాన కలిలంబుద్రోసి
చెలcగియాడెడుగcతి జేతులాడించు—
మాయానుబంధcబు మటిమటిదన్ను
చాయcగా లీలcగా - చరణంబులార్చు—
వనజనేత్రునిcబాసివచ్చిన తనకు
దినమెట్లు గడచునంచను భంగినులుకు
పరమకృపామూ_ర్తి పండరీశ్వరుcడు
పరువడి భాషించు పగిదినాలించు— 95

తగని మాయలలోఁగి పొగియులోకమ్ము
మొగిఁజూచి దుఃఖించు పొలుపుననేడ్చు—
'అడియండ'నినివంగి హరిపాదములను
బడుగతిధరణిపైఁబడి బోరగిల్లు—
నిలపైని మఱుఁగైన నళినాక్షభక్తి
తలయెత్తువడువునఁ దాఁదలయెత్తు—
సనకాదులకునైన సర్వేశుజాడ
కననిట్టిదని తెల్పుగతిదోఁగియాడు—
హరిభక్తు పద్మాసనాసీనవృత్తి
నెఱినిట్టిదని తెల్పునియతిఁగూర్చుండు
పరమ వైష్ణవతతి ప్రౌఢమార్గమ్ము
గరకట్టినట్లుగాఁ గడఁగి నిల్చుండు-
శరణాగతిని వీడిపెఱ త్రోవలెల్ల
నరయనిట్లని తప్పటడుగులువెట్టు
వాక్కుల కందని వానివర్ణించు
ఫక్కి - యిదని - తొక్కుపలుకులు వలుకు
మాయలోఁ గ్రీడించుమా నాధుచెయిది
పాయక సూచించు భంగిఁజెరాడు-
నంతవినోదంపు టాటప్రాయమ్ము
నంతరింపఁగ సేవ, సమకూడిరాఁగ
తనతోడివారి నందఱఁజీరి-కనుల
మొనయంగ బాష్పముల్మొద్దుగాఁ బాడి—
తాళముల్దట్టించి తైతయ్యమనుచు
లీలతో నర్తించు బాలోద్దవుండు-
ఒకసారి కన్నుల నొనరఁగూర్చున్న
సకలేశ్వరుని రూపుజూఋనో! యంచు
వడిగ తెప్పలుమూసి - బంధముల్ద్రోసి
కడునిషఁ గూర్చుండి కరఁగులోలోన-

నొకసారి దవ్వుగా నున్నట్లు శౌరి
చికమకలనుగూరి - చేయెత్తిపిలు -
నొకసారి, ధవుఁడంట నొయ్యారమొలుకు
చికిలినవ్వులతోడ, పిగ్గిల్లు రమణి
పడువున, నేవేవో భావంబులాచి
యెడయెల్లఁ, దనలోనె బుడిబుడిపలుకు-
నొకసారి బుడుతని నోదార్చుతల్లి
ప్రకటించు భావముల్ పదిలంపడంగ
రార! పండరినాథ! రార! నాతండ్రి!
రార! నాయూర్ప! యంచారాటమొందు-
నామదేవుఁడు - నాదు, కామతంబిట్లు
కామధేనువుగాఁగఁగడపద్రొక్కినది
రంగనాథుని దయాభంగిచేనంచుఁ
జెంగలింపఁగభక్తి - చేయెత్తి మ్రొక్కి-
జనకుండు, శ్రీశుయశమ్ము గీర్తింపఁ
గనులూరఁ దానాఁడుఁ గరములుదట్టి-
తనతండ్రి చేతులుదట్టి నర్తింపఁ—
దనుపు వెన్నెలఁ బోలుతానమ్ములార్చి
పలికెడు నాళుప్రబంధముల్ - పలుకు
పలుకెల్ల విరవాది పగిడిగా విరియ-
జనకుండు విష్ణుపూజలొనర్చునపుడు
చెనవునఁ గూర్చుండి చెవులు భావించు-
విధుశేఖర ధ్యాన నిధియైనయట్టి
మధుసూదనునిముందు మలయుదీపముల
తోడుగా నానందతుందిల దృష్టి
జోడించి యొకవేయి జ్యోతులునిల్పు-
జమిలి హస్తమ్ముల శంఖచక్రములు
రమణీయమైవెల్గు రంగధామునకుఁ

బొసఁగఁ దానమ్ములు పొనరించునపుడ
వశమైన హృదయమ్ము పలపలబాఱి
సకలతరంగిణీ జలములుప్పొంగి
యొకటిగాఁ గురిసిన యొరిమదోపించు-
తాపింఛగుచ్ఛ సుందరకుంతలునకు
పాపాపనోదన ప్రవణ పాదునకు
పండరీశ్వరునకు భక్తి వఱ్ఱొడ్డి
తండిరి కుసుమముల్ దలకొల్పునపుడు
తనకరంబుల కాంతిదట్టాడి పూవు
లొనర నబ్జంబుల యోజఁబొల్పార
నందించుఁ బుష్పంబు లానందబాష్ప
సందోహములు - తేనెజాలయిపాఱ-
వందించుఁ బ్రేమమ్ము సందడింపంగ
నందనందనునకు, నారాయణునకు-
నామదేవుఁడు - తండ్రి 'దామాజి' కాంతి
సీమలై కనులు వీక్షించి యుప్పొంగ-
నరిగెఁగాలంబిట్టులా కుటుంబమున
కరమరలేనట్టి యానందముననె -
పదియగునేఁడు సంప్రాప్తించె భక్తి
నదిమును కలుగొట్టు నామదేవునకు-
నొక్కనాఁడొక కార్యమొదవి 'దామాజి'
ప్రక్క పల్లియ కేగవలిసి వచ్చుటయు
నాటి పూజా విధానమ్ములో లోటు
వాటిల్లునో! యేమొ! పండరీశ్వరున
కనితోచి-నామదేవునిఁ జేరఁబిలిచి
నెనరునముద్దాడి వినవోయి కొడుక!
పనిగల్గెపీనాఁడు - పల్లెకుఁబోదు
వనజోదరుని పూజవరుస దప్పెడునొ!

నాయన్న! నామదేవా! యింటిదైవ
మాయెరా! పండరీరాయండు - వాని
పూజదప్పిననాఁడు పుణ్యంబువోలయు
నేజాడనైన నీవీ ప్రొద్దుపూజ
సవరింపవలయు - నీసలిపెడుపూజ
భవబంధ హరునకుఁ బాండురంగనికి
మా చేయునుతికన్నమన్ననకెక్కు
నీ చిత్తమందున నిలిచియున్నాఁడు
కడలేని బంగారుగనిగాఁగవాఁడు
కొడుక! మాపితరుల కోటిపుణ్యంబు
లొడఁగూడి యీయింట బుడుతవైనాఁడ
వాడికంబు నీ చేతియొక్క పుష్పమ్ము
తలపైనిఁబడినంత - కిలకిల నవ్వ
వెలయఁబారాఁడు విఠలుని విగ్రహము
పోయివచ్చెదనంచు ముంగురుల్దడవి
యోయన నిల్లాలి కొకమాట చెప్పి
పోయిన-'నేటికా పురుషోత్తమునకు
నాయిచ్చుపూజలకై యెదనేమి
భ్రమవుట్టెనో!' యంచుఁ బట్టంగరాని
ప్రమదంబు నిండార - భక్తి భాగ్యమ్ము
నామదేవుండు తానమ్ముపేదీర్చి
తా మాతృదేవికిఁ దమిదీఱ మ్రొక్కి
జనకుపాదములు నిశ్చలఁదౌఁచుదలఁచి
యెనలేని సద్భక్తి యేఱువైపాఱ
నడతెంచె శ్రీ జగన్నాధునిదరికి
బుడిబుడినడలతోఁ బడమినంతటను
స్థలపద్మములచాలు జల్లించికొనుచు—
జలజలమనిరాలఁ జషువులందు

నానందవశతఁ గట్టాణిము త్తెములు—
మానసంబనురాగమ త్తమైతూఁగ—
తెరువుజూచెడు దేవసురభి చెంగటికిఁ
దఱితోడ వత్సంబు బరుగిడునట్లు—
కాచియుండిన ప్రాణకాంతునిదరికి
నేచినతమి - వచ్చునెలనాఁగకరణి—
ఆస క్తిగొని యింద్రియమ్ములు - విషయ
వాసనలకులోఁగి పఱచెడునట్లు—
ఉడుగకతెరలెత్తు నుత్సాహకశ క్తి
బడి - కార్యవిజయంబు వడిఁబోవునట్లు—
తన చెన్నుపైఁగన్ను మనమును నిలిపి
చనుదెంచు నామదేవుని జూచి - కోర్కి—
నదె వచ్చె నిదె వచ్చెనని శీర్ష మె త్తి
యెదురు పొంగులు వోయెనిందిరాజాని—
నామదేవుఁడు భ క్తిసీమ, సాయుజ్య
సీమంతినీచారు సీమంతభూష
పులకప్రణాళికా పూర్ణతనుండు—
దళితాఘవై కృతు ధ్యానంబొనర్చి
యంతుపట్టఁగరాకయలరుచిన్మూ ర్తి
నంతలోన ప్రతీకమందావహించి—
సకలంబు దానుగాఁ జరియించునట్టి
యకలంకరూపున కాసనంబొసఁగి
క్షీరవారాశి వీచీశయ్యఁబండు
నారవినేత్రున కర్ఘ్యంబులిచ్చి—
ద్యునదీజననహేతు ఘనపదాబ్జునకు
ప్రణయశీతలముగాఁ బాద్యంబుజరపి—
మౌనీంద్రచిరతపోమయశరీరునకు
మేనవల్పున్నట్లుఁ దానమ్ములార్చి—

కాలాధ్వములకుఁ జిక్కనిదైవమునకుఁ
బాలనుర్వులవంటి చేలముల్ గట్టి!
తనసేవ మనుజమండనమైనహరికిఁ
బనుపడఁదీరు లాభరణముల్ గూర్చి
జలధిజాచరణ లాక్షాబిందుశోభ
దులకించునట్టి కౌస్తుభమున్నవాని
కనురూపధవునిపై నబ్జాక్షికున్న
యనురాగమట్టి చందనములలంది—
కలుముల చెలిచూచుకములపై వాఁడు
లలితాంఘ్రులకు నక్షతలు సమర్పించి
ఘనవై జయంతికా కలితవక్షునకుఁ—
దనుపారువిరుల పూజనములొనర్చి—
పరమర్షి దివ్యహవ్యద్రవ్యగంధ
భరితదేహునకు ధూపమ్ము లర్పించి—
పరమపూరుషునిఱువలఁకులఁగాంతి
పరిణద్ధములగు దీపమ్ములు గూర్చి—
నామదేవుఁడు ముందు నైవేద్యముంచి
శ్రీమహితాకార! సింధుగంభీర!
రావోయి! సనకాదిభావనామూర్తి!
పావనతరకీర్తి! పండరీనాథ!
యెదుటనుంచిన పాలుముదముతోఁగ్రోలి
యెదపుల్కరింపుల నింపుమాటాడి
నైవేద్యమునఁజవి నాకు వర్ణించి
పోనచ్చుఁగాని సొంపులు జిల్కరించి"
యని చీరి పిల్చిన నబ్జనాభుండు
దనకెంత మదిలోనఁ దత్తరంబున్న
వాని సుధాపేశలానూనవాక్కు
లానెడు తమకంబులగ్గలించినను

గదలిరాకున్న, నాకలిలేదా! నీకు
మధురంబుగాలేవా! మాయింటిపాలు
మీగడల్ జాలవో! మ్రింగుడు వడవా!
త్రాగుటపోలదో! కండచక్కెరలు
దక్కవో! వాసన దక్కెనో! నేటి
కక్కట! మాసేవ లమకఁగాలేదొ!
యేల మేలంబు నాపాలి దైవతమ!
జాలమ్ము సేయంగ సమయమా! దివ్య
గోకులవాపినీ గోపికరాబ్జ
కాకలీకలనిన దాకీర్ణ కనక
కంకణ హస్త సంగతిలేక దుగ్ధ
మంకిలివడునొ! కృష్ణా! నాదునేత్ర
మింతమన్నింపరా! యింతకే మఱవొ!
పంతగించిన గోపకాంతలు - వారి
స్వాంతమ్ములిగురింపఁ బలుకాడి - నీదు
చెంతఁజేర్చిననాటి చేఁతలు మఱచి
తివా! రూపుమాఱిన తీరుమారెడినొ!
యవికృతమైనట్టి యానందభరము
తిరముగా నీతోన దివ్యవై కుంఠ
పరిసరమ్ములనున్న వానినీభువికిఁ
బంపితివొక్క నెపంబుతో స్వామి!
పంపునొదలఁ దాల్చి వచ్చినానిటకు-
వచ్చిన నాపైని వర్షించుటుఱవొ!
యెచ్చైనదయ - కాక - యెదబాటుగూర్చి
క్రుంగించుటుఱవొ! నీకో! నాకొ! నింద
శృంగారజలధి! యోచింపుసుమ్మింత-
పాలుద్రావెదులోన వైకుంఠవాస
లాలిత భకకులమ్ము నీచింతఁ

దూలెడు నంచురావో! లెస్సయదియు
శ్రీలాలితాకార! చిత్సుఖాధార!
యిటులైన నాకథయేమిరా! యెట్టి
కటికి దెందముతోడఁ గాలమ్మునీడ్తు;
నేదియెట్లైన నీవిప్పుడు వచ్చి
యాదరముంచి - పయస్సునుగ్రోలి
పోవలెనా పూజపుణ్యంబువంద
రావోయి! మన్మనోరాజ్యభండార!
యనిమఱిబీరిన నరవిందనేత్రుఁ
డను పమంబను రాగమాగుబ్బుగొనఁగ
హృదయంబులో విస్తరించిన కరుణ
కదలాడఁ, దెగమీఱు కన్నులయందుఁ
గమలజాకజ్జలా కల్పమౌపెదవి
రమణీయ మందహాసము పిసాళింప
నిటలస్థలంబుపై నీలాలకములు
నటియింపఁ గ్రొంగ్రొత్త నాట్యభంగిమలు
ఆఱచంద్రులోని చిహ్నాంశమ్ముపోలెఁ
గరమొప్పఁ బదనైన కస్తూరిబొట్టు
చెఱుకుఁ గెంపులతోడ దొరయు, పల్వరున
పరగింపనీరేజ పత్రసంతతులు-
బటువుతా బ్రహ్మాండ భాండముల్దాల్చి
పుటపుటనై యున్న బొజ్జదొనంక
వెడఁదపొక్కిలివాఁడు - వేకారి, లచ్చి
పడుచు గుబ్బలపైని పవళించువాఁడు-
గడుసుపోఁకలవాఁడు - కడుమించుపురుల
తొడవుతోఁ జూడమెప్పెడు మోమువాఁడు
కలికి రేకలవాఁడు - హాళదిపుట్టంబు
గలిగి కన్దన్పెడు కానుగలాఁడు-

నెఱిమించునొక యింద్రనీలమ్ముపోలి
పరిణతంబైన శ్రీవత్సంబువాఁడు
యాజానులంబి 'యాహా!' పుట్టఁజేసి
తోఁజుగానటియించుతో మాలవాఁడు-
కనులకు వ్రేఁగైన ఘనవక్షమందుఁ
దనుకు కౌస్తుభకాంతి తతిగల్గువాఁడు
నీలమేఘంబొండు నిల్చికొన్నట్లు
లీలగా విష్ణుండు మ్రోలనిల్చుండి-
చిక్కనిపాలు గుటుక్కనఁద్రావి
యక్కటికంబుననా భక్తుశిరము
నిమిరిపోయిన - సుధానిష్యందియైన
కమలేక్షణునితాకు - కలయంతతనువు
పులకలు మొలిపింపఁ దెలిగన్నులందు
జలజలరాలంగ సమ్మోదబాష్ప
ములు - ప్రియస్పర్శచేఁ బులకించు చెలియ
పోలుపున నామదేవుఁడు గొంతతడవు
లలితలజ్జాభంగములఁ దొప్పదోఁగి;
గరుపారుమేనునఁ గరములు మోడ్చి
సరపి జోదరునకు సాష్టాంగ మెఱఁగి-
లేవ, గుణాబాయి దావచ్చి, చూచి
నైవేద్యమేమయ్యెరా! వత్స! యన్న
త్రావిన వాఁడమ్మ! దామోదరుండు;
మోవిపైనదె చూడు ముసరుకొన్నట్టి
నునుమీగడలతావి; కనవె యాబొజ్జ
కనువిందులొనరించె గారవంబూని!
యాకలిదీఱినదమ్మ! నాస్వామి!
కేకట నింక నర్తించు, థైథయ్యా
థైథయ్యా యనుచు సౌందర్యంబులుబుక

వేధాది సురతతుల్ వేకారివినఁగ—
ననిపల్కు, నా తల్లి యబ్బురంబంది;
మనమున నమ్మకయును నమ్మకుండ
లేకయు మరియాడి, సాకారభక్తి
యాకుమారుని పూజ యాత్మనాధునకు
వినిపింప, మోదమ్ము వేమరెత్తింప;
వనుపడి కోర్కెలు పరవళ్ళఁద్రొక్క;—
నా జియ్య! నా స్వామి! నా వంగడంబు
తేజంబ! నా నోము దీర్చిన తోట!
నిత్య సూరులలోన నిలిచినవాఁడ!
ప్రీత్యతిశయ తృప్త వేధోండతుండ!
నా భావనాచంద్ర! నా భక్తిఫలమ!
నా భద్రములపేటి! నా నామదేవ!
ఆ పాండురంగని జూపరా! మాకు
నీ పుట్టువునమాల్చి నిఖిలపాపమ్ము,
లటులుండు, నిటులుండు నా వికుంతుండు
కటకీకృతశ్రుతి, కలితతాపింఛ
గుచ్ఛవిచ్ఛురితాలకుఁడు, రూపుగొన్న
స్వచ్ఛందశృంగార, మచ్ఛమౌనీంద్ర
చిరతపస్సలిలాంబుధర దివ్యమూర్తి
పరభాగ్యమైనట్టి పండరీనాధుఁ
డని తలపోఁతగా, కచ్ఛంపురూపు
కనుదోయి బండఁగాంచిన యదిలేదు"
జనకుమాటకు నీయకొనియె పుత్రుండు
వనజోదరుని దైనవరదర్శనంబు
నిప్పింతునని శ్రీశుఁడెంతగాఁదనకు
గుప్పిట నొదిగెనో! తప్పనిభక్తిఁ
బట్టిన భక్తుల పాలిడింగరుఁడు,

కట్టిన వెల్లావు కమలనేత్రుండు
మఱుదినమున యందు మధుసూదనునకు
నరుసంబుబెనఁగొన నర్ఘ్యమ్ముదీర్చి
సనకాదిదివిజమస్కరిశిరోభూష
లనుపమాంఘ్రులకు బాద్యంబులందించి
ఆ వైపు నీ వైపు నార్ద్రమౌమనసు
భావమ్మునంట దీపములు వెల్గించి
జన్మజన్మమునకు సర్వేశ! నీవె
మన్మనఃపతియని మలరులు పూన్చి
ఇదె నాదుజీవనమిదె తపమ్మంచు
మది చెమ్మగిల్లతోమాలియసాతి;
సర్వేశ సద్భక్తచరితముల్వోలు
పర్వ్వవాసనల ధూపమ్ములర్పించి
నైవేద్యముంచి, యా నామదేవుండు
భావించి చీఱిన, పండరీశ్వరుఁడు
నడుమున చేతులు, నలువైన మోవిఁ
తొడిఁబడు నవ్వులు నిడుదకన్దోయి
బెరపిన సత్కృపా భరమౌచునిలచి
వరవుడనైతి నీ భక్తికిఁ, దెమ్ము
నైవేద్యమన్నంత, నామదేవుండు
సేవించికొమ్ము, తండ్రీ! విశ్వవిశ్వ
సమ్మోహనాకారు! సాత్వికాచార
సమ్మితసాత్వత సాన్నిధ్యమూర్తి!
వనిపల్క, 'దామాజి' యరపి-యేమేని
కనుపడకుండిన - కళవళపడుచు
నే మాయజేసితి విందిరాజాని'
నామాంసపుంగండ్ల కీమాడ్కినను చు;
నావఱచిన యట్టులఱచిన, తండ్రి

కీవంత బోకార్పనేవలెనంచు
నామదేవుఁడు హరిమోముపై చూడ్కి
సోమించి నిలువంగ - స్రుక్కుచుబలికె
శ్రుతి సతీకమన! విశ్రుతవైరిదమన!
ప్రతిలోక భండార! వాక్పరిష్కార!
నా తండ్రి కనుదోయి చేతమ్ముగూడ
శీతలంబొనరింపరా! తావకీన
మగు దరిసెనమిచ్చి - నిగమగంధములు
పగటించు చిన్నారి నగవులు చిలికి"
యని వేడ - నభయహస్తాభిరాముండు
కనుగవమెఱుగులు కడలనెత్తులు
గామృదుహాస సంకలితమైమోవి
కామనీయమ్ముల కరవోలె వెలుఁగ
వచియించె నీ గతి వాగ్దేవి పుణ్య
నిచయంబు ముక్కారు నింపిన యట్లు
నామదేవా! భక్తినందనారామ!
నామదేవా! ముక్తి సీమంతదామ!
యీనాటివా! మన యిద్దరి పొత్తు
లేనాటివో! కలియేచి ధర్మంబు
ముసుగుదువడ, నిన్ను పుడమి కంపితిని
ప్రసృమరభావ ధూర్వహములైనట్టి
పదకవితలుగట్టి ప్రజల నాకట్టి
యదయ, మ్మధర్మమ్ము నడఁగించుటకు
నో యుద్ధవా! నీకు నొనరినపున్నె
మే యెల్లఱకును బ్రాప్తించునా! యేమి?
దామాజి కిపుడు మద్దర్శనప్రాప్తి
ప్రామిన యంతఁడొప్పడునె! యింకెంతొ
తడవున్నదోయి! యేతరమునఁ జూడ

నెడనూది కొల్పి సాధించుఁగాకేమి:"
పండరీశ్వరుని యాభాషణంబులకు
నిండు గన్నులయందు నినిచి కన్నీరు
నామదేవుఁడువల్కెఁ "నా స్వామి! కరుణ
యే, మేనుదాల్చి యీ భూమికి దిగిన
దని, భక్తవరులెల్ల రగ్గింపఁ, దెలిపి
మనముననొకసారి మఱచియే కాని
'పాండురంగా!' యన్న పరమపాపులకు
నండవై నిలిచి తాపాపనోదనము
నొనరించు నీవు, నా జనకుపై నిపుడు
కనికర ముజ్జగించిన విధంబేమొ!
గరుడవాహన! నేడు గఱచితివేమొ!
వరవినాయకునుండి పక్షపాతమ్ము
నా తండ్రి కనుగప్పి - నాకు గొల్పిడిన
చేతమ్మురంజిల్లునా! తాత తాత!
నీమఱికెక్కిన నిక్కంపుభక్తి
సామాసికంబుగ సాధింతునేని
భాగవత వ్యూహపాదరేణువులు-
భాగధేయంబుగా భావింతునేని
వర భక్తపదసక్త పాదజలమ్ము
సురసరిత్తుగఁగ్రోలి సొక్కెదనేని
భగవంతుకంటెను భాగవతులను
ద్విగుణిత భక్తి సేవింతునయేని
పలుమాటలేటికి, పండరీనాథ!
తలమట్టు పలుకయుద్ధవుఁడనయేని
నీవు నాగురులకు నెమ్మితో కరుణ
గావించిపోవలె కటకటం పడక"
యిక తాళలేదయ్య యిందిరాజాని!

ప్రకటకారుణ్యుండు పండరీశ్వరుఁడు
చాలింపు ముద్దవా! సైరణవిరిసె!
బోలనిపంతమ్ము లేల! భక్తులకు
వరవుడమోయును, పండరీశ్వరుఁడు
పరికింపనిమ్ము నీ గురువులు నన్ను
నన్నంత, మనసెల్ల నానందమగుచు
కన్నులు బాష్ప ముక్తాతతుల్ గురియ
రావమ్మ నాతల్లి! రమ్ము నాతండ్రి!
దేవాదిదేవుండు భావనామయుఁడు
భవ బంధముల మాల్చు ప్రభుడురంగండు.
భవభావనాకాశ దివసకరుండు
నిలిచికొన్నాడు తాఁగొలువిచ్చి, తడవు
నిలువంగలేడమ్మ; లలితపాదములు
కందును నావాని కందంపుగనులు
గందురుగాత! మీకాంక్షలు దీర!
ననిపీరె, నాభక్తుఁ డప్పుడుగనిరి
జననియు - జనకుండు సర్వవేదముల
కాధారమగువాని - నమరవైయాత్య
నాథమ్ములగు చరణమ్ములవాని
కడునలికంబైన నడుమునయందు
నిడికొన్న చేతులయింపులవాని
చేకట్లవాని, విచ్చిన తమ్మిదోయి
రాకొట్టు విపుల నేత్రమ్ములవాని-
నేత్ర పాత్రములందు నిండిజాల్వారు;
ధాత్రాదులును గోరు దయగలవాని
గీఱునామము వాని నీరేడుజగము
లాటిచి వెలయించు తీరులవాని-
కటివంక బొమ్మల యొఱపులవాని

పురుడైన మొసలి రాపోఁగులవాని-
నెఱిఁగల్గుచు నిగనిగలు చిట్లించి
గరువుపైఁబడు - నలకలగుంపువాని-
నెమలిపించెము వాని, నీటుదొలంకు
కమలారతుద్రవా కల్పంబువాని''
కని, పులకాంకూర కలితులై - యేమి
యనలేక చిత్రమ్ములై నిల్చినంతఁ
దెమ్మోయి! యుద్ధవా! తీయనిపాలు
సమ్మదంపడనీవు చవులెంచి గ్రోలి
పోయెదనని పల్కి పుండరీకాక్షుఁ
డాయిత్తపడి వలహస్తమ్ముసాచ
నామదేవుండు దుగ్ధామృతంబొసఁగె
రామావతారమ్ములో మచ్చలేని
సాత్త్వికభక్తితో శబరి, వేదాంత
తత్త్వమ్మునకు, ఫలతతి నిచ్చినట్లు
చక్షుర్యుగంబు వాత్సల్యంపు భక్తి
పక్షమైన యశోద పాలిచ్చినట్లు
తను నాథుగాఁగోరి తరుణివై దర్భ
తనయ యచ్చంబైన మనసిచ్చినట్లు
తాఁదప్ప లోకమ్ము తలఁపునలేని
రాధ - సర్వస్వమర్పణ సేసినట్లు
తాదుగ్ధమున్గ్రోలి - యాదిదేవుండు
సాధువాదముసేసి చల్లగానవ్వి
యిక పోయివత్తునా? యిత్తువా! సెలవు
సకల జీవవ్రాత సంజీవకరణి!
యనిపల్కి మఱుగైన, నపుడు దామాజి
తనయునక్కున జేర్చి తనువునే మఱచి
నీవు జిక్కినదాన నావంశమెల్లఁ

బావనమైనదో భక్తిభండార!
యొక యన్వయంబునం దొక వైష్ణవుండు
సకల పుణ్యముపండి జన్మించినప్పు
డటునేఁడు తరములు నిటు నేఁడుతరము
లటమటదొలఁగి మోక్షానందమొందు-
తండిరినేగాను - తండ్రి నీకెవఁడు
పాండురంగనిదైన ప్రకటరూపమ్ము
వనుచు నగ్గించిన - నౌదలవంచి
వినయంబుసేసె - సద్వినుతుఁడౌ సుతుఁడు-
నామదేవుఁడు భక్తి సీమంతభూష
శ్రీమనోధాముని జింతించిపాడు
పదములు వేలకు, భారతీ మంద
మృదుహాసములవంటి పదములుగూర్చి
అక్రూరు ననురాగమాత్మలో మెలఁగి
శక్రవందితు బాడు సఖ్యభావమున
నాభీష్మ భక్తి హృదంతరం బాచి
శోభిల్లగాఁ దత్త్వసూక్తులు వలుకు
హరినూను బాంధవ్య మార్ద్రమైతోచి
పరమేశ్వరునితోడి - వావివర్ణించు
ఆకృష్ణతానైన యట్లు భావించి
యాకులపడి పిల్చు నాక్రోశమంది
సాత్రాజితీప్రేమ చవులెంచి కోప
పాత్రమ్ముసేయు సౌభాగ్యమ్ములాచి
వల్లవీభావంబు పారాడి విరహ
వల్లకి మ్రోయించు బాష్పరుద్ధమ్ము
వేలులక్షలుగాగ వినిపించె భక్తు
డా లీనమతి సుధాస్యంది గీతమ్ము
లా పాటలకుఁజిక్కి- హరి, నామదేవు

నోపండు నిముసమ్ము నుజ్జగించుటకు
హరిసేవ నజ్ఞానమది యత్తమిల్లు
పరుసున, దిన్నఁగా బాల్యమ్ము జాఱె;
దనుజారి నామామృతమ్ముచే శాంతి
దనికెడునటు కండ్ల తళతళల్దోఁచె;
వైరాగ్యమున ముక్తివాసించునట్లు
తీరైన నవ్వులఁజేరె క్రొత్తళుకు;
హరి రక్షయున్నట్టి నరుమదివోలె
యురము నానాటికి విరివియైతోఁచె;
శరణాగతుని నిత్యసంతోషమట్లు
గరువులపై క్రొత్తకాంతి భాసించె;
పరభక్తు నిత్యసౌభాగ్యమ్ము వోలె
కరమొఱపుల మోవికావిదోఁతెంచె;
పనిసేయవచ్చిన పడిగాపువోలె
ననవిల్తుఁడంజిక నక్కుచు వచ్చె;
నామదేవుని భావనది, క్రొత్తహంస
యై, మృదుశృంగార మావిర్భవించె;
నరరూపదైవమ్ము నామదేవునకు
పరువమేతెంచెనం చెఱిఁగెను తండ్రి
యనుకూల బాంధవ్యమరసి దామాజి
తనయు బెండిలిచేసె తని పూవుబోలు
భార్య 'రాధాబాయి' భర్తతోఁ జెందె
నార్య సమ్మతమైన యట్టి సౌఖ్యమ్ము
లానమ్మదములొక్క- యర్భకుండఁగుచు
వాసించె భూమిపై, వంశపావనుఁడు
మనుమండు గలుగ-దామాజిమిన్నంటె
ననకారుబోలె గుణాబాయి మనసు;
అచ్చుకట్టిన యట్టు లలరునే తండ్రి

కచ్చంబుగానని, రా తాతగారు;
కాదు రాధాదేవి కన్నులు మూస్కొ
నాదర్శమునయట్టులనె గుణావాయి;
పొలంతి భర్తను జూచెఁదెలిగన్నులందు
తలసూపు చిఱునవ్వు తని సొమ్ముగాఁగ
'నాదేవదేవునే యడిగి చెప్పెదను
వాదేల'యని పల్కె భక్తుండు-తండ్రి;
పదిదినములు వానిపైని రెన్నాళ్ళ
లడెయిదెయనఁ జెల్లెనటగడెవోరె;
కరముపేడుకనామ కరణోత్సవమ్ము;
జరిగింప దామాజి సంబరపడియె
నిప్పచ్చరపుదేవి నిచ్చలు నిలిచి
ముచ్చటలాడెడి నచ్చోటికెవరు
వత్తురు బందుగుల్? భక్తులన్నంత
తత్తఱపడు మోక్షధాముండుగాక;
'దామాజి' తులపికా దామశోభాఽభి
రాముఁడౌ శ్రీ పాండురంగనిఁజేరి
సాష్టాంగపడి, దీనజన కృపావార్ధి
కష్టశ్రితాఽఽవన! కలిలాఽతిదూర!
మరుదధీశ్వర! నాదుమనుమని నామ
కరణమీనాఁడు, సాక్షాత్కారమొసఁగి
నాయింటి నిస్స్వమన్నంబు భుజించి
మాయి సుంగునుమదుల్ మలయదీవించి
రావలెననియన్నఁ, గ్రాల్గనుల్నగవు
క్రోవులుగా నియ్యకొనియె రంగండు
నడిప్రొద్దుదాపైన నామదేవాదు
లడిబత్తి కన్నుల నాత్మల నిబువ
నెదురు సూచుచునుండ నెదుటను నిల్చె

సదమలముని తపస్సామ్రాజ్యమూర్తి
శరణాగతులయింట బరగు బందరువు
తెఱగంట్ల సేమంబుతీఱిన కరువు
గోపీజనమ్ముల కూర్మిగందరువు
కాపథదూర మోక్షదకల్పతరువు
లలిత పీతాంబరోల్లసిత దేహుండు
వలయిత మంజులాప్యాన బాహుండు
ఘుమఘుమాయిత దివ్యకుసుమ సంగ్రథిత
కమనీయమాలికా కలితవక్షుండు
జలధిజానేత్రకజ్జల చారుగండ
తలగళచ్ఛృంగార తరుణ, హాసుండు
కరుణాపరిష్కార కల్యాణసార
వరకటాక్షరసాభరిత దిక్కుండు
మదకలాపి కలాపమండనాత్యంత
మధురాలక కలాప మహనీయమూర్తి
యప్పుడు శ్రీరంగఁడను రాగమొనర
గుప్పున వాసనల్ గుప్పఁజిర్నగవు
నామదేవుని జూచి" నామనోధనమ!
యేమి? నీ తలఁపు నా కెఱిఁగింపు"మన్న
మనసెల్ల వెన్నయై కనులెల్ల భక్తి
పొనరార నామదేవుఁడుపల్కె" దేవ!
నీపట్టి నర్మిలి నేపేరఁ బిలువఁ
జేపడునో! మేలు చెప్పుమటంచు
"నారాయణుండ" నెనంది వర్ధనపు
బారులుగా నవ్వ పాండురంగండు
నారాయణుండను నామాక్షరములు
చేరలహర్షమ్ము చెవులలోఁబోయ
నామదేవుఁడు గళ సీమరుద్ధమ్ము

గా, మఱిమఱి పల్కె గఱుపాఱమేను
ప్రాముసుల్ సేయు ప్రవర్గ్య హోమమ్ము
లామోదమునజేరి యానెడునట్లు
పాండురంగండు పాపడియె నన్నంబు
వండిన వితములు వర్ణించి కొనుచు;
తమ్ములంబొసగెఁ జిత్తమ్మునరాగ
మిమ్మాడ్కిఁ గ్రమ్మెనా నెలమి భక్తుండు
పోయివత్తునె? యంచుఁ బుండరీకాక్షుఁ
డాయెడ చిఱునవ్వు, నానవ్వుతోన
కుప్పలువడె చంద్రగోళి గట్టించి
నప్పరుసునవెల్ల నైనవి కొన్ని;
సంజకెంజాయ నిచ్చలమైన యట్లు
రంజించు చీనాంబరంబులు కొన్ని;
కనుబాటుఁ బొరయు చిక్కని యపరంజి
పనితనంబున్నట్టి వస్త్రముల్ కొన్ని;
పులుగడిగిన ముత్తెముల నంచలములు
తలతలమని మించు జిలుగులుకొన్ని;
మాయూరపింఛ సచ్ఛాయముల్గొన్ని;
కాయజశుక తుండకాంతముల్గొన్ని;
కోశామ్ర వర్ణముల్గొన్ని - వార్వాహ
పేశలరుచితతి స్ఫీతముల్గొన్ని;
యీ కరణిని వారి నెలమి మన్నించి
యాకులిత స్వాంతుఁడైనట్టి నామ
దేవుని కయివట్టి దీవించి, దేవ
దేవుండు మఱుగైన, తేజమ్ము దరిగి
గృహమెల్ల దీపమార్పిన యట్టులైన
మహమున కేతెంచి మధుసూదనుండు
తనపాదభక్తి తద్దయుసీక యేల

మనసును మఱగించు మాయదా నొసఁగె
కలుష సంహరు భక్తి గావలెఁగాక
వలువలి వేటికిఁ బదటికే యనుచు
వారి వారినిఁ బిల్చి వసనంబు లొసఁగె
నారాయణ పరుండు నామదేవుండు;
కోకలిచ్చెడినట్టి కొడుకునుబట్టి
యాకట్టినది తల్లి; యతఁడు దావినునొ?
కోకలుగావమ్మ కూర్మినాతల్లి!
శోకంబులివి, నందసూనుపై తలఁపు
మాలిచి - యెఱుకలు గూలిచి, భక్తిఁ
దూలిచి, సంసార మాలిన్యమందు-
దేలించు, నిచ్చలు దెప్పయై నిలిచి
పాలితామరమూర్తి - పాండురంగండు
మనపాల నెలకొన; మంపిల్లి, యేల
వనటకు మూలమ్ము భాగ్యముల్ గోర
బొదబొదమనిపల్కి - సదనంబుఁజేరి-
కదలని దయ్యంబు గదలించినట్లు
వలువలు కడజేసి పండరీనాథ!
తలఁపుగన్గొన నొక్క- తటపటసేసి
పోయితివో! నీదు మోసమేగంటి
నాయుల్లమున నీదు నలువైన రూపు
దక్క - నే కోర్కెయు నెక్కొనలేదు
నిక్కంపుఁ బంతంబు నీతోడు ననుచు-
పదములు బెడగార - భావముల్గూర
మృదురాగములు దీర; మేల్మిగాఁ బాడె;
'నారాయణా!' యన నామదేవుండు
చారునేత్రమ్ములు సారించి చూచు;
'నారాయణా' యన నామదేవుండు

కేరింతలాడుచు గిలకిల నవ్వ;
'నారాయణా' యన నామదేవుండు
పోరుపెట్టిన పాప, పోరుసాలించు
'నారాయణా' యన నామదేవుండు
చీరిన యట్టులై చెంతదాఁ జేరు;
'నారాయణా' యన నామదేవుండు
'నారాయణా' యను నవకంపు శిశువు;
నారాయణుని దయఁగాంచిన బిడ్డ
నారాయణుగ నెంచె నామదేవుండు;
నవరసంబులు గుప్పి - నామదేవుండు
ప్రవణుండుగా పదబంధంబులల్లి
వింతవింతగ స్వామి బిల్చెడు నపుడు;
కాంతముఖుండైన కందునుజూచి
పొఱఁగా వర్రోడి, భక్తి, గన్మూసి
నారాయణా! యంచుఁ జీరెడునపుడు;
తన సతియైన రాధాబాయి కనులఁ
దనికిన శృంగార తత్పరతలను
జేరి పరీక్షించి - చిద్రూపమెంచి
'నారాయణా' యంచు ననిచిన యపుడు;
గృహదైవతమ్మున కెదుటఁ గూర్చుండి
యిహసుఖమ్ములనెల్లఁ దృణముగాఁ జూచి
పూరేకులై యెదపూజలు దీర్చి
'నారాయణా' యంచునను పూనినపుడు;
నారదాదులు భక్తిధీరులు మింట
బారులుగానిల్చి - ప్రస్తుతింపుదురు;
నామదేవుఁడు భక్తినందన వనము;
నామదేవుఁడు హరి నమ్మినబంటు;
గడచెఁ గాలమ్ము, నిష్కారుణమ్ము ముదిమి

యెదతాకి 'దామాజి' కెక్కివచ్చినది.
కహాకహామను నవ్వు కన్నులం దొలుక
విహరించినది - యింట - బీదటికమ్మ-
నామదేవుఁడు దివ్యనామ పారాయ
ణా మిత సక్తుఁడెయ్యది విచారింపఁ
డాకోడ లీయింటి - కాయింటికేగి
వాకొనుచున్నది వనట, బెన్వేతలు;
"పెఱచోటఁ బుట్టక - కఱవైన వేమొ?
పొరపడి యిచ్చటఁ బుట్టినవాఁడు
వీఁడు వెంగలిబిడ్డ! కూడెందుఁ గలదు!
జాడగా నొకనాఁడు, చచ్చుగా కంచు
నపుడు గుణాబాయి, యాత్మజుఁజూచి
యపురూపముగ బుట్టినట్టి యో కొడుక!
కలరు భక్తులు భూమి కంజాక్షుఁ గొలుతు
రలవి యెఱింగి, నీయట్లు రేవగలు
తాలిగట్టిన భార్య తలఁపులు మాల్చి
బాలచంద్రునిఁ బోలు పట్టి బోవిడిచి
యిఱు గురుపులచెంత దొఱఁగి యున్మాద
పరవశులైనట్టి భక్తులులేరు
ఇటు నిహం బటుపరం బెంచి సాధించు
పటు బుద్ధులగువారు ప్రాతిగారేమి?
పండరీశ్వరునకుఁ బరముద్ధరింప
పండబాఱిన చేను, నిండుసంసార
మెప్పరికింపుచే? తప్పినదేమి!!
యిప్పుడమికె నీవు, గొప్ప భక్తుఁడవు
పరధర్మ మొక్కటిఁ బట్టిన యంత
పెఱధర్మములనెల్ల విడువంగ నగునొ!
ప్రమదలఁ పుత్రులు, బాంధవుల్ చెలులు

తమతమ కర్మంబు దగిలించి కొన్ని
వదలని బంధమ్ము లడవడం పడిన
వీరలడురే, రిత్త పలుకులేగాక,
పిచ్చివాడా! జన్మమిచ్చినవాడె
యచ్చంపు కాపురంబిచ్చినవాఁడు
దీని సాధించిన, దేవదేవుండు;
యేనాటికోరాక! యేడకుఁబోవు!
నన్నవస్త్రములకు నలజడి వడుచు;
కన్నులఁ దడిపెట్టు కాపురం బగుచు
"నారాయణా!" యేమి గోరాయణుండు;
వీఁడడి! చాలింపు వెఱ్ఱివేసమ్ము-
లని - మందలించిన - యాత్మను గొఱవి
గొని - చూడినటులైనఁ గోకొల్ల లగుచు
కనుల నీళులు గార - కంపితంబైన
తనువుతో - పాండురంగని యాలయంబు
జేరుచు - వలగొని - చెలువైన పాగ-
గీఱునామము - కటిజేరిన హస్త
ములు - మేల్మిబుగ్గలు నలకల సొగసు
లలవడగట్టిన యట్టి పసిండి
చేలమ్ము - నెమలిపించెము, వక్షమందు
వ్రేలాడు పూమాల, విరవాది నగవు
చకచకలాడెడి మకరకుండలము,
లోకయందముల దీవి - యుర్విపై నిలచి
నటులున్న విభుజూచి, యౌదలమోపి
కటకీ కృతశ్రుతి కాంత పాదముల
దివిజగంగకు గ్రచ్చు దీర్చు బాష్పముల
నవఘళింపఁగఁజేసి యభిషేకమార్చి
వలచి కోరినయట్టి వారికి నీక

వలదన్న వానికా! వసుధపై బ్రమకు!!
కనకమూలములైహి కమ్ములు, నిన్నుఁ
గనుకంట, ధనమెట్లు గందునో! స్వామి?
ఆపాత మధురమ్ములైన సుఖమ్ము
లా! పుట్టువొందినయట్టి ఫలమ్ము
లా సౌఖ్యముల చవికాత్మలో మఱఁగి
నాసవిత్రి, యజస్ర మీసుదొల్కాడ
పనిలేని భౌతిక వాదమ్ము సేయు
జననీ జనకులెవ్వరని నాకు! నిచ్చ
లము, నీకు నాకున్న లంకెయేగాక!
ప్రమితి స్వరూప! వైరాగ్య ప్రదీప!
ఒక పొత్తి నాకిచ్చి - యొకపుత్రు నిచ్చి-
వికట బంధమ్ముల బిగియించి - నీవు-
కనుమఱుఁగైపోవు కైలాటమాడి
ననునేల వేగింప - నారాయణుండ!
నాతల్లి పలికిన నీతి తానౌనొ?!
భ్రాంతి, యట్లైనచోఁ బలుకక, యేల
వలవని సొలగింపులు! తేల్చిచెప్పు
మల, యామె వాదమ్ము లలవర్చికొందు
కాదేని సంసార కాలుష్యమార్చి;
నీ దాసునిగఁజూచి - నిక్కమ్ముఁబ్రోవు
మని నిష్ఠురోక్తులనాడిన - కనులఁ
దనపారు కరుణ చిత్తడిఁబోలఁజూచి
పలికె నీ విధమున పాండురంగండు___
కులదీప! వసుమతీ ఫలితతపంబ!
భక్తి కల్మాషితావత్స! కామాది
నక్తంచరాఽప్రాప్య! నా నామదేవ!
యీ వొక బగుతుండ, వేను నీ స్వామి

నీ వాదములు క్రొత్త లెవట నేర్చితివి;
నామదేవునకును నారాయణునకు—
చీమ దూరెడు సందులేమి నిక్కమ్ము,
తాను నిర్గుణుఁడైన దామోదరుండు
నామరూపాకృతి నామదేవుండు;
తానగుణుండైన - శ్రీశుండు - వాన
నా బాహ్యతత్త్వంబు నామదేవుండు—
జల్లిమాటల నెవ్వరల్లిరోగాని—
చెల్ల! నీకును నాకుఁజెల్లునే! పొరపు
నామదేవా! నీవు నన్ను వీడకుర!
యేమైన కానంత యెడబాటు నేను
తాళలేనుర! భక్తతతిలేక - బ్రదుకఁ
బోలదు నాకు, గానాలీనమూర్తి!"
యని పల్కు రంగని యాననంబందు—
పనుపడుదైన్య భావమ్ము వీక్షించి
యినుపక్తియైదగ," పెన్ని జన్మమ్ము
లనుభవించిన - యెంతవనట బైకొనిన
నరకమ్మునందున్న - నటనిముసమ్ము
పరరూప! నిన్ను నేమఱునగలేను;
మోక్షసౌఖ్యంబైన మూఁడు కాసులకు
లక్షింప నీ భక్తి లాభంబుముందు—
నిది నాకు సత్తపం - బిది నాకు నెలవు
యిది నా ప్రతిజ్ఞ యియ్యదియె నా యుసురు"
కౌఁగిలించెను స్వామి - కరికరాకార
భాగంసముబఁజేర్చి భక్తకోటీరు
నా రుక్మిణీదేవి, నేరనివాని
నీ రీతి - వంచింప నేలందు నవ్వ—
యిట, నామదేవుని యిసుగు, నాకలికి

కటకటంపడి తల్లి గాఱియఁ బెట్టఁ
తాలిమినేది రాధాబాయి - యత్తఁ
జోల వీక్షించి "నీ పుత్రుని గట్టి
కొన్న దానికిఁ జూడు! కూడైన లేక
పన్నలవలె మేము బ్రదుకంగవలసె
పుత్రులఁగననేమి పుణ్యంబు; వారిఁ
బాత్రులఁ జేయంగవలెగాక; సుకము
లకు; దేవుఁడంచు వ్రేలాడుచు బ్రదుకు
వెకలికి - పుత్రులు పెండ్లాము నేల?
నా గొంతు గోసిరి నా తల్లిదండ్రు;
లీ గండకత్తెర నిఱికించి మెడకు;
పరమ పాతివ్రత్య పద్ధతులెల్ల
జరగెడువారికి జరగునేకాని—
మావంటివారికే కైవడిఁజెల్లు!!
వావదూకులు తాము పరులకు బోధ
సేతురు; ధర్మముల్ నేతులుట్టంగ;
నా తెన్నులనుదామ యనుసరించెదరొ!
పాండురంగా! యంచు బనవినఁ - గూడు
దండకు వచ్చునా! తనివిదీఱంగ
జాల, న్నమును బెట్టఁ దేలంగవచ్చు
వాలాయముగ నీటిపైని వింధ్యమ్ము
లీ పల్కు-, లతుల భక్తాపాయనోద
నోపాయ లీలావినోదుఁడై నట్టి
శ్రీ పాండురంగని చెవులలోఁ బడియె—
నాపన్న రక్షకుండల్లన నగియె—
గరుఁడుని దానొక్క- తురగమ్ము జేసి
యరిది ప్రానుతులఁ గళ్యములుగాఁజేసి
బత్తి యెఱుకలంక వన్నెలు చేసి

హత్తిన వైరాగ్యమది జీనుజేసి
ధీరభాగవత సత్కార పుణ్యంబు;
తారవజ్రమ్ముల తలకుచ్చుఁజేసి
పరమసాత్వత హృదాభరణమౌశాంతి
పురత ప్రస్రవద్రుచి, మొగముట్టుఁ జేసి
నెమలి కన్నులపాగ నెత్తిపై వెలుఁగ:
కమనీయమైన చిక్కంటి నామమున
మూలగోచి చెఱంగు పుడమిని జాఱ
పోలని పైపంచె నేల జీరాడ;
శ్రీఖండు కేశవసెట్టి దానగుచు—
నా సైంధవ పురశ్శులమరంగఁబట్టి
కరపంకజమ్మున కనపడ్డవారి;
కెఱఁగుచు వినయంబు పొరిబర్వ, నామ
దేవుఁడన్ భక్తుండు దీక్షితుండతిధి
సేవలనని విందు; మా విశాలాక్ష
యుని గేహ మెక్కడో! యొకసారి చూపుఁ
డ'నిసారె యడుగుచు నల్లల్ల రాఁగ
వారు ఫక్కున నవ్వి - నేరఁడో కాక—
కోరిక నరుదెంచె కోమటిసెట్టి
యిది యొక లాభమంచెద నెంచెనేమొ?
యదవదలయ్యెనో యయ్యామనీష
నామదేవుని యింట నా కూడు! వాఁడు
సోమారియై; గుడిఁ జుట్టుచునుండు
చేతిలో చిటికెలు; ప్రాతతంబూర
యే తఱిఁజూచిన నేల పదాలు;
భళిరె! చక్కని గేస్తు - బ్రాప్తించె నేఁడు
తలమున్క దినుసులే! ౘదానూరుజుండు;
యీ సెట్టియును నెదురెక్కించినాఁడు

ప్రాసంగు విత్తులవంటి నామాలు—
యిరువురు బగుతులే! యింకేమి కొదువ?
కలుపుదీరఁగ నేఁడు కలదు భోజనము
వాడకెల్ల నటంచు పరిహాసమాడి—
కూడిన పసితోడి కోమటిసెట్టి
ఆ కనంబడుచున్నయదె! నామదేవు
శ్రీకరంబగు గృహసీమ! పొమ్మన్న
ఆయతంబగు కన్నుదోయికిఁ దొడవు
నై యుల్లసిలు నవ్వు నంతలో మలపి
'శ్రీకరంబగు గృహసీమ' పొమ్మంచు
వాకు దప్పని యట్టివారు వల్కితిరి
మీ మాట వితయౌనె? నామదేవునకు
లేమియన్నది గల్గునే! మధుద్విషుని
యనుగులమనివింటి మాతని కింక
పనుపడకుండెడి భాగ్యమ్ము లేవి?
యని పల్కుచునె యల్ల నా యిల్లు దరిసి
యనిమిష నాథాదులగు మనస్వులకు—
నలగడె చిక్కని యంఘ్రులు మోపి—
కరుణాపరిష్కార కాంత గంభీర
ములు చూపులల్లన బొలయించి - లోని
కలసటబై కొన్న యతిథులమయ్యా!
దూరదేశమునుండి తోతెంచినాము—
మా రాఁక గమనించి పదికించు భంగి
యాదరింతువటన్న యాసతో నిపుడు—
శ్రీధామచరణ నీరేజ భృంగంబ!
పండరీశ్వర బహిఃప్రాణ! వైరాగ్య
దండితవిషయ! నితాంత సద్భక్తి
దీపదీప్తమనస్క! పాపాపహార!

కాపథపూర! మోక్షరసావతార!
కవికుల కలహంస! గాయకోత్తంస!
నవనీతమానస! నా నామదేవ!
రమ్మంచుఁ జీఱిన - ప్రావల్వ, యింట
గ్రమ్మిన పేదరికమ్ము సూచింప
తన కలికొప్పు రాధాదేవి వచ్చి
మనమనుత్సాహమై - మంద్రకంఠమున
మగవారు లేరింట - యా యత్తగార
లగవుపై నెచటికో యరిగినారయ్య!
పోయిరండన నంతఁ బోవక నెట్టి
యోయమ్మ! నడవలో నొక్కింత ప్రొద్దు
గూరుచుందుము మేము, వారింతలోనఁ
దారరుదెంచిన; తీఱుమాయాస;
లని విశ్రమించిన - నా యింటి కోడ
లనఁ పుదప్పె నటంచునట నిల్వకేగె,
నారద వీణానినాద పీయూష
చారుధారా పరిష్వక్త పాదుండు—
శివజటామండలీ శేఖరీభూత
పవితలోకత్రయ పాదనదుండు—
ప్రరుచిర క్షేమాబ్జ రాహాళాయమాణ
ఖరనిశాచర వంశ గహనదావాగ్ని;
నిరతిశయధ్యాన నిష్ఠిత వేద
పురుష భావగ్రాహి; పురువిలాసుండు
వాగంగనాతపః ఫలసాధుశబ్ద
భాగంఘ్రివలయ నిక్వాణరమ్యుండు
పండరీశ్వరుఁడు రవ్వంత సేపుండి
యెండబారినదమ్మ! యింతి! మా గొంతు
సరస కృపామూర్తి! జలమిన్ని యొసఁగి

యరపి రక్షింపవమ్మా! యంచు నార్చె
నా యార్పులను విని - యండజయాన
తోయంబు గొనితెచ్చి తొరగాఁగ నిలువ
జలమందికొనుచు నా సర్వేశ్వరుండు
ఫలితాపతారుండు పలికె నీ రీతి___
నామదేవునివంటి నాథుని బడసి
భూమి మూర్తంబైన పున్నెంపుఁబ్రోవ!
నామదేవుఁడనంగ నేమనుకొంటి?
వామనుష్యుండుద్ధ వాంశజుండమ్మ!
కలియుగమ్మున రమాకాంతుని లీల
వెలయింప నేతెంచె నిలువియ్యసేసి
మాకును వారికి మనసులు తనువు
లేకమై యున్నంత - హితము సవిత్రి!
పేరు కేశవసెట్టి - పెద్ద బేహార___
మారసిపోదమీ యనుఁగు నటంచు
నరుగు దెంచితిమి, దెప్పరమైనలేమి___
యటిమెను కాపురంబంచు విన్నార;
మందుకే గొంత ద్రవ్యంబు దెచ్చితిమి,
సందియపడకమ్మ! సదమలాచార!
కైకొనవమ్మః నీ కాంతునింకైన
వాకొనకమ్మ! దెప్పరములుగాఁగ
వెలవెలి యొడమికి వెల యేమితల్లి!
జలజనాభుని భక్తి సత్యమౌధనము
లని పల్కఁ చేటంతయై వక్త్రసీమ
వనజాక్షి యా సొమ్ము భద్రంబుసేసి
పప్పును బియ్యంబు నిప్పుడఁ దెత్తు
గొప్పవారరుదేర కొఱసేయరాదు;
దయసేసి యొక గడె తామసింపుండు

అయిపోవు కను గిటినంతలో వంట
యనిపోవఁటోఁ దల్లి! యన్నియు వచ్చె
పనివి నెదమటంచు బలికి కేశవుఁడు
తిరిగిపోయిన, భక్త పరివార దుఃఖ
పరిహారకుండైన పండరీశ్వరుఁడె
తావచ్చెనని యెంచి - తరుణి యుప్పొంగి
భావించి మ్రొక్కి - విపణికేగి, వలయు
నెల్ల సంబారమ్ము లింటిలోఁ జేర్చి—
యుల్లమ్ము హర్ష సంపుల్లమైయుండ—
నచట గుణాబాయి - యటనిట దిరిగి—
ప్రచుర నిశ్వాసధూమ్రస్విన్నమూర్తి;
పరుష వాక్యాదాన విరసంబులైన
యెరవు బియ్యము గొంచు - నింటికేతెంచు
చున్నది, దారిలో శోభితంబైన
పన్నగ తల్పుండు పండరీనాధుఁ
కోవెల దిలకించి - కొడు కిటనుండు
దేవదేవుని యిలు దీర్చెడు కొడుకు—
వానిఁ దోకొనిపోవవలెనంచు వచ్చి—
మానిని; యా గరుత్మద్వాహు నెదుట
నిలచి తంబుర మీటు చలఘు గీతముల
నిలుపైని వాగ్దేవి నెఱయించుచున్న
నామదేవుని గాంచి, నారాయణుండ
స్వామియన్ చింతతో సకలమ్ము మఱచి
యున్నట్టి వాని, రాగోన్నద్ధమతుల
కెన్నండు దెలియంగ నింద్ర మౌవాని
వెడద కన్నులతోడ విశ్వైక జనకు
నొడలు పానము సేయుచున్నట్టివాని
నాయమృతాసార మాకలి దీర్పఁ

గాయంబు కాంతమై కనుపట్టువాని
నలనల్ల నాట్యమ్ము లాడెడువాని
కలుగ్రావినట్టులు; కాంత భావార్ద్రి
మగు పరిష్వంగంబు లబ్బిన; మగుడ
మగువ పోలిక; నఱమఱచిన మనసు
నయి; తనలోఁ దాన, హర్ష హర్షము!
నెయిది; యేమేమొ భాషించెడు వాని
నామదేవుని గాంచి; యీ మత్తుజూపి
మా మీది మనసును మఱలించినట్టి
మాయలపుట్ట; రమానాధుఁడనుచు
నా యింటి రంగని నభివీక్షసేపి
దూఱెనిట్టులు, కండ్లగారు నీరమ్ము
లారంగ విభుని పాద్యమ్మను దీర్ప
నవనీతచోర! ఆమ్నాయ విదూర!
భవవైరి! యవిదిత భావనా చార!
పంక నిశ్శంకుండ! పారదారికుఁడ!
సంకుసుకుఁడ! భిక్షువావల్యా వర్తి!
మా కుమారుని మాకుఁ గాకుండఁజేసి
నీకుఁదాసునిఁగాఁగ నిలిపి కొన్నావు
పెంచితివో! నీవు పెద్దజేసితివా!
వంచక! యెట్టులీ పారుపత్తెమ్ము!
నీతియున్నదె నీకు? నీ భక్తులెల్ల -
నీతిమంతుఁడవంచు నింగి కెత్తెదరు!!
అంకింతురెప్పు డుదారుఁ డీవనుచు
పొంకంబుగా, లంచ మంకింపకుండ
నెవరికే మిచ్చితి? విందిరాజాని!
యవకుఁడై వచ్చిన యాకుచేలునకుఁ
గరుణించి తందురు, కమ్మని యటుకు

అరివెట్ట కుండంగ నాదరించి తివ్వా?
భ్రాతృవంచన జేసి వచ్చినవాని
దాతవోలిక దువ్వి దగ్గరదీసి
వైరివీరులబలా బలములు దెలిసి
యారావణుని హత మార్చి, మోసమున
నన్నుజంపించిన యందుకై; బిచ్చ
మన్నట్లు తమ్మున కవని నిచ్చితివి.
ధ్రువునిఁ - గజేంద్రుని - ద్రౌపది, గాచి
తివా! వారి నిష్ఠురాధ్యవసాయమహిమ
పరతంత్రునిగఁజేయ; వంచింపలేక
కరుణ జూపించుచే గాక; నిర్హృదయ!
రక్షకుండను కీర్తి రజ్జులేకాని -
శిక్షించుటయె కాని రక్షింపలేవు;
నినునిమ్మి గృహములు నియతులు వదలి
గుణహీన! వచ్చిన గోపకాంతలకు
నిచ్చిన దపయశంబే కాక - వారి
ముచ్చట దీర్చితో! ములు చిలమేటి!
పరదార ధనముల భంగించుటలును -
కఱటి చూపులతోడఁ గల్లలాడుటలు
పడతులఁ జంపుట - తౌడుకు వధించు
టడుగడుగున మాటలటమరించుటలు
నీపుట్టుతోఁబుట్టి నిలచిన గుణము
లో పండరీశ్వర! యో నిరాచార!''
యని యిట్లు దూఱెడు నాతల్లిఁ జూచి
వనజాక్షుఁడనె యేల 'పరుసంబుగాఁగ
ననుచెట్ట చేసెదు! నామదేవునకు
వనిత! నీపై ప్రేమ బంధమ్ములున్నఁ
దోడుకొని పోవమ్మ! నుడువఁ బెక్కేల!

పడఁతి! నిశ్చయముగా భాషింతు వినుము
వాఁడు నా పుత్రుండు, వాఁడు మీ సుతుఁడు
గాఁడు బాల్యంబిట గడచెనే! కాని -
మద్భక్తి సుమదామ మహితవక్షుండు -
మద్భక్త వరనామ మనన దక్షుండు -
మన్ముఖోల్లాస భూమస్థేమవృత్తి;
చిన్మయ రూపుండు; చిలువాయనంపు
కోరికలకుఁ జిక్క; కొఱఁతల స్రుక్క -
పారుకాడెడు కాలు బందెలై పోవు;
వారికి వాఁడొక్క పీఁడికాని
ధీరుండువాఁడు - సాకారంబు ముక్తి
సారంబు! విజ్ఞాన సార; మాచార
తీరంబు; కంటి కర్పూరంబు నాకు;
పరిపక్వమైనట్టి ఫలము - వృంతమ్ము
దొఱఁగెడునట్లు - చేతో హారియైన
నా భక్తిచే బండినది వాని హృదయ
మీ భవచింతలనెల్ల మాల్చినది—
నామదేవునకును నాకున్నయంటు
నేమింప నాటిది నేఁటిది గాదు—
అది నిరుపాధికం బది సనాతనము—
అది వేల తపములనైన యంటనిది—
సోపాధికము మీది సూ! బాంధవంబు—
యీ పూట వర్తిల్లి రేపు బోవునది;—
యటు లౌట! వానికై యటమటం పడుట
కటకట! కొఱ గాని కార్యంబుతల్లి!"
పలికె గుణాబాయి" కలబుద్ధి యెల్ల
నొలుక బోసితివయ్య! యోవిఠలయ్య!
రాజు ధర్మము దప్పి రక్కసుం డగుచు

తేఱిన జనములఁ దివిరి వెంటాడి—
వారి సర్వస్వం బవారణ దోఁచి—
కాఁజియల్ బెట్టెడి కైవడి మాకు
నేడు గడైనట్టి యిసుగు గన్గంట
పాడి దొఱంగుచు బంటుగాఁ దోఁచి—
తివి; తలి దండ్రుల నవఘులఁ జేసి
తివి; యింట దారిద్ర్య దేవి నెక్కొల్పి
తివి; చిఱునవ్వుతోఁ జవ జవలాడు
పవిదిఁ దానెక్కి రావలిపిన వాని—
మనుమని బ్రదుకెల్ల మాల్చితి వాఁడు
కనులలోఁ బ్రాణంబులను నిల్పికొనియె;
నీతి యేదీ! నీ కనీతియే గాక;
చాతుర్యములు పల్కి జనము ముంచెదవు
నాననేదిన వాఁడ! దీనరక్షకుఁడ
వైన నిక్కమ్ముగా, మానుండి వాని
వేఱు సేసిన దాన, వీధులఁ బడితి—
మేరీతి రక్షించి తిప్పుడు మమ్ము
మేముదీనులు గామె! మామేని యుసురు
బ్రాము, నాకటి మంట పట్టుమో! నీకు"
"నావేశమునఁ జిక్కి యాడెద వమ్మ!
పావని!" యని నవ్వె పాండురంగండు
నామదేవుని వంటి నందను బడసి
భామిని! నీకిట్లుఁ బలుకఁగ రాదు—
శత జన్మపుణ్య సంచయములు పండి
యతిలోక నైర్మల్య వతివైన దాన
దామాజివంటి భర్తను జెట్టవట్టి
భూమికిఁ దొడవుగాఁ బొలుపొందు దాన!
నా మానసపుఁ దావి-నా యూర్పుక్రోవి

నామదేవుని వంటి నందను నొసఁగి
యాశీర్వదించినానమ్మ; కష్టమ్ము
పీసమ్ము దోచిన వేదురందెదవు!
గడచుచున్నదియెట్లొ కాపురం; బేమి
తొడబడినది; బండి దొరగిల్లినదె?
సంపదలభ్రంబుఁ జంచలలమ్మ
నింపాదిగా నిల్చునే! నిచ్చేలములె?
ఓడమి గల్గుటలెల్ల నుపకృతి గాదు—
యెడఁద పశుత్వమ్ము లెసఁగించు గాని—
నేయిద్రావను ద్రావ నాయతంబగుచు
నాయగ్నిమఱి నాల్కలార్చెడు భంగి
ననుభవించుకొలం దినం గదలెత్తి;
మనసు భోగములకై మల్లడి గొనును—
దేవతాంతరములు త్రైవర్గికములు
నావితమే వేఱు; నవనీత హృదయ!
సతత లక్ష్మీ సమాశ్రితుఁడైన నేను
పతితులై పోదురో! భక్తులటంచు—
ధన ధాన్యముల నివ్వ-దాసులకెపుడు
వనిత! కైవల్య సంపదలిత్తు గాని—
ననుశరణంబుగా నమ్మి తక్కొఱుల
మనసున నమ్మని - మద్భక్త వరులు
సుకపు మత్తానోలఁ జూతున యేని
యిక నాదుయశమేమి; హితబుద్ధియేమి!
'శాకాయ లవణాయ! సర్వ దేవతలు,
నేఁకటఁగైవల్య మివ్వంగ గలరె?
అపునరావృత్తియై నట్టి మోక్షమ్ము
కృపసేయు నన్ను-మ్రుక్కుడిభోగములకు
వాడుకొందురె? ఫలభరిత వృక్షమ్ము

వాడుకొందురె తల్లి! పంట కత్తెలకు!
నైకజన్మముల పుణ్యంబులఁ జేసి
యాకళించిన యట్టి యనితర భక్తి
మప్పు భోగములకై మార్పఁబాలిడియె?
కప్పురమ్మును బెట్టి యుప్పు చేకొనుటె!"
అని యాడు నాపల్కు లుఱుమడి వినుచు—
వన జాతగేహిని వద్ద కేతెంచి
నీవైన చెప్పవే నిజనాథుతోడఁ
గావించినది పాడి గాదంచుఁ దల్లి!
ముల్లోకములనేలు మొదటి దాంపత్య
మల్లవో? యిటు ధర్మపటమరించుటలె?
అఖిల కల్యాణ గుణాశ్రయుండనుచు;
ముఖసుఖమ్ముగఁ బల్కు మునినికాయములు;
మాపట్టి హృదయమ్ము మార్చి; యీ చేయు
కాపట్య చతురత కల్యాణ గుణమె?
హరిదంతయౌవతాభరణమైనట్టి
చిరకీర్తి గల్గిన చెలువునిగన్న
గేస్తురాలా! యిట్టి కస్తిగూర్చుట; ప్ర
శస్తిగాదని కండ్ల జంకింపఁగదవె!
యని మొఱవెట్టిన; నా జగన్మాత
కనుదోయి విప్పదు, గండరు వనఁగ -
మఱల గుణాబాయి మాధవు చెంత
కరుదెంచి కంటినీ రలుఁగులు వాఱ
నిట్టూర్పు పొగసెగల్నింప, ధమ్మిల్ల
మట్టిట్టులై; తేనె తుట్టె గదల్చి
నట్లుగా, నందను హస్తమ్ముపట్టి
చేట్లకొఱవి! యేమి చిక్కనటంచు
నీ కొయ్య చెంత వేగింతువు బ్రదుకు;

నీ కిల్లు వాకిలి గాకపోయినదొ?
పెంచిన గురువులు పెఱవారలైరొ?
కొంచెమయ్యెనొ? కట్టి కొన్నట్టి పొలఁతి -
కొడుకు గాఁబట్టఁడో! జడుఁడవొ! జోగి
వో! డిగద్రావ నీ పూర్వబంధములు -
చాలుచాలిక నింద్ర జాలమ్ములందు
మేలిమివాఁడు సుమ్మీ! విఠలుండు—
తెలిగన్నుగవల సైగలతోనె; జగము
లలయించి, యెలయించి, కలిగించువాఁడు
ఆకండ్ల యొఱపుల కగ్గమై గాదె?
యాకలి దప్పుల నణచుట మునులు!
కరుణలేనట్టి యా కనుల బాగునకె
వఱపుడ మోపిరి పాండునందనులు—
ఆ జగన్మోహనమైన యాకార
మా, జగా చిఱునవ్వు, లాకటి హస్త
ములసొంపు, వంచన ల్దెలియనివారి
తలఁపులాకట్టి, యూర్పుల నేర్చుకొఱకొ!
కమలనాభుండు మర్కటకంబు - వాని
మమత లేటికి! - బుద్ధిమాలినవాఁడ!
పుండరీకుఁడు తెల్వి పొరివోయి - తపము
పండించి - వైకుంఠ భవనంబునుండి
తెచ్చి నెక్కొల్పె నీచిచ్చు - సజ్జనుల
కిచ్చ నిల్కడలుపోయెను నాటిఁగోలె;
నంచు నేడ్చుచు - భక్తవంచక! కాంతి
కంచుక! యొకసారి కనికరంబుంచి -
పంపరా! మా వాని - పట్టిని, పడఁతిఁ -
బంపివచ్చునుగాని - సాన్నిధ్యమునకు!
పరమబాంధవుఁడైన పండరీశ్వరుఁడు

పరుసంబులైనట్టి భాషణంబులకుఁ
గలఁగి - యానామదేవుల కయ్యేవట్టి-
యొలయనీరము - తల్లి కొప్పనసేపి
బొమ్ము నీ సుతునకు బుద్ధులు గఱపి
నెమ్మది జీవింప నిమ్మఁచుఁ బలుక-
నామె యీడ్చుక పోవ - నరిగె గీమునకు
నామదేవుఁడు రంగనాథైక ధనుఁడు-
యింటికోడలు తాన మెలమినిదీర్చి-
కంటలే నగవు రేకలు గుస్తరించి-
కూనిరాగములతో గోవిందుఁబాడు
చానన మెల్ల నానందమై - వంట
సేయుచున్నది - వచ్చు జీవితేశ్వరుని-
నాయక - దనయత్త నల్లంతఁ గాంచి-
యెదురేగి - తొడితెచ్చి - యెన్నండులేని-
మధురోపచార సంభ్రమములు నెఱప
క్రొత్తలు వుట్టెనే! కోడలిదైన
చిత్తమందని యత్త చిత్తరువంది-
ధామంబుఁజొచ్చి - పదార్థంబులెల్లఁ
దామతామైపుట్టి; తడవాడునట్టు
లేపట్టుఁగాంచిన నెక్కుటొక్కుడుగ;
నేపార; రంగనిదిది దయయంచు;
ఊరటపడిన; హర్షోద్రిక్తకోడ
లారడంబున వంటలన్నియుఁదీర్చి-
యత్తమామలఁ బిల్చి-యాత్మజుబిల్చి-
ముత్తెంపునగవు మోమునఁ జిందులాడ
నామదేవులఁ బిల్వ; నామనిధ్యాన
సీమాతిగా మోద చిద్రూపుఁ డతఁడు-
యెన్నండు లేని యీ యింపు; తజ్జూడ

నన్నాతికిని గల్గినట్టి కారణము
తలఁపునఁ దట్టక - తాను భుజించి
పలుపలు విధముల భావించె; యింట
పరిచారికావృత్తిఁ బరఁగెడునట్టి
పరమపూరుషుఁడైన పండరీశ్వరుని
ప్రియ; జనాబాయి నివృచ్ఛింప; నామె
క్రియగాఁగ రంగండు కేశవ సెట్టి
గా వచ్చి; జలమాని కనకంబులిచ్చి;
ధావంతముడిపిన కైవడిజెప్ప
నామదేవుఁడు రంగనాధుని దయకుఁ
గై మోడ్చి-"నాకేల కనకముల్ స్వామి!
గ్రుడ్డికి దీపమ్ము కొలయౌనె! చెవిటి
పడ్డకు - సంగీత భంగులర్థంబె!
నిన్నొకనిని దప్ప నిఖిల విశ్వంబు
మన్నింప నలకాసు మాత్రమ్ము దేవ!"
యంచు రాధా దేవిగాంచి, యో పడఁతి!
వంచితవైతివే! భాగ్యమ్మువలన-
యేవి! యా కనకమ్ము లిక్కడఁదెమ్ము!!
త్రోవఁబ్రాలివిగాక! ప్రోవ బాలివియె?"
యని పల్కె నాయక యాత్మనాయకుఁడు
కనక మెల్లను దాన మొనరించునంచు
గుఱుతించి - కొంతదాపరికమ్ము సేసి
కలకుఁ జూపులఁ గొంత కనకంబు నివ్వ
వారివీరినిఁ బిల్చి నీరేజనాభుఁ
డీ రూపమున వచ్చె నింకేమియనుచు
హేమమ్ములనుబంచి - గామిడియొడమి;
యేమాడ్కిఁ జూచిన నిద్దియే యనుచు
పాండురంగని రూపు భావంబునందు

నిందించికొని భక్తి నినుపొరఁబాడె
దినములు చనె; నామదేవునిపాట
లనుదినంబును వేలకై ప్రచరించె
నంత నొక్కదినాన నచటికేతెంచె
శాంతికూపారంబు జ్ఞానదేవుండు
గుణమణీనిచయ రోహణ ధరాధరము-
పణితవ్య చరితుండు; ప్రబల మాయాంధ
కారనిర్మూలన క్షమ చరణుండు
సారసోదరునియం శస్వరూపుండు
యెఱుక యాకారమై బరతెంచునట్టి
తెఱఁగైన యాజ్ఞాన దేవులఁజూచి
యెదురేగుదెంచి దుర్విధి దలంగించు
పదసరోరుహములఁ బాద్యంబు లొసఁగి-
యా నీరములు గంగ కనుగులంబనుచు-
దానాని; పొరి శిరస్థలమునఁ దాల్చి-
పాదయుగంబులఁ బడి లేవకున్న
సాదరమ్ముగనెత్తి జ్ఞానదేవుండు
పరిరంభణముసేసి - భక్తకోటీర!
పరమసాత్త్వికమూర్తి! పండరీనాధ
చరణాబ్జనిగడితాశయ! నామదేవ!
పరిమితియేది! నీ భాగ్యంబునకును-
పరిచరించెను నీకు భక్తి సుఖమ్ము
నిరవద్య చరితుండ! నీ పితామహులు-
నీవు పుట్టిన దాన, నిఖిల పాపమ్ము
లావురుమని యార్చి - యస్తమింప గను
ప్రణుత సాయుజ్య సౌభాగ్యంబులంది
మనుకొని; నినుఁగూర్చి పొగడుచున్నారు—
ఒక వైష్ణవుఁడు పుట్ట - నొక యన్వవాయ

మకలుషమై - ముక్తినందుచే భ్రాంతి—
యదియుండనిమ్ము - నేకాంతమ్మునందు
మది మదిగదియించు మాటలు కొన్ని
నాడంగవలపి - నాయాగమనంబు
కూడునే సమయంబు గూడిమాటాడ
ననఁగ - 'ధన్యోఽస్మి' - మిమ్మాన దీఱంగ
పెనగొను భక్తి సేవించుటకంటె
మాదృశులకు నింక - మహమన్య మేమి?
పోదమటన్ననా పుణ్యుని కరము—
పట్టి, పుల్కలు మేన నెట్టికొనంగ
తొట్టు హర్షంబున దూరమ్ముపోయి—
యొక శీతల చ్ఛాయ నొనరఁగూర్చుండి—
వికసిల్ల కనులు - సొంపిల్లు హాసమున
జ్ఞానదేవుఁడు వల్కె; మేను చేకొన్న
శ్రీనాధ భక్తి భావా! నామదేవ!
యెన్నాళ్ళనుండియో యెడఁద నీకోర్కె
యున్న దీనాటికి - నొనరె లగ్నమ్ము
నీవు నేనునుగూడి నిఖిల తీర్థములు
సేవించి - యటనట - చెలువుగాఁ గొలువు
దీరిన యర్చావ తారముల్ కనుల
కోరిక దీరంగ కొల్చిరావలయు—
నిదియాశమా కోర్కె ప్రిదులంగనీక
మదిగూర్చవలెనన్న మనసెల్లఁగ్రుంగి
కటకటం పడి! "దేవ! కాదిది నాకు
నెటుఁజూడ 'పండరి' యే నాదుపాలి
కఖిల తీర్థమ్ములకాశ్రయ భూమి
ముఖచంద్ర చంద్రికా పూరిత భక్త—
నికరుఁడై - దాక్షిణ్య నిలయుఁడై - నేత్ర

వికసిత కారుణ్య విభ్రముండగుచు
కటిమండలంబునఁ గరములు చేర్చి—
యిటుకపై నిలచిన యీ పుండరీక
వరదుఁడే - యెల్ల దైవతములు నాకు—
వరయభూవైకుంఠమైన యీ పండ
రీ నివాసము మాని - శ్రీరంగనాథ
మానిత పాదపద్మమ్ములు మాని
యొక నిమేషంబైన యుర్విపైఁ బ్రదుక
నకుటిలమూర్తి నాకగ్గలం బయ్యా!
శయపద్మములనున్న జలముఁ బోఁద్రోసి
వియతిమేఘమ్ముకై వేకారినటుల
పెరటనుండిన కల్ప వృక్షమ్ముఁ ద్రోచి—
పెఱవృక్షములఁ జూడ మురిసిన యట్లు
తనుపారుసుమ వసంతముఁ బోవవిడిచి—
తనితావులకు వేఱు దలచినయట్లు
వరశరచ్చంద్రికా స్ఫురితంబు వదలి
తిరిసిన యటు, రిత్త దివియ కొఱకు—
పండరీశ్వరుఁడు నా పాలిటనుండ
నొండు దేవతలకై యొగ్గుట యుఱవె!
స్వామి! నా సర్వంబు, పాండురంగండు;
నా మేను, నా యాత్మ, నా జీవనమ్ము
లాసర్వ మూర్తికే శేషంబుగాని;
వీసంబు నితరుల శేషంబుగాదు—
జ్ఞానదేవా! సర్వ శక్త! యజ్ఞాని
దీను, నన్గరుణించి - తికమక లెంచి—
తైలధారయుఁ బోలెఁ దఱుగక నొకట
పాల బుగ్గలవాని - పండరీశ్వరుని
నిరతంబు దరిసించు - నిరధికమైన

పరమకైవల్యానుభవము గల్గంగ
దీవింపవలెనంచు - దిగ్గనలేచి,
భావార్ద్రిముగఁ బాద వనజంబులంట
జ్ఞానదేవుండు విజ్ఞాన కల్పమ్ము
పాణియుగంబుల పండిరీనాధు
ననుఁగైన నామదేవుని నెత్తి - కనులఁ
గనికరమే పారఁగనులలోఁ జూచి—
యోనామదేవ! నిత్యోన్నత భావ!
యోనామదేవ! భక్త్యానంద పావ
నాకార! తెలిసెలే! మాకు నీకొదలు;
శ్రీకాంతుఁడే నిల్చి చెప్పంగనైన
సమ్మతింతువా? మాదు సహవాసమునకు—
రమ్మురమ్మం చుత్తరమునకునైన—
నాగక - యవ్వాని హస్తంబు వట్టి
వేగంబ శ్రీశుకోవెలఁజేరి - యందు
వలగొని - కైమోడ్చి - బలిపీఠమునకు;
ఫలితావతారంబు పండరీశ్వరుఁడు
కటి తటమ్మున సొంపు గట్టహస్తమ్ము
లిటుకపై నిలచి - యక్కటి కంపు కప్పు
రము జార్చువెడఁద నేత్రమ్ములతోడ
కమనీయతకుఁబరాకాష్ఠగా వెలసి
నట్టి సన్నిధిఁజేరి నిట్టు వాయంగ
గట్టిన రూపమ్ముఁ గన్నులఁ ద్రావి
జ్ఞాన దేవుండు - విజ్ఞాన దీపమ్ము
జ్ఞాన దేవుండు - నిష్కామ్యతాసిద్ధి
జ్ఞాన దేవుండు - భాషా పరభోగి
జ్ఞాన దేవుఁడు విష్ణు సాకార మూర్తి
విధివిహితమ్ముగా విభునిఁ బూజించి

ప్రథితవేదములకు వాపిగాఁ బొగడి —
స్వమనోరథమ్ము విజ్ఞాపన సేయ
నమితాదరమ్మున నాలించి - నమిత
పరమేశుఁడైన శ్రీవాసుండు వలికె
"వరదయ్యె జ్ఞానదేవా! నీవుగూడ
తీర్థయాత్రలకునై తీవరం పడుట
తీర్థమ్ములెల్ల నిన్ తిరియు గారవము
నీవు వైకుంఠమ్ము - నీవు కైవల్య
మీవు మా రూపంబు - నీవు ప్రాముసుల
కెల్లను తలకట్టు - నెల్ల యోగముల
కెల్ల సాధనలకు - శృంగాటకమ్ము—
విధుఁడు గైవల్యమ్ము వెదకుచుఁబోవు
విధమును; సూర్యుండు - విపుల తేజమున
కంగవించెడునట్లు భంగురజ్ఞాన
మంగళమూర్తి; నీ మదికి నీ కోర్కె-
యన - జ్ఞానదేవుండు హస్తములొమ్మోడ్చి —
కనులందు మనమందు - వినయంబు దొలుక
"శ్రీవాస! మీరన్న శ్రీ సూక్తి నిజము
గావచ్చు; నైన భక్త్యమృత కూపార
మీ నామదేవుండు - హృదయంగమంబు
లైన యీతని పాటలనవరతంబు
వినుచు నాయాచోట్లఁ గనుచు మీ మూర్తి
ననుభవించెద భక్తి, నాచవి యెట్టి
దో! యెఱుగఁగఁబోలదో!! మాకుఁదీర్పు
డీ! యింత కోర్కె-యం" చెంతయో వేడ
పండరీనాథుండు బంధు సంతతికి
పండిన పెరటి కల్పకమౌట - మాఱు
వలుకంగ నేరక - కలఁకయంతయును—

లేలగంగఁ ద్రోచి - తాదప్ప వేఱుగతి
దనియకించను - దీనదీనమ్ము
గా - నమస్కార్యమ్ములైనట్టి తనదు -
చరణపంకజములే బరికించువాని—
దరిజేర్చి - భక్తి సుందరుని శ్రీనామ
దేవుని ప్రేమ సుధావళక్షముగఁ
దావీక్షసేసి; నిద్దంబుగాఁగౌగి
లించి - లే నగవుల మంచి తోమాల
లంచితమ్ముగ వక్షమందుఁగీలించి—
"ఈ జ్ఞానదేవుల నెవరను కొంటి?
వజ్ఞానమున, వత్స! యవనికి దిగిన
యెఱుక యాతఁడు - నీదు పరిచయంబునకు-
పరితాపపడుట నీ భాగధేయంబు
బొమ్మ సుమ్మతనితో - బోవుటే గాదు,
నెమ్మది కెక్కంగ - నియతితోఁ గొలిచి—
యాశీః పరిమళ మొదలదాల్చ—
మా సిద్ధి; సామాన్యమని యెంచరాదు.
సర్వదేశమ్ముల సర్వకాలముల
మర్వకుమమ్మ! సన్మానసాధార!
నిను వీడియుండుట - నిజముగా మాకు
దిన దినంబొక యుగమ్మునకు సమమ్ము
యీ యున్న వైభవంబిట్టి మందిరము
నీ యిలా వైకుంఠ మితపు పండరియు-
తక్క భక్తుల పొగడ్తలు - భోజతనయ
చక్కెర పలుకులు - చవినింపు నీదు
పదకవితలు లేని వగదీర్పలేవు—
మధుర భావావేశ మృదిత నేత్రాబ్జ
నాధాను సంధాన! నా నామదేవ!

నా దైన్యములనెంచి, నన్ను మన్నించి
సరగునరమ్మోయి! తిరిగి – నా యూర్పు!
హరి యిట్లు చిరవియోగాఽభితప్తుండు
నామదేవునకని, జ్ఞానదేవులను
ప్రేమముప్పొంగ నిరీక్షణసేసి
వచియించె, నీవు సర్వజ్ఞుఁడవోయి!
ప్రచుర శాంత్యానంద పారదృశ్వుడవు
కలుగుట – లేకుంట, యలరుట, వనట
నలయుట లనెడు భావావేశములకు
నీ హృదయంబున నెలవు శూన్యంబు
నా హృదయగ్రంధి నామదేవుండు
శిశువర్తనుఁడు; లోకసిద్ధుండుగాఁడు
వశిగాఁడు సర్వభావవిపంచి వాఁడు
తల్లి పోలిక నేవిధంబున నోమి
యుల్లంబు నలఁగక యుండ మా దరికిఁ
దెచ్చి చేర్చెదో! నిన్ను నచ్చిపంపెదము
సచ్చరిత్రుఁడ యంచు; జలజలరాల
కనునీరు – నామదేవుని కయ్యివట్టి
నెనరున – జ్ఞానదేవున కొప్పగించి–
చెప్పినమాటయే చెప్పును శౌరి–
ముప్పిరి గొనుప్రేమ ముగ్ధుఁడైనట్లు
నామదేవుండంత దామాజిఁజేరి
శ్రీ మహితుని యాజ్ఞచెప్పి – సవిత్రి
నూరార్చి – తన భార్యకూఱట పలికి
మారరూపుండు గుమారుఁ జుంబించి
మఱివత్తునని పల్కి – మనసున భక్తి
గరమొప్ప, నానాఁడు జ్ఞానదేవులకు
నాతిథ్యమునుదీర్చి; హరిగూర్చి పాడి

ప్రాతస్సమయమందు; పండరీభూష
చంద్రభాగను జేరి; జ్ఞానదేవుండ
తంద్రచిత్తుఁడు తాను, తానముల్ దీర్చి
యావిఠ్ఠలేశున కభివందనంబు
గావించి - మంత్రసంకల్పమ్ము జేసి
పయనమ్మొనర్చిరి; వారు - విఠ్ఠలుఁడు
జయమౌను మీకని - సాఁగనంపంగ
వారు కన్పడునంత మేరకు స్వామి
దారిపైఁ జూపుల తలద్రిప్పలేదు-
నామదేవుఁడు లేని, దేమిగా బట్ట
దామనస్వికి; విఠ్ఠలాధీశ్వరునకు
శ్రీ రుక్మిణీదేవి చెలువొప్పవచ్చె
వారిజాక్షుని చెంతకారాధ్యమూర్తి
వచ్చిన ప్రేయసిఁ బలుకరింపండు
ముచ్చటాడఁడు, నేఁడు మూగయైనాఁడు
కలియుగదైవంబు కఱదలనెల్లఁ
వలనొప్పగావించు పండరీశ్వరుఁడు,
చిఱునవ్వు ముత్తెముల్ చెంగావిమోవి
కఱవై-నిడుద యూర్పు పఱపులఁగంది
యరయికలేనట్టి యలకలు గాలి
పరిపరిపోకలై పరిమళంబుడిగి;
దిగజాఱు చెమ్మట సొగసి యందములు
వెగడులై, కనుబొమల్పేరణంబుడిగి;
పలుమాఱు నిలజాఱుజిలుఁగు దుప్పటము,
పొలపంబులుడివోయి, భువిపల్లటిల్లి,
యఱగడె కొకవింత యందమ్ము జూపు
వరశిఖండిశిఖండ మఱనిద్రవోయి
నలికంపునడుముపై వెలయు హస్తములు

నిలచి - నిల్వఁగలేకవచె సోలియాకి
యందెలైనట్టి భాషాంగనా వీణ
క్రందైన కుణుకుణు క్వణనముక్ వీగి
కలికి కన్నుల జాలు గట్టిన బాష్ప
ములనున్న విశ్థలుఁ బోల వీక్షించి
యచ్చెఱువడి; డెందమలమటగుంది
యచ్చపలాక్షి యిట్లనియె "దేవేశ!
యోగీశ్వరేశ్వర! యోగవియోగ
భోగవిహీన! సంపూర్ణ సంవిత్స్వ
రూప! నిత్యానంద! చాపల్య రహిత!
కోపులు మాకిలి క్రొత్తలై తోచె
నలమటలనుట బ్రహ్మానందమునకు
తెలియంగ వలనౌనా! దీనికారణము!"
"కారణ మింకేమి గలదు, నీ కెఱుఁగ
నేరని యది" యంచు నీరజాక్షుండు
పలికెనిట్టులు, "నాకు ప్రాణ మిత్రుండు
కలిమియు, తలిదండ్రు, లెలనాగ - సుతుఁడు
చెలికాండ్రు - సర్వంబు వలదని - నన్న
తలఁపున నిడికొన్న ధన్యమానసుఁడు
నామదేవుఁడు లేఁడు, నాపాలి కఖిల
మా మనస్వియె - వానిలేమి సర్వంబు
లేనట్టులైనది; జ్ఞాన దేవుండు
వానినెట్టులు నూచునో! ననవంటి
యా హృదయము నెట్టులానంద పఱచు
నో! హితములు పల్కునో! సంచలెఱిఁగి;
వాని విశ్లేషంబు భావంబు నాచి
యానఁగరాని యట్లై, వేధ గుడుపు
పరమ భక్తుండైనవాఁడు మున్నెప్పు

దెఱుఁగడు నాతోడి విరహంబు; చేదు
మ్రింగెడు నటులెట్లు మ్రింగుదునో! దీని
నంగన! దుర్లంఘ్యమై వచ్చె; నెడరు;
ఆకాల మీకాల మనిలేని; నిత్య
లోకాళికెల్ల నాలోకింప; తల్లి
వేఱునునేన; మద్విమల భక్తౌఘ
మారుచుదప్పి ప్రేమామృతంబులను
నామదేవుండు నా కామని; కంటి
కామెత, వాని భక్త్యర్థ్రింబుచూప"
మన - నంబుజాక్షి రుక్మిణి "రంగనాథ!
విన - కన - వింత, నీవేడుకల్ మాకు
నఖిల భూతమ్ముల యాత్మల నిలచి -
సకల వేళలఁ బ్రోచన సేయునట్టి
యాత్మ స్వరూపుండవైన నీకెవ్వ
రాత్మభిన్నులు - వట్టి యక్కలిగాక!
కలఁడులేఁడని నీదు కడగాన లేక -
వెలవెలఁబోవును విపుల శాస్త్రములు -
దేవేశ! యా జ్ఞానదేవునియందు
భావింపఁగా, నామదేవునియందు
నాయందు - దేవసంతానమ్ములందు -
నీయునికియె దప్ప; నిజమన్యమేది?
యటులుండ యెడబాటులంటిన వోలె -
కటకటం పడుట; యేకైవడి?" యన్న
ప్రమదను వీక్షించి పండరీనాథు
డమర సంప్రార్థ్య కల్యాణ పాదుండు
వచియించె 'నిజము! నీ పలుకు వామాక్షి!
యచలితజ్ఞాన లాక్షాంఘ్రివి నీవు
నేనరూపుఁడనైన - నిత్యభక్తులకు

మానసోల్లాసంబుమది నివ్వగించి
వెలుఁగు నానావిధ క్షేత్రంబులందు
కొలుదువు దీర్తును గుణంబుల బూని - దివ్య
మంగళ గాత్రంబు మన్నించి; కనులఁ
దొంగలించెడు దయతో నందమూని
ఆదివ్య తిరుపతులందున్న భక్త
లాదరువులు నాకు; నట్లనే వారి
కెడలేక యుందు; నీ హృదయ బంధంబు
కడుకొను పూవును గంపునంబోలె;
అట్టి భక్తులలోన నగ్రగణ్యుండు
నట్టేలు భక్తికి నామదేవుండు —
వాని వియోగమే వగివి సహింతు!!
దీనదీనంబులు దృక్కులు బఱపి
నావైపు, వత్సంబు గోవును వదలు
కైవడి కన్నీళులై వణకాడు
నొదలయి; వెనుదిర్గి - కడగి చూచుచును —
యెడగ్రుమ్ముకొనుచును నేగిన వాని
కాయంబు నారెండు కన్నులఁ వ్రేలు
పాయదు; యిక నేమి బట్టు నామదికి!"
రెండు కన్నుల నీరు నిండించె భక్త
భండారమైనట్టి పాండురంగండు
వడతి రుక్మిణి యప్పుడడరడగించె
కడుశీతలములైన నుడువులు వలికి
యటజ్ఞాన దేవుతో నరుగుచున్నట్టి
నటదుష్ణ బాష్పండు నామదేవుండు
వలుమాఱు తలమల్చి పండరి నరయు
జలజాక్షుఁడరుదెంచు జాడకై వలచి;
యడియాసలైన నుగ్గడువు నిట్టూర్చి -

గొడగును దనలోనె కోపమ్ముబూని —
వచ్చునంచని పల్కు; వచ్చువాఁడేని
వచ్చియుండడె యంచు వడిబమ్మరించు
'నీవె నాతల్లియు నీవె నా తండ్రి
నీవె నా కఖిలమం' చావంతయేని
యన్యుల నమ్మనియట్టినన్ వదలి
తన్యాయమిదియంచు నా క్రోశపడును
పలుమాఱు భూమిపైఁ బడుచునులేచుఁ
బలవరించును గతంబులు - ప్రేమ తెర్వు
తో 'యంబుజోదర! యో కృపాజలధి!
యో యవిదిత వృత్తి! యో పాండురంగ
కటితటీ హస్త! భక్తక్రీత! నేటి
కిటులైతివేమని యెంతయే నఱచు
తల్లిని విడిచిన పిల్లనివోలె
నల్లవో! మది దప్పి నామదేవుండు
జ్ఞానదేవుండు నిష్కలుషవర్తనుఁడు
జ్ఞానదేవుఁడు యోగ గాంభీర్యవార్ధి
జ్ఞానదేవుఁడు శుభం కరభరణుండు
జ్ఞానదేవుఁడు విష్ణు సాకారమూర్తి
నామదేవుని జూచి 'నాయనా! యేల
నీమాడ్కి వెతగుంద - నీవిశ్వమెల్ల
పాండురంగఁడుగాని - వస్తువున్నదియె!!
పండరీపురిలోనె; వాసుదేవుండు
వసియించు ననెడు నీ భ్రాంతి దొలంచి
ప్రశమిత పాపుండు పండరీశ్వరుఁడు
సకలంబునందుండు సాక్షాత్కరించి
యకరువు పద్మంబు నందునఁ బోలె
నను - యనుభవము నీ కబ్బుటకొఱకె

పనిగట్టుకొని వచ్చితిని నామదేవ!
కన్నులుగాక లోఁగన్నులు దెఱచి
యన్న! చూడుము! హృదయంబున - బాండు
రంగఁడున్నాఁడు; చిద్రంగఁడై - లోక
భంగులఁ జిక్కక భద్రం కరుండు
తననాభియందె చిక్కని తావినుంచి
కొని - శంబరము తావికని - పాఱినట్లు
తన మేన యవ్వనంబను వొద్ద తొడవు
మెనయత్రాల్గంటి సొమ్ముల కేగినట్లు
పెరటి కల్పనగంబు కరుపించి - బయటి
పెఱపెఱ యీవులు వేడినయట్లు
యెదలోని రంగని వదలి బాహ్యముల
కదవదపడుట; మోహాంధకారంబు
లనిన యొడలమోడ్చి హస్తయుగమ్ము
మనవి చేసెను భక్త మందారమాల!
“తమవంటివారికిఁ దగిన మార్గములు
మముబోంట్ల కెట్లు సంప్రాప్తించు దేవ!
మీరు యోగారూఢు తీరు భావింతు
రారంగనాథుని నీ రూపుగాఁగ
నాతఁడంతర్యామియై యుండు మీకు
నాతఁ డర్చావతారాంగుండు మాకు;
నాతండు ద్వంద్వాతి గాఢ్యుండు మీకు
నాతండు ప్రేమానపేతుండు మాకు
నా పాలికా పండరీ పట్టణమున
కోపుల నెలవైన కోవెలయందు
దివ్యమంగళగాత్ర దీధితితోడ
నవ్యయానందంబు లావటింపుచును
అఖిల కల్యాణ గుణాకరుండగుచు

నిఖిలాశలను దీర్చి నెఱివేకు వారి,
కావంక నీవంక సేవించుచుండ
నావేశితులు సనకాదికమునులు;
శ్రీ రుక్మిణీదేవి సీమంతమందు
జేరిచి లాలింపఁ జివురుపాదములు;
నారదమౌని వీణారపికుండు
'నారాయణా!' యంచు నలువుగాఁ బాడ;
పుండరీకాది సత్పుణ్యపేటిక - య
ఖండమోక్షవితీర్ణి కారుణికుండు—
భీమరథీతీర పృథుమండపమున
కోమలికములకుఁ గొనదివ్వెయగుచు
కటితటంబున హస్తకమలముల్ జేర్చి—
కుటిలాలకల ముద్దు గురియు వక్త్రమున
తొంగలిఱెప్పల దొంగ చూపులను;
దొంగలింపఁగఁబూని తోడ్తోడ నఖిల
చేతనమ్ముల యెదల్ చిరకాలముగను
బ్రాతియౌ వైకుంఠపదమును వదలి
కాచికొన్నట్టి తెక్కలి కర్రివాఁడు
వాచవియగునట్టి వలపులవాఁడు
వాఁడెనా పాలిటి వలకారి; నన్ను
నాడించు దైవ మర్త్యావతారుండు
ఆ పరదైవ దివ్యాంఘ్రి పద్మమ్ము
లే ప్రొద్దుమానక యీ హృదయమున
నిలుచునట్లుగ సేయువలె ననుగ్రహము
కలుగదు బ్రదుకట్లు గానట్టినాఁడు
తద్దర్శనమ్మును, తత్కీర్తనమ్ము
తద్దివ్య నిధ్యాన తత్పరతయును
నాకు ధారకమును; నాకు పోషకము;

నాకు భోగ్యంబు, నే పోఁక జూచినను
జ్ఞానదేవునకు నీ సహజ ముగ్ధములు
వీనుల కమృతంపు వితమయ్యె నుదులు;
వారు తీర్థములాడి రాయ థమతులు
వారు దర్శించిరి వరదైవతములు
వారు తీర్థములాడ; వారి పవిత్ర
మై; రిక్తపాపమ్ము లయ్యె బో! నదులు;
వారు దర్శించిన పరదైవతము; ల
వారి భాగ్యంబంచు; ప్రమదమందినవి;
శివతాతి భావుండ జిహ్మాగవృత్తి
యవగణితేంద్రియుం, డచ్ఛంపుఁ దెలివి
యోగనిష్ఠితుఁడు; సద్యోముక్తిదాత!
భాగవతులలోనఁ బ్రథమగణ్యుండు
పండరీశ్వర భాగ్యఫలము; ధరిత్రి
బండిన తపము; వాగ్వనితాపవిత్ర
తాపాది; రసభరవ్యాఖ్యాత్మమూర్తి
యాపన్న బాంధవుం డాజ్ఞానదేవు
డెడనెడబోధించె హితమితంబుగను
తడవు మాటలనె, యధ్యాత్మ తత్త్వంబు;
లొక్కనాఁ డిమ్ముల నెక్కటిగాఁగ
నక్కమలోదరు నత్యంతరక్తి
బాడుచు నెడనెడ నాడుచు; నూర్పు
వీడుచు, బాష్పముల్ గూడ నేత్రముల
నొత్తిలి చీరుచు; నొల్లబోవుచును
మత్తిలియుండిన మాడ్కి; నున్మత్తు
కైవడి, మధురభక్త్యావేశమునకుఁ
దావలమగు నామదేవు నీక్షించి-
యల్లన నడతెంచి; యక్షిగోళముల

మొల్లమై వాత్సల్యముల్లంబు దనియ
గరపద్మమునఁదాకి - సరసకుఁ జేర్చి
శిరమునిమిరి; తల్లి శిశుభాషణములు
విన వలచిన భంగి, విశ్రుత జ్ఞాన
వన నిధి, నామదేవుని జూచి" వత్స;
పరమాద్భుతము నీదు భక్తి భావమ్ము
ధారా ప్రపాతమ్ము - తన్మయత్వమ్ము;
దక్కనేలితి వీవు; దక్కని వాని;
నెక్కటి మునులకుఁ జిక్కని వాని—
నే మంత్రమునఁ, గొల్చితింది రాజాని
నే మార్గమున భక్తి యిట్లు ప్రాప్తించె
నుపవాసములనో? నిత్యోదక స్నాన
జప నిరతులనో! పూజా పద్ధతులనో?
పారాయణలమునో! బహుశ్రుతంబులనో?
పరుసంబులైన తపంబులతోనో?
భూరి ప్రదక్షిణంబులతోనో! దీప
వారముంచుటతోనో! పాయసాన్నములు
సాపడనిడుటనో! చర్చలతోనో?
చేపడ్డ వితములు చెప్పు"మటన్న
కలకల మని నవ్వి కరములు మోడ్చి—
తలవంచి యతని పాదమ్ములచెంత
"వెలివెలి పూజల విష్ణుండు చిక్క
నె!! లఘుదైవతముల నేమంబులవ్వి—
యనురాగమనునది - యాత్మలో లేక
వనిత పాతివ్రత్య పద్ధతి బయల
నెఱపిన యంతన; గరఁగునే ధవుఁడు?
మఱువంగ భరమైన మగని రూపమ్ము
కనుగవ వ్రేలాడ - మనమున వ్రేల

తనుదాన మఱచిన తరుణి - క్రొత్తడి త
నమ్ము నాశంకించునా! మనోధవుఁడు
నెమ్మి పైపై పనుల్ నెఱపకయున్న;
నారీతి హృదయమ్ము ననవరతమ్ము
శ్రీరంగనికి నిచ్చి జీవించువాని
కీలయుపాసమ్ము, తీల దానములు
కేలెఱుంగని వారి పోలికలాక!
మనసిచ్చుటననేమి - మనసు పీనిదియె
వనజనాభునకు నర్పణము సేయుటకు
మనసు వానిదిగాన - జనిగల్గినపుడె
తనవానితోఁ, జేరెఁ దానిచ్చుటేమి!
అంబుజోదరుని పాదాబ్జంబులందు
నింబుగా హృదయమర్పించు కొఱకు
జతనంబువలయునో! శ్వాస బీల్చుటకు
తతితోడ నన్నంబు తనియనానుటకు
నిదురించుటకు సుకమొదవిన వేళ
ముదమందుటకు దుఃఖమునను గుందుటకు
పనియె యత్నమ్ము; స్వభావమ్ముగాక!
తన జీవనమునిండ దామోదరుండు
ప్రేమ సింహాసన స్ఫీతరూపుండు
దీపమ్ముగాఁ గొల్వు దీర్చియుండంగ
పెఱచింతలకు నింక; దెఱపియుండెడినొ!
పెఱమాటలకు మది స్ఫురణంబుగలదొ!!
కలవింక విహగమ్ము గాత్రమ్ముమఱచి
నలువైన పాటలీనంబైన యట్లు
మనువును తనువును మఱచి భక్తుండు
తన ప్రాణనాథు చేతలఁ జిక్కి సొగయు:
కాముకుఁ డెచ్చోటఁ గలయ దిర్గినను-

కామినీ రూపచింతామత్తుఁడైన
పొలుపున - లోభియే నెలవుననున్న
మొలనున్న ధనమునే దలఁచెడురీతి-
చెలువంపు పొలిమేర; లలఘువుల్ తిరము
లల శ్రీనివాసు దివ్యాంఘ్రి యుగ్మములు
మఱువంగ నేరఁడు పరమ భక్తుండు;
తఱి, జీవనంబిడి కరుణింపనైన
తరిమికొట్టిననైన; ధారాధరంబు
గుఱిచి - వ్రేగెడు వానకోయిల భంగి
పరుసమాడిననైన - వంచింపనైన
కనుమఱుఁగైన - నిక్కట్టు లుంచినను
తనుగా దటంచు నూకొనకున్న: గదిరి
నను, అట్టుచేసిన; ధనములుగొన్న
తనువడిగిన; మానమణచిననైన
పరమాత్ముఁ డొక్కఁడే వరబంధువనుచు
తిరమైన భక్తి సాధించు భక్తుండు-
ఛదమడిగిన పుష్పసమితి నర్పించు
పదుదున, పుష్పసంపదలు గాంక్షింప
ఫలసముదయమిచ్చు పవిది; వాఁడడుగు
వలనున కినుమడి వలచి యర్పింప
మఱియేమిసేయు; డెప్పరమైన భక్తి
పరవశుండై యింటి వత్సంబుగాక!
పరమాత్మపై భక్తిఁ బట్టంగ నొకరు
పరికించి; బోధించి; తెలుఁగివ్వవలెనొ?
నవవసంతము వచ్చినది యంచు; రసము
లివతళింపఁగఁబాడు మీఁకనంచు నెవరు
గొనకొని బోధింత్రు; కోకిలాంగనకు -
తన మనోవిభుఁడు, కోటను గొట్టబూని

కోటతల్పులఁబోలు కుఱుముడిరైక
మీటినంతన, యుల్లమూటాడి; క్రొత్త
చదురులు నెఱపెడి; ముదిత కెవ్వారు
మదిలోనఁ గూర్చుండి - మరులు నేర్పెదరు?
అల్లంత దవ్వులనంబ గన్పడిన
త్రుళ్ళింతలిడి ముందు దూటుచు బఱచు
తర్ణకంబెవరిచేతను బోధితమ్ము!
వర్ణింపరానట్టి బంధమ్ముగాక!!
యను, మంటు రాతికి నెగసిన భంగి
ననయంబు హరియందు నావిష్టమైన
మనసు నెవ్వారలు మఱలింపఁ గలరు!!!
వనితలో! సుతులో! త్రోవగరాని బందు
గులో! నెచ్చెలులో! జనకులో! తల్లులో! స
కల భాగ్యములో! పెంపు గల్గిన యశమో!
తానాడ లేక మార్దంగికు పైని
పానలు వెలయించు భంగి, నెడంద
గట్టలే, కితరుల అట్టుచేసెదరు
కట్టిన హృదయంబు కలఁగునే! యెపుడు?
వారేమి సేతురు! వారి ఋణాను
సారంబు వచ్చిరి తీరిన యంత!
చెప్పకయేపోదు, రెప్పుడో కోర
కిప్పుడు ప్రాప్తించిరే! యేటిమాట
భక్తి భావన కొక్క పద్ధతియేమి!
భక్తియే పద్ధతి; భక్తియే ఫలము!
ఈతనేర్వఁగబూన నీదుట యొకటె -
రీతియైనట్లు, సర్వేశ్వరు భక్తి
ప్రాప్తింపవలెనన్న భక్తిసేయుటయె
యుక్తమౌ మార్గంబు; నుల్లంబెగురువు;

తనకుఁదోచిన యట్లు దానులాలించు
తన హృదయము ముచ్చిలినవాని; గాదు
కూడదంచని పల్క; కోమలి వినునా!
దూడఁజూచినయంత ద్రొక్కుళ్ళు లాడి
తనువెల్ల ప్రేమయై తాఁదూట నిచ్చు
కనులు దీపమ్ములై క్రమ్మిన ప్రేమ
పసి, యొక్క నియమంబు పాటించి కొనునా!
కసరెత్తు సమరతి గలదా! తాక్రిందు
మీదన్న భావమ్ము, మాధవు భక్తి
లేదులేశంబేని - మీదు క్రిందవుట!
కలరష్టవిధ నాయికలు; వారి భావ
ములు; పలు తెఱగులఁ బొగడును జగము.
వారి భావములెల్ల భక్తుండు క్షణము
పరమేశ్వరునిఁ గూర్చి పడెడు నవస్థ
వేయింటఁ బోలవు! విదితమ్ములగునె!
యా యవస్థలు చవు, లను భూతిలేక!
తనవాని ననుసరించినను; తావాని
ననుసరింపఁగఁ జేసినను; నభిసారి
కాభిఖ్యయింతికి; నామెయేయగుది
వాఽభిసారిక, దినంబందువర్తింప
బారాదివితముల, ప్రతి నిమేషాఽభి
సారిక భక్తుండు; చర్చింపభేద
మొక్కటే, తావానికురుకునే గాని
యక్కమలాంబకు నభిసరింపంగ
జేయండు - శ్రుతిసతీ సీమంత భూష
లాయడుగులు నొచ్చుననెడు తాపమున;
నిది భక్తిపంథ - నాకిదియ సూత్రమ్ము
కుదిరిన జీవనం - బదికినయుసురు

గంగాది సకల తరంగిణీ చయము
ప్రాంగణమున చంద్రభాగయే నాకు;
సకల పుణ్యక్షేత్ర సంచారతపము
ప్రకటమౌ పండరీ వాసమే నాకు
సకల శాస్త్రపురాణ సంచయాభ్యాస
మకలుష హరికీర్తనాఽఽసక్తి నాకు
తెరలని యుపవాస దీక్షలు; చక్ర
ధరనివేదిత ప్రసాదమ్ములే నాకు
న్యాసముల్, కవచముల్, వాసియౌ జపము
లా సర్వరూపు పాదాంబువే నాకు
నచటి వృక్షమ్ములే యవ్యయానంద
ప్రచుర భాగవతులు; నచటి విహంగ
కలకలములె పుణ్యకథలు; నా స్వామి
లలితరూపముజూచి - పులకలుబూచి-
మనువును, తనువును - మఱచుటే ముక్తి
కనుగవ జలమూర - గాద్గద్యమార
నాకటివేళల - నలపైన వేళ
దీకొని పెఱవారు - దిట్టినవేళ
కులముచెడినవేళ - కొఱమాలువేళ
చెలపాదులకుఁ జిక్కి- జెంకినవేళ
నాఱడి పడువేళ - నంకిలివేళ
ఘోరపాపములకు గురియైనవేళ
సంకెలఁ బడువేళ - చంపుటకొఱకు
నంకకాంద్రొకటియై యడ్డినవేళ
వాని నామామృత మూనుచు - మరణ—
మైనను - వరియించుటదియ నా భక్తి''
జ్ఞానదేవుఁడు రసాస్వాదపయోధి
ప్రాణ పదంబైన నామదేవుని - ని

సర్గసుందరమైన - సఖ్యామృత ముని
రర్గళమ్ముగ భుజార్గళములన్ బొదివె
ప్రతిదినం బీరీతి భగవంతుగుఱిచి
ప్రతిలేని వితముల భాషించి కొనుచు
సాధు సమ్మతమైన జ్ఞానవాదముల
మాధురీ సురభిళ మహనీయ భక్తి
వాదమ్ములను, నెదప్రమదమ్మునొందు
చాదరమ్మున నచ్చటచ్చట నున్న
యోగుల భక్త్యైకభోగుల - వీత
రాగుల; కర్మనిష్ఠాగుణోత్తరుల
త్యాగుల; వేదవిద్యా గరిష్ఠుల; స
దాగతుల; బుధుల; శతమన్యుల; పురు
షోత్తములను - శాస్త్ర విత్తముల - సు
పాత్ర సిద్ధులఁజేరి - పల్కులాఁడుచును
తీర్థమ్ములాడుచు దివ్యరూపముల
నర్థి దర్శించుచు నటనటఁ దిరిగి
కరినగరంబున కరుదేర - జనులు
పరుసయి భక్తికి పడగెత్తినట్లు
నామదేవుని దివ్య నాదామృతమ్ము
చే - మదివేడుకై - చేరి కొల్చినను -
యమునలో నాడి దివ్యావేశముకుళి
తములైన కనులలో దారలు గురియ-
మోద బాష్పమ్ము, లా పురిని కొల్వైన
శ్రీధరుమూర్తిఁ గీర్తించెను నామ
దేవుండు, తోడ్తోడ భావముల్ పొరల-
భావాను గుణముగా భాషపొంగార
యతు, లలంకారమ్ము లతిమాత్ర రక్తి
నతుకంగ; దాళ విన్యాసముల్ పొదల

శుద్ధి, ప్రయోగ ప్రసిద్ధి - రసాను
బద్ధత - నక్షర ప్రకర రమ్యతయు-
బొదలంగ; విచ్చిన బూగుత్తులట్లు
పొదిగొన్నవిరవాది పొట్లంబు లటులు
కులుకు కస్తురివీణ గోసినపగిది
తెలికప్పురపు గ్రోవి తెరచిన భంగి
జవ్వాది పక్కణి సడలించినట్లు
మవ్వంపు నవ్వుల ఱువ్వినయట్లు
పులుగడిగిన ముత్తెములవోలె - తాము
గలిపి మాటాడిన కరణి - సమమ్ము
లైన సమాసమ్ము లంతలంతలను —
దేనె తెట్టెలువోలె దేసిగానదుక
ప్రతి దినమ్మునుగూడ పండరీనాథు —
నతులిత కీర్తనానందంబు చెల్లె—
నా బాలగోపాల మా కీర్తనోత్స
వాబద్ధ హృదయులై యనుసరింపంగ;
నారాజ్యమేలెడు నతఁడు తురుష్కుఁ
డేరూపమునఁ గొల్వ నీశుఁడొక్కండె;
యనెడు సుజ్ఞానంబు నటయనివాఁడు —
కనులు గప్పిన యహంకారంబువాఁడు
మాయ బొమ్మలుచేసి మడుగులు గట్టి
తీయతీయని నివేదితములు దించు
దైతక్కలాడుచు; కూతలువెట్టు
నేతరిత్రోవలే! యీ భక్తియంచు
పరియాచక మొనర్చు పాటిగలాడు
పురిని కోలాహలంబును విచారించి
యెవ్వరో క్రొత్తగానే తెంచి రిర్వు
రవ్వారి నొక్కని హలహలియంచు—

విని, రోషతామ్రాక్ష వివృతముఖుండు
గనియెద దీనిలోఁగల్ల నిజంబు
లని; నామదేవుఁడార్ద్రాక్షుఁడై శబ్ద
వనజాతములతోడ వాసుదేవునకు
కైంకర్య మొనరించు కడకేగుదెంచి —
హూంకరించి జనంబు; కింకిరిపాటు
నిలువెల్ల నగుచు; ముక్కులు వొంగ "నాన
దలఁగి పాటలు వాడి; తైతక్కలాఁడ
చూతురేమం"చు; చిచ్చుఁబోఁ జూపుఁ జూచి—
చేతులు జాచి; "పిచ్చివి చెయ్వులెల్ల
చాలింపుమ''ని కర్కశముగాగ భక్తి
దేలెడు నానామదేవు గద్దించి —
పలికెనీకై వడి 'పాదుషా! యోరి!
చిలిపిచేతలు సాలు, - చెవిగోసినట్టి
మేక తెఱంగున మిక్కిలి మిడుక —
నాకలి దప్పులుగాక - దైవంబు
వచ్చునా! గిచ్చునా! ప్రజలను మోస
పుచ్చగా; చక్కని బూమె గట్టితివి
'కన్నయ్య' - 'చెన్నయ్య'-'సన్నయ్య'యనుచు
తిన్నని పదములు తీర్చిపాడెదవు.
పదముల బొంకమే భగవంతు మనసు
గదలించునేమి! పైగంబరు మాట
యల్లాకు నొకరూప మనిలేదు; మాకు
తెల్లంబు; గాదేని ముల్లాల నడుగు"
మన్న, పరమశాంతుఁడైన భక్తుండు
కన్నుల మ్రొక్కి శ్రీకాంతు కీర్తనము
సర్వశక్తము ప్రజాచయము నాకట్టి
నిర్వహించుటగాదు - నిక్కు నాకలికి

మెదుకులు గడియింప నొదిగించి కొన్న
పదకంబుగాదు! మా పండరీశ్వరుని
పదము వట్టిన నవనిధులు ముంగిటనె
పటలంబుగా నిల్చి పడిగాపు గాచు —
నక్షరాక్షరమున నక్షీణముక్తి
పక్షమ్మొనర్చుచు - పని దీర్చుచుండు
నమృతవార్థులు 'మేన నామేడితములు
తమిదీర నాకలి దప్పులు మాల్చు
'పాండు రంగా!' యన్నవాని భాగ్యములు
కొండిక ధనదుండు గొల్చునా యేమి?
పండరీశ్వరులెంక - భవ్య వైభవము
పందునే! రాజన్య భవనంబులందు—
రారాజులైన తరాజులుగాక
నీరజాక్షు నెదిర్చి - నిలువంగ గలరె!
పందెంబు నరుమిదే! పండరీశ్వరుని -
యందెల సాక్షిగా - నాస్వామి భజన
దీర్పరానిదియైన దీర్చునటంచు —
నేర్పడనావేళ మేచి భాషింప
పాదుసా, రోషసంభ్రమితాక్షుఁ డగుచు -
వాదిచ్చగించి నీ పందె మొప్పితిమి
తీర్పరానిదియైన దీర్చునటంచు
నేర్పడ నీవె భాషించితి గాదె!
ఇదె! తీర్పు మనుమంచు నెక్కుడే నొక్క
మొదవును దెప్పించి - గదుముచుబట్టి
తలగొట్టి కీర్తనా స్థలమెల్ల నరుణ
పలదూషితముగాగ ప్రత్యక్షమైన
శార్వరువలెఁ, గళాసము నొలిపించి
యుర్విపై బలపించి 'యోరి భక్తుండ!

యీ పశువును బ్రదికించితివేని
నీపాట లాటల నిక్కమున్నట్లు;
తప్పిన నీ గోవు తలగొట్టినట్లె-
తప్పక నినుబట్టి - తల గొట్టువాఁడ
నెంతసేపటిలోన నీ కార్య మొనరు
పంతంబు గట్టిన బరిజోగి! చెప్పు''—
మనుడు గోహత్యకు నాత్మవడంకి
కనుదోయి కన్నీటి కాలువలగుచు
"పంతంబు గట్టిన పాదుసా! భక్త
సంతారకుండైన స్వామి - శ్రీ పాండు
రంగఁ డీ మొదవును బ్రదికించు సుమ్ము,
భంగిగా; నాలుగు పగళులలోన
నిది తప్ప దీవార్ధులింకిన; - మొదలి
కుధరముల్ గ్రుంగిన; గోపతి యిలకు
రాలిన; దిక్కుంజరములు వ్రాలిన; వి
ఫాలాక్షుఁడగుచు నీశ్వరుఁడు సోలినను,
నిక్క మీమాట"న్నఁ బెక్కువ నవ్వి
యుక్కు శరీరంబు; బల్లముల్ శిలలు
నైనట్టి బంటుల నటఁ నాపు వెట్టి
భూనాథుఁడాగారమునకుఁ బోవుడును
నామదేవుఁడు భక్తిసీమ; వైరాగ్య
భూమ; పండరినాథు పున్నెంపు ప్రోవు—
జ్ఞానదేవుల పాదకంజాతములకు
మానిత శాలీనతా నతంబుగను
మస్తమ్మొనర్చి; విన్యస్త సమస్త
శస్తమంగళమైన శయకుశేశయము
పైనుంచి దీవింప బ్రమదంబు నెంచి-
తనకింక రంగండు దక్కెనటంచు

నన్నంబనక - జలంబనక - రవంత
కన్నుమూయక ప్రతిక్షణ విజృంభితమ
హా భక్తి భరుఁడౌచు - నలకామధేను
వీ భువిపాలు పారించిన యట్లు
కూలంబుదెగి సుధాకూపారమూర్మి
జాలంబుతో ధరాస్థలిడిగ్గినట్లు
నూఱు వసంతము లొక్కటేసారి
బారుగా ధరణిపైఁ బ్రసరించినట్లు
ఆ మూఁడు మూర్తుల యతి వలనైన
కామతస్స్ఫ్రితతనూ గంధముల్ భువికి
దిగజారినట్టులు ద్దీప్త భావములు
నెగడంగ నుడులు వెన్నెలలు బారింప,
పండరీశ్వరుపైన బాడఁదొడంగ
నండజవాహనుండా మహాభక్తు
పిలుపులు చెవులలోఁ జిలుక - తేనియలు
నిలువంగనేరక పలుమారు పయన
మై నాల్గుదినముల యవధి బీడింప;
మానసంబెట్టులో మఱలించి కొనఁగ;
నిట నామదేవుఁడుత్కటమైన భక్తి
ఘటియింప - మృదుల రాగమ్ములతోడ
పదకవితలు జెల్లె - ప్రజలు మోదమున
సదమదమై - మదులదికిన బొమ్మ
లటులు - తామును గూడ హస్తముల్గట్టి
కటికరసుందరుఁగంజాక్షుబాడ
నర్యముండుదయించి యస్తంబునందె
పర్యస్తమయ్యెను వాసరం బొకటి___
పశువు బ్రదుకలేదు - పండరీశ్వరుఁడు
ప్రస్ఫుమరకరుణతో భాషింపలేదు___

నామదేవుఁడు - భక్తిధాముండు; కీర్త
నామోదములు పంచె హరిదంగనలకు
జనులెల్ల - మదులు నిశ్చలములై - పాడి
రనవధికమ్ముగా నా కీర్తనములు
నామదేవుని పిల్పుతో మాధవునకు
నేమరిల్లగఁగాదు; హృదయంబుపాల
పొంగులై యున్నది - పోవుదమన్న
భంగించుమన్న దీప్రతిన; తానొక్క-
కడనిలువఁగలేక - కటకటంపడుచు
వెడఁద కన్నుల నీరువెట్టికొన్నాఁడు—
కడచె రెండవదినంబుడుపీధి - దినక
రుఁడు - కెంపులను బోలు రోచులఁజల్లె—
మూఁడవదినమును ముగియంగవచ్చె—
మూడుఁబో నీరేయి ముగిసిన మృత్యు
వని ప్రజలెల్లరు ననుకంప బూని
కొనకొని తమలోన గుసగుసల్వోవ—
సారవిచారుండు సాత్త్వికాకారుఁ
డారూఢ వైష్ణవాభ్యర్హిత తత్త్వుఁ
డతివేల శాంతిదాంత్యాది సద్గుణని
రతిశయతేజోవిదితమురఘస్మ
రవశభక్తి సంభ్రముఁడు - నేత్రాంత
రవిరళానంద బాష్పాధీనమూర్తి
కమనీయ మగుప్రేమ - కరగట్టినట్లు
విమలనిష్ఠకు రూపు సమకూరినట్లు
దృఢనిశ్చయము గండరించినయట్లు
కడిదితపము ముద్ద గట్టికొన్నట్లు
తొడరి గంధపుగాలి వడి వీచినట్లు
దడబడు పదములఁ దతిగొన్నమల్లె

గుత్తులవోలు కొంగ్రొత్త భావమ్ము
లత్తు కొనంగ భాషాంగ నా తపము—
లవఘళించిన యట్టు లాత్మేశు గుఱిచి—
యివతళిం పుల్ప్రేమ నెంతేని బిలువ—
తొలి దిక్కు జవరాలు - తలిమంబు విడిచి—
తలిగించి ముసుఁగు దిక్కులు సూచినంత
వలగొన్న కాంతులై వాసరాధిపుఁడు
ఝళ ఝళద్ఘంటికా కలితమై - సప్త
ఘోట్టాణ హేషావి ఘూర్ణ దాశాంత
హట్టమై - వరమణీ ధట్ట రుక్పట్ట
పర్యాప్త గగనమై - బరగుళతాంగ
వర్యంబునెక్కి దీప్తమ్ము రాజసము
కనుదోయి నలరింపఁ గంతమ్ము జాచి—
వనజ భవాండంబుఁ బాఱవీక్షించు
వేళకు - గళవనమాలికా గంధ
జాలమ్ము దిశల నాసారమై ముంచ
హరినీల రుచి జాలకాను బద్ధములు
నెఱులుదీరిన కురుల్ పరవళ్ళు లాడ
హరిత శార్వలరుచుల్ హరిదంతరములఁ
బరగించి - శిఖిపించ భరము నర్తింప—
మొసలి వాగడపోగు లెసఁగించు రుచుల
నసలసలై పోవ; నభ్రమండలము—
పాఱుతెంచిన యట్టి పాండురంగండు
దారున బాహాదండమ్ములు సాచి—
యుపగూహన మొనర్చి - "యో నామదేవ!
యపపాడి గానొక్క యవధి నేర్పఱచి—
నెంతనల్పితివి - నన్నెంత నల్గితివి—
చింతతోనే మేను చిక్కిపోయినది—

ఒక్క జీవమునకు నుసురు లిచ్చుటకు
నక్కజముగ నాలు గహములువలెనొ!
యొకమాట చాలదో? యుస్సురుమనుచు
తికమక గుడిచితి దినములన్నియును''—
అనిజ్ఞాన దేవుల నభివీక్షసేసి—
కొనకొని ప్రశ్నించె కుశలమ్ము స్వామి!
ప్రణయాధినేతయౌ పండరీనాథు
ననుపమం, బారూప, మచ్చటనున్న
జనులకుఁ దోపలే దనఘుఁడౌనతనిఁ
గనుగొనుటన్న సైకపుఁ బున్నె మేమి!
అంతటిలో వచ్చెనా తురుష్కుండు—
చెంత మల్లగణంబు చేరిసేవింప
కరమున కరవాఁడి ఖడ్గంబు మెఱయ
నఱుకుదుగాక యీనాడు నీప్రముచ్చు
దొరకెనటంచు, వాతెఱ సుళ్ళుగొనఁగ
పరభయంకరమైన విరసహాసంబు;
వాఁడు చూచుచునుండ వసుధపైనున్న
తొడుకులోఁ బ్రాణముల్ తోడ్తోడగూడ
పలలమ్ము - రక్తమ్ము - పలుప్రేవుగములు
బలుబొమికెలు - నాంత్రములు - సరిగాగ
తొలినున్న రీతిన నెలకొని; యంద
ముల గనులైనట్టి తెలిగండ్ల తోడ
ముచ్చటయైనట్టి మూపుతో; సరిగ
నచ్చుదీర్చిన యట్టు లఱచందురునకు
కలకలలాడు శృంగములతో - ముక్తి
చెలువు వేదికబోలు నలికంబుతోడ
చతురుదధులఁబోలు చరణమ్ము లమర
ప్రతిలేని నాల్గుప్రా బలుకులఁ బోలు

వలుదచన్నులతోడ, వలనొప్ప ధరణి
పొలపంబు నెఱపినట్టులు, దేనువగుచు—
ముందట నెలకొన్న మొదవును జూచి
క్రందుగాఁబెరయు నక్కజమున; సారె
సారె; బరీక్షించి సందియం బెడలి
తీఱిగర్వము, డెందమాఱటం పఱప
నికనేమిసేయునో! యీ భక్తుడనేఁడు
వికటంపు వెఱపు - నిల్వెల్లను గ్రమ్మ—
నాలుక తడియార - "నా తప్పునైచు
డీలీల మిమ్ముగారించిన తులువ
నని శాపమివ్వక - యనుకంపఁజూడుఁ"
దనుచు నా యిర్వుర యంఘ్రులఁబొరల;
నగి; నామదేవుండు - నారాయణుండు
విగత రాగద్వేషుఁ డగణిత శాంతి
పరిధి; నీచేసిన పాపంబు దలఁపఁ
దరికట్టి యికనైన నాశాదికమ్ము
'అల్లాను' భజియింపుమని మందలించి—
చల్లగా మఱియొక్కసారి యక్కునను
జేరిచికొని - భక్తు, శృంగార ధామ
మారంగపతిఁ సెలవనిచెప్పి పోవ
పరుసమై నిరతంబు ప్రజలు సేవింప
మురహరు బాడుచు - మొనయు భక్తులకు—
తెరువులు సూపుచు - తీర్థంబులాడు
చరుసంబుతోడుత నటఁగొన్ని నాళ్ళ
గడపి; యాపైఁ గాశికాపురిఁజేరి
మృడునకు గాదిలి - యుడు రాజనేత్ర
చరణ పంకేరుహ జాతమ్ము మాధ్వి,
యరుదారు దివసకరాన్వయన్నృపుల

యశమైన యట్టి దివ్యాపగనాడి -
యసమ బాణుని మదం బణచిన వాని;
త్రిపురనారీరతిశ్రీ భంగ తుంగ
కుపిత హుంకార సంక్షుభిత దిక్చక్రు;
దారుకాజారు; నీహార శైలేంద్రు
కూరిమియల్లుని, గోరినవరము
లిచ్చకెక్కుడుగాఁగ నిచ్చెడు వాని;
నచ్చంపు వైష్ణవు, హరి తత్త్వవేత్త
తారక బ్రహ్మ విద్యా రహస్యజ్ఞు
తారకాకమన, సుందర జటాజూటు
కాశికా విశ్వేశుఁగరమర్థి మ్రొక్కి-
యాసర్వ మంగళ, నా విశాలాక్షి
వినుతించి - యటుడుంఠి విఘ్నేశుఁగొలిచి -
వినత దేవవ్రాతు - విశ్వవిఖ్యాతు
దరచక్రధరు, ధరాధర ఫణాపటల
వరచంద్రశాలికా పర్యంక భోగి
వక్షోమనాక్ప్రల వైజయంతీవి
లక్షణ సౌందర్య చక్షుః ప్రసన్ను
లక్ష్మీపదాబ్జాతలాక్షారసాంక
పక్ష్మలితద్యుతి ప్రచయాంసపీఠు
బిందు మాధవుని సేవించి - పీయూష
తుందిల శబ్దముల్ దొ్రటిలఁ బాడి
యాతీర్థ మీతీర్థమనుచుఁ గొన్నాళ్ళు
నాతలంబునయందె యధివసించినను
కాశికాపురిలోనఁ గలఁడొక్కరుండు
వాసనా దూరుండు - భక్తినిష్యంది
తారక బ్రహ్మ విద్యారసికుండు
ధీర రామానంద దేశిక చరణ

ధూళీ పరిష్కృత మౌళి; భాగవత
పాళీపదాయత్త భవ్యజీవనుఁడు
పేరు 'కబీరు' - "దోహా" రసోన్మాది
శ్రీరఘుచంద్ర మాశ్రిత కుటీతలుఁడు
ననువార్త చెవిఁబడ నా మహామహుని
కనిపించికొని - వాని ఘననిష్ఠఁజూచి —
పోవలెనను బుద్ధి - వొదమి - యావీధి
నీవీధి గాలించి - యెల్లరనడిగి
కొనపేటలో నొక్కగొందిలో - మినుకు
మినుకు మంచును నిల్వమని కితంపడెడు
కొఱదివ్వె - వెల్గెడి - కుటినొండుఁజూచి—
యరసి - తారకనామ పరిమళ భరిత
మగుటయు, లేమిచే నవళమైనట్టి
దగుటయుఁ దలపోసి - యతని నివాస
మిందెకాఁదగునని యెవ్వరో! యయ్య!
నందిత సుగుణుండు - నామావతారుఁ
డాకబీరులఁ జూచి - యానంద భరము
నాకంత పరిపూర్తి నందవచ్చితిమి.
యతని యిల్లిదియౌనె; యన్నంత - భాగ
వతులెవ్వరోవచ్చి వాకిట నిలిచి —
రని పల్కనది భార్య - ధ్యాననిష్ఠుండు
కనుగవ దెఱచి - వేగమ్మున వచ్చి —
వారి పాదములకు వలగొని - దార
నీరమ్ములం దివ్యనిష్ఠతోఁ గడిగి
పైనున్న చీరచీవరమునఁ దుడిచి
యానిన భక్తితో నొదలవంచి
దయసేయుఁడని పల్కుతా తెర్వుసూపి —
శయగతమ్ములు! సిద్ధశక్తులయ్యును - న

నాదరించిన యట్టి బోధైక పూర్ణు
డాదాశరథి చిరిత్రాలోచనాని
రంతర దంతురి తాంతరుండగుట
చింతా విరహితుండు; జీవులఁ బ్రోవ
నవనికే తెంచిన యాళుకాంశంబు
భవనికారుండొక్క ప్రాఁజాపవఱచి
యధివసింపఁగఁజేసి - యంఘ్రులఁబట్టు
చిది భాగ్యసాకల్య; మిది నాకు ముక్తి
యిది రామసేవ; యియ్యది ధ్యానమనుచు
మదిమది నుప్పొంగి - మగువనుఁ జూచి
"పరమేశ్వరుఁడు బంపె భాగవతులను
పరమేశ్వరుఁడెవచ్చె భాగవతులుగ
నేమైన నున్నదే యింటిలో"నన్న
నామె, యిసుంగులకంబువు లొనఁగి
పడుకొనఁ బెట్టిన దడలుచున్నారు
బుడుతలు కడుపులఁ బొగరాజుచుండ
నేమియుండును నింట! నేమి లేదన్న
దామాత, కనుగవ యార్ద్రింబుగాఁగ
"సరిలెమ్ము జిటికెలోఁ దిరిగి వచ్చెదను
శరమువోలిక - పాదసంవాహనమ్ము
సలుపు చుండు"మటన్న - జాయ యేమంచు
దలఁచెనో! తన భర్త! యలజడిఁ జిక్క
ననియెంచెనో! నేన యంగడికేగి
కొనితెత్తు ననిపోయె కోమలహృదయ;
యేగినదేగాని - యెవ్వరిచ్చెదరు?
త్యాగమ్ముగా పదార్థములు! భాగవతు
లైనవారికినేమి? హరియైననేమి!
ప్రాణపదము సువర్ణము భూజనులకు;

నదిరేయియవుట బే హారమ్ము నిలిచి
నది-యన్నియంగడు లప్పుడే మూసి
రొక్క- కోమటి మాత్ర మున్నరొక్కంబు
లెక్కించుచుండె దా నిక్క- సేరుటకు
నతని యంగడిసేరి - యడిగిన దతివ-
ప్రతికితి మీనాఁడు భాగ్యవంతుండ!
మూసిరంగడులెల్ల మూయకుంచితివి
మాసిగ్గుదప్పించు కోసమైనట్లు
సెట్టి! వేకువతోనఁ జెల్లింతు పైక
మెట్టైన - బియ్యంబునిమ్ము, భాగవతు
లటఁగాచి కొన్నార లా కటమ్రగ్గి
కటకటం పడకు, నీ కాసు పోనివ్వ
ననుడును గన్నెత్తి యతివ వీక్షించి-
మనసున మదనుండు మరులు ప్రేరేప
దుర్ఘర దారిద్ర్య దూషితంబగుచు,
నిర్భర దారిద్ర్య నిగడితనేత్ర
మన్నాతి గాత్రంబు నందును, నంద
మన్నది గనిపించి, యా కన్ను గపకు
నావా తెలకు - సొక్కి-, యల్లన నగుచు
భావంబు దెలుపుచు - బలికెనా శ్రేష్ఠి
"వేళగానట్టి యీ వేళలో వచ్చి-
చాల చాతురితోడ జాలమల్లెదవు
అడుగువారికి నెల్ల నప్పులనివ్వ
గుడినెత్తుకొనిపోక, గుదురునా! బేర
మదికానిమాట; యేణాక్షి! మాసాయ
మదియొకపైన - నీయది మరియొక్క-
పైన నొప్పెడు మాటయవుగాని - మమ్మెఁ
బూనఁద్రోయగ; వెట్టిబొట్టెలా? మేము

యింతకు - నెవ్వతె వీవు! కాదారి
యంతలింతలఁజేరి యందంబులాడె"
దన్న-, "నీయూరరా మార్పితబుద్ధి
సన్నుతగుణుఁడు శాశ్వతకీర్తి, నిత్య
భాగవతార్చనా పరుఁడు 'కబీరు-
భాగధేయంబు శ్రీ వారణాసికిని-
యెఱుఁగరే మీరలా పరమపవిత్రు
నెఱుఁగకుండిననేమి! - యెల్లరునెల్ల
వారిని దెలియంగ వశమౌనా! ధర్మ
దార - నేవారికి; తడవు సేయకుఁడు
ప్రాలిండు, వేకువపైక మొప్పింతు
జాలిఁబడుచునుంద్రు; సర్వేశభక్తు
లన్నంత; పకపకమనినవ్వి - " మేలె!
యన్నువకౌను దానా! తెలివల్వ
కన్నులదాన! నీకాంతుండు బగుతు
డెన్న భక్తులుగాని దెవ్వరీ ధరణి
బ్రదుకంగ నేరని - ప్రతియొక్కవాడు-
కొదదీర్చికొనుటకు - గోచినిగట్టి
పంగనామమువెట్టి, చెంగుమంచాడ
పంగులేనట్టి మావంటి వారెల్ల
వీరిని బ్రదికింపఁ గూరుచున్నారా!
కూరునే! యిట్టి పల్కులతోడఁ బనులు-
అరమరలేల! నాయాత్మ దెల్పెదను-
నెరవేర్తు నందువో! మఱుమాట పలికి;
మఱుమాట లేకున్న - విరవాదిపూలు
విరిసిన యటులొకపరి కన్నులార్చి-
సమ్మతిఁ దెల్పినఁ జాలు బియ్యంబు
కమ్మని బేడలు - కాయగూరలును -

యొకటేమి! యక్క-అయున్న వన్నియును
నికరంబుగా వ్రాలు నీయింట నిపుడు-
కోమటిమది బెనగొన్న దుశ్చింత
యా మానినీమణి కర్థమై-కనులు
చెమ్మలై ; దిగ్రమింగి - యుమ్మలికమ్మ
పమ్మిన దుష్కాంక్ష, వాఁడచెప్పంగ
విందునుగా కని - సందియంబేల
డెందంబు నందున్న - తీరెదో పలుకు!
మనినంత! వికవికలై - మొగంబెల్ల
మనసులో నున్నట్టి మాట నాలుకకు
దెప్పించు వెఱవు - గా దేని యోయింతి
యిప్పాటి వెఱుఁగరే! యెవరైన బుడమి!
చల్లకువచ్చి - దాచఁగనేల ముంత
పల్లవాధరి! విను! భ్రమజెందినాము
నీపైని; మా కోర్కె నీవు తీర్చితివ!
యాపైని; రిత్తబియ్యంబేమి! ప్రాణ
ములె నీవి; యన్నంత - వెలవెలఁబోయి—
తలఁకి, నలందురి, తలరి, శ్రీజాన
కీ నాథ! యిదియేమి కీడు దెచ్చితివి!
మానుదునా! లేక - పూనుదునా! యి
టెందుకు మమ్ముఁ బరీక్షింతువోయి!
మందెమేలము మేలొ! మా స్వామి! యంచు,
దలపోసి - భాగవతుల యాకలెంచి —
మలమూత్రములకుండ - మయి; దీనిదుష్టుఁ
డాపించె! భాగవతార్పితంబుగను—
నాశిల్లగాకన్న; యీసు జనించి—
ధవుఁడుగేహినికినిదైవమ్ము - వాని
ప్రవిమలమైనట్టి పంతమ్ము దీర్చు

ఛీ! పతివ్రతలకు హెచ్చైన ధర్మ
మీపట్ల జంకుట - లేలంచు, దోచి —
ధర్మస్వరూపుండు - ధర్మనిస్త్రిటిత
దుర్మద రాక్షసస్తోమ కంఠుండు
పరసతీ హృదయతాప గ్రంధి, శౌర్య
పరిణాహిరావణ ప్రాణనిహంత;
శరణాగతత్రాణ చణుఁడు; దుర్గర్వ
భరిత కాకాసుర ప్రాణాపహార
చటులభ్రుకుటి; యేకజాయావ్రతుండు
పటుధనుష్కరుఁడయి - పగలును - రేల
ముంగల వెనుకల పౌరువులఁ దనకు!
జెంగట నిలిచి రక్షింప; ప్రముక్కడులు
దన్నేమిసేయుదురన్న నిశ్చయము
పెన్నిధివోలె హృద్వీధి భాసించి—
"వల్లె"యన్నది దానవైశ్య శేఖరుని—
యొళ్ళెల్ల పులకల యుద్యానమయ్యె
నంతనాపడఁతి యీవయ్య! పదార్థ
మింతలోఁ జనుదెంతు నేకటఁదీర్తు
ననుడును - బోయినవనితదా మరల
జనుదెంచునే? యను సంశయం బొదవి—
వచ్చుట గిచ్చుట వాసిగా దబల!
నచ్చుగిట్టదు మాకు - నగదు బేహార!
మిప్పుడే - మాయెద దప్పిఁబోకార్చి
తెప్పునఁ బొమ్మన్న - దీనదీనముగ
వాని వీక్షించుచు - భక్తశేఖరులు
ప్రాణపదమ్ములు భగవంతునకును—
వారట నాకలి వనటలఁ జిక్క
గా; రమియించుచో - వారిదలంచి—

యరియాడి; "నాచిత్త ముత్తలంపడఁగ
దొరకునే! చవులు! తొందరకాడ! మనసు
జతలేని రతము - పాషాణ చుంబనము
వ్రతము చెడెనె పొమ్ము! వలదె సుకమ్ము!
తెలికన్ను గవలలోఁ బొలపంబు మెఱయు—
నలఁతి నవ్వులతోడ నల్లన డాపి—
యారజంబులతోడి యఱగంట వలపు
దేరఁగ సరసంపు తీరులఁ బలికి
యెదమేని నెత్తావి సుడియంగఁబైట
నెడవ్రాల్చి - యంతలో నెయ్యుచుసోలి
నెలమిచెల్వముల సొమ్ములుగాఁగ - కోర్కె
తలపొల మెయ్దంగ - దా సమ్మతించి
పశమైన వనితతో - రసకేళిగాఁక
పొసఁగునే! పెఱరతంబుల మనస్సుఖము
మాట తప్పుననేను - మాయింటి దైవ
మోటుపల్కు నయింపఁ దొక తడవైన
నొకమాట; యొకపత్ని; యొకబాణమతని
కకలంకమూర్తి ధర్మావతారుండు
మా దాశరధితోడు మరిపత్తు; లేదు
భేదమ్ము; మమ్ము బంపింపుఁ"డనంగ—
పెద్ద పెనంగిన విరసంబెగాక -
పిద్ధించునే కోర్కె, చెలువుల మనసు
కరగించి కలయుటే కామతత్వంబు
తొరయేటి కనితోచి, తొయ్యలి నేఁడు
దప్పిపోయిన రేపు దప్పిపోయెడునొ!!
యెప్పుడో యొకసారి - మీవంతు దీర
కయపోవునా! యన్న గట్టిధైర్యమున -
స్మయమానుఁడై "పత్ని! నరగరా, పొమ్మ"

టంచుప్రాలొఁసగిన, నతివ నేత్రాంత
రంచితబాష్పయై; హరిపదాంభోజ
విన్యస్త చిత్తయై; వేగంబ వచ్చి -
ధన్యులమైతిమి - తావకార్చనకు
దైవంబుకృపసేసె - తడవయ్యెనేమొ!
సేవకింకిట తడసేయ నటంచు
జలమాడి - వంటకంబులు దీర్చి - మేన
నలరుతారకమంత్రమైన కబీరు
గాంభీర్యశరధికి - కంధి గాంభీర్య
సంభేదనోత్తుంగ శరధికి-; భక్త
నిరవధి - కారుణ్య - నిచితాంబకునకు
సురరాజభీతిదాఽసురరాజకంఠ
ఘంటాపథవ్రాత ఖంటాకధనుర
కుంఠితటాంకృతి క్షుభితదిక్కునకు;
ధర్మైకరతునకు ధర్మరూపునకు—
ధర్మవిద్రోహిసంతానదావాగ్ని
కారామచంద్రున కర్పణసేసి—
పారవశ్యమునొంద భక్తితో మనసు
హరిరూపులైనట్టి యతిథుల కతివ
సరగున వడ్డింప సరసఁ గూర్చుండి—
వ్యజనంబు వీచుచు - బ్రహ్మరూపులరు
నిజమిది, దాసుని - నిర్వృతికొఱకు
నెంతదూరమురాఁగ నిచ్చగించితిరొ!
సంతోసమేగాని - జన్మదరిద్రుఁ
డీదేహి - మీకు సంతృప్తిగా - సేవ
లాదటఁ జెల్లింప నవకుఁడైనాఁడు
వండిన వానిలోపల జంకుఁదొలఁచి
దండిగా భుజియించి - దయబ్రోవవలయు

నని యుపచారంబు లాడుచునుండె
వనిత వడ్డనసేయ, పలుమాఱులడిగి——
వారు భుజించిన - పడుకలుపఱచి——
వారిపాదము లొత్తు చూరును, బేరు
లడుగ - పండరిలోని - యా రంగనాథుఁ
డదవడి పఠ్ఠించె నామదేవుండు
అతిథులు నిద్రింప నాకలి నవయు
సుతుల కన్నమువెట్టె; శోభనాచార!
అప్పుడు దెలిపిన దతివ నాథునకు
నప్పాలసుఁడు వైశ్యుఁ డడిగిన వితము
తన ప్రతిజ్ఞయు, విని, తడవేలయువిద!
మన గృహంబునకు వచ్చిన భాగవతుల
యాకలి దీర్చిన యనఘుండు వాఁడు
పోకున్న దోసంబు - పోవనేవలయు
మానావమానముల్ మంచిసెబ్బరలు
మానిని! మనుజుల మనసులు కల్ప
నలు సేసికొన్నవి, నరుఁడు శ్రీహరిని
దెలియుట - తలచుట - తులలేని ధర్మ
మఖిల ధర్మములకు నా హరిప్రీతి
నికరమౌఫలము! తన్నియతి దప్పినను
సకియ! ధర్మము గజస్నానమ్ము, తెల్వి
వీకటాటవీ జ్యోత్స్న! విన్కియు రిత్త
జలధి, తరంగిణుల్ గలిపిన నవియు
జలధియైనట్లు, లీశ్వరుగూర్చి సలుపు
కర్మంబులందు, సధర్మంబులైన
ధర్మంబులయగు - నీ తత్త్వంబు కడది
కలికి! ధర్మములుగా గనపడి కొన్ని
యలమున ధర్మమ్ములై తుదివోయి ——

బయలి ధర్మమ్ములై ప్రస్ఫుటాఽధర్మ
మయములౌ గొన్ని సమ్యగ్వీక్షచేత —
ఏది ధర్మమొ! భువి నేది యధర్మ
మో! దెప్పరము దెల్పవేదులకైన
కాన - శ్రీరాముఁడొక్కండె సత్యమ్ము
వానికి పెఱయెల్ల; పరికింపకల్ల
యికపొమ్ము, వైశ్యుని యిచ్చ బండించి
సుకముగ మఱిరమ్ము శోభనాచార!
యనుచుండ, మేఘమ్ములాకాశమందు
పనికి, గర్జాభీల వైయాత్యమమర
వఱుగొని గురియంగ పథములందెల్ల
బురదయై పోయిన - పోవంగలేదు -
పొలఁతి యొంటిగఁ దాను - పోయిననైన
నలమిన జంబాల మంఘ్రులకంటి
తలయెల్లఁ దడిపి; భోక్తకు సుఖభోగ
మలవడునే! యన్నయనుమానమెసఁగి
తాన భార్యనుగొని తరలంగఁ దలఁచి
మానిని శిరముపై మాపుడు పుట్ట
మొక్కటిగప్పి తా, నుద్వహించుచును—
చిక్కని చీకటి చిటిలినవాడ
లందు - సీతాజాని ముందు జనంగ
క్రందుగా రేగిన కన్నులకావి;
తరలెఁగబీరు; సుందరరామచంద్ర
చరణవిష్టర మనస్సాత్త్వికమూర్తి;
తరలెగబీరు; సీతానాథపాద
పరవశనేత్రస్రవద్బాష్పవారి;
తరలెఁగబీరయోధ్యాపతిధ్యాన
భరితరోమాంచ విస్ఫురితదేహుండు;

తరలెఁగబీరు వైధాత్రశ్రుత్యంత
పరిమళిత కవిత్వపాటవశాలి;
పయనించి, పయనించి వాడలు గడిచి
రయమున గృహిణి మార్గంబు సూచింప
నాయంగడికివచ్చి; యల్లనమ్రొక్కి-
యోయి! మహాపుణ్య! యొక్కంత తడవు-
జరగె; మాదోసమ్ము సైపఁగా వలయు,
పరమ భాగవతులు వారు నిద్రించు
వఱకును రావల్ల పడలేదు మాకు!
వరమూర్తి! మాదైన వ్రతము దీర్చితివి
ఇదె నాదుభార్య! నీ యిచ్ఛ దీరంగ
మదనకేళినిదేలు మదవదం పడకు
తనువులు, ధనములు, మనుగడలెల్ల
తనుపారు తృప్తి సౌందర్య ధామునకు
రామచంద్రునకు నర్పణ సేయుకంటె
నే మార్గమునఁ జూడ నేదిపుణ్యంబు!
యేనిందయుండి - మీ యిర్వురకేళి
కేనెవ్వ, లేకుండ, వీక్షించుచుందు
పరమ భాగవత సేవాపుణ్యమూర్తి
కరుణింపు మనుడును - కాపురుషునకుఁ
గన్నులఁ గప్పిన కామంబు విరిసె
నున్నతమతి యబ్బె, నోచెల్లి! యనఁగ
నే పూర్వజనికృతం బింత యుండినదొ!
పాపంబు వెన్వెంట భంగంబునొంది
ప్రబల పశ్చాత్తాప వహ్నిగాల్పంగ
నభయ మీవలె నాకు, నభయం బటంచు
తలమోది కొనుచు నాతల్లి పాదముల
కిలజాగిమ్రొక్కి; కన్నుల గర్వమప్పి

పరమ పాతివ్రత్య పాకసేవధికి
దురిత మెంచితినమ్మ! ధరణీసవిత్రి!
నావంశమెల్లను నరకకూపమునఁ
ద్రోవంగఁబూనితి; ద్రోహిమన్నించి
యీ శిరస్థలమున నిడుము నీపాద
మాసాదితంబగు నఖిలమంగళము
నిన్నట్లు బలికిన చెన్నటి నోరు
చెన్నఱి యింతింతఁజీలునో యేమొ!
నిన్నట్లు సూచిన చెన్నటికండ్లు
ప్రన్నఱి గుంతలు వడిపోవునేమొ!
నిన్నట్టు లెంచిన చెన్నటి మనసు
క్రన్నన వెలిమిడిగాఁబోవునేమొ!
నన్ను రక్షింపవే! నా తల్లి!" యనుచు
కన్నీటితోనన - గడిగి పాదమ్ము
లా కబీరునివైన యడుగుల కెఱఁగి
మీ కులంబున బంట, మీ యింటి లెంగి
మీ నీడ సోకిన బానిసకొడుక
మీనెగుల్నను గాల్చు; మీ కృపాదృష్టి
నా పాపములు గూల్చు; నన్ను రక్షించి—
నా పరుసపుఁబల్కులోపి మన్నించి
కడతేర్పవలె శిష్యుఁగా జేపికొంచు
నడవడులెంచక నాయన్నలనుచు
వినయంబుసేసిన - విని కబీరుండు
కనుదోయి దొనకంగఁ గారుణ్యదృష్టి
సకలగురుండు దాశరథియేగాఁక
యొకని కొక్కఁడు గురుండుర్వరగలఁడె!
యతఁడు దయాపూర్ణుఁడతని కొక్కనికి
పతితపావనుఁడన్న ప్రథగల్గెనోయి!

వానికంజెను దయావాసితంబైన
దానామదైవతం, బానుడియందు
శతకోటియమృతంపు జలధులుగలవు
శతకోటి కైవల్య సౌఖ్యముల్ గలవు
ఒక పాపమేమిటి? - యుర్వినిగలుగు
సకలపాపంబుల నొకప్రక్కవెట్టి—
మరియొకపైపు నామంబును దూచ
భరమౌను నామంపుబలము; శ్రీరామ
శ్రీరామ! యనువాని పేరలెన్నుటకు
నేరండునలువైన - నిటలాక్షుఁడైన
వెఱకు, పశ్చాత్తాప మెరగలివోలె
కరుసుపాపమ్మును గాల్చివేసినది"
యని; వానిలేవనెత్తి, నితాంతమైన
యనుకంప దోపంగ; నక్కునఁజేర్చి—
యిఁక బోయివచ్చెద మేమారకోయి!
యకలంకమైన 'రామా!' యన్న ధనము"
అనిపల్క, నా పల్కులం దత్తమిల్లె
ఘనయోగి వరులసాధనలోని తెలివి
యా కబీరుని యమృతాలింగనమ్ము
యాకృపానిధి బోధయందలి తీపి,
యానాటిలోఁ దెగినట్టి ప్రాక్కర్మ
మానసంబును రామమయము గాలింప
నంగడివిడిచి, భార్యాదికబంధ
భంగంబుసేసి, తీవ్రంబైన భక్తి
సాధించి - యాశ్రేష్ఠి బాధావిముక్తి
మై - ధర్మసమ్మిత మపవర్గమందె;
పరమసాత్త్వతుల దీవనలన్న; నిజము
మఱుగైన చిల్లరమాటలా! యేమి?
మఱునాటి వేకువగురుసేవసేయ

నరుదెంచినట్టి యా యంగడిసెట్టి
తనకత సెప్పిన; త్యాగపాథోధి
పెనఁగొన్న యెఱుక, కబీరంచు - నామ
దేవుండునున్ జ్ఞాన దేవుఁడగ్గించి
భావార్ద్రిముగ బాహుబంధమ్ము జేర్చి-
యా పతివ్రత సద్గుణావళినెన్ని
మీపాల రఘువరుండే ప్రొద్దుగలఁడు,
యొకనాటి దేమని యాదివచింప
వికసితముఖుఁడై; కబీరు - మస్తమ్ము
వంచి - వందించె, సద్భాగవత ప్ర
పంచ పాదార్చనా బలమంచు బలికి;
యాదిన మేకాంతమందు మువ్వురును
శ్రీధవు గూర్చి చర్చించెడు వేళ
వారిరువురి పూర్వభవములు; వారు
నారాయణుని దైన కోరికతోన
పుడమి బుట్టిన విధంబును - వారుపైని
నడువంగవలిపిన వడువును - జ్ఞాన
దేవుండు దలపింప, దిగ్గనలేచి-
యావిష్ణు పాదంబులంటి - రిర్వురును;
మఱునాడు తామికఁ దరలెదమనుచు
వెరవుదోపంగఁ గబీరుతోఁ జెప్పి
యాతని భార్యకు, నవదాతమతికి
నతివేల మగుదయ నాశీస్సు లొసఁగి
జనకు పోలిక - జగంబున కీర్తిగొనెడు
తనయు 'కమాలు' ముద్దాడి - దీవించి-
పోవుచు - జ్ఞానదేవుఁడు - నామదేవు
దైవతంబైన చిద్ఘనమూర్తి 'చంద్ర
భాగామనోహరు - పార్థరథాంగ

భాగధేయము, భక్తభండారమైన
పండరీనాథుని వర్ణించి చెప్పి-
"దండిభక్తుఁడ! నీవు తద్దర్శనంబు
నొనరింపరమ్మట నున్నారు, భక్తు
లనుపమవర్తను" లన్నఁ - గబీరు
'ధన్యోస్మి' పూతమంత్రంబట్లు మాకు
మాన్యంబు మీయాన మఱుపకేతెంతు
నరపి, యీ కార్తికమందు నుత్థాన
హరివాసరమునకు - హరిగొల్వననుచు
నొడఁబడి - దారయు బడిరాగ; దవ్వు
నడచి - యాయిర్వురి యడుగులకెఱఁగి
సాఁగనంపఁగ బోయి దాగుణోత్తరులు
సాగు చూపులతోడ చషులకందు
మేరకు - నవ్వారిదారులే చూచి
కారు కన్నీట కబీరు గీమునకు-
దావచ్చె గృహమెల్ల భావుకనామ
దేవసత్పద కవితా వాసితమ్ము;
జ్ఞానదేవుండును నామదేవుండు
వీనెక్కినట్టి త్రివేణిలో నాడి
ధర్మావతర వికర్తన వంశకీర్తి
శర్మదంబు, నయోధ్య సరయువ్వనాడి;
నిత్యయౌవన కృష్ణ నిభృత విలాస
చైత్యమ్ము యమునలో జలములఁగ్రుంగి
ద్వారక దరిసించి - పదునాఱువేల
నీరజాక్షుల నిత్యజారున కెఱఁగి
తక్కటీర్థమ్ములఁ దానమ్ములాడి
యక్కడి మూర్తుల నగ్గించి పాడి-
పయనించుచుండ మార్వారుదేశమున

భయమొదవించెడు వనములో నొకట
నడచుచునుండిన నామదేవునకు
బెడిదంపు దాహమై, పిడుచలుగట్టి
నాలుక; కనుచూపు నేలలో నెచటఁ
గ్రోలనీరమ్ము చేకూరకయున్న-
హరిహరీ! యనుచుఁ దూగాడు పాదముల
నతిముఱి చీకటులైన నేత్రముల
తటమటలైన గాత్రమ్ముతో, బిట్టు
కటకటంపడి యొక్కకడఁ గూరుచుండి
పండరీశ్వర! యిట్టి వనమున కీడ్చి-
చండ భాస్కర కరచయమునఁజూడి
నన్ను జంపింతువో! నాతండ్రి యనుచుఁ-
గన్నులనీ రోడఁగలవరించుడును
నల్లంత మేరలో నగములనుండి
పల్లంబులోనికిఁ బడుచును లేచు
చున్నట్టి పక్షులఁజూచి, టిట్టిభము-
లన్నట్టి తలఁపున నాజ్ఞానదేవుఁ-
డన్న! దూరమ్మున నదె! సరోవరము-
దిన్నఁగ రమ్మన్న - మున్నటలేని,
కాసార, మదియెట్లు గలిగె నటంచు-
వాసియౌ పండరీశ్వరు దయయంచు
నటకేగి చూచిన, నంబువుల్ సర్ప
కటకంబునందున్న కైవడిఁదోప
నీరు ద్రావెడు నాస నిలువునఁగూల
బోరన నేడ్చుచుఁ బుండరీకాక్ష!
కరుణాదరిద్ర! నిష్కపటులై సర్వ
భరములనీకు నర్పణ జేసి బ్రదుకు
భక్తుల నేడ్పించి, బ్రమసి తిర్గెదవు

ప్రాక్తన కర్మాను భవమన్న ముసుఁగు
దగిలింతు, నీచేయు దారుణంబులకు
తగవరి! జీవి స్వతంత్రుండుగాఁడు-
పరతంత్రుఁడగువాని ప్రాక్తన కర్మ
మరయనే విధమున నంటంగవలఁతి!
సర్వేంద్రియంబుల సాక్షాత్కరించి-
సర్వభోగముల రసంబులు గుడుతు
వని నీ వె పల్కితి, వట్టిచో జీవి
తన కర్మములకునుఁ దానెట్లు బాధ్యుఁ
డని వితర్కించినంబుజోదరున
కనుకంపముమ్మడ్డువై, తోన, తోన
సరసిలో నీరు దెప్పరముగ నుబికి
దొరలంగఁజేసిన, - పరమ హర్షమున
దోసిటఁద్రావి - యేతులఁ బల్కానాను
నాశిఖత్వమ్ములు - నారాయణుండ!
తలఁపకుమని చాల తల్లడించినను
కలకలమని నవ్వి జ్ఞానదేవుండు
నామదేవా! నీకు దామోదరుండు
కామితంబులఁ గూర్చు కల్పవృక్షంబు
వరవుడమోసె నీ భక్తికి వాఁడు
తిరముగానని - నామదేవు నగ్గించె
నాసరం బిప్పటికట్టులే, పాఱు
వాపిగా నామదేవయశంబనంగ;
నటనుండి కదలి మహాదేవ మస్త
తటవర్త నక్రియా ధన్యతారుణ్య
వతియైన గంగలో నుతపడ మునిగి
ప్రతిపదమ్మును తపోభరమైన తుహిన
గోత్రంబునకు నేటి కోళ్ళు చెల్లించి-

దాతృతాయత్తు కేదారేశుఁ గొలిచి-
నైమిశాదులు సూచి - నడచుచు; నాంధ్ర
భూమి ప్రవేశింపఁ - బొదిగొనివీచె,
పావనోదార గోదావరీసలిల
శైవాగ మామోద జటిలవాయువులు;
ఆయా స్థలమ్ముల, హరు, మహాజూటుఁ
బాయని భక్తితోఁ బ్రణుతించి నడచి—
మదిరారసోత్తాల మల్లికార్జునుఁడు
మదదిగ్గళబరసీమంతినీహృదయ
పశ్యతోహరుఁడు భావస్నిగ్ధభక్తి
వశ్యుండు, శ్రుతిపరామృశ్యవర్తనుఁడు
శ్రీశైలవనములఁ జిందుక్రొత్తేనె
నా సదిరగలేదొ! యౌఘళంబొలయు
నామదేవుని కవితామాధ్వీగ్రోలె
వేమారుఁబొగడుచు వేవేలరుచులు;
అటనుండిచని గరుడాసనాసీను
కటు దృష్టి, కహకహత్కర్కరాకారు
ప్రబలదైతేయ దుర్దర్పాంధకార
కబళనవ్యగ్ర జాగ్రత్ప్రోగ్ర్యహాసు
నరకేసరినుతించి, మఱియునుగల్గు
పరమస్థలంబుల భక్తినందించి
వేదమ్ములేశిలలై; దెసదెసల
గాదిలిప్రామునుల్, కాల్వలైనట్టి
శేషాచలమునకు శిరమువంచి;
యాసతో, వరద హస్తాభిరామునకుఁ
దరమైన పదకవితామాలలేపి
పఱపులై పులకలు కఱగుచు మ్రొక్కి
యచ్చట భక్తుల కనుగులంబుగను

ముచ్చటలాడి మెప్పులు గొని, దివ్య
వైకుంఠమైనఁ దద్వాసతమనసు
లేక తానములుగా నిద్ధయౌభక్తి;
కటనుండి కదలి, దివ్యాపగ, ముక్తి
కటకమైనట్టి యా కావేరిగ్రుంకి
శివరాత్రిడగ్గఱ; భవుఁడు వేంచేసి
నవకమొప్పెడు 'నాగనాథ'పురంబు
నకు వచ్చి - యచ్చట నాగభూషణుని
వికసత్కనీనికా వీక్షణంబులను
బూజించి - కీర్తనమ్ములు సేయుచున్న
నోజగా నీవార్త యూరెల్లఁ బ్రాకి
పదులు వందలుగాగఁ బ్రజముట్టుకొనుచు
పదటునఁ బ్రమదంబు వట్టుగాఁ ద్రావ
నా యూరి విప్రులకడి కన్నులెర్ర
నై, యుడుకుచునుండి; రవసరంబునకు
నానాఁడు; 'శివరాత్రి', యాపురియెల్ల
బోనమ్ము పిక్కినఁ బోయెడునట్లు
తరుణులు, ముదుసళ్ళు తరుణులు కూన
లబువుళ్ళవోయిన యంగమ్ముపార
లందఱు నామదేవా నీతమగుచు
క్రందైనసుధఁ గ్రోలఁ గాపికొనంగ
ప్రారంభమయ్యె కీర్తన, పాండురంగ
దేరాళముగనాడె నెదుటనేనిలచి—
ప్రతిపదంబునయందు బరపళ్ళుద్రాక్ష
ప్రతిలేనిభక్తి, సుపర్వులగ్గింప
తలఁపు తామరనుండి చిలికినతేనె
లలరభావములు, దేవాంగనల్గరఁగ
నామదేవునినోట నర్తించెవాణి
పావిత్ర్యనిధికిఁ గైవసమైన యట్లు

ఆ పద కవితలయందములూన్చి——
యాపసోవములాడి రచ్చరల్ దివిని——
నగువారు, తూగువారగుననువారు
నెగిరెడువారు, బిట్టుగ నేడ్చువారు,
కరతాళములు దట్టి కరగెడువారు——
ధరఁబడి పొర్లువారరుసంబుపట్టి
భరమయి, కడిదిగా నఱచెడువారు;
కరడులై పులకలు కాయంబులందు;
ఓరామ! యో కృష్ణ! యో ప్రావృషేణ్య
ధారాధరాకార! మేరుగంభీర!
యని పలవించువారైరి జనమ్ము
వెనుకొని కీర్తనల్ వేదురెత్తింప;
పడమటికొండపై వ్రాలె సూర్యుండు
పుడమిపై నెల్లఁ గెంపులుపాఱఁజల్లి;
యప్పు డర్చకులు సంధ్యాకాలపూజ
నప్పశుపతికిసేయంగ నేతెంచి——
ఆలయంబెల్ల మర్త్యమయంబు, కీర్త
నాలాపమయమౌచు, నందఱినడుమ
చుక్కలలోన నబ్జునిఁబోలి, శాంత
దృక్కుల భువిఁ బవిత్రీకరించుచును——
చేతఁ దంబుఱఁబట్టి చిఱుతల మ్రోత
లూతలై పదముల, కొక్కొక్కమాట
యచ్చు కట్టిన పరమానందమట్టు
లచ్చంపుసుధవోలె నాత్మలఁ దనుప
నవరసములు జగన్నాథు సంసేవ
జ పరమ్మగాఁ దీర్చసమయమ్ముగలిగె
నిది జాఱవిడిచిన నెటులంచు, దామ
పదమదంబుగ దూకుచాయగా నదుక

సంకీర్తనముసేయు సాత్త్వికభక్తి
సంకేత, మాశ్రితు సర్వస్వమైన
నామదేవుని, వెన్క జ్ఞానమార్గమ్ము
భూమికి వచ్చిన, పొలుపున నడరు
జ్ఞానదేవుని జూచి కక్కసింపుచును
మానసమీర్ష్యా సమావిష్టమగుచు
కన్నుంగవలు మేడికాయలై పొంగఁ
గ్రన్నన దర్పించి, గద్దించిరిట్లు
"చాలులెండోయి! మీ చవటపదాలు
వేలుపుగాణలు విచ్చేసినారు
కొఱమాలు రాగముల్, కూతలు, వెఱ్రి
కరము త్రిప్పుడులును, కన్నులార్పుటలు
సొళగింపులు, మూతిచాపులు, పిచ్చి
తాళమ్ము, లీప్రజాతతి బేలుపుచ్చు
టలు, రిత్తరిత్త కేకలతోనె ముక్తి
గలిగెడు నష్టైన కైలాసమందు
సూదిమోపెడు నంతచోటైన దొరకు
నా! దినమును ముక్తులౌ వారితోడ!
నా పండరిని నేర్చినట్టి విద్దెలనుఁ
జూపించి, యిచ్చటఁ జొక్కింపబత్తి
వలదగట్టినయట్లు బయలుసేసినను
మొఱటులై వీరు నమ్మరయేని! మేము
నెఱినప్పి, మెచ్చంగనేర్తుమే! యిచట
పరికరింపనియట్టిపన్నలే! చొప్పు
దప్పిన దేశఛందమ్ములు శర్వుఁ
డొప్పునా! యజ్ఞమయుండు శంకరుఁడు,
మడిగట్టినాము మా మార్గమ్ము విడచి
యెడయుండు, మైలయు మడుగుబోవదలి

భజనపేరిటి వెఱ్ఱిపాటల భక్తి
రుజలకిచ్చోటఁజేరునె గౌరవమ్ము
లనినను; పాండురంగాధీనమైన
మనసుతో - లోకమ్ము మఱచినయట్టి
నామదేవుండు తన్నామసంకీర్త
నామత్తులైన జనమ్ములుగదల
కుండిన; విప్రులు కొఱకొఱలాడి
రండాసుతులు! భక్తి రసికులువోలె
పిలివిలి నాట్యముల్ సేయుచున్నారు
తలముగా, దిప్పుడుద్ధతి యూరిప్రజలు
వారిపాటలకుబ్బి - చేరినారిందు
దారుననెదురింప దక్షిణల్ తగ్గు
నని గొణుగుచు, సామమునన - కార్యమ్ము
పనుపడ సాధింపవలెనంచు నెంచి
యో నామదేవుండ! యో జ్ఞానదేవ!
వీనుల విందయ్యెలే! నాగనాధు
నకును మీ పాటలు; వికసిల్ల వక్త్ర
మెక తొట్టనానంద, మిదె భాగ్యమనుచు
వెన్నెల కన్నులు విశ్వేశ్వరుండు
క్రన్నన మీపై పె గాంచుచున్నాడు
మీ నాట్యములకును - మీ పాటలకును-
నానలు బోఁద్రోసి, మేనులు మఱచి
మీవెంటఁ బడినట్టి మావారి ననక
తీవరమ్ముగ మిమ్ము దిట్టుట మేలో!
కానిందు మీ భాగ్య కాలమ్ము, గాని-
యానిన ప్రేమ సంధ్యాకాలపూజ
సేయించు కోర్కెతోఁ జేరెడు భక్తు
లీయిఱు కటమున నిడుముడిఁ బడుదు

లాపిఁటిందికిఁబోయి! యాడుఁడు, పాఁడు
డాపి నాకికిఁ బాటలభిమతంబేని
యామొగంబగునంచు "నక్కసంపడుచు
నామదేవునకును నడవఁ జూపింప;
నటులకాకంచు బ్రాహ్మణులకు మ్రొక్కి
యటనుండి గదలి; భక్త్యావేశి, యాల
యంపుపశ్చాద్భాగ మందునఁజేరి
యింపులేతరువులై యిగిరించినట్లు
శ్రుతితోడఁజేర్చి ప్రస్ఫుటముగా తాళ
గతులు, మద్దెలమ్రోత, లతులితంబులుగ
నజ్జలు మీరంగ, నంఘ్రియుగ్మముల
నజ్జగా - గజ్జియల్, హవణిల్లి పలుక
పరిరంభణము సేయుపవిది, శబ్దమ్ము
లణుదార, మటపెత్తి, హరిఁగూర్చి పాడ
నా పాటలకు సొక్కి యమ్మొగంబగుచు
పాపాపనోదుండు; భవుఁడు సంతోష
పులకితుండై; వురే! వురె యంచుఁ బొగడి
తలనూపఁ దొడఁగిన తారుమ్మలించి
యొప్పరికించిన నప్పాఱులకును
తెప్పున విన్పించె నిప్పల్కులపుడు
కులహీనులార! పిచ్ఛిల మదులార!
మలయుక్త మతులార! మత్స్వరూపులకు
నెగ్గొనరించిన నేటికీపూజ!!
పిగ్గొల్ల బాటునఁ జేయుశేగాక
కాలుసేతులు గల్గి లీలఁబారాడు
ఫాలాక్షులే హరిభక్తులటంచుఁ
జదివి యెఱుంగరో! సజ్జనులలుక
మదివెట్టరో! కండ్లమాంద్యమ్ము గ్రమ్మె

నో! జాతియన్నది యొడలికిలంకె
యో! జడమతులార! యుల్లంపుగుణము!!
జనన మైశ్వర్యంబు, ధనమును, విద్య
యనునవహంకారమునకు సాలములు
హరి, యకించిన కృతాదరుఁడు, సర్వేశు
దరిసింప నర్హులో! దార, ట్టివారు!
కడిదిమచ్చరులార! కానరో! కాఁక
యెడఁదశుద్ధముగాక, బుడిబుడిపూజ
లొనరింప-తిలమాత్ర మున్నదే గుణము!
కనుఁగవవిప్పి చక్కనఁజూడుఁ డతఁడు
నరమాత్రుఁడేయౌనొ! నామదేవుండు
ధరణికిఁ దిగిన యుద్ధవురూపు వాఁడు;
జ్ఞానదేవుండు; నిక్కంబుగా విష్ణు
వీనేల తపమునఁ దాను జన్మించె
పొండు! ప్రల్లదులార! భూసురవ్యాజ
భండులారా! వారి పాదముల్గడిగి
జలమాని - ప్రార్థించి శాంతులఁజేసి
తొలువుండు, మీయఘంబులు; పోవకున్న
మిమ్ము మీసుతులను మీ బందుగులను
చిమ్ముటగ్గికి బూది సేయించుననిన
వడవడ వడకుచు, తడియారినోట,
కడుఁ జీకటులు గ్రమ్మ కన్నులయందుఁ-
బదరంగగుండె, లెంపలు వేసికొనుచు
పదఁడు పదండని పఱుఁగులు వెట్టి
యా నామదేవుని యంఘ్రులు దాకి
జ్ఞానదేవుని పాదకమలమ్ములంటి
యో నామదేవ! భక్త్యున్నతభావ!

పశువులమైతిమి, భ్రమసి పల్కితిమి
పశుపతి కోపంబు ప్రళయాగ్ని పోల్కి
మమ్ము ముట్టిన, దింక, మమ్ముద్ధరించి
నెమ్మిఁ జూడకయున్న నిల్వ లేమన్న
వారికి వందించి, పార్వతీ విభు, న
వారిగాఁ బ్రార్థించి బ్రహ్మకులంబు
నిలిపిరి భక్తులు; నింగిపైనుండి
జలజలమని రాలె తెలిపూలవాన;
ఆనాటినుండి భక్తావనపరుఁడు
గాన వినోదుండు - కాలకంధరుఁడు
నాగభూషణుఁడైన - నాగనాథుండు
తీగె సాఁగఁగ నామదేవుల కీర్తి
యరయఁ బశ్చిమ ముఖుండై నిల్చి భక్త
వరులకంకిలి మాల్చి మెఱయుచున్నాఁడు
మఱికొన్ని దినము లా తరుణేందుధరుని
సరస సంకీర్తనా చారంబు సలిపి
యతుల పశ్చాత్తప్త మతులైన విప్ర
తతులకు జ్ఞాననేత్రమ్ములు దెఱచి;
ఆయూరనున్న భక్త్యార్ద్రుల - కడలు
బాయంగ సంసార పారమ్ము జేర్చు
మహిత భాగవతధర్మమ్ము బోధించి
యహితసంశయమున హతులైనవారి
నిశితతర్కమ్మున వశులుగాఁజేసి
సపిదప్పునెడ, సిద్ధశక్తులు సూపి
నాగనాథునిపాద నలినమ్ములంటి
యాగుబ్బుగొనుభక్తి, నానతికడసి
పండరిపురికినై పయనంబుగట్టఁ
బాండురంగనిఁజూడఁ బదయుదుననుచు

నామదేవునిమేను, నందనారామ
మామని సొగసు, సాంద్రానందవశత;
నటు చూచునాస్వామి - యిటు పల్కఁదేను
పొటమరింపఁగ వేడ్కఁ - బూన్చుకౌగిటను
రంగఁడు; నేను వస్త్రంబు ద్రిప్పినను
పొంగెనో పొలయల్కఁ 'పోలదటంచు
నాకపోలముదాకి - నన్నేలయించు
నాకద్దులోకమే వైకుంఠమగును,''
తరుగనియట్టి చింతాతంతువులను
పరవశమై మేను పరుగిడుచున్న
నామదేవునిఁజూచి - జ్ఞానదేవుండు
యేమోయి! పట్టితివింటితెర్వుఁను
జింకవైతివి మేము, జీర్ణవృద్ధులము
సంకటమౌను, నీ సరిగాఁగ నడవ
తొందర లేదులే! తోయజనాభుఁ
డందయుండును నీకునై యాత్రసాచి
మెల్లనఁజనుమని మేలంబులాడు
మల్లెలుపూయ కమ్మని మోవిపైని,
నామదేవుఁడు పాడు నలినాక్షుగుఱిచి
సామోదితములతో సరియైన కవిత;
లెందెట్టులుండిన క్రందుగాఁదేనె
జిందుకవిత వాని జీవనంబయ్యె
నా కవితాశాఖికామని, ప్రేమ
పాకపరాకాష్ఠ పాండురంగండు;
తెరువులఁ దగిలెడు పురులందు దివ్య
హరినామకీర్తన, లరవిరుల్ చల్లి
యచ్చటచ్చటనున్న యనఘుల - సాత్వి
కచ్ఛవులను భక్తగణములఁ జూచి

నడువంగ నడువంగఁ బొడకట్టెనెదుట
పడికట్టు - ముక్తికి, పండరీపురము
పండరీపురములో - భాసిల్లు భక్త
మండలీప్రాణమ్ము మహితగోపురము
పండరీపురమన్న - భక్తులకెల్ల
గండరించిన యట్టి - కైవల్యపదము;
ఘనులు మహర్షులు - కండేర్చికూర్చి
పనివడనిల్పిన - భవ్యతపమ్ము—
సనకాదిమునుల వాంఛాభూమి; నార
దునిమహతికి, గొంతుతనివోవుచోటు
సౌఖశాయనికులౌ సప్తర్షివరుల
వైఖరీవాక్సార - వర్ధితనగము
వాసుదేవుండనువారమ్ము - భక్తి
భాసురులకు వెంట - బడివచ్చుచోటు
పండరీపురము గన్పడినంత - మేన
బొందు మల్లెలుపూచి, పొలపంబు మెఱయు
కనులలో నానంద కమలముల్ విరిసి
తన ప్రాణనాథునిదరికి నేతెంచు
వనిత చిత్తములోని, వగలునకంటె
నినుమడిగానయ్యె నెనసినవగలు
వామదేవునకు; నెన్నఁగదరమౌనె!
కామవికార సంకలితచిత్తులకు
జీవేశ్వరులకున్న పావనప్రేమ—
లేవితంబుల నెప్పు డిగిరించుననుచు;
కరములు ముకుళించి - గండముల్ పూచి—
ధరణిపైఁబడి - పరాత్పర! నమోవాక
మని సారెసారె సాష్టాంగమ్ముసేసె—
ననిచినప్రేమల నామదేవుండు.

తాన, శ్రీపండరీధాముఁడై నట్టి
జ్ఞానైక వనధికి - జ్ఞానదేవునకు
తనకన్న వేఱుగా వనజాక్షుఁదలఁప
బనియేమి! లోకశిక్షణకుఁగా; నేమ
మును; నడపుటెగాక మొనపియాతండు
తనువు భూమినిసోక దండమ్ము వెట్టె—
నిప్పుడు గాదప్పు డిందిరానాథు
తెప్పలుగా హర్షముప్పతిలంగ
దరిసింపవలెనని - తారుణ్యదర్ప
భరితబంభరమల్ల సరసఝంకార
సారంగరాగమై, సారసారావ
పూరితంబై, సారసౌరభాసార
సారసవిసర కింజల్క కర్దమిత
వారియౌవర చంద్రభాగలో నాడి
హరికీర్తనము సేయుచాత్మఁ జొక్కుచును
పొరిగోపురద్వారమునకు వందించి,
బలిపీఠమున కర్థిఁ దలవంచి - నీల
జలదమ్ము కాలుసేతులు దాల్చినట్లు
కొమరారు ప్రాబల్క కొనల క్రొత్తావి
గమగమల్ నించు చిక్కని యూర్పులగుచు
అదె వచ్చు, నిదెవచ్చు ననుచు తన్గూర్చి
యెదురుతెన్నులు సూచు నిందిరారమణు
గని, మూర్ఛవచ్చిన కరణిపై వ్రాల;
కనులలో నీరముల్ గార్చుచుఁ బాడు
రంగఁడు; కౌగిట వ్రాలిన వాని
ముంగురుల్ నిమిరి, క్రమ్ము కదుష్ణ బాష్ప
ములు మీటి, కండ్లకన్నులుసేర్చి చూచి
పలుమారు, ఁగౌగిలింతలఁ గరఁగించి

యెన్నండు ననువీడి యెఱుఁగని వాఁడ!
విన్నాళ్ళు లెట్లు వేగించితివోయి!
నీవు లేనిచో నాకు నిలుకడలేని
భావమై - కన్నులఁ బట్టదు నిదుర
జ్ఞానదేవుల మైత్రి సామాన్యమైన
దా! నీదుభాగ ధేయంబు ఫలంబు!"
ననుడును - "స్వామి! నీ యానతి యంచు
పని వినుచేగాని - పవలును రేయి
నీ రూపమే కండ్ల నిలిచిన దోయి!
నీ రూపమయ్యెను నిఖిలంబు జగతి-
నీ విరహపుఁ జిచ్చు నిలుపున గాల్చ
ప్రోవులై - వాగులై పొంగి వచ్చినవి.
పదకవితలు, భవద్భక్తి సౌరభము
వెదజల్లు మొల్లలు, విశ్వేశ! - కాని
యమృతమ్ము గుడిగట్టినట్లున్న - దుఃఖ
శమమైన నీదు నర్చాస్వరూపమ్ము
కనుల ముందుటలేక - కలఁగుటలేమి
యని యందు! క్షణమొక్క యగ్నికుండమ్ము"
బుడతయై నామదేవుఁడు బమ్మరించె
నిడువాలు గన్నుల నీరమ్ము నించి;
నామదేవుని, భక్తి సీమంతినీని
కామకాంక్షలు కర్వుగట్టిన రూపు
నామదేవుని, దివ్యనాదాఽవతారు
నామదేవుని, ముక్తి నగరిపీక్షించె
మొలక నవ్వు ముత్తెములతోడఁగాఁ
పలుతెఱ మురిపింపఁ బలికె విష్ణుండ
నామదేవా! గ్రొత్తవా! మనకున్న
ప్రేమబంధమ్ములు, విశ్వ విశ్రుతమ

వెఱఁబాటు లందున్న కడిది ప్రేమమ్ము
లోడగూడియుండిన నుండవుసుమ్ము;
భక్తితాల్యమునాకు బహుళమ్ముగాన
భక్తి, విరహభావవర్ధితం బగుట,
భ్రమర గీతమ్ములు, రసపరాయణము
లమృతవేణి కలంచు నన్నావా! కావా!
పరమభక్తులకెట్లు భరమొ, మాధవుని
విరహంబు, భక్త విరహంబునట్ల
భగవంతునకు, నిన్నుఁబట్టిన మనసు
మగతఁజిక్కిన, నొక్కమాఱైన నాడి
యెఱుఁగ రుక్మిణితోడ, వెరవరిపలుకొ!
సరసనేయుండె, విచారింపవోయి! —
యనని జ్ఞానదేవుల నభివీక్షసేసి
తనుపారనవ్వె, చిద్ఘనుఁడైనమూర్తి
నామదేవుఁడు భక్తితో మౌళివంచె
నా మధుసూదను నర్ధాంగి, రుక్మి
ణీదేవి, కామాత బోధింపదేని
శ్రీధరునకుఁగల్గునే దయాస్ఫూర్తి!
హరివల్కె 'నామదేవా! పోయిరమ్ము!
సరసవతంసమ్ము జ్ఞానదేవులకు
దీప్పమాతిధ్యమ్ము, తెలవకు నెగులు
దేర్పుము; సుతుని ముద్దిడికొమ్ము; తల్లి
నీపైనె ప్రాణముల్ నిలిపికొన్నదియు
నాపెకునితముగా నాడుముపలుకు;
ధరణి ప్రేమములు, రిత్తకు రిత్తగావు.
జరగు బ్రహ్మానంద సబ్రహ్మచారు
లవిలౌల్యములుగాని యంతకు; జీవి
కవి మహాసంస్కార మావహించెడును

పోయిరమ్మంచు; విప్పుగల వక్షమున
తోయజనాభుఁ డొత్తుగ నొత్తికొనుచు
గళసీమనున్నట్టి తులసికాదామ
మలరుచు నవ్వాని గళమున వేయ
శ్రీ రుక్మిణీదేవి; చిఱునవ్వు లొలయ
వారిజాక్షినిలీలఁ బరికింపుచుండె;
వారువోయినతోన - వారిజాంబకుఁడు
ధీరమంధరముగాదారతో ననియె
"చెలువ! తీర్థమ్ములు సేవించివచ్చె
నలువుగా మనవాఁడు నామదేవుండు
దానికుద్యాపన దర్పకయున్న
వానియావ్రతము సత్ఫలవంతమగునె!
వాఁడు నిస్స్వుఁడు; వాఁడు బట్టినదేవుఁ
డాడకాడకుఁగల్గు యాదవాన్వయుఁడు
మాకింక తెరువేది; మనికి తం బలమె;
మాకన్న" నద్దిరా! మాయలవాఁడ!
కల్పకల్పమ్ములు; కాపురించినను
నల్పేదు మాపైనె జాజఱ, లింక
పెఱవారివిడుతువే! విడిముడిలేని
దొరకయివట్టిన తెఱవలౌమాకు
మాత్రమెక్కడ వచ్చు - మణులు - ధర్మములు
సాత్రాజితులవేడ సమకూరునేమొ"
యని కావికన్నుల నలమంగనగవు
వనజనాభుని పదద్వయమంటి; స్వామి!
వింతలాడెదవు - నీవితములు; జ్ఞాన
వంతులనైనను; భ్రమియింపఁజేయు
సురరాజ్యరమ భవచ్చరణంపుధూళి;
సురరాజు నీయింటి పరిచారకుండు

గొడుగు వట్టెడువాఁడు గుహ్యకేశ్వరుఁడు
మృడుఁడు నీమొగసాలఁబడినచారణుఁడు
నీవునిస్స్వుఁడవౌట నిక్కమేయైన
భావింపనిక భాగ్యవంతులెవ్వారు
మాగువాలనియోగ మాయావృతుండ
వై ; గణుతింపంగ నఖిలభూతముల
యంతరాత్మల నిల్చి - యఖిలభోగముల
సంతరానుభవంబు సలిపెడుదాన
నీవు నిస్స్వుండవు; నీవయాఢ్యుఁడవు
నీవుగానిదియేమి? నిఖిలశక్తుఁడవు!
కానిమ్ము! నీ కిచ్చగలుగుట యేమి!
పూనిక యది దప్పిపోవుట యేమి?"
యనుడును, కన్నుల నల్లార్చి నగవు
మొనసినవాతెఱ ముత్తెముల్ పూచి
పండరీశ్వరుఁడనె 'పడఁతి! యాయుద్ధ
వుండెగా - నామదేవుండౌచు వాడమె
వానిమహత్వంబు వనజాసనాదు
లేనైననెఱుఁగ; నింకేటికివాదు
గగనంబు కడపల గగనమెఱుంగ
దగణితమ్మాత్మ మాయాశక్తినేన
యెఱుఁగను; భక్తిలో నెంతటిబలమొ
యెఱుఁగఁడు భక్తుఁడింకొరులెఱుఁగుదురె!
నిరపేక్షుఁడై - నిత్యనిర్మలుండగుచు
పరమశాంతుండు - నిర్వైరుండునగుచు
సమదర్శనుండునై, సతతంబునన్న
తమిమీఱ, నెదలోనఁదాల్చి జీవించు
వానియంఘ్రుల ధూళిబడునన్నయాస
వానిసేవలొనర్చి, బ్రదికెడునాస

యనుసరింతునువాని! నన్వహంబు విద!
కనుగూర్కులేక, నా మనసున వేఱు
తలఁపులులేక, శ్రీ ధామమై కుంత
మలవాని కలుపుల కల్పంబుసాటి,
పరమభక్తులకన్న పండరీశునకుఁ
బరికింప ప్రియమైన వస్తువులేదు”
నామదేవుండింతలో మఱివచ్చె
స్వామి చెంతకు, భక్తి భరనిత్యశిశువు
వానివీక్షించి నీవ్రతము ముగించి
పూని యుద్యాపనమ్మునుఁజేయవలదె
ధనములు కొఱయైనఁ దమకున్నకొలఁది
నొనరింపఁదగుఁగాక నొల్లఁటో ధర్మ
మనుటుచితంబె! నీకంత లేవడియె!
కనుకని నీమూపుగాచెడు తల్లి!
తమ్మిబిడారంపు కొమ్మగాదోయి!
లెమ్ము! పండరిలోన; లీలార్థమూర్వి
దిరుగువేదమ్ములు; తరుగనినిష్ఠ
వెఱఁగుగానగ్నులు వ్రేల్చెడువారు
నాఱుశాస్త్రమ్ముల నాకళించిన, గ
భీరబుద్ధులు; సోమపీథులు, వాజ
పేయం బొనర్చిన విశ్రుతశ్లోకు;
లాయతి బ్రహ్మల నడకించువారు
పరమకర్కశతపోభర జీర్ణ దేహు
లరుదారు మంత్రమయాత్ములు; కడిమి
బహుపురశ్చరణ తత్పరులు; స్వధర్మ
నిహితబుద్ధులు; ధరణీసురుల్ గలరు
వారి నాహ్వానించి - బహుభోజనముల
భూరిదక్షిణలఁ దృప్తులఁజేసి; కాక

వ్రతము సఫలమాయె! భక్తుండవోయి!
యితకరిగాఁ దక్క నేలినవంటు
పరమభక్తులకును పాండురంగండు
పొరమాటలేటికి? పోదము, నేవత్తు
నీవెంట విప్రుండనై - వేదరాసు
లావిప్రవరుల నాహ్వానించుకొఱకు"
నని పూని పలికి; లీలావతారుండు
క్షణములోఁదానొక్క జగతీసురుండు
గానయి; నుదుటిపైఁ గమ్మనితావు
లీను త్రిపుండ్రముల్, వీనులఁగుండ
లమ్ములు; నిడుపుజందెమ్ములు; చంద
నమ్ము వక్షముననం సమ్ములయందు,
గళమునఁ దులసి మాలలు, వానితోడ
నలముతావుల సోగలైన గొజ్జగుల
దామముల్, చకచకద్ధవళ చంద్రికల
చేమించు నైదుకచ్చెలకట్టు హౌసు
యొసపరిజరియిడ్డ యుత్తరీయంపు
పసలు, పెన్నెఱిగుంపు నెఁసగెడు కచ్చు—
కరమునఁ బూవుల సురటి యొప్పార
నిరుకళంబుగ నవ్వ - నెఱిముందు నిలిచి
పొందయ్యె వేసమ్ము పోదమేయన్న
కందమ్ములానంద తుందిలమ్ములుగఁ
బొడగని నామదేవుం 'డాన' - యన్న
పడఁబారి వచ్చెను భక్తచయమ్ము
భవునంశభవుఁడు నివృత్తి దేవుండు
తపులలాటాక్షమ్ము దాఁచినవాఁడు;
వనజాసనుండు సోపాన దేవుండు
తనుపునొక్క మొగంబు దాల్చినవాఁడు

యోగ మాయాంశతో సుర్వరఁదిరుగు
త్యాగైకవనధి ముక్తాబాయి, చాంగ
దేవుండు, యోగసం దీపిత బుద్ధి
భావుకుండా స్పర్శ భాగవతుండు
హరికేశవాద్వైతి నరహరిభక్తుఁ
డరిదిమానిసియైన యాకూర్మదాసు
కుమ్మరి బగుతుండు "గోరా" - మనస్వి
క్రమ్మిన యర్మిలి రాకాభిదుండు
పరమవిశ్వాసమ్ము, నరసింహ మేధ
మెఱయు భక్తుఁడు చొకామేళ పంచముఁడు
అంబుజోదరుని ప్రేయసి జనాబాయి
నంబి, జగన్మిత్రనాగ నాథుండు
లలిత ప్రసూన మాలా సేవతోన
జలజాక్షు నేలిన సావంతమాలి
మఱియుఁ దక్కిన భక్తు, లరిది శ్రీధరుఁడు
సరగున విప్ర వేషము గట్టెననుచుఁ,
జేరిన తనవారిఁ జెంతకుఁ బిలిచి
వారివారికిఁదగు భంగి లాలించి
తాను భూమీసురుండైన కారణము
ప్రాణప్రియులు వారి, కాహరి దెల్పె
అపుడు నివృత్తిదేవాదులో పెద్ద
అపరాజితుని వెంట - నవరంజి పడగ
లను బూనినడువంగ - నసుఁగులౌ భక్త
లను సరింపఁగ కీర్తనానందవశులు
నామదేవుఁడునట్ట నడుమ; శ్రీధామ
నామామృతము బంచ; నలుగడలందు
సాఁగె నాయుత్సవం, బాగతదేవ
తాగణ వ్యాకులి తాంబరం బగుచు

పాఱుఁడై నడచెడు పాండురంగండు
వారిక, ప్రతి గృహపతిఁజేరఁబోయి
తలవంచి - భక్తి సంకలితుఁడై యెల్లి
ఫలితావతారుండు పండరీశ్వరుని
సన్నిధిలో నుండు సంతర్పణమ్ము
మన్నించి మమ్ము - భామా పుత్ర మిత్ర
సహితంబుగా వచ్చి సన్నిధిసేసి
బహుమతి సేయంగవలె నంచుఁ బలుకు;
"కారణమే"మన్న; "గాదిలి తనకు
నారాయణు నిలెంక నామదేవుండు
తీర్థయాత్రలుసేసి తిరిగి వచ్చుటను
సార్థకమ్ముగ వ్రతా చరణముద్యాప
నము సేయనెంచితి; మమరులు మీరు
మము గృతార్థులసేసి మమపుడం"చనును
ప్రథితాను భావుండు పండరీశ్వరుఁడు
క్రతురూపులగు విప్రగణము వీక్షించి
తనపేరనంతుండు - తాను విప్రుండ
ననె; జాతి ధర్మ వేలాఽతీత వృత్తి;
యీరీతి విప్రుల నెల్లరఁ బిలిచి
వారిజాక్షుఁడు - భక్తవంశ వర్ధనుఁడు
కోవెలఁజేరి, యా కొంటిరి మీర
లావసథములకు నటుగుండటంచు
నె  చ్చ, నవ్వుచుఁజెలువకు విప్ర
కులములతోనన్న, పలుకులు చెప్పె;
నామదేవుని యింట నామసంకీర్త
నామోదములు గుప్పుమనె నాటిరేయి;
తెలతెలవాఱె దిక్కులఁ దెల్విసేరె
పులుగులు, నుడితేనియల విందు సేసె;

ముత్తెఱంగులఁగూసె మత్తకుక్కుటము
రెత్తిన మెడలతో నీండ్లపైనుండి;
మఱియ మారుతములు మానినీ గండ
తలములు చుంబించె దాక్షిణ్యవృత్తి;
తురుముల నున్న ప్రావిరులఁజ్జగించి
కరదర్పణములలో కాలివాతెఱల
మొలకచందోయి కెంపులఁ జూచికొనుచు
కులుకులుపోయిరి; క్రొత్త కోడండ్రు;
విరిసిన నెత్తమ్మి, తెఱవల చుట్టు
తిరిగి, యళుల్వింత మొఱపులు సూపె;
పరమ రసికుఁడైన పండరీశ్వరుఁడు
తఱుగనితమి భోజతనయ నాకట్టి
కురులొత్తిగించుచుఁ, గొనరి చుంబించి
విరవాది పూసెజ్జ విడలేక విడిచె;
లోకబాంధవుఁడు త్రిలోకనేత్రంబు
కోకముత్సంధాయి, గొజ్జగుల్ జల్లె
గగనమాణిక్యమ్ము; నిగమభూరుహము
జగదగదంకార చరణప్రచారి;
నామదేవాదులు, నారాయణునకుఁ
బ్రేమంపుఁ జుట్టముల్ వీనులవిందు
సేయురాగములతో, చెలువుఁదాళముల,
తో, యతులదుక చేతోహారులగుచు
పదకవిత్వమ్ములు పాడుచున్నారు
పదనెక్కుగోపురద్వారమ్మునందు;
నింతలో నర్చకు లెలమినేతెంచి
యంతర్ముఖులు భక్తులందఱకెఱిఁగి
తలుపులు దెఱచిన, మొలకనవ్వులను
జిలుకుచూపులఁ గటాక్షించె శ్రీధరుఁడు;

తలయంటె నామదేవులకు; జవ్వాది
గలిపిన నూనెతోఁగలికి రుక్మిణియు;
సత్యభామాదేవి జలములువోసె
నత్యున్నతము తపంబగునిదియనుచు;
నారతుల్వట్టి రబ్జాస్యలు దక్కు-
వార, లాపండరీశ్వరుఁగూర్మిసతులు;
పురుషోత్తముఁడు స్వయమ్ముగ వస్త్రమాల్య
పరికరములనిచ్చె - భక్తశేఖరున
కీ నామదేవున కెవ్వరీడంచు
మౌనులు, సురలు, వేమారుఁ గీర్తింప;
పాండురంగని పాదభజనలో భక్త
మండలియుండంగ మధ్యాహ్నమయ్యె!
వచ్చిరివిప్రులు వందలు వేలు
మచ్చిక భుజియింప మాకబ్బు, నాల్కు-
త్రుప్పుడుల్లెడునంచు; దోరలై యాన
విప్పుగిల్గినపొట్టి లప్పళించుచును;
ఆలోన బ్రాహ్మణుండై యున్న చక్రి
పాలమ్మువంచి తత్పాదముల్మట్టి
జలములఁగడిగి; యిమ్ములఁ దడియొత్తి
తెలిచి, బంతులుగాఁగఁ దీర్పించి, రుక్మి
ణీదేవి వీక్షింప - నిడుదఁగన్నులను
బ్రోదిగా నవ్వులు - పువుబోడి ముత్తె
ములముగ్గుదీర్చిన నెలవులయందు
తలిమముల్ మోచాచ్ఛదములు వేయించి
యిఁకరండు వడ్డన కింతులటన్న
వికచాంబురుహనేత్రవీక్షణతోన
నచ్చరలెల్లరు, నాపాల కడలి
వచ్చిన బాంధవ్య బంధంబు గుటిచి

పోలె, నాక్షణమున-నాలోక జాల
జాల కమ్ముల విప్రచయము దూలించి
పెఱయు మధ్యమలోక లలనల కరణి
చెలువ నవ్వులతోడ సాక్షాత్కరించి
జలజవాపిని తలంపులతోన, తెట్టు
వలుగాగ బెరిగిన బహుపదార్థములు
వడ్డింపఁదొడఁగిరి, వాసితోరస్థ
లోడ్డీన మృదుగతులొయ్యారములుగ,
పుడఁగుఁడాపుం యన్నములు నూఱుగాయ,
లనువైన పచ్చళు, లంబళుల్-చారు
పులుసులు-గమగమల్ వలచు క్రొన్నేయి
బలపి వంకలు గట్ట ప్రతివారి ముందు
నరిసెలు, గారెలు, నవుగులు, లడ్లు
కరిజికాయలు, దొడ్డ ఖండమండెగలు
కుడుములు, పూర్ణపు కుడుము, అద్దెనలు
సుడిగొను నప్పాలు, పొడి బెల్లమందు
బొరటిన యవుగులు పరమాన్నములును
పరిపరి విధముల భక్ష్యసంతతులు
నొడికఁపుఁగూరలు, నొఱపు పప్పులును
గడు మధురమ్ము చొక్కమ్మైన పెరుగు
వారి కటాక్షముల్-వారివ యమృత
ధారలు మందహాస-దంతుర మంద
హాసముల్, వల్గునృత్యత్కుచా భోగ
మాసర దర్పముల్-మాంసల జఘన
మండల జల్పాక-మణిమేఖలా ప్ర
చండ విభ్రమములు,-సాభోగ కటివి
తర్దికల్ గనుచు, చి, త్తజ శరాసార
మర్దిత హృదయులై- మఱచి, - నేత్రమ్ము

లాపోవఁ ద్రావుచు-నా కంఠ పూర్తి
సాపడ విప్రులు-సారెసారెకును
వనజదళాక్షుండు-ప్రతివారిఁజేరి
"మనమున కించిన-మధుర భోజ్యములు
పరితృప్తిగాఁదిని,-కరుణింప వలయు
శరణంటిమని యుప-చారముల్వాలకు
నాపరాత్పరునకు-నాజ్ఞానమూర్తి
కపాటులకు నెక్కడెక్కడి సాటి!
లోక శిక్షార్థమై - యాకమలాక్షుఁ
డీకైవడుల నటి - యించుచేగాక;
భూసురులుత్తరా - పోశనం బంది
యాసనంబులువిడ, నంఘ్రులు గడిగి
తజ్జలమ్ములు శిరస్థలమునఁజల్లె
పజ్జల నిలుచున్న - భక్తులందఱకు
హరి, పురుషోత్తముండా సలిలములు
శిరమునఁదాల్చె - నుబ్బరవోవసురలు;
చందనమును పూలు సరస తాంబూల
మందర కొసఁగి మంత్రాక్షతలిచ్చి
నామదేవాదులతో ముందు నిలిచి
యామధు సూదనుండౌ దలవంచి
వారు దీవించిన 'పరమ భాగ్యమ్ము'
మీరరుదెంచుట - మిక్కిలి వెలిగె
నామదేవుని పుట్టు - వమీ పదద్వ
యామృతసేవచే నంచు నగ్గించి
భూరి దక్షిణలచేఁ బొందించి తృప్తి
వారట విశ్రమింపఁగ, నామదేవ
సోపాన దేవ, వీసోబా, నివర్తు
లాపుణ్యులైన 'గోరాది' కుంభారు

లాచొకామీళాదు లంత్యజుల్ భక్తి
వాచవిగ్రోలిన వనితలైనట్టి
యాజనాబాయి మున్నగువారు, దసుకు
సాజమైనట్టుగా సరసిజనేత్రు
కెలనఁ గూర్చుండిన - శ్రీగండ్ల నగవు
వెలఁది వెన్నెలఁగాయ - వేల్పుటచ్చరలు
వడ్డింప, పరమూర్తి పండరీనాథుఁ
డద్దసాళలుగాఁగ నఖిలలోకములు
రమతోడఁ గ్రిడించు రాసిక్యమూర్తి
ప్రమదముప్పొత్తుగా, భక్తులనోట
నిడుఁదన యెంగిలి, గుడుచు నుచ్ఛిష్ట
మొదగూడెనేఁడు మహోత్సవంబనుచు;
"నామదేవా! భక్తినందనారామ!
నామదేవా! రచనా సార్వభౌమ!
యేది! నీనోటిలో నిడుకొన్న కబళ
మాదరమార నాకం దివ్వవోయి
జ్ఞానదేవా! నీకు నాకును భేద
మేనాడులేదు, యేదీ నీదు కబళ
మారగించెద నధ్వరాగ్నిహుతంబు
పారమికమ్మువ పాద్రవ్యమట్టు
లోయి! నివర్తినాథా! యూరకుంటి
వా! యిదె! కొమ్మోయి! యన్నంబు మేల్మి
పలుకాడవేమి కుంభార! గైకొమ్ము;
పలుదోయఁ గ్రుచ్చిన భక్ష్యంబు - దీని
నన్న చొకా మీళ! మిన్నకున్నావు?
తిన్నదందిమ్ము సంతృప్తిగాఁ గుడుతు
నోసి జనాబాయి! మూసిన ముత్య
మైసిగ్గుతోడుత నట్లుంటివేమె?

కెంపుల పలుగాటు లింపైన పిడుచ
నంపవే! భుజియింతు నాకలిగొంటి''
ననిసారె బలుకుచు - నారగించుచును
మునిపంటఁ గొఱికిన భోజ్యముల్ భక్త
కులముల కిడుచు బెక్కువల నవ్వుచును
జలజాక్షుడుండిన - చాపకూడైన
యావిందుఁజూచి బ్రాహ్మణులు, కట్టెఱ్ఱ
గావించి కన్నులు, కఃకటం పడుచు
మాదిగ యొకఁడు కుమ్మరియొక్క - డొక్క
డేదికులమొ, చెప్పగాదనువాఁడు
పరువెత్తి వచ్చిన పడతి యొకర్తు
పరువు వీడిన, వీరి భక్తులటంచు
వారి యెంగిలిదాను, వారు తనెంగి
లారగించుచుఁ, గులా చారముల్ గూలఁ
ద్రోసినా, రేటి విప్రుఁడు వీఁడు; నిగ్గు
దీపిన యట్టి మాదింగుడుగాక
వీని మాటలు నమ్మి, వేద గంధిలము
లైన మాకులముల నాలి బుచ్చితిమి
చవియైన తిండి యాశలు చూపి, కులము
లవియించి, మాతెల్వి లాలంబుసేసె
వీడు దుర్మార్గుండు వీని గృహంబు
కూడు, వీడిచ్చిన మాడలు, కలుష
ములు, పాప దైవంబు నిలిచి మాపాల
నిలువున గూల్చె సన్నిష్ఠ లన్నియును
పేరనంతుండంచుఁ బెద్దగాఁ బనవి
మేరుమానిసి వోలె మెలమెల్ల డాపి
మాకొంపలను గూల్చె మాయలపుట్ట;
యీ కశ్మలమువోవనేది తెర్వంచు

తమలోనఁ దాము వితర్కించుచున్న
గమలోదరుఁడు వారికై వడి జూచి
తన్మనంబుల నున్న తలఁపులూహించి
చిన్నయుండానంద శిఖర స్థితుండు
విమల భక్తులదైన పెద్దఱికమ్ము
తమిదీరఁ జాటంగఁ దాసుగాఁ బూని
చేసిన తెఱఁగౌట, చిఱునవ్వు పెదవి
కోసలఁ దొలుక విప్రులఁ జేరిపలికె
"దాసుని యెడ నేమి తప్పు దోచినదా?
భూసుర వరులకు, ఫుల్ల పద్మముల
వలెఁగలకలలాడు వదన బింబములు
జిలుగు నవ్వులనేది, చిన్నవోయినవి!
అనుమానమేల మాయందు! లాతులమె
పనుకంగ! మీలోని వారమే కాక!
మనసులో నున్నది మాటతోఁ జెప్పి
మనుపుండుమమ్ము మీ మన్ననల్ గురిపి"
యను హరి వాక్యంబు లాలించి" యాడు
కొననేమి యున్నది? కులమున కెల్ల
గుద్దలి గొంటివి! కద్దొ! విప్రుండు
పద్దుగా శూద్రుల పంక్తి భుజించు
టలు; వారి యెంగిలి కలరుచు గుడుచు
టలు; తన యుచ్ఛిష్టములు వారి కొసఁగు
టలు; చాపకూడయ్యె, తలపంగ నిందు;
తెలవారినంత కుండలు, గొట్టు కొనుచు
బ్రదుకునీ కుమ్మరి పరమ భక్తుండె!
పదరినంతనె వెఱ్ఱి పాటలు - పిగ్గు
దొలఁగి, యాడిన యంత; తొట్రిల్లి కన్ను
లఱమూపి నంతన యయ్యెనా; నామ

దేవుండు - శకునితో దీక్షైన వాడు!
కావరంబున వాఁడు గఱచిన కూటి
నందివ్వ గుడిచితి; వా చొకామీశుఁ
డెందలివాఁడౌగాఁడీ యూరి వాడె!
కడజాతి కొయ్య, వీక్షణమునన్నైన
వడిగఁ దానము సేయవత్తివాఁడద్ది
రా! వాని యెంగిలి? నీ వాయి దెఱచి
పావన మనిదింటి, వీవర్తనములు
పాఱులవే? నీవు బ్రాహ్మణుం డనుచు
నేరిమి మాటాడి - నీ యింట మమ్ము
గుడిపించి, మానిష్ఠ గూల్చితి వేల?
యెడిగట్టి తీయఘంబుడుగక సేయ
నీరీతి జూచిన - నీకులంబేమొ?
యారని యరగలి యైయున్నదోయి!
పలికెదు శాస్త్రార్థ వాపితంబుగను
సలిపెదు సేవలా చార పూతముగ
నిన్నియుండియు - నీకు నియమంబు లేక
యున్నట్టి దాన - నాయున్న వన్నియును
వెలిమిడిలో సేయు వేల్మిగానయ్యె;
కలిమిగలిగినంతఁగావలమూని
యిచ్చవచ్చినయట్లు పచ్చిగాఁదిరుగ
మెచ్చు నా ధర్మంబు! మీదదైవంబు!
వేదానుసరణంబు - విప్రధర్మంబు
కాదందువో! మరి - కల్లలే యౌనొ
ప్రామినుకులుసెప్పు వర్ణధర్మమ్ము
లామేర నడపుట యదిగాదొ తగవు!"
అనుడు నప్పరమేశుడంకించి శిరము
కనులార్చి-, వాఁకిఁగరములు మొగిచి

భాషించె "వో విప్రవరులార! ధర్మ
భూషితులార! మీ బుద్ధులు తప్ప
దలఁతురే! యొక్కొకరలతులే! వేద
ముల నాకళించిన పుణ్యపూరుషులు;
పొల్లసెప్పునె 'వేదపూరుషుం' డర్థ
మ్ముల్లసితమ్ముగా నొనరించుటందు
బుద్ధులు పెడత్రోవఁ బొరలుచేగాక!
సిద్ధంబుగా మీరు సెప్పిన ధర్మ
మదియు ధర్మంబె, కాదన్నదెవ్వారు
మదినెంచిచూడ, సామాన్య విశేష
ధర్మంబులని - రెంట తప్పకపలికె
మర్మజ్ఞుఁడైన యామ్నాయపూరుషుఁడు
సామాన్యధర్మంబు సామాన్యులందుఁ
దామాన్యమౌను శ్రద్ధాగుంఫితమ్ము
మరి విశేషమ్ము ధర్మము విశిష్ట
నరులందుఁజెల్లు; నిబ్బరముగాఁజూడ
వెలయు సంస్కారమ్ము, భేదకధర్మ,
మెలమి వీఁడు విశిష్టుఁడితఁడు సామాన్యుఁ
డని నిర్ణయించుట; కా నిర్ణయమ్ము
వినికియు, జదువును, వృద్ధోపసేవ
నమ్ము, తపోబుద్ధి - నెమ్మది శుద్ధి
నెమ్మి సాత్త్వికవర్తనమ్మునుగలుగు
వలఁతు లొనర్తురు; వలవనిభంగి
పలుకుదు రొరులహంభావరూషితులు—
నామదేవుఁడు భక్తిసీమ, సామాన్యు
గామతినెంచుట కడిదిపాపంబు
కులము దేహమునకుఁ - గులహీనుఁడైన
జలజాక్షు భక్తుండు, కులమునమేటి

యహరహమాత్మనిధ్యాన శ్రుత్యంత
నిహితచిత్తుఁడు - శాంతనీరధి - నామ
దేవుఁడే - హీనుండుగావుటయేని
యీ వసుమతి పూజ్యులింక నెవ్వారు?
వైష్ణవాగ్రణీ; భక్తివాల్లభ్యనుతుఁడు
ముష్ణద్విషయ శిరోమోటనవృత్తి
సహపంక్తికినివాఁడు సరిపోవడేని
యిహమున సరిపోవుటింక నెవ్వాఁడు?
వనజాక్షు భక్తులవాసి మీ కెఱుఁగ
నువౌనె? దెలిపెద నాలకింపుండు
అధమకుర్కుర పలలాశియౌగాక
మధువైరి భక్తుండు, మఱి, భక్తిలేని
విప్రునికన్నను వేయిరెట్లధికుఁ
డప్రియంబైన నియ్యది మౌనిమతము;
పరమభక్తులయందు వాత్సల్యభరము;
పురుషోత్తముని పూజఁబూర్ణమౌరతియు
నొరులొనర్చెడు పూజ నొనరుముచ్చటయు
దరధరుకొఱకునై దంభ, రాహిత్య
మా హరికథలయం దత్యంతరక్తి
శ్రీహరిపేరితో - చెలరేగి మేన
మొలకలై నిలిచిన పులకచయంబు;
వలువుగానిచ్చలు నామజపంబు
కామసంకలితమ్ముగాని సద్భక్తి
యీమాడ్కి నెనిమిది హితపద్ధతులను
నెగడెడుమ్లేచ్ఛుఁడే యగుగాక! వాఁడు
జగతీసురునికంటె సర్వథాఘనుఁడు,
వాఁడు మౌనీంద్రుండు, వాఁడు పండితుఁడు
వాఁడు శ్రీమంతుండు, వాఁడు సన్యాసి

ఉచ్ఛిష్టమును దింటి - నొప్పియేతింటి
నుచ్చనీచములు దామున్న వేయాత్మ!
కళిలంబునందున, నాఢ్యుఁడై నిలిచి
సుఖదుఃఖములకెందు సొగియకయున్న
వాఁడొక్కఁడేగాక - వందలఁగలరొ?
వాఁడ బాధ్యుఁడు ద్వంద్వభావసంప త్తి;
ఆత్మ యుచ్ఛిష్టంబు నాత్మయేఁన్న
దాత్మ విదులు మీరలాశంకయేల
భిన్న భిన్న శరీర వేషమ్ముతోన
భిన్నమౌనేయాత్మ! వెడకొయ్యలార!
సరసులు, నదులును, జలధులు, భిన్న
సరణినుండిన, దాన, జలము భిన్నంబె!
ఊరూర నొక సూర్యుఁడుద్భవించినను
సూరులు పలువురే! సూరులు, మీకుఁ
దెలిసినదేగద! తెలియని భంగి
కులగర్వమునఁజిక్కి కొల్లలాడెదరు
వినయవిద్యాశీల వి త్తముండైన
ఘనవిప్రునందును - కరియందు, గోవు
నందు - కుర్కురమందు - నధమచండాలు
నందు - భేదంబెంచ నట్టిడుల్ పండి
తులు, మీ రలా పండితులరొ? వై తండి
కులొ! నేనవాక్రువ్వ వలయునే చెపుడ!
నేదాన, భేదమ్ము లెంచక సర్వ
సాధువులై యున్న సమదృష్టిపరులు
సమదర్శనముగానఁ జర్చింపనాత్మ
నమరనిచ్చలు, వార, లాత్మ సంస్థితులు
ఈ పుట్టువున యంద, నదృశుల్, నాక
భూపట్టభద్రులు బొమ్మంచుశ్రుతులు

వలుకట తెలియదో! కులహీనుఁడంచు
పులుమేపి నామదేవుని పల్కినట్టి
యవడులు మీరలయ్యాత్మ సంస్థితులొ?
యవగుణుల్ మీరలనాత్మ దూషితులొ!"
అనిపల్క హరిజూచి - యాలింబుసేసి
'వినుఁడం'చు చదువులు వెలఁగబెట్టెదవు,
మేముగూడను గొన్ని మేర, ధర్మములు
నీమాడ్కి నాచరింప నేర్తుములెమ్మ
శాస్త్ర మన్నదిలోకచక్షువు; జీర్ణ
వస్త్రమ్మువలెదాని - వదలంగ దగునె!
విధి నిషేధంబులు వింగడించినది
సదమల శాస్త్రమా చక్కటిఁబోని
కామకారునకు సుఖంబె శూన్యంబు;
ప్రాముసు లందిన పరగతియేడ!
కావున శాస్త్రంబు గఱచి - తద్భావ
భావుకుండయి - వృద్ధపథసమ్మతముగ
నడువంగవలెగాక - తొడిబడి - నేను
నుడివినదే మేల్మి నడయను వాని
ననుసరించునె లోకమంధమైనట్లు
మణిఁబెంకు బొచ్చెయున్మాడ్కి ధర్మంబు
దూషించి పలికితి, వాసుదేవుండె
పోషకుండోయి! తత్పూతధర్మమున
కదికానిదంచన నా హరిగూడ
మదిదప్పెనని యన్నమాడ్కియౌగాదొ!
తర్కింపనదిగాదొ! దైవదూషణము!
శర్కరిలమ్ము వాచాప్రౌఢియేల;
హీనకులంబైన యీ నామదేవుఁ
డూనిన సద్భక్తి నొక్క విశిష్టుఁ

డందువు, మాకెట్టు లది(ప మాణమ్ము
సందుగొందుల వెంట - సందడిగాఁగ
పడిలేచు వాఁడెల్ల, భక్తుఁడే యగుచు
మడిసందిఁ జుట్ట సామాన్య ధర్మమ్ము
నింక శాస్త్రమ్మేల! యెవరాదరింత్రు
జెంక కొక్కొక్కఁడే, సనకుండ ననఁడొ!
కర్మానుబంధ, సంకలితుండుగాని
శర్మమయుఁడు ఫణిశాయి యేసుమ్ము
తాప్రథమాచార్యుఁడీ ప్రశస్తమ్ము
దీప్రధర్మమున, కీ తీరుగాఁజూడ 95
నాతనికిని ధర్మ మర్థి మన్నించు
సేఁత కర్జము, లోక శిక్షణార్థంబు"
గావున, యుచ్ఛిష్ట కలలమ్మువోవ
నావిష్కృతమ్ముగాన, నఘ ధర్మమ్ము
పంచగవ్యము నీవు పట్టెడు వఱకు
త్రుంచంగనేరమీ తొందయంచుఁ బలుక
కడగండ్ల జిఱునవ్వు తొడవుగా నుడివె
నుడువులఁ దలఁపుల కడయైన వెలుఁగు
"కానిండు, మీకోర్కె గాదనఁగలనె!
ప్రాణసములు నాకు భవ్య భూసురులు.
యెల్లిగ్రహింతు మీ యుల్లంబు లలరి
పల్లవితములుగాఁ బంచగవ్యంబు
తమరెల్ల నేటివితముగానె - రేపు
మముఁగృపఁ జూచి - మన్మందిరంబుననె
యాతిథ్యమహము సేయఁగవలె" నంచు
నా తలంపును మెచ్చి - యట్లకా కంచు
దీవెనలిచ్చి భూ దేవులు వోవ—
పావనరూపుండు - పండరీనాథు

డాదరంబున భక్తులందఱఁ జూచి
వేదముల్ చదివియు - వేదార్థ మనన
సేయక, కులకృత చిక్కణ గర్వ
మే యెడబాయక, యెవ్వరినైన
దూలనాడుచు, బుద్ధి దూలి, యాకాలు
పాలగొట్టెలుగాఁగ - బడలి చిక్కెదరు,
పరిమళ ద్రవ్యముల్ భరియించు పశువు
పరిమళం బెఱుఁగునే? - పాఱుఁడై పుట్టి
మంత్రముల్ మోసిన మాత్ర - నీజన్మ
తంత్రమ్ము దప్పెడు దారిగన్పడునె!
వెలివెలి చదువుల వేదపూరుషుఁడు—
తెలుపునేమర్మంబు - దేవపుంగవుఁడు!
భాగవతోచ్ఛిష్ట పరమోత్సవమ్ము
యాగయోగవ్రతా ద్యఖిలసత్పుణ్య
ఫలము, తత్ఫలముల బలిమిచేగాదె
బలకొని, యిటు వెల్గు పండరీశ్వరుఁడు!—
పానలేటికి! జేపు పాఱుల కెల్ల
జ్ఞాననేత్రం బిచ్చి - సాక్షాత్కరించి
భక్తుల మహిమకుఁ బడగెత్తఁబోదు -
నత్యంత మాశ్చర్య మందంగ సురలు
పొందు రంగండన్న పారాడుదైవ
మొందేల! మాట లీయుర్వరయందు
బొందన్నలార! యెప్పుడు నీడవోలె
నుండుదు - మీవెంట నొప్పరికింప
కని పల్క, భక్తి పీఠాగ్రణుల్ - వాని
యనుమతి గొని - కాళ్ళ కౌదలల్వంచి
పేరు రమ్మున నెద జేరిచి, గంధ
సార శీతల పరిష్వంగంబు నంది -

యునికి పట్టుల కేగి, యుల్లంబులందు
వనజాతనేత్రుని భావించి కొనుచు
నాలుపిల్లలకు నా హరిలీల లెన్ని
యాలోల మతులకు, నర్థితోఁ బలుకు
చంతంత బాడుచు, నతిలోక వర్త
నాంతర్ముఖులు - మోదమందుచునుండ;
నామదేవుని యింట - నాట్యమ్ములాడె
సామగ్రశుత్యుక్తి భాషాదేవి - ప్రాకృ
తావతారం బూని, యడుగడుగునందు,
శ్రీవాసు నెమ్మేను చెమరించుచుండ;
పద కవితారస ప్లావితుల్, మౌను
లది తపం బనిచేరి - యంకించుచుండ
మురవైరి మేని కస్తురివోని, తమము
హరిదంతరంబుల నల నల్లవిరిసె.
కడలి కన్నియ వాలుగండ్ల చిర్నగవు
తొడకెనోయన, దెల్పు దోచె నల్గడల
శ్రీరంగపతి తులసీ మాల్యగంధ
పూరమ్మువలె, వాయువులఁదోచెఁదావి;
పూతక్రతాయీక పోలరాగమ్ము
భాతి, తూర్పున; నేచెఁబాటల కాంతి;
హరి దర్శనంబున నలరెడు భక్త
వరుల మోములు వోలె వనజముల్ విరిసె
గడువేడ్కఁగెందమ్మిఁ దొడరి చుంబించి
సుడియుచు నెలుగించె సొక్కి తుమ్మెదలు
దివసవారణ రాజదేహ మాత్రమ
సవితృభా పద్మకోశైచ్ఛ స్ఫూర్తిఁదోచె;
పాండురంగ ద్వారభరిత సద్భక్త
మండలీ కీర్తనా మధురిమల్ చెలఁగె

ద్వారముల్ దెఱచిన, పండరీశ్వరుఁడు
ధీరవార్షుక మేఘ దీప్తతనుండు
లలితేంద్ర చాపలీలాహారి పింఛ
వలయ నర్తన కళా భ్రమితలో కుండు -
కామాభివర్షి, గుంజామాలికాఽభి
రామ చూడాపాశ రాసిక్యమూర్తి
కమలాలయా నేత్ర కజ్జలా కల్ప
రమణీయ బింబాధర స్ఫురద్రూపి
మకర కుండల విభానికర చంద్రకిత
వికచగండస్థలీ విస్మేరవర్షి;
క్రకిమీ కటీరరా రాజత్కరద్వ
ఙశివార్ధ చంద్ర విన్యాస సుందరుఁడు;
కమలాసనాది వీక్షా పుష్పపుంజ
కమనీయ శ్రుతి శివం కరపాద తలుఁడు -
కొలువివ్వ, నానాఁడ తొలినాడువోలె
తలమొలఁ జూడక దండడిఁబాటి
పరమ భక్తులు నేత్ర పాత్రముల్ నిండ
పరమేశ్వరుని రూపు పానంబుసేయ,
"రావోయి! నామదేవా! వెఱఁగులకు
తావలంబగు నేటి - భావాఽభిరామ
నాటకంబున కీవె - నాయకాగ్రణివి
చాటున నున్నావె? సావంత మాలి!
కనుపింపరా - కండ్ల కఱవులు దీఱ
వనధి గంభీర! నివర్తి నాధుండ!
యొకరేయి గడచె, నిన్నొరపి భాషించి
మొకమైనఁ జూపింపవకట! యిదేమి?
ఓయి! సోపాన దేవా; యత్యమృతము
గా, యశస్వీ! నిగ్గుగాఁ బల్కరాదొ!

జ్ఞానదేవా! వేద చర్చాను చర్చి
కానిధి! నాపైని కనలు గొన్నావా!
నరహరి! రేయి యెవ్వరిఁ గొల్చితోయి!
గిరిజునో! నన్నా! క్రిక్కిరిసిన భక్తి
కడజాతివాడ! చొకామీళ! పాఱు
లడిగిన, నేజాతి యందువా! యేమొ!
యేకుండ మంచిదో! యేది దూష్యంబొ!!
నీకుఁ దెల్లంబోయి! నిజము కుంభార!
అడుగులో నడుగుగా నడచెదవేమొ!
యడిపిగ్గుదాన! జనా! క్రొత్తవలపొ!
ఏమమ్మ! సక్కుబాయీ! రేయి యెల్ల
మామీది మనసింత మఱలింప వైతి"
వనియిట్లు భక్తుల కాదర శీత
లనిభృత దృష్టినుల్లాసంబు గూర్చి-
ముచ్చటించుచు నుండ, మొగసాలయందు,
జెచ్చెర విప్రులు జేరినిల్చినను
కనుగిటినంతలోనన, విప్రవేష
మొనరంగ నచ్చిన వనజోదరుండు
వారిడాయఁగ వచ్చి, పరుసకు వచ్చు
తీరున, కౌతుకా ధీన మానసులు -
చేరిన వడువు నీక్షించి, చిర్నగవు
పారాడఁ బెదవిపై, ఫాలమ్మునందు
గరపుటమ్మొదిగించి, కడువడి మ్రొక్కె-
హరి, సర్వధర్మ రాహస్య రత్నాఽబ్ధి;
పాఱులతోఁ జంద్ర భాగకు నేగి
సారస కింజల్క సమ్మర్దితమ్ము
వారి మునింగి, సర్వోఘనిబర్హ
ణారభటీ గుంభితాఽభి ధానుండు

తనచేసిన యఘమ్ము దలఁగించు కొఱకు
రణదఘ నిచయ భారపరాస్తమతులు,
కర్మబంధితులు - దుర్గర్వితుల్, జన్మ
మర్మాఽవిదులు, కామ మాంసలితాళ
యులు, ముధావేదార్థ కబళన వ్యగ్రు
లలరి, భూసురులు, పెల్లఱచి సంకల్ప
మును జెప్ప; తలవంచి - ముగ్ధుండువోలె
వనజోదరుఁడు గొనె పంచ గవ్యంబు
నిఖిలాఽత్మ రూపికి, నిఖిల ప్రమాణ
శిఖరాఽవిదితగుణ శీలికి, మాన
మేది! యవజ్ఞతానేది! యభీష్ట
మేది! దూష్యంచేది; ధృతగర్వు, లవని
సురులు, తమకు దృప్తిబొరయుట కొఱకు
బొరపడిరే కాని - పుణ్య దూషితులు
హరి, పురుషోత్తముండంతట, నవని
సురులతో గూడ భాసుర - నవార్థముగ
భాషించు చెడనెడ - నీషద్వికాస
భూషిత నేత్రాంతముగ నవ్వులాడు
చలరి, భక్తులు ముందు నమృత సంసేక
ములుసేయ, తంబూర లెలుగెత్తి పాడ
ప్రతి పదమ్మున యందు - ప్రత్యగ్రపులక
తతిఁదాల్చి, వసుమతి తత్తఱంపడఁగ
నవిదిత రూపులై, యభ్రంబు నందు
తెవగట్టుకొని నిల్వ - దేవతల్ మునులు
పసిడి గోపురముల పసలు, మిన్నులమి
యసలు గొన్నట్టి దేవాఽవసథమ్ము
జేరి, కూర్చున్నంతలో, రశ్మిమాలి
కీరపూవులఁ బొత్తుగూరు మయూఖ

మాలికల్ బరపి, దిఙ్మండలం బందు
దా, లీల, గగన మధ్యంబున నిలువ;
బంతులు దీర్చి, రంభా గండపాళి
వంతుకువచ్చు రంభా పత్త్రములను
శాల్యన్నములువెట్టి, సద్యోఘృతంపు
కుల్యలతోఁబాటు - కుచలికుచముల
దుపికిళ్ళతోడ, చేతో జాత డిండి
మసతీర్థ్య కంకణ మధుర నాదముల,
పలుకు, పాగడపు టంఘ్రుల జతుద్రవము
మలపుల, మెట్టదామరల సృష్టింప,
తడి నవ్వులను వేల్పు తరుణులు; తేనె
నుడువుల వడ్డింప - పుడమి జేజేలు
గళదఘ్నముగఁదిని - కరములు గడుగ
జలజోదరుఁడు, దక్షిణలఁ దృప్తిపఱచి -
మఱల నెప్పటి యట్ల - పరమ భాగవతు
లిఱువంక గూర్చుండ - నిచ్చతోఁ గరగి
వారియుచ్ఛిష్టంబు లారగించుచును
వారికిఁ దనచేత వక్త్రదష్టంబు
గుడుపుచు, టక్కరి కొసరు చూపులను
నడదివియలు వోలె నలుగడల్ బఱపి
తిలకింప, విప్రులు - కలుషింప వదన
ములు, గుసగుసవోయి పొగులుచు-కడకు
తెగియించి - "యేమోయి! దిమ్మరి! నీకు
నగవు పాలయ్యె నామ్నాయ ధర్మంబు
పంచగవ్య ముగ్రోలి, వంచించి మమ్ము
ముంచి, యదే పని మొదలు వెట్టితివి"
యనుడును, కిలకిల యై మొగంబెల్ల
ప్రణత త్రయీ మూర్తి పలికె శ్రీధాముఁ

డున్మాదులార! మీకున్నదేగాని
చిన్మయమూర్తికిఁ జేరునే కసటు!
ధరణి గోరూపంబు ధరియించి యెవని
చరణనీరేజ సంస్పర్శంబు కొఱకు
చిడిముడి పడునో! యాకడలేని వెలుఁగు!
కడు కొని నిలిచె చక్కఁగఁజూడుఁ డనిన
నావాక్య బలమేమొ! యందఱి మదుల
నావటిల్లగ భక్తి - యావైపుఁ జూడ
దరిసెనం బిచ్చె, వేదాంత వేద్యుండు;
బరమసూరులు గొల్చు పండరీశ్వరుఁడు
క్రందైన యట్టి వైరాగ్య సుఖమ్మొ!
ముందట నిలిచిన ముఖ్యనవద్వ
యపురాణ సారమో! యని మిష మౌని
విపుల గీతానంద వినుత సౌభాగ్య
మో! సప్తకోటి మహోన్నత మంత్ర
వాసి తానుష్ఠాన వాల్లభ్యభరమొ!
మేనంది నిలుచుని ధ్యాన రసమ్మొ!
ఆనిగమముల పుణ్యము మూర్తమైన
ఫొలుపొ! యానామదేవుని ప్రేమభక్తి
కలవడ నంగముల్ మొలిచిన వితమొ!
యన, ముందు నిలిచిన యాపరమాత్మ
గనుగొననేరక కకుభంబులెల్ల
నొక్కఁటే వెలుగుఁగాఁ బిక్కటిల్లినను
దిక్కుదోపక భయా ధీన మానసులు
నడునడ నడకుచుఁ దడఁబడ నుడులు
పుడమి వేల్పులు, కండ్లఁ దొడిబడు బాష్ప
ములను నబ్రహ్మణ్యము పఠించి - వేద
నలఁ గ్రుంగి, ముందట, నారాయణంబు

నా రణంబు వరించి - యటుపై నృసింహ
ధారకమ్ము నృసింహ తాపనీయమ్ము
రామతాపిని, సుదర్శనము - మహాఘ
సామజ హరి, కలిసంతారణమ్ము
మొదలు గాగల మంత్రముల నుచ్చరించి,
పదములఁబడిన నాపన్న శరణ్యుఁ
డా రూపమును విడి, యంతలో విప్రుఁ
డై రదనచ్ఛద - హాసభాసితుఁడు
తోచిన, వేదవిద్యాఽఽచిత గర్వ
శోచనీయులు, ముధా శుష్క నిష్ఠావి
రూపిత హృదయులు, తాపంబు నొంది
మా పాపములు వోవు మార్గమింకేమి!
ఆత్మస్వరూపుని, నఖిలదర్శిని, చి
దాత్ముని, సామాన్యుఁడంచు భావించి,
తొరపడి, వెర్రిగా దూషించి, పొగరు
బొరపి - ప్రాయశ్చిత్తమునకు దార్చితిమి;
యనుచుఁ బశ్చాత్తాపమున గ్రుంగు పాఱు
లను గూర్చి కేశవుండను కంబఁబలికె
నో విప్రవరులార! యోసదాచార
భావితులార! మీ పాపంబు దొలఁగె
మనసు పశ్చాత్తాపమును బొందు కతన
ఘన పాపములనైన, కసటులనైనఁ
దొలఁగింపఁ, జాలిన తోరంపు మందు
నొలయు పశ్చాత్తాప మొక్కటే గాదె!
యని యాడి, నామదేవుని జీరి - ప్రేమ
దనుపార వీక్షించి, తలబుడుకుచును -
"ఓయి నాప్రాణంబ! యోయి నిర్వాణ
దాయి దయావేశ! యోయి భక్త్యైర్ద్రి

హృదయ! యనారత హృత్పీఠ సంస్థి
తదర రథాంగ ముద్రా భద్రమూర్తి!
కవితా వసంత! కైతవజన్మ! జగతి
నివతళింపఁగ భక్త హృదయ సౌరభము
వినయసుందరుఁడవై, విప్రులపాద
వనజంబులకు మ్రొక్కుమని యానవెట్టి
యామాటతో నతండవని సాష్టాంగ
మై, మోకరిలిన, యాదివిఠలుఁడు
ధరణీ సురులఁబల్కె" దయబెట్టవలయు,
తిరముగానీ నామదేవునిపైని,
వీఁడు నా సేవధి - వీఁడునా యుసురు,
వీఁడు సద్భక్తికి వీఁడుద్ధవుండు;
పరముండు భక్తి కింకరుఁ డన్నమాట
యెఱుఁగరో! కాక, మీ, రెల్ల వేదముల
తొలియాకు గాదొ! యాపలుకు, వేదముల
మలచిన సారంబు మనసులఁ బట్టి
యలవోక లోకంబు నందుఁ జరించు
కులపావనులు భక్తి కలితులులేక
పరమేశ్వరుఁడె లేఁడు, బ్రాహ్మణులార!
ధరణి యీ భక్తుల చరణ ముద్రికలు
తనువందు సోకిన తావులనెల్ల
కనులార్చి, పులకలఁగ రఁగుచునుండు
భక్తుఁడే జాతిలోఁ బ్రభవింపనేమి
వ్యక్తంబుగా వాడు వాసుదేవుండు;
పంకమ్ములోనన పద్మమ్ము పుట్టు;
పొంక పుఁబట్టు దా పురుగులఁ బుట్టు;
గులకరాలను రత్నములు ప్రభవించు
చిలిపి యీగలను దీపులదేనె దేఱు

గుల్లలో జన్మించు గొప్ప ముత్తెమ్ము;
పిల్లిపై జన్మించు పేర్మి జవ్వాది;
కులగర్వ మునఁ గ్రుంగి వెలివెలి నిష్ఠ
సలిపిన యది గజ, స్నానంబుగాక
యెఱుకకు మార్గంబె! యెఱుకలోఁగాక
పెఱత్రోవలను జన్మ మరణముల్ దెగునె!
అటు సూడు డెఱుకయే యాకారమైన
పటు బుద్ధియతఁడు సోపాన దేవుండు
వానిప్రక్కననున్న వాఁడు నివృత్తి;
జ్ఞాన మార్గము వాని కాలిపెండెరము,
జ్ఞానదేవుఁడు వీఁడు - శర్వాది ఘనులు
గానని యెఱుకకు ఖనియైనవాఁడు
ఈ జగన్మిత్రుండు - పూజనీయుండు
రాజయోగాంబుధి, రసతుందిలుండు
సావంతుఁ డున్నాఁడు, సావంతుఁ డనఁగ
నావై జయంతమ్ము, భావవాసితుఁడు,
కులము మాదిగగాని, గుణములజూడ
కలిపావనుండు చొకా మేళుఁడతఁడు
వీఁడు గోరా, భక్త - వినుత సత్కీర్తి
యాడుదు వీనింట నహరహంబేను
పరమ భక్తులు వీరు - పండరీశ్వరుఁడు
వరవుఁడు వీరికి, వలచును వీరి,
చరణరేణువులకై - శిరమున బూన్ప
యరయంగ నుచ్ఛిష్ట మనుట యేపాటి
బగుతులదొసఁగెన్ను - పాపంబునకును
మిగిలిన పాపంబు మేదిని లేదు
వారునేనొట - తత్పరిభవంబన్న
వారి జాఙని నన్నుఁబరిభవించుటయె''

యను హరి వచనముల్, విని విప్రవరులు
కనులలో బాష్పముల్ గాఱ -" మాదోసఁగు
మన్నింపవయ్యా! రమానాథ! వేద
పన్నముల్ మోపితి - మెన్నగార్దభము
నరకు మోపినయట్లు, జల్పజీవులము
పురుషోత్తమా! వేద పురుషుండుగూడ
పరిభూతుఁడయ్యెమావదనముల్ సెంది;
పరమాణు వాదిగా బ్రహ్మ పర్యంత
మరియ సర్వమ్ము మాయామయం బనుచు
పరమాత్ముఁడొకఁడు దప్పక నిత్యుఁడంచు
కలిగిన యీ సృష్టి - కనుగల్గి చూడ
పలురూపములనున్న - బ్రహ్మంబటంచు
నెన్నిచెప్పును వేదమన్ని బోవిడిచి
యున్నత కులగర్వ మొకటిఁ బట్టితిమి;
స్వామి! నిర్హేతుక జాయమానంబు
మాపైల దొలఁచె - నీ మహితానుకంప
జ్ఞానదీపం బిచ్చినావు భాగవత
మానసములు దూల - మా చేసినట్టి
యవినయములు - ముక్తికయ్యె మార్గమ్ము
లవునవు! దము రాచునట్టి వారలకె
తావుల నొసఁగుఁ జందనపుఁ గాష్ఠమ్ము
లీ విమలాత్ముల కీర్ష్యలు లేవు,
తాపముల్లేవు చిదానందు నిన్ను
మాపాల గలిగెడు మాడ్కిఁ-గావించి
రీభక్త సంతతికెన్నఁడే గాని-
క్షోభంబు గలిగించు కొఱయఁటనట్లు
నీ నామ నిష్ఠలో నిలువెల్లఁ గరగి
మానసమ్ములు, తక్కు-, మఱచెడునట్లు

సర్వకాలమ్ముల, సర్వ భావముల
సర్వేశ! నీరూపె, జవకట్టు నట్లు
కులగర్వములు బుద్ధిఁ దొలఁచి, మా యెఱుక
మఱఁచి - మాయల తెర్వు మఱపని యట్లు
శరణాగతియె మాకు పరధర్మ మగుచు
మొఱకు ధర్మపు తర్కములఁ లోగనట్లు
భక్తు లన్నంతనే - వారి పాదములు
సక్తితో సేవింప - సమకట్టునట్లు
మము గటాక్షింపుము - మన్నించి"-యంచు
దమతలల్వంచిన - ధరణి దేవులకు
దామోదరుండనె "ధన్యులై తిరి! మ
దామిత తమము; నేఁడత్త మిల్లినది,
జ్ఞానదేవునిఁజేరి - సంతత సేవ
బూని - యా మహనీయు - పూర్ణకటాక్ష
మునకుఁ బాత్రులరైన - మొనపిన మాయ
తనుదాన విరిసి - చిత్తముల నారూపు
హత్తి, సారూప్యంబు నందంగవచ్చు
యిత్తెరువునఁ దక్క నిఁక లే దటంచు"
జ్ఞానదేవుఁడు కరా - బ్జమ్ములుమోడ్చి
తాను వందించె - వేదాంత వేద్యునకు
కడగంటి చూపులు - కడల రత్నంపు
నడదీపములుగాఁగ - నారాయణుండు
మఱియొకసారి - యా ధరణీ సుదులను
బరికించి - చిఱునవ్వు పెఱలను దేల్చి
కనుమఱుఁగైన - చొక్కంబైన బత్తి
తనువుల మనములఁ దట్టాడు చుండ
జ్ఞానదేవుని పాదకమల రజంబు
బూని - శిరమ్ములఁ బొరలాడువార

లా మహనీయుని యంఘ్రులు, బాష్ప
దామంబులను జేసి, తడిపెడువారు
లామూర్తి కన్నుల నట్టె నెక్కొల్పి
తామేది యెఱుఁగక - తనిసెడువారు
నై - విప్రులెల్లరు - నతనితోఁ బాటు
నావసథములకు నరిగిరి, భక్త
లాపాండురంగని యడుగుల కెఱఁగి
తీపైన తత్కీర్తిఁ దివిరి పాడుచును
గృహములఁ జేరిన, నిందిరా జాని
ముహురుద్గతములైన మొలకనవ్వులను
నామదేవునిఁ జేరి, - ప్రేమ సౌరభవి
ధామృదులముగాఁ దనిముద్దుపెట్టి
యిఁకఁబోయి రమ్మని - యింటికినంపి;
వికచ తామరసాక్షి - విశ్వైకమాత
మెచ్చి యాలింప రుక్మిణి, నామదేవు
నచ్చంపు కీర్తిగా నంకింపుచుండె;
కడచె దినమ్ములు, కమ్మకస్తూరి
వడువున గుమ్ముగాఁ గడలకుఁ బ్రాకె
నామదేవుని కీర్తి, నానాట వాని
ప్రామినికులు వోని - పదకవితాప్ర
వాహమ్ము లింటింట వఱ్ఱుగాఁ బాఱె;
శ్రీహరి ధ్యాన సుశ్రీకు, లాత్మాను
సంధానమతు, లజస్రము రాఁదొడగిరి,
బంధముల్ దోలఁచిన - బాంధవుల్ - పాండు
రంగ సంకీర్తన శ్రవణ తత్పరత
తొంగలించంగ భక్తులు వానిదరికి;
నేమియున్నది వాని! కామధుమధను
నామమొక్కటిదప్ప నామదేవునకు!

నదియె సర్వము దీర్చు - నదినవనిధుల
ముదలఁగైకొనఁ జేయు మొదలిదైవంబు;
ప్రతివాసరంబొక్క పండుగయయ్యె
ప్రతిలిప్త, రచనాధురా గంగయయ్యె
నిటులుండ - సుందర కుటిలకుంతలుని
కటిహస్తు, సర్వలోకైక ప్రశస్తు
పాండురంగని - భావభక్తిచే గెలిచి-
యండనిల్వఁగఁ జేసినట్టి కుంభారుఁ
డొకనాఁడు భక్తులకు ల్లంబు దనియ
వికసింప పున్నెంబు, విందుసేయంగఁ
దలపోసి - వినయంబు దలకొనఁ బిలువ
నెఱమినా సజ్జను లియ్యకొనంగ
నామదేవుండు, పఁడరినిభావాఽభి
రామమైనట్టి యర్చావతారం బె
పాండురంగండన్న భావంబుపూని
యండవదలిరాని యట్టివాఁ డగుట
"గోరా" యచటికేగి - కూర్మితోఁ బిలువఁ
బోరామి భావించి, యారమా వరుని
యెడబాటునకు నుల్కి, యెట్టును బలుక
నొడబడకుండిన నుడివె రంగండు
"నామదేవా! భక్తిసీమ! కుంభారుఁ
ప్రేమంబుఁ జెల్లింపఁ బ్రియము మా మదికిఁ
బొమ్ము! రావచ్చును లెమ్ము! శీఘ్రముగ
కమ్మని నీదేసి కవితా ప్రసంగ
ములఁ గళఁ గూర్పుము, మొనసి భక్తులకు
నెలవోలు నీవులేనిది - భక్త బృంద
మదియేమి సొబగు! నాయన! హారవల్లి
మదికించునే! మధ్యమణిలేని దేని?

లెమ్మ"న్న కనుల నీరమ్ములై - యెడఁద
నుమ్మలి కమ్ములై యున్న సద్భక్తుఁ
గౌగిటఁ దనిపి - చొక్కపునవ్వు నవ్వి
సాఁగనంపినఁ బోయె, శాంతిఁ దొలంగి;
పరమపూరుషుఁడున్న పండరీపురికి
'తరడోకి' యనుపల్లె కుఱఁగటనుండు
నచ్చోట కుంభారు నావాస మగుట
నచ్చలంబునఁజేరి రఖిల భక్తులును
హరిహరాద్వయ వాది - నరహరి భక్తు
డరిది తెల్వికి నెల్లయైన "వీసోబ"
వేల్పులు వొగరు నివృత్తి నాధుండు;
జల్పచపేటంబు జ్ఞాన నాధుండు
పరమశాంతుండు సోపానదేవుండు
నరరూపమౌ తెల్వి నాగనాధుండు-
అతివయౌ యోగమాయాంశంబు, యోగి
తతి తలపూవు, ముక్తాబాయి, మాలి
కాసేవతో, లోకకాంతు మెప్పించి
భావంబునేలిన సావంతమాలి
క్రొత్తడితనపు సఖూబాయి, వలపు
దత్తయౌ చిత్తమ్ము - తోయజాక్షునకు
పావడమిచ్చి తద్బాహు బంధనపు
తావుల నిలువెల్ల తనిపినయట్టి
నానముత్తెంబు, జనాబాయి, భక్తి
మేనైన, యాచొకామేళుండు, తెల్వి
కడలియైనట్టి 'రాకా' సజ్జనుండు
పుడమి జన్మముగొన్న పుణ్యుఁడుద్ధవుఁడు
పండరీనాథ పద్వనజ సర్వస్వ
దండబాయని భక్తుఁ డఖిలేశ్వరునకు

నామదేవుఁడు, రమానాథ నామాఽభి
రామసంతతవృత్తి, నామదేవుండు;
మఱియుఁ దక్కిన భక్త వరులెల్లఁగూడి
పరసి జోదరుగూర్చి చర్చ సల్పుచును
తమ తమ యనుభవ తతిజెప్పుచును, ని
గమసమ, నామదేవమధుర కవిత
లను జొక్కి, భాష్పమాలా రమణీయ
తనువులతోడ, నంతంతఁ బొర్లుచును,
ఒక్కరి చేతుల నొక్కరుఁబూని
చిక్కని గతుల రాసంబులాడుచును,
పరమేశ్వరునిగూర్చి పనవుచు, నవ్వు
చరయుచు 'లేడని' యలతలంబడుచు
నోరంతప్రొద్దు భక్త్యున్మాదమందఁ
దారుచు జన్మసార్థకముగాఁ గడపి
యాపైని భుజియించి, యలవోక, తాను
శ్రీ పునిలీలఁ జర్చించుచున్నంత
జ్ఞానదేవుఁడు రమానాథుని సాటి,
యాననంబున బాయనలఁతిహాసంబు
ప్రక్కననున్న కుంభారు నీక్షించి,
యిక్కరణి వచించె, నెలమి గుల్కంగ
"నోయి! కుంభార! నీ వుద్దించువాఁడ
వాయబ్జభవునకు, నతఁడు ఘటమ్ము
లమరించుఁ బంచభూతముల సాయమున
నమరింతువీవునేకైక మృత్సాహ్వా
మున, నసువులులేని పొచ్చంబె కాక
వనజాసనునకు నీకును భేదమేమి
వరుసగాఁగూర్చుండి రరుదైన భక్త
లరసి యాఘటములయందు, నపక్వ

ఘటమేదో! సెప్పుము, కచ్చితంబుగను
కటకటంపడకు, నిక్కంబున కెవరి
భయమేమి "యనుడు కుంభారుండు నుదుట
కయిగవసేర్చి, నిక్కంబు వల్కుటకు
వెఱపు జెందుటగాదు; ధరణి సంసార
సరణికి, సరిపోవు సామాన్యఘటము
తారతమ్యము సెప్ప నేరుచుగాని
నేరుచునే? భక్త నికరంబు వాసి
నిదమిత్థమనితెల్ప, నీలెంకయైన
సదమల జ్ఞాన విశ్రాణన కల్ప
కము, జ్ఞానదేవులు మము గోరిరట్టె;
క్రమమౌనె! ముందువెన్కలుసూడఁ,బాండు
రంగని యానకు ప్రతిగల్లనైన
నంగవింపఁగఁ జెల్లునా! మీదుముదల
ననుచు కుంభారుండు నా భక్తగణము
పనుపడఁదనతట్టు పలకచేఁగొట్టు
చునుఁ బోయిపోయి, నెక్కొనిన పుల్కలను
తనువును మఱచి, శ్రీధామ నామాను
సంధానముననున్న - సాత్త్వికు, జన్మ
బంధాతిగుని, తట్టు పలకచేఁ గొట్టి
నామదేవుని, నిది నాకుఁ జూడంగ
స్వామి! యిన్నిటిలో, నపక్వఘటంబు
గాఁదోచెనని తేల్చి కడగి చెప్పినను
బోధస్వరూపుండు, ముక్తి శృంగాట
కము, జ్ఞానదేవుండు కలకల నవ్వి
ప్రమదంబుగలిగె, కుంభార! నిక్కంబు
పలికితి, పీ యున్నవానిలో నిదియె
పలువాదులేల! యపక్వమౌ ఘటమ

టంచు వెండియునవ్వ, నాయున్న భక్త
సంచయమతనిని, సై సై యటంచు
కరములఁదట్టి వెక్కసముగా నవ్వి;
అఱకంటఁ జూచుచు నా నామదేవు
నంతము క్తాబాయి, యవిరళయోగ
తంతన్యమానరుక్తతి కమనీయ
చక్షుః పరిష్కార - సరగునలేచి
పక్షంబుసేపి కుంభారుని, "మేలు!
మేలు! నిక్కంబుగాఁదేలిచితోయి!
నీలాగు చెప్పంగ నెవ్వారునేర
రీనామ దేవుండు, సూనాస్త్ర జనక
మానిత రాహస్య మధువెల్లఁ దాన
గ్రోలిన యటులెంతొ! నీలిగి నడుచు,
నాలింపఁగా నింద, రతవి నిజమ్ము
నేటికి బయలయ్యె నీరజేక్షణుఁడు
నీటు పాటలతోన - నియమింపఁబడునొ!"
యనుచుఁ జెలఁగి నవ్వ - నక్కడి భక్తు
లనయంబునగిరి - శయంబులు దట్టి
ధరణి సర్వంబు నీశ్వర విభూతిగను
దరిసించి, ప్రాణి మాత్రమునకు దొసఁగు
నాచరింపని యట్టి - యనఘులు, కరుణ
కాచార్యులౌభక్తు, లావైష్ణవోత్త
ముడు; నామదేవుని, యెడఁదకు నెగులు
బొడమింపఁ జేతురే! పూర్ణాను కంప
వాని హితమ్ముగను భావించి, లేని
దైన నేరము, బూని, యనుటయేగాక,
యీ పరియాచకం, బెదగ్రుమ్ము వాడి
తూపుగా; నిట్టూర్పు దొంతరల్ మలయ

కనుల నీరము గ్రమ్మ, గంపింపఁ దనువు
మనసెల్ల పడియలై, మానాథు దరికి
పడఁబాటి నామదేవుఁడు సెకలొలుకు
నిడుఁదలౌ నూర్పులై, నిటలంబునందు
గ్రమ్మిన చెమటలై, కాయమందెల్లఁ
బమ్మి నవణకులై, పండరినాథు
పాదద్వయంబులఁబడి లేవకున్న
నాదావతారుండు, నారాయణుండు
పరమర్షి యజ్ఞవ పాగంధిలమ్ము
పరశివాఽఽత్యంతిక భావ మహమ్ము
ఘోషనారీ నేత్రకోణ భాషావి
శేష తాత్పర్యమ్ము, శ్రీరమ్యమైన
పెదవిపైఁ జిఱునవ్వు ప్రిదులంగ, ముక్తి
మదవతీ మేఖలా మాణిక్య కాంతి
నాయనా! నామదేవా! యేల యిట్లు
పాయఁబాఱఁగ నోర్పువనటఁ జిక్కెదవు!
నావంటి దైవంబు - నీ వెన్నుగావ
నేవగ, నీకింత యిడుగడ గూర్చె!
చెప్పరా! నా తండ్రి! దెప్పరమైన
నొప్పరి కింపక నూడ్తు నీవగపు!"
ననుడును, "పరులైన నలమటం బేల!
దినదినంబును బడు తీరులే గాదె!
లౌకిక మాయా ప్రలాపముల్ - మదికిఁ
దాకునె! నీపాద తాత్పర్యమతికి!
నీవంక వారుగా నెగడుచు, నెఱుక
త్రోవలు దఱచిన - దొడ్డవారలుగ
యశము చేకొన్న, భక్తాగ్రణుల్ - మనసు
కసిగాటు వఱచినఁ గలఁగుట గాఁక"

యనుచు - 'గుంభారు' గృహం బందుభక్త
గణము బరీక్షింపఁగా జ్ఞానదేవు
డడిగినవితము, నయ్యాజ్ఞ బాలింప
నొడిగట్టి కుమ్మరి యొక్కొక్కరుని, బ
రీక్షించి - గుణముల నెన్ని చెప్పుచు, న
రక్షితుండగు దన్బరీక్షించి - యిదియ
యన్ని ఘటంబుల - నపరి పక్వంబు
నన్నట్టి జాడయు, నాపైని జ్ఞాన
దేవుండు నవ్విన తీవియు - భక్త
లావరుసన చేతులల్లార్చి, గేలి
కొట్టినవడు, వాడ కూతురు, నాన
తట్టు వడంగ ముక్తాబాయిలేచి
పలికిన దురుసులు - భక్త బృందమ్ము
తలలార్చి, యంకించి, సలిపిన గేలి
పూసగ్రుచ్చిన రీతి, బొసఁగంగ దెల్పి
మాసరంబుగ నేడ్వ - మధు మదహంత
యతనిలేవఁగనెత్తి యౌదలఁబుడికి
చతుర భాషలను హాసంబు వుట్టించి
మించు నర్మిలిఁ గౌగిలించి - క్రాల్గనుల
యంచులతోఁ గటాక్షించి యిట్లనియె,
"యున్నట్టి సత్యంబు నొప్పుగాఁ బలికె
పన్నకంబేమి! కుంభార భక్తుండు
జ్ఞానదేవుఁడు దయాకంఠి! నేరంబు
లానంగ నతఁడేమియలఁతులవాఁడె!
కైవల్యవల్లి ముక్తాబాయి కంటు
లావెలంది వసించు తావుల నున్నె!
తక్కు భాగవతులు, తారు పూతాత్మ
లెక్కటి భక్తి నాకెక్కినవారు

జగమఖిలమ్ము నీశ్వర విభూతిగను
దగఁజూచి - మానమ్ము దెగఁజూచి, యెల్ల
ప్రాణుల సుఖమునే వాంఛించువారు!
దీనదయాపరుల్, దేవ సన్నిభులు,
వారి బుద్ధులయందుఁ బంక లేశమ్ము
దూఱునే! సూర్యుని త్రోవఁదప్పినను
వారు నిన్నవమాన పఱతురే! హితము
గోరిసేసిన యట్టి కుఱుసేఁతగాని;
నామదేవా! భక్తిలో మేటివైతి
వామాటకేమి! సదాచార్యసేవ
లేనిది - గలుగదు, దానెంతవడిన
జ్ఞానమ్ము; దాని పౌష్కల్యమ్ము లేక
ధారా ప్రపాత సంస్కార కల్పితము
తీఱదు సుమ్ము! సంసారంపుఁ దగులు;
మొదలును-తుదలేని - పుట్టువుల్ - చావు
లదయంబులివి - సుడు, లందు, దప్పించు,
మరకాఁడు గురువను - నెఱకాఁ డొకండె
యరసి సదాచార్య - నా రహస్యంబు
దెలియంగ వలె నీవు వెలితి లేకుండ
తలకొని - నిత్య సేవలగురుఁ దన్పి;
యీ కొఱ దీర్చుట కీ భక్తగణము
నీకుఁ గల్పించె నీ నెగుల"ని యన్న
నామదేవుఁడు వల్కె "నా స్వామి! పరుల
చే, మక్కి హృదయమ్ము, చేరంగ జెంత
నీవును వారికే నెరవుగా నాడ
నావిధి కేమని - దేవురించెదను!
బావి త్రవ్వఁగఁ బోవఁబడి నట్టులయ్యె
వావిరి బూతముల్ పండరీనాథ!

జ్ఞానదేవాదులకైన వేరైతి
మానాథ! నీకునుఁ గానట్టి వాఁడ
నైతినో! యింక నా కాథ్యు లెవ్వారు
చేతమ్ము వడదేర్ప శీతల ఫణితి!"
నని విలపించిన, నా నామదేవు
కనుగవ దుడిచి శ్రీకాంతుండు వలికె,
'నాలింపవోయి! నన్నుపగత శాంతి
బాలిశుండవు వోలె భాషింపఁ దగదు,
పూవునకును, దాని తావికి - భేద
మేవిధి లేనట్టులించుక లేదు-
మనలోన నెడము, మున్మాటికి నిజము,
మనసరి! నీవేల మల్లడి గొనెదు!
కాని, సదాచార్య కరుణచేఁ గలుగు
జ్ఞానమ్ము నేనివ్వజాలను సుమ్ము,
పాండురంగఁడు నాకు స్వాధీన, మింక
నొండుగురుండేటి, కొప్పదటంచు-
నలఁతిగాఁ జూడకు, మాచార్య సేవ
ఫలియించుమే, లనుభవమాత్ర వేద్య
మదియెల్ల యెఱుకల కవ్వలిగట్టు;
పదనైన బంగారు వహ్నిలో తప్త
మయ్యును, వెలిగార మంటించకున్న-
నెయ్యోజఁ గరఁగని, యీడుగా - నీవు
నాకెంత హితుఁడవై నడచుచున్న
చేకూర దాత్మకు జ్ఞీవన; మతుల
గురుసేవ లేక - సద్గురుఁడు బ్రహ్మంబు
గురుఁడు త్రిమూర్తులకును తొలి వేల్పు
దైవంబు గోపింప, దయగల్గు గురుఁడు
దైవకోపంబును దప్పింపఁ జాలు,

గురుఁడు కోపించిన హరి హరాదులును,
గురుదేవుఁ గాదని కొనియాడ లేరు;
గురుసేవయే భువి నరిది తపంబు
గురుసేవ ముక్తికి గురుతైన దారి -
రవివంశ మందు శ్రీరాముఁడ నగుచు
నవతరించిన యప్పు, డవ్వశిష్ఠులకు,
యదువంశమందుఁ గృష్ణావతారమున
సదమల గుణులైన సాందీపనులకు,
నేసేవ సేయుట యెఱుఁగవే! దాన
నే, సముపాస్యత లెసఁగెను నాకు
సంసార బంధ సంసక్తియుఁ గర్మ
సంసరణం బునీశ్వరునకు లేవు—
గాన - సద్గురు సేవ - జ్ఞాన స్వరూప
మైనట్టి నాకు ననావశ్యకంబు
ధరణిఁబెద్దలు వోవు తెరువులఁ దక్క
నరులు వర్తింతు, రీన్యాయంబుఁ దలఁచి
సలిపితి లోక శిక్షార్థమై; సద్గు
రులసేవ, మాయను దొలఁచునంజనము
జ్ఞాన దేవాదులఖండమౌ జ్ఞాన
మూనుట, గురుసేవ నొనరించు కతన -
నదిలేని నాఁడు - మోక్షార్థుండ వగుట
బధిరుండు వినుట - సద్భక్తి కాసార!
యీ పాట లీ యాట లెన్నియుండినను
నోపవు నిర్వాణ మురవుగ నివ్వ
నాలింపు పలుకు, సదాచార్యుఁ జేరి
పాలింపు కైవల్య భవ్యసుఖంబు"
నన, నామదేవుఁ డట్లనియె - గోవింద!
తనుధన వైభవ దర్పాంధులైన

పురుషులుగాక యీ పుడమిపై జ్ఞాన
భరితులు - సద్గురు వరులు పుట్టుదురె!
పొసఁగఁగుంపటియందు బూడిదగాక
య సదృశంబైనట్టి యబ్జంబు గలుగు
నే! యట్టి సద్గురు లెవ్వరో! వారి
నేయుపాయంబున నే జేరవలెనొ!
కృపని చ్చగించి - యీవే యానతిమ్ము;
కపటంబు లేక, నిక్కము సెప్పు హితుఁడ
వీవె కాకెవ్వార లింక నాకన్న
నావన జోదరుండనియె భక్తునకు
'వినవోయి! "వీసోబ" - యను నొక్క పురుషు
డనుపమ జ్ఞాన దుగ్ధాబ్ధి! యీ యూర
నాగనాథస్వామి; నా జను శివుని
యాగార మందుండు, నది యూరిబయల
ఘనుఁడు! రహస్య వర్తనుఁ డాత, ఁడేల
మునులకుఁగీర్తి; భూజనులకుఁ గాక!
కైవల్య మతని చెంగట దాపి; వాని
సేవించి, పొందు మాశీస్సిద్ధి' యనిన
నామదేవుఁడు రమానాథుని చరణ
సీమ, నొదల వంచి, చిత్తమ్ము గ్రుమ్మ
నెడబాటు నెగులు; దానింటికి వచ్చి -
బుడుతని లాలించి - పొలఁతి భూషించి -
తల్లినిఁదేర్చి; శ్రీధాముని యాన
నల్లనఁ దెలిపి - తానామె నొప్పించి -
మఱునాఁడు - శ్రీరంగఁ డెఱిఁగించినట్టి
తెఱువును బట్టి తత్పురి దాటి నడచి
యోరంత వోయిన, నొక జీర్ణమైన
గారీతు కోవెల గనుపింప - నందుఁ

జొఱఁబారి చూడఁ గ్రిక్కిఱిసిన తమము
నెఱసిన యొక మూల, నిదురించుచుండె
శతవృద్ధుఁ డొక్కండు జడలైన కురులు
పతిత ధూళీ ధురావహములు గాగ
నెమ్ము లేర్పడిన కాయమ్ముతో, వెలుఁగుఁ
జిమ్మెడు వెడఁద ఫాలమ్ముతో - మేన
నిలువని యట్టి ప్రావలువతో, భంగ
ములులేని సంద్రమ్ము - పురుషోత్తముండు;
ఆజీర్ణ దశమి, నిజాంఘ్రులు - చెంతఁ
దేజరిల్లెడు చంద్ర దీప్త కిరీటు
కడుపూతమైన లింగమ్ముపై - దాచి
యొడలెఱుంగని నిద్రనున్న, వీక్షించి
నామదేవుఁడు నాగనాధునిపైన
నీ, మంపు సేఁతలి దెక్కడి నీతి! -
యాజడ ప్రాయుండు - హిత గురుండంచు
నీడకుఁ బంపెఁ దానెన్ని కేశవుఁడు
కానిమ్ము! చూచెదఁగా కంచు - నోర్మి
బూని - యోయయ్య! యో పుణ్యాత్మకుండ!
యిదియేమి నిద్దుర! యీశ్వరుపైనె
పదములు జాచి; భూ భాగమ్ము లేదె!
కనుదెర్వుమంచు, బిగ్గరగాఁగ - కర్ణ
మున నోరు వెట్టియార్చినఁ గొంతవడికి
నతఁడు, గన్గవవిప్పి - యల్లననవ్వి
ప్రతిలేని భక్తుండ! బాగాయెనోయి!
యూరెల్లవదలి - యెవ్వారు మాదరికి
రారంచు - నీ పాడు ప్రహరిలోఁ గనుక
నిచ్చటికిని వచ్చి, రచ్చ చేసెదవు
కచ్చగట్టినయట్లుఁ గావంగ నీతి

మేలువాడా! వయసు దూలి - బలమ్ము
మాలి - కాటికిబోవ వేళయైనట్టి
మాతోడిదేమయ్యా! మాత్సర్యభరము!
చేతమ్ము నొప్పింతు - వేతులఁబోయి——
పదములు లింగమ్ముపైఁ బెట్టి నతని
కెదుగనికిన్క, నీ కేల? చూడంగ
భరమయ్యెనేని, మా పదములుదీసి
పెరచోటవెట్టుము! కరుణతో నన్న
నామదేవుఁడు కృపాస్నపితచిత్తుండు
ప్రేమమ్ముతోఁదీసి పెఱచోటఁబెట్టె
నడుగులు, తోడన - బొడమెనందొక్క
యుడు రాజధరమూర్తి; యొండుచోనుంప
మఱియొక్క లింగమ్ము, వెఱఁగుబూన్చుడును
పెఱచోటనుంచిన, వేఱొక్కలింగ
మై, యెచ్చటెచ్చట నంఘ్రులువెట్ట
పాయకలింగోద్భవం బచ్చటగుచు,
శిలలెల్లలింగమ్ము, లలరువాకిళుల్
చెలువైనలింగముల్ లలిమొల్చినట్టి
గడ్డిపోచలును లింగమ్ములు - బయల
నొడ్డిన పుట్టలు నుర్విజములును——
లింగముల్ - తనవైన యంగమ్ములెల్ల
నంగజహరురూపు లింగమ్ములగుచు
విశ్వరూపము సూప - వెఱగంది, మఱి, య
నశ్వర చైతన్యు నావృద్ధుఁ జూడ
నతఁడు లింగాకారమైయున్న - దుఃఖ
మతివేలమై, కండకానినిగండ
పదము తొలంగి, తత్పదముల నంటి
దుడుకుతన మొనర్చి, ద్రోహియైనాను

నా తప్పు సైపుము, నాగనాథా! కృ
పాతరంగిత భావ! పార్వతీరమణ
యనిబిట్టు వాపోవ, నావృద్ధు నవ్వి
కనుగల్గిచూచిన; గలవిశ్వమందు
దైవంబు గానిది, తడవినలేదు
భావంబు నన్గాక, ద్వంద్వపరాస్త
మై మతి, భేద మిథ్యా కల్పనమ్ము
తో - మనుగడనెల్లఁ దూలఁ బుచ్చెదును;
పండరీశ్వరుఁడు నీ భావంపుఁ జెడుగు-
ఖండింపఁ దలఁచి - యిక్కడికంపె నిన్ను;
నీరేజనేత్రుని నియమంబు పూని
చారు భక్తి స్ఫీతు, జ్ఞానిఁగాఁ జేతు
నామదేవా! యన్న, నామదేవునకు
దామమ్ములయ్యె ముద్బాష్పసంతతులు
ఆ దినంబున నుండి, యతినిష్ఠతోడ
సాధింపఁ జొచ్చె నిచ్చలు గురుసేవ
యనెడు తపస్సు, హృదబ్జ సద్భక్తి
తన తోడునీడగా, దళితాఘుఁడైన
నామదేవుఁడు, నాగనాథుని రూపు
కామిత కల్పవృక్షంబు వీ సోబ,
పలుకుల - చేతల భావసంవాద
ముల - ననుక్షణమును బోధింప నెఱుక;
కలుగు నీ జగమెల్ల - కంధిగంభీరుఁ
డల పాండురంగని యంశమేగాని-
యన్యంబులేదని - యా సద్గురుండు
మాన్యోత్తముఁడు పెక్కుమాఱులు జెప్పు
చెప్పిన యర్థమ్ము చేతలఁజూపు
విప్పుమోహ గ్రంధి వినత శిష్యునకు;

నామదేవుఁడుపాడు, నారాయణునకుఁ
గా, మృదుకవితలు, కనులనీరోడి
తలనార్చి గురుఁడు, తత్కవితలు దిద్దు
నెలకొల్పి, జ్ఞానవాదల సత్సుగంధ
ములు, పాండురంగండు, తలమొల నెఱుఁగ
కలవారిముందు నాట్యమ్ములు సేయు;
ప్రతిపదార్థమ్మను - పండరీశ్వరుని
యతులిత రూపమై - యానందభరము
కంఠదఘ్నమ్ముగా - కళలొత్తగిల్ల
కుంఠీభవమ్మాయె - గోవిందుగుఱించి
ననుపఁబూవులు వాఁడు నామదేవుండు
ప్రణుతభక్తుఁడు, రంగపతి - వానివెంట
వెంటనె దిరిగిన, వీక్షింపఁదతఁడు -
కంటి, నీకలు, నిక్కము పొమ్మటంచు
కరములు దట్టి సద్గురుఁడు, ధన్యుండ
వరసితి మఱువంచు నగ్గించి పలుకు
నప్పుడప్పుడు మాయ గప్పిన, తెరువు
దప్పనీయక చూచుఁదాను సద్గురుఁడు
నీరీతి దిష్టంబు చేరువగాఁగ
నీరజాసన ముఖ నిఖిల సుపర్వ
అఱుసాచి - వేకారునట్టి జ్ఞానమ్ము
గురుదేవు కరుణచే కరబదరంబు
గానైన - 'వీసోబ' - కైవల్య వార్ధి
మానిత శిష్యుని మాళిపై హస్త
ముంచి, ప్రేమమున దీవించి, సత్పుణ్య
సంచయంబులు పండి - సాధించి కొంటి
వెఱుక - కృతార్థుండ వింక - కైవల్య
మఱచేతిలోనిది, యాజ్ఞాన దేవ

కరుణ నాకొసఁగె నఖండ మౌజ్ఞాన
మరయ ధరణినున్న హరిరూపుఁ డతఁడు
పరమగురుఁడు నీకు - భక్తితో వారి
చరణముల్ సేవించి - తరియింపు మింకఁ
బొమ్మం"చుఁ బలికిన - నెమ్మితో నడుగుఁ
దమ్ముల కెఱఁగి - గృహమ్మును జేరె
నానాట నుండియుఁ నఖిల విశ్వమ్ము
ప్రాణ ధనంబైన పండరీశ్వరుని -
యాకారముగఁ దోప - నఖిల చేతనము
లాకృపామూర్తి దివ్యాంశముల్ గాగ
పొలఁతి శ్రీధాముండుఁ, బుడుతండు రంగఁ
డడలతల్లి మా, నాధుఁ డక్కపక్కముల
వారెల్ల పండరీశ్వరులు, జంతువులు
నీరజోదర రూపు, పాఱు పక్షులును -
విచ్చెడు పూవులు - వీచెడు గాలి
యెచ్చోటనేది వీక్షించిన పాండు
రంగమ యంబైన - ప్రతి వేళ ముందు
చెంగలింపఁగ - రమార్చిత పాదతల్పుఁడు;
అర్చావతారంబునందె వేంచేయు
నర్చిస్స్వరూపుండు - హరియన్న మాట
దొలఁగి, తద్విరహంబు దలఁగి, యానంద
పులకితమై మేను, పూర్వంబు నట్లు
కోవెలకేగక - యేవేళ భక్త
పావన గోష్ఠుల భ్రమసి పాడుచును
ప్రతిభక్త ముఖమందు పండరీశ్వరుని
ప్రతి లేని రూపు దర్శన మొనర్చుచును;
యీ యెఱుకకు నెల్ల నిదియె కాకంచు
పాయక జ్ఞానదేవ పదంబు దాకు

చను, దన్నుమాలిన యనువున నున్న
చనుదెంచి యొకట నర్చావ తారుండు
నామదేవా! గురునాధుల కరుణ
నీమదిఁ జిల్కరించిన దాది యెఱుక
రావై తివేల దర్శనమునకైన
మరి, విభవమ్ముల మఱచితి వేమి?
యని చిఱునవ్విన, యంఘ్రుల నంటి
ననిచిన యెదఁ బల్కె నామదేవుండు
విశ్వస్వరూప! యనశ్వర సంవి
దధ్వర మాత్ర వేద్య విలాస! తొల్లి
నరయుదు నిన్ను - భీమరథీ తటస్థ
వరగోపురస్ఫీత ధర్మదేవాల
యాంత స్థితునిగాఁగ; నర్చావతార
కాంత స్వరూపుగా, కమలాఽధినాథ!
కటితటమ్మున యందుఁ గరముల బూన్చి
యిటుకపై నిల్చిన యీవె సర్వస్వ
మనుతలం పుండుట, నచ్చోటు వదలి
క్షణమైనఁ గదలిరా జాలక యుంటి
నీపనుపునఁజేపి నెనసెను, సద్గు
రూపదిష్టంబైన యుత్తమ జ్ఞాన
దీపంబు, దలఁగె, వేధించు నజ్ఞాన
పాపంబనెడు నొక్క బహుళ తమమ్ము
జీవేశ! చేతనాచేతనంబులను
నీవ గన్పడె దిష్టు, నిభృతమ్ముగాఁగ
నెన్న, నేనెచ్చోట నున్నను నీదు
సన్నిధినే యున్న చందమై తోచె
నేమి వచించిన హృద్య మౌనీదు
నామమే వచియించినట్లు భాసించె

నేది భాసించిన నీ యెదయందు,
నాదట నీ తలం పైనట్టు లయ్యె
నరయ 'విసోబా'స దంఘ్రి పద్మముల
దరి జూపె నాకింకఁ గొఱలేదు స్వామి!
తావక విరహంబు దావానలమ్ము
గా, వేధపెట్టుట కడచెనో ఱేఁడ!
గాని - యికొక్కటి గలదు నాకోర్కె-
దానిఁ గృపావృత్తి దయసేయవయ్య!
ఆత్మవంతుల లోన నభ్యర్చితుఁడు, పృ
'థాఁత్మజుం డన్నట్టు లతి చపలంబు
హృదయంబు, దీనిని గుదియింపఁ గడిది
మెదలు' గాలిని గట్టు మెయివడి, నింద్రి
యములకు దాసుండనయినట్టి నాకు
క్రమమున నిలుచునే! కపటంపు బుద్ధి
యది నిల్వకున్నచో నమకునే యెఱుక?
పదివేల తెరువులఁ బారాడ నైన;
స్వామి! సద్గురు కృపాసంపాదితమ్ము;
కామ రోధకమైన జ్ఞాన దీపంబు
నమర భావక్క- మా ననుకంపచేత
నమల కాంతుల వెల్గు నట్లుదీపించి
ననుగృతార్థుని జేయు మని తలవంప
వనజనాభుఁడు నవ్వు, వాతెఱగునిను
నా నామదేవుని హస్తమ్ము పట్టి
తానిట్లనియె భక్త తతితోడ, పల్కా-
డీ నామదేవుని నింక నపక్వ
మైన ఘటంబంచు ననువార లుందు
రా;" యంచు సద్భక్తు లాహ్లాదతుంది
లాయత చక్షుష్కలంకించు చుండ

నామదేవుఁడు భక్తి జ్ఞాన దేవులకుఁ
దా మౌళివంచె బోద్ధగురూత్తమునకు;
కడచెది నమ్ములు, గమలాధి నాథు
నడుగు దమ్ములవైన యందముల్దొలకు
పదరచనలతోడ, భావాభిరామ
నదివోలునెడఁదతో, నామదేవునకు
ఒకనాడు సద్భక్తు నొంటిగాఁ బిలిచి
వికసిల్ల నెమ్మోము, విశ్వరూపుండు
ఆచార్యకృపఁ బ్రాప్తమైన జ్ఞానమ్ము
లేచాయనున్నవం చిచ్చక మాడ
తలవంచి, యోదేవ! తలఁగక యున్న
దలసదాచార్యుని యనుకంప నన్న
మిన్నకుండెను స్వామి; మీదొక్క నాఁడు
పన్నుగాఁదానొక్క భషకమై, వాల
మల్లార్చుచును, వీధులందుఁ జుట్టుచును
నల్లన భక్తులమనుకొన్న వారి
యిండుల దూరుచు, నేదేనిఁదాక
దండంబు గొనివారు - తఱిమి వచ్చుడును
బాఱుచు, నటనటఁ దారుచు, చొంగ
గారు నాలుక తోడ గసబోపి కొనుచు
నంతంత మొఱుగుచు, నలికిడి యైన
గంతులిడుచు, గ్రొత్త గాన్పించుఁ దన్ను
వాడకుక్కలు వెంటఁబడి - కర్వరాఁగ
నూడని బాడుచు, నొగి వచ్చి వచ్చి
యా నామదేవు గృహమ్మున దూరి
జ్ఞానైక నిధియైన నామదేవుండు
రొట్టెఁదినుచునున్న - నెట్టన నెగిరి
తట్టన, నద్దాని దాఁదట్టు కొనుచుఁ

బాఱిన - గురుకృపా పరిణమగు, ను
దారమౌ నెఱుకచేఁ దచ్చునకంబు
పండరీశ్వరుని రూపంబుగాఁ దోప
నిండు భక్తుఁడు లేచి, నెయిలేని రొట్టె
నేరీతిఁదిందువో? యిందిరా జాని!
పాఱకు మయ్య! నాపై నెనరుంచి,
యిదె! ఘృతం బంచును ఘృత పాత్రబూని
ప్రిదిలిన కురులతో, వెన్నఁ బాఱుడును
నగుచును జనులెల్ల - నామదేవునకు
వెగటుగా నిడుబత్తి వెట్టికెత్తినది
పరికింపరండంచుఁ, బడఁబారి రాఁగ
బరువడి - శునకంబు బడిపాఱుతెంచి
నామదేవుఁడు, పురీ సీమనుదాట
నా మనుజులు నంతకంత విచ్చినను
అలసిన యదివోలె నాకుర్కురమ్ము
నిలిచిన, నద్దాని నెనరునఁదాకి
బుజ్జగించుచు, ఘృతమ్మున ముంచిరొట్టె
నజ్జాగిలము నోటి కందించు చిట్టు
లోరంత ప్రొద్దున్న, నున్నట్టులుండి
సారమేయంబింద్ర జాలమ్ము వోలె
మాయమై, యెదుట నున్మాదమ్ము వెంచు
నాయతమ్మగు కన్నుదోయి గలాడు
నలికమౌ నడుమున నిలిపిన యట్టి
చెలువమౌ కరములచే కట్లవాఁడు
అలకల సందుల యందుండి గ్రమ్ము
సొలపుల తెక్కల చూపుల వాఁడు
పాండు రంగఁడు నిల్చి, "భక్తకోటీర!
ఖండి తాజ్ఞాన దుర్గమవన! యెట్టు

బుంటివో జూడంగ నుల్లంబు పుట్టి
వెంటన నీకొక్క వింత సూపితిని;
గురుకరుణా పరిస్ఫురితమౌ తెలివి
తిరమయ్యె నీయందు, ఁదీఱెనానెగులు
పోయి వచ్చెదనన్న - బురుషోత్తమునకు;
నాయెద వందించె ననఘ భక్తుండు
కడచెను కాలమ్ము, గాత్రికి కమ్మ
బొడతెంచె వికచాబ్జ పుంజ పింజరిత
జలము, సప్తచ్ఛద లలిత పరాగ
విలులితమారుతమ్ముల తోడ, జలధ
రాంగనా మణిత విభ్రమముల తోడ
తుంగేక్షు వనపాలి కాంగ విన్యాస
వాసిత కలకంఠ భూషిత గాన
మాసరమదనమై - మధురంపు వేళ
చేరి శుద్ధైకాదశిని - నామదేవుఁ
డారవి నేత్రుని యండ, కీర్తనము
సేయుచు నుండిన, యోయి! యీనాఁడు
మాయింట భుజియింపుఁమని శ్రీశుఁడనిన
హరి వాసరము నేఁడు, దురితంబుగాదె!
యరయక భుజియింప - నశ్వత్థమెట్టు
లగముల, పత్రంబు లందు శ్రీతులసి
వగయెట్లు, సర్వదేవతల నీవెట్టు
లటుల వ్రతములందు హరి వాసరమ్ము
కటకీ కృతశ్రుతి! కడిదియౌ తపము
ఈనాఁడు భుజియింపనిఁక నెన్ని జన్మ
లైనను నినుజేరు నాసలు గలవె!
క్షమియింపుమన్న శ్రీకాంతుండు, పెదవి
గమిచిన నవ్వులై, గారవించినను

మఱికొన్ని నాళ్ళేగ, మధుసూదనుండు
సరస భక్తునియెడ శాస్త్ర గౌరవము
లేపాటివో! జూడనెంచి, తానొక్క-
బాపఁడై జీర్ణ చీవరములు గట్టి
తలవణకఁగ - పాదములు తొట్రిలంగ
నిలువెల్ల చర్మమ్ము వఱువట్లు దూల
పలు తెఱగులులేని వదనమ్ము, మిత్తి
యలఁతి నవ్వులు నవ్వినట్లు భాసింప
వట్టిపోయిన బావులట్టి నేత్రముల
నట్టిటు బారాడ నలఁతి జీవమ్ము;
నామదేవుని యింటి నడవలో నిలిచి -
యో మహామతి! సమాఖ్యోత్తరా! దీనుఁ
డను, బ్రాహ్మణుండను - కనికరంబుంచి,
ననుగాచికొనవె యన్నము వెట్టి? యనుచు
నఱచిన, వెసవచ్చి - యా విప్రుచరణ
సరసిజములు శీత జలములఁ గడిగి
వేంచేపు సేయించి, వీవన వీచి -
మంచి మాటలనాడి - మజ్జిగ నొసఁగి
కరములు మొగిచి, యేకాదశి నేఁడు
నరకాలవాల మన్నంబును దినుట-
జఠరులు తాళజాలరయేని, పండ్ల
నరికట్టు డాకలి'యన్న - ముక్కోప
కాడౌట, విప్రుండు కటకటం పడుచుఁ
బాడైన ధర్మముల్ బచరించి, యన్న
మింత బెట్టఁగలేక - యెగుర గొట్టెదవు
బంతులు దీర్చి - వేదాంతముల్వాలికి;
బ్రదికినగాదె! ధర్మములు, ప్రాణంబు
కదలించు ధర్మంబు; పదటికి గాదె!

అన్నంబు పెట్టక - యాగడించినను -
కన్నులు మూతు - మీ కడపలో, నీకుఁ
దప్పదు బ్రహ్మ హత్యా దోషమనుచు
నప్పాటుఁదగ్గి నిర్వైశరించినను
రంగండు దలఁచిన భంగిగా నిమ్మ
భంగంబు నొందింప పరధర్మ మనుచు
నామదేవుండనె, నా మహీసురుఁడు
సామమ్ము వీడి; క్రచ్చర శపించుచును
వైవస్వతునకు నొప్పందమున్నట్లు
దావీడె నసువులు ధరణిపై దొలఁగి
యవకాశమునకునై - యాకలి గొన్న
భువిజనుల్ వీఁడట! పుణ్యుండు - పాటుఁ
జూడఁజూడఁగఁ జంపె నోడక, వీని
పాడుట లాడుటల్ - పగటికే యంచు
క్రంతల నిలిచి, వ్యాఖ్యానముల్ సలుప
దొంతరలుగఁ గండ్లఁ దొలక బాష్పములు
నాపాలు నెత్తి కొంచఖిల భాగవతు
లాపాటఁ దనవెంట నంటుచు రాఁగ
మననమ్ము సేరి, రమాజానికేని,
మనటు గల్పించితి, మనుగడ కింక
నీవిప్రుతోడన నింకును గాక
జీవమ్ము లనుచును, ఁజిచ్చు రగిల్చి
తానును మంటలోఁ దడయక పడిన
మానినీ మణి భర్తృ మరణ ప్రయత్న
మును జూచి, నామదేవుని ధర్మపత్ని
గొనకొని, తానును గూడఁ జిచ్చులుక
యపుడు హాహాకార మంబరంబంటి
కృపఁ జూడవేమి లక్ష్మీనాధ! యంచు

భక్తులార్చిన, చలజ్జ్వాలా జటాల
ముక్తమౌవహ్ని తానపుడ చల్లారి
లలిత పీతాంబర కలిత కటీర
తలవినిహిత కరద్వయ విరాజితుఁడు
సురమౌళి మందార సుందరోదార
తరసుగంధ నిబంధ చరణపద్మృండు
ప్రతి ముహుర్విస్రంసి భద్రోత్తరీయ
ప్రతి కర్మసాధన వ్యగ్రమానసుఁడు—
కస్తూరికాపంక కర్దమిత, ప్ర
శస్త వక్షోరత్న శబలితమూర్తి;
శతశస్సహస్రశస్స్యందిరుగుచ్ఛ
యుతమణి కుండలాన్విత శ్రుతిద్వయుఁడు
లలితకపోలఖురళికాచలన్మృ
దులహాస చంద్రికాకులిత దిక్కుఁడు;
సారంగనాభికా సమ్మర్దమృదిత
చారుకుంతల భృంగ సంగతాలకుఁడు
చకచక త్పింఛగుచ్ఛ విరాజికేశ
నికరోద్గ్రథితమౌక్తిక కలాపమూర్తి;
పాండురంగఁడు దోచి, భక్తుని లలిత
గండముల్ చుంబించి, కౌగిటఁ బొదివి
బాపురే! వైరాగ్య భావకాసార!
బాపురే! ధర్మనిర్వహణైక ధీర!
భళిభళి! సద్భక్తి భర్మభండార!
కలిమలభార సంక్షాళనాచార!
ఆశాంత యౌవతహారసత్కీర్తి!
పేశలగుణ వాసితాఽసమమూర్తి!
నా యుద్ధవా! యుద్ధవా! యెంతవాఁడ
వోయి! సద్భక్తుల కుత్తంసముగను

చరితంబొనర్చితి, చలియింపకుండ
దిరమౌనుగాత! సద్గురు కృపాదత్త
మైన యఖండ బ్రహ్మాకార సంవి
దానందమని మౌళినాశీస్సునింపె
భాగవతవ్రాత బహుజయకార
మా గుబ్బుగొనె గగనాంతరంబందు
నామదేవుఁడు కన్నుదామరల్నిలిపె
నా మురళీధరు నడుగులయందు
జ్ఞానదేవుఁడుమోవిఁగనుపించునగవు
లైనగధరుఁజూచె, నానంద జలధి;
నామదేవుఁడు సుధానదులు వాఱించె
భూమి సత్కలితల పొడలైన భక్తి;
హరియానచే వచ్చినట్టి యుద్ధవుఁడు
హరియానచే నందెనానందపదవి;
నని యిట్లు విష్ణుభక్తాధీనపాద
వనజపరాగ సంవాసితమౌళి
తలిచేత, రససముజ్జ్వల కావ్యస్వజన
ఫలితప్రభవుచేత, బహువాఙ్మయప్ర
సిద్ధ మహాకవి, శుద్ధసద్గ్రంథ
శుద్ధాంత సంచరద్బుద్ధిచే రసవ
శంవదహృదయుచే - శశ్వదాభాసి
సంవిత్స్వరూప కృష్ణముఖారవింద
విగళిత వేద్యాంతరగతిచే, భక్తి
నిగడితమతిచేత, నిరతసంజప్త
పావనాష్టాక్షరీ వరమంత్రదత్త
భావనానంద నిష్ప్రత్యూహఫలిత
గురుకృపారసుచేత, విరచింపఁబడిన
పరమంబు పండరీభాగవతమున

నిదినామదేవుని సదమలచరిత
మిది భక్తికాసార, మిది పాండురంగ
విమలయశోజ్యోతి విస్తరించిన న
భము, భవబంధ సంభ్రాంత ముముక్షు 40
జన శాంతిదము, ముక్తికనపాయమైన
మననంబు, పాండురంగని శరీరమ్మ
ఉక్తుల విష్ణుపాదోద్భవ, రిక్త
రిక్తులాడు త్రివేణి, కృతమహాపాప
ములనెల్ల బోకార్చు, వెలలేనిమందు
వెలయును సూర్యచంద్రులతోడిదగుచు 43

---

# పండరీభాగవతము

## (గోరాకుంభారు కథ)

శ్రీకామినీ కుచార్చిత పాదకమలుఁ
డాకృతిగొన్న బ్రహ్మానంద భరము—
సనకాది హృదయ కాంక్షానదీజలధి
ప్రణతామరీనేత్ర పంకజమహము—
కలిమలజ్వలదేకగతిపయోధరము
లలితవంశీరాగలాస్య పీయూష
సరసి—విఠ్ఠలమూర్తి సాక్షాత్కరించి
భరియించుచుండెడి పండరిపురికిఁ
బరగు దూరమునందుఁ బల్లియ యొకటి
"తరడోకి" యనుపేరఁ దనరుచునుండు
నలరు "గోరా" యను నభిధాన మొనరఁ
గులహిత వృత్తియౌ కుమ్మరియొక్కఁ
డందున-పూర్వభాగ్యములు ఫలించి
క్రందుకొన్నది చిత్తకంజంబు వాని
కావిఠ్ఠలేశుని యడుగులయందు—
భావింపఁడు పురాణ భావార్థములను
దఱచి చూడండు ప్రస్థాన త్రయమ్ము
పరికింపఁడు ప్రమాణ వాక్యమ్ములెల్ల
శోధించి విప్పండు శుద్ధమ్ముగాఁగ
బాధాంత తర్క తీవ్రగ్రంధులెల్ల
నదియేమి చిత్రమో! యప్రయత్నముగఁ
జదువుల మర్మంబు చదివినాఁడతఁడు
చదువేల! యాజన్మ సంస్కార భరము
పొదలు కారణజని పుణ్యమూర్తులకు!

వారిమాటలయందె వర్ధిల్లు శ్రుతులు
వారి పల్కులఁబొంగి పారుసత్యమ్ము—
వారిచేష్టితములు వరపురాణములు
వారి చూపులు లోక భద్రరూపములు
వారిపుట్టువులు దుర్వారసంసార
నీరసమాన వోన్నేయ పరములు—
వారి దివ్యకథాను వాదనంబులను
శౌరియే యెద మెచ్చి స్వయముగాఁ జేయ
నట! యిఁకఁ గొదువేమి యట్టిపుణ్యులకు
కుటిల శాస్త్రార్థముల్ కొల్లలునేర్చి
పనిలేని కుత్సిత వాదముల్ ద్రవ్వి—
మనము శ్మశాన ధూమమ్మునుబోలఁ
గనులలో గర్వంబు కరుడు గట్టంగ
తనపుట్టుకయె వసుధకు మండనంబు
గానెంచి, దైవంబుగాఁ దన్నుఁ దలఁచి—
కానవచ్చినవారి గద్దించి చూచి—
పరనిందయే యొక వ్రతముగాఁబూని—
యఱకాసు బోలని యట్టి మెప్పులకు
మురిపి - మానవుల సంభాషించి - వారి
కరుణచేఁగొన్న సౌఖ్యంబులుగుడిచి—
యేగాలికా చాప నెత్తుచుఁదిరిగి
భోగంబురోగమై పురులు దూలగను
బరదూరులై పోవు పండితమ్మన్యు
లరయుదు రెట్లు బ్రహ్మానందపదవి!
అతఁడు గుణాతీతుఁ,డతఁ డప్రమేయుఁ
డతఁడవనీ తపఃప్రాప్తంబుసిద్ధి -
యతఁడు పురాణ వాక్యార్థైక లక్ష్య
మతఁడు నైగమ వీధి కామల జ్యోతి

అతఁడు నిష్ఠాతత్త్వ - మతఁడు పావిత్ర్య
మతఁడు పండరినాథు నంశావ తారుఁ
డవజితక్రోధుఁ డహంకారశూన్యుఁ
డవికారి - భాగవతాచార శీలి—
జ్ఞానాగ్నికుండవషట్కృత భౌతి
కానేకచాపల్యుఁ డభినందనీయ
పండరినాథ దివ్యపదాబ్జభక్తి
మండితుఁడఖిల సమ్మాన్యవర్తనుఁడు—
దళితాఘుఁ, డుపకార తత్పరబుద్ధి
కలివియుక్తుఁడు కుంభకారభక్తుండు
జ్ఞానస్వరూపుఁడై సంసారమందుఁ
దాను వర్తించు కతన, బంధచయము
లంటలేదతనికి - నబ్జపత్రంబు
నంటునే సలిలంబు, లబ్జాక్షుభక్తి
పూతులింద్రియములఁ బ్రుంగి చిక్కుదురె!
అతని యిల్లాలును పతియన్న శివుని
ప్రతిగాగ నర్చించు భావంబుగలది—
సతతోపవాసకృశాంగి - స్వభర్తృ
చరణధూళ్యంకి తార్చ్య నిటాల - ప్రేమ
పరిణతమూర్తి, బంధురనీల వక్ర
చూర్ణకుంతలశోభి సుందరవక్త్రి;
కర్ణమూలాయాత కమనీయనేత్ర—
సంచిత దివ్యవిజ్ఞానాత్మ - వినయ
కుంచితాపాంగ, యాకుంభకారునకుఁ
గాఁగ ధరాస్థలి కవతరి చినది
త్యాగలక్ష్మి యనంగఁ దద్దయుఁ బ్రీతిఁ
బతిసేవసేయుటే వ్రతముగా నడపుఁ
బతికన్నులనె దన భావమర్పించుఁ—

బతికొఱకే దాను బ్రతుకు - రంగనికిఁ
బతికిని భేదమావనితకు లేదు—
కలదువారలకు సౌఖ్యగ్రంధి - యొక్క
కలకల నవ్వులు మొలచెడుశిశువు—
వాని కన్నులయందే భావించుకొందు
రానలినాక్షు దివ్యస్వరూపమ్ము—
వానిచేతలఁజూచి వర్ణించికొందు
రానిగమాత్ము బాల్యచరిత్రములను—
వాఁడన్న వారికిఁ బట్టియేగాదు
వాఁడు పండరిలోని పాండురంగండె—
వాఁడు కారా జాతనగ్నకృష్ణుండు
నేఁడొక్క గుడిసెలో నెలకొన్నవాఁడు
ఈరీతి వాత్సల్య పూరితమతులు
దారచరిత్రులు దారు జంపతులు
చరియించు చున్నారు శాశ్వతానంద
పరిపూర్తికొక్క దివ్యము పాసనమ్ము—
చిఱువెన్నెలల చల్వచిందినయట్లు
విరులపై నెలగాలి పఱచినయట్లు
తేనెలు సోనలై దిగజారినట్టు
లానందమే రూపమై నిల్చినట్టు
లందమే పొందుగా నమరినయట్టి
చందమై - పాపని సరస ముఖాబ్జ
మందు నవ్వులు నాట్య మాడినయపుడు
గందురు పితరులు గన్నులనవ్వి
తమలోనఁ దాముగాఁ, దల్లి మనమ్ము
భ్రమియించు వాత్సల్య రసపరిప్లుతము
జనకుని మానసాంచలములదాకి
చనునొక్కసారి యీ షత్ప్రేమశైత్య—

మతఁడు భావించిన నాత్మ భావింపఁ
డతఁడు సూచిన హృదయంబుతోఁ జూడ
డనుభవించిన నైన నాత్మలగింపఁ
డు - నియతేంద్రియుఁడుపడునె బంధనముల!
మానినిహృదయమమ్లానసుమమ్ము
వానిచేతోవృత్తి వజ్రకర్కశము
మగువ చిత్తమ్ముప్రేమమునఁ గోమలము
మగని చేతము తర్షమలినంబుగాదు
జగమెల్లఁ బ్రేమింప సాధ్వి చింతించు
మగఁడుదాసీనుఁడై మలయుచునుండు
సంసార చక్రంబు సత్యంబు సతికి
సంసారభరము తుచ్ఛము మిథ్య పతికి
జగదేక రూపుగా సాధ్వి బూజించు
నగధారి - నిర్గుణుఁడంచుభావించు
ధవుఁడు - విభిన్న వర్తనులిరువురును—
గవగూడికొని రొక్క కాపురంబందు
నామెనే ప్రాణేశుఁడనుసరించెడునొ?
కామినిఁబతియె యాకర్షించుకొనునొ?
వారిరువురి భావ బంధమ్ములదుకు
మారరూపుండు గుమారుఁడొక్కరుఁడు—
తరళనేత్రముల మందానిలమట్లు
బరుగిడముగ్ధభావమ్ములు - కూన
తనవైపు జూచిన దండ్రిచిత్తమునఁ
గనుపించు సగుణమై - కంజాక్షమూర్తి—
యలకవచ్చినవేళ నక్షులుమొగిచి
చిలిపి నవ్వులులేక - చేతులుగట్టి
పలుకకకూర్చున్న బాలుని జూచి
పొలఁతి భావంబులో పలనిర్గుణుఁడుగ

భాసించుఁబరుఁడైన పండరినాథుఁ
డాసమయములందు నతఁడు క్షోభించు
నప్పుడు జనని యత్యాశ్చర్యమొందు—
నప్పగిదిని బాలునందగా నిలిచి
యాడించుచున్న వాఁడఖిలైక వృత్తి
కూడికూడని యొక క్రొత్త నాటకము!—
అలకలనొత్తి, కుంతలములు దువ్వి,
చెలువంబుగాఁగొండె సిగవేసి - విళ్ళ
ముడిచి, గోర్వెచ్చని ముద్దులువెట్టి,
జడదీర్చి - పచ్చనిసంపెగల్దుఱిమి
కందమ్ములందునఁ గాటుకదిద్ది
యందముజ్జెలగెడు నలిక పట్టంబు
నందు జిత్రకమిడి, యనురాగ మొనర
నందిక జేర్చుక్కఁబొందుగాఁ దీర్చి—
కలగండ దర్పణంబులనోష్ఠచిబుక
తలములఁజిట్టి చుక్కలుగదియించి—
సందిట తాయతుల్ సవరించికూర్చి
కందమ్మ యడుగుల గజ్జెలుగట్టి
యీచెంప నాచెంప నెత్తిముద్దాడి
యాచపలాక్షి కుచాగ్రంబులువికి
గోరువెచ్చని పాలు గురియుచునుండ
రార! నాకృష్ణమ్మ! రమ్మంచురెండు
గరములు దాచి ముక్కలగదలాడ
శిరమార్చి చీరి బొంగరమట్లు ద్రిప్పి
గిలిగింత వెట్టి నవ్వులను దెప్పించి
కలకల నవ్వులోఁ గర్పూరమట్లు
గరగెడునప్పుడు - కామిని వైపు
సరస కటాక్షవీక్షణములఁజూచు

పతి - సిగ్గుతోవింత పరుగులువోయి
సతి - దనలోననే శాంతించికొనును——
కురులు జిక్కువడంగఁ గూకటుల్ చెదర
నరవిరి గన్నులయందుఁ గజ్జలము
మాలి - మోమునగాంతిదూలి - మన్నదిని
ధూళీ పరిప్లుత ధూసరాంగముల
బూడిద బుస్సన్న వోలికఁబిల్ల
వాఁడు బాజారులోఁ బరుగిడునప్డు
కన్నతల్లి మనమ్మికంది - వెంటఁబడి
యన్న! రమ్మంచు నాహ్వానించు వేళ
జనకుండు మధురహాస్యచ్ఛురితంబు
కనుచూపు జల్లిన - కామిని యెదను
హత్తించుకొను హృదయాంతర జ్యోతి
దత్తరపాటు - నుత్తలపాటు గదుర——
నన్న! యక్క! యటంచునందఱజీఱి
యన్నువ ప్రేమమాటాడించుచుండు——
బిలచినఁ బలుకండు - పలికెనయేని
యలనల్ల నాతఁడు నఱవల్కు వలుకు——
నతఁడు కూటస్థునకాత్మలో వెదకు
నతివసగుణరూపి కాత్మలోగరఁగు——
చిరిగిన వస్త్రంబు నఱకొఱతిండి
యఱకొఱ నిద్రయు నైననేమాయె
వారు తృష్ణాసంగ వర్జితులగుట
వారు మహారాజ్యపట్టవైభవులు——
కుమ్మరి కులవృత్తిఁగుండలు జేసి
యిమ్ముగానెత్తి పైకెత్తికొన్నంత
ముదిత కుమారు వీపునఁగట్టికొనుచు
సదమల పావిత్ర్యసంపదవోలె

నడుగులో నడుగులనిడుచు వెన్దవులు
యడజడిలేని తుష్టాంతరంగమున
పతి పాండురంగని భవ్యగీతముల
నుతియింప నతిసముత్కృత మదినెనపి
పడఁతిసూడిగములు స్వనియింపతుఋము
పడకంగ సాత్త్విక భావముల్గ్రిమ్మఁ
దనువుకంపన మొంద - తలపులు బూయ
వెనువెంట బాడును, విన్నవారెల్ల
నిడువెండ్రు కలువెట్టినిలిచెదరింక
నడుగఁగనేమున్న దాయదృష్టంబు!
పండరి పురిఁజేరి - వాడల బెట్టి
కుండలన్నియు నమ్మి కొన్నంతఁ 'గాని'
పూవుటెత్తులుగొని వోదురురంగ
దేవాలయమునకు దేవియుఁదాను
సమచరణమ్ముల సౌందర్యముబుక
రమణీయ హస్తతలములు - గటీర
మున వికసింపంగ ముగ్ధవినీల
తనువు లావణ్య సీమనను వదింపఁ
గలికి గన్నులయందుఁ గరుణదొలంక -
గళలెల్లదానుగా నిలచినవాని
లావణ్యలక్ష్మీ విలాసమౌవాని
భావజకోటిరూపముగలవాని
సనకాది ముని మనోధనము - విఠలుని
గనులలో గౌగిలించిన యంతలోనె
మఱతురు లజ్జ, నే మఱుతురుమేను
మఱతురు లోకమ్మ మఱతురుమదులు
కొనితెచ్చినట్టియా కుసుమమాలికలు
వనజనాభుని పాదవనజంబులందు

వైచి - క్రొంగ్రొత్తవైభవమావహించి
వాచంయమానీక భావసౌగంధ్య
భరితరూపుండైన పాండురంగనికి
కరయుగంబులు మోడ్చి కనుగవమోడ్చు
తారుదండమువెట్టిఁ - దరుణి గుమారు
చేరంగ మూర్తికిఁజేయి మోడ్పించు
పదపడి నామదేవాదికభక్త
వదననిర్గతసుధా మధురగీతములు
దలవోసి తలవోసి తడవకుఁబాడి
యిలుసేరికొంద్రు రేయికిగుటుంబమ్ము
పండరినాథ దివ్యచరణాంబుజము
లంద - వారికి నెల్లయవసరంబులను-
కలలలో పాండురంగని వైభవమ్మె
దలఁతురు మేల్కొన్న తరుణంబులందు
గొలుతురు వాని సలలితరూపమ్ము
బలుకుదురతని దివ్యమ్ము నామమ్ము
కలకంఠ సతివోలెగామినివాడ-
జలధరమును వోలె శబ్దించు నతఁడు
నా పలుకులగ్రోలి యతివ నిల్వెల్ల
నీ పవృక్షమువోలె నినుచును బులక
లమ్మది తనుగాంచి యార్ద్రాక్షుఁడగుచు
నెమ్మికై వడివాఁడు నృత్యమ్ము సేయు
దనపితరుల గనుంగొని బాలకునకుఁ
గనుల నిరమ్మదకాంతులు దూయు
తరడోకిలోని యందఱయిండ్లు - హర్ష
పరవశములు - దమపనులను మఱచు;
నొకనాఁడు ప్రత్యూష వికచనీరేజ
నికర ధూళీపాళి నీరంధ్రితాంగుఁ

దలస సమీరకుఁ దవనీమృదూరు
తలమునకెగ బ్రాకు తరుణంబునందు
హరినామ చింతనాతురుఁడైనవాఁడు
పరమభక్తులకొజ్జబంతి యౌవాఁడు
భవబంధనము లెడ బాపినవాఁడు
కవచితశాంతి - నిష్కలుష మానసుఁడు
స్థండిలశాయి మితాహారభోక్త
పాండురంగ వియోగబాధాఽసహిష్ణు
డాకుంభకారకుఁ డక్షులు విప్పి
శ్రీకాంతు రూపంబు చిత్తంబునందు
నిలుపుచుఁ దనయెద నలినమృణాల
వలయంబువలెనున్న వనిత హస్తంబు
దెమలించునంతలోఁ దెలివి నొందినది
కమలదళాక్షి చిక్కనిక నుల్విప్పి;
పరమము నీంద్ర శాపవశంబుచేత
ధరణికి దిగిన యచ్చరలేమవోలె
నిలువెల్లనందమే నెలవుకొనంగఁ
దెలినవ్వుల ధరశుక్తిక నల్లలాడఁ
గుడిచంటిలోఁబాలు గుడిచెడునట్లె
పడుకొన్నబాలుని వదనంబునందె
యున్నకుచంబు ప్రేమోద్భూనమగుచు
వెన్నెలపాలు స్రవించుచునుండ
పచ్చిసంపెగల సొబంగుల బుడికి
పుచ్చికొన్నట్టి చూపుల నాధుజూచి
ముక్కర గదలాడ ముగుదరసార్ద్ర
వాక్కులతోనాడెఁబరియాచకమ్మ
"తానట! యొకఁడు భక్తాగ్రేసరుండు
మానినీ హృదయసమ్మర్దదూరగుఁడు

యిల్లాలి కనుగప్పియేగెడునంట
గొల్లగొట్టెడు నాస గోవిందుభక్తి
దాఁజేయు భక్తి, నర్ధమ్ము భాగమ్ము
గాఁజేయుసతియని, కానఁడోగాక!
తానట! యొకనాఁడు తరుణి కటాక్ష
దీనుఁడై గోర్కెను దీర్చినాఁడంట -
యానంద గర్వయై యతివగన్నదట
సూనాస్త్ర నిభుఁడైన సూను నొక్కనిని
యిన్నియుండినను యోగీశ్వరుఁడంట
గన్నులుగప్పు తెక్కలి మొనగాఁడు
తనత్రోవ తనదట! తరుణునికొడుకు
గనఁడట! వారేమిగావలె సుమ్ము!
పరమాత్ముఁడిట్టి నిష్ఠురభక్తిమెచ్చి
కరుణించునేమి! నిక్కముసెప్పు" డన్న
దాని గ్రహించి మందముగాగనవ్వి
కానవే ప్రత్యూషకాలమ్ము పరమ
పూతమ్మురంగని పూజనమ్మునకు
నాతి! లెమ్మన్న మందాలసముగను
పిల్లనినోట దీపించుకుచమ్ము
నల్లనదెమలించి - యలకలనొత్తి
జోకొట్టి - యడిసిగ్గు చూపులకొనల
నాకట్టఁజూడని యట్లుగానాధు
బరికించి యావక పాటలాధరము
నరవిరి తెలినవ్వులా గుబ్బగొనఁగఁ
గుదియించికొను పూన్కి - నదవదమైన
మదినొక చాయగా నదుపులోనుంచి;
మీనకే తనక్రమ తూణీరమట్టి
వేనలి యురియాడగా నలివేణి

శిరము వంచుచు నమస్కృతిసేసె - పుణ్య
పరిణతమూ ర్తికి ప్రాణనాధునకు,
ఫాలంబునందు నిర్భరమోక్షసౌఖ్య
మూలమ్ముధరియించెఁ బూతరజమ్ము;
పలికెడు కోయిల పాటలోఁ గలిపి
పలుకఁదొడఁగిరి దంపతు లిరువురును-
కమనీయ తమము శ్రీకాంతునామమ్ము
చెమరింపఁ దొడఁగెను చిఱుగాలివొరలు
చెమరించి రిర్వురు శ్రీనికేతనుని
రమణీయభజన సాంద్రా నందవశత;
తలలన ల్లార్చె దీవెలు మెలమెల్ల
దలలనల్లార్చి రీ ధ్యానతత్పరులు
కుముదముల్ ముకుళింపఁగోరిననేత్ర
కుముదముల్ మొగిచిరి - విమలదంపతులు-
తెలివిసేరినది దిక్కులయందు తూ ర్పు
మలయేన్గునకుముఖ మండనంబట్లు
సరభ సాయాత వాసర రమాచరణ
పరిగళి తమ్ము ప్రభాపిహితాంత
రావకాశము పద్మరాగనూపురము
నావెల్గెఁగమలినీ నాథ బింబమ్ము-
పంకజ కేసర ప్రతిమముల్ సాంద్ర
కుంకుమోపమములు - కుపితనితంబి
నీ కటాక్షాంకూర నిభములు చక్ర
వాకరాగోద్రేక వర్ధిష్ణువులు - ప
యోజినీ సరస ముఖోల్లాసముల్ - ద్వి
జాజిర దత్త సంధ్యార్ఘ్యమాహాత్మ్య
పరిణద్ధకాంతులు - బ్రహ్మభూయములు
ధరణి జీవముల చైతన్యరూపములు

ప్రసరించినవి బాలభానుకరమ్ము;
లెసలారు వేడుక నిందీవరాక్షి
దనపతి యానతి గొని యింటియందు
బనులుదీర్పఁగ బూని చనినదిగాని
మనమున రంగని మధురనామంబు
కనులలో భక్తిరేఖయు మాయలేదు
విగళితేంద్రియ వృత్తి విమల సంస్కారుఁ
డగణిత జ్ఞానతమోర్కుండు - పాండు
రంగనిష్ణాతుండు - సంగవిదూరుఁ
డంగీకృత తితిక్షుఁ డత్యంతశాంతి
పరిణాహి పరివేషభాసురమూర్తి
కరమరుదగు కుంభకారభక్తుండు
పరమూత వడినట్టి యశ్రులతోడ
బరుగులువెట్టు బాష్పమ్ములతోడఁ
జలియించుచున్న హస్తమ్ములతోడ
మొలకలై నిలిచిన పులకలతోడ
నలసాలసంబుగా నంగంబులూగ
నల్లనల్లలేచి కాల్యమ్ములుదీర్చి
యతసీసదృక్షదేహ ప్రభాంకూరు
నతమౌని మానసానందప్రసారు
బహుపురాణనికాయ భావైకసారు
మహిత శ్రుత్యంగనామణి పరిష్కారు
యాదవీమధురత్రపా దిగ్ధగండ
కేదారపులక లక్ష్మీజలధరము
నామదేవాది మహామహచిత్త
తామరసాకర తరుణ బంభరము
జ్ఞానేశ్వరీగ్రంథ సరసకల్హార
సూన పరాగమ్ము, శుద్ధసత్వమ్ము

కలియుగ మాలిన్య కతకఫలమ్ము
కళగల్గు పాండురంగని రూపుమదిని
కొలువుదీర్పఁగ, భాండములుసేయు పొంచె
పులకాకులిత తీర్థభూతదేహుండు
మన్ను ద్రొక్కుచునుండె, మహనీయమూర్తి
మన్నుద్రొక్కుట గూడ వన్నెదెచ్చినది
వానికి - మరి యాత్మవంతులకే వి
ధానమ్ము! గౌరవాధానమ్ముగాదు!
సమదృష్టితోడఁ గాంచన లోష్ఠములను
గమనించు బుధుఁడు - సుఖమ్ముదుఃఖమ్ము
వేఱువేఱుగను భావించునా! యేమి?
శౌరినిధ్యాన నిష్ణాతుండు - గరళ
సదృశంబులైన శుష్కములు సౌఖ్యములు
మదిగోరునే! విష్ణుమధురగుణాను
వాదనానందలవంబుతో సరియె
సౌదామినీలతా చపలవైభవము!
వారుగోరిన విభవములకుఁగొఱయె
వారికుటీరంబు ద్వారంబులందె
యష్టసిద్ధులు నిల్చి హస్తముల్మొగిచి
సాష్టాంగపడును నాజ్ఞాప్రతీక్షములు;
వారుకోరరు, వారు గోరినయేని
కోరుదు రాశౌరిగుణ కీర్తనమ్ము
కుమ్మరియెదలోన గోటిధేనువులు
చిమ్మినవానంద శిశిరదుగ్ధములు
అనుకరించినది సంధ్యాంతరిక్షము
ననురాగతుందిలమౌ వానిమనసు
తారకారత్న సంతానంబునాను
దారభావమ్ములు తరళించినవియు

ప్రతియయ్యెనందనారామమ్మతోడ
తతపులకా పూరితమువానిమేను
రంగ! రంగా! యన్న ప్రత్యక్షరమున
జెంగలించినది విచ్చిన యెలనవ్వు
గళమెల్ల గద్గదాకలితమై - వెడలు
పలుకెల్ల సద్భావార్ద్రమై - వెడఁద
కనులెల్ల జీవనకలితముల్గాగ
దనువెల్ల మఱపును మనమెల్ల జడత
గవిసికొనంగ హృత్కంజంబులోన
దివిరి ప్రకాశించు దీపంబుగనుచు
వనజాసనాది దివ్యాభికాంక్షితము
ననుపమంబైన బ్రహ్మానందసుఖము
ననుభవించుచునుండె నాకులాలుండు
ప్రణతయౌవత శిఖాలంకారమైన
ధరణికిదిగిన నిర్జరపుణ్యమైన
పరమపావిత్ర్య రూపంబైన, వాని
పడతికినింటిలోఁ బనిదీరలేదు
పడుకొన్నబుడుతండు ప్రాభాతమధుర
శతపత్రములబోలు చక్షులువిప్పి
వితతఫాలస్థలీ విభ్రాజమాన
చూర్ణకుంతల శోభ, సోగలై మౌగ్ధ్య
పూర్ణంబులైన చూపులకాంతి - యింటి
కొకవింత వెలుఁగివ్వ, నోష్ఠవిపంచి
జికిలినవ్వులపాట చిందులాడంగ
దనకట్టెదుటనున్న దండ్రినిజూచి
దనకరంబులజాచి దరియంగనేగె;
నమృతమే రూపెత్తినటులున్నబాలు
కమనీయరూపంబు గనలేదుతండ్రి

కనులుమీలితములుగావించి - చిత్త
వనజంబు విఠ్ఠల పాదార్పణంబు
గావించి సర్వలోకంబును మఱచి
భావాతిగమ్ము నవస్థనుబూని
దను దానెజూచు చాత్మారాముఁడగుచు
ననుభవించుచునుండె, నమరదుష్ప్రాప్య
మతిదుర్లభంబు బ్రహ్మానందసుఖము;
బ్రతిదినాభ్యాస కారణమున బాద
యుగము మన్ద్రొక్కుచు నున్నదేగాని
యగుపడదాతని యత్నమావంత;
బాలుండు దరిసిమృణాలహస్తములు
లీలవాచుచు గౌగిలించె నూరువులు
నమృతశీతలమైన యాస్పర్శగూడ
గమనింపఁ డాతండ్రి గన్నులువిప్పఁ
డాతని సర్వేంద్రియమ్ములు - రంగ
పూత నిధ్యాన సంపూర్ణమత్తములు;
గళమెండినది బసికందుకు పిలిచి
పిలిచి - తల్లికిగూడ వినబడలేదు
తరుణి చిత్తమ్ము మాధవకీర్తిగాన
పరవశమై దన్నుమఱచినయదియు
పసికందునకు చేతిపట్టుజారినది
వసమఱిమంటిలోఁ బడినాఁడు - తండ్రి
ద్రొక్కుచున్నాఁడు నిస్తులభక్తిపరిధి;
యక్కజపడినారల ఖిలదేవతలు
యెన్నఁడుగంటిమే యీ భక్తిభరము
గన్నారనని దమకరములనెత్తి
జయజయాకారముల్ సలుపుచున్నారు
జయజయాకార సంసక్తగర్భమ్ము

అమల దిశాంగన లతికుతుకమున
గ్రమముగావిచ్చె గ్రమములు నేత్రములు
జలదాంగనలు నూత్నసౌందర్యరేఖ
లొలికించినవి మింటియోరలయందు—
కల్పవృక్షము శిరఃకంపంబొనర్చి
కల్పించినది సుమకాయమానములు—
సురవీధులన్నియు బురదయైపోవ
సురనైచికియు బయోభరముచేపినది
సురగంగ కంకణ స్ఫురితముల్ రేగ
కరమర్థి తారంగ కరములనెత్తి
యానందనాట్యమ్ము లాచరించినది
ఈనాకమునకన్న నిలయెంత బుణ్య
వతియని దేవతావనిత లభీప్స
మతినిండ నబ్బురమంది వీక్షించి
రగణిత పుణ్యభాగ్యమ్ముదృశ్యమ్ము;
నిగమవాసంత వనీకోకిలమ్ము
పండరినాథుడే భ్రమసి యానంద
తాండవమాడె నాతరుణంబునందు;
బుడుతని యవయవంబులనుండి దొరఁగి
గడుకొని బారురక్తమ్ముతో నెనయు
ధాన, మృత్తిక హరిద్రాగౌరమయ్యె
వాని పాదమ్ములు బాలుని యాంత్ర
ములుజుట్టుకొన లతాప్లుతమైన తరుల
వలెనున్నయవి పిల్లవాని మేధస్సు—
కరము లంఘ్రులును వక్షమ్ముదరమ్ము
కురువులు కోమల కుంతలంబులును
కన్నులు జెక్కిళ్లు కమనీయ తనువు
మన్నులోఁబడి రూపెమాసిపోయినవి;

పండరి నాథుని పరమభక్తుండు
పండరినాథు రూపాంతరమైన
కుమ్మరి, మీలితాక్షుఁడు బుల్కలెగయ
నెమ్మనమానంద నిభృతమై దూగ
పలుకుచు నున్నాఁడు పండరీశ్వరుని
కలిమలహరము నిష్కలుషనామమ్ము
నాడుచున్నాఁడు భావావేశమెనసి;
యాడునాట్యమ్మున కలఁతయేలేదు
పలుకు నామము నకుఁబరితుష్టిలేదు
కలమోదమున కానకట్టయేలేదు
ఆవంత లేదు బాహ్యజ్ఞానభరము
భావాతిగస్థితి పరిమగుఁ డతఁడు
వానియిల్లాలింటిపనులను దీర్చి
సూనుండు లేచెనో చూతముగాక
యనివచ్చినది శయ్యాయందునలేఁడు
తనతపస్సిద్ధియౌ - తనపృథుకంబు;
తల్లిమనంబులోఁ దత్తరపాటు
మొల్లమైనది యెందు బోయెనో కాక
నాతండ్రి! నాకందు! నామనోధనము!
నాతనూజాతుండు! నాహృదయాళి!
అరనిముసము గృహమందాడు కొనఁడు
పరువెత్తుగన్నులు భ్రమియింపఁజేసి
కాళ్లువచ్చిన బెద్ద కష్టంబుసుమ్ము
యిల్లిల్లు దిరుగాడ నిప్పుడేనేర్చె
దయసేయరా! యెందుదాగితోకాక
కయిసే య రార! న్నాకన్నులు బండఁ
పప్పుబెల్లమ్ముసాపడుదువుగాని
చెప్పరా! యెచ్చోటఁజేరితోస్వామి!

రార నాకోరిక! రార నాతండ్రి!
రార నాజీవన రమణీ య దీప!
రార! నామోదసర్వంకష జలధి!
రార! నామానస రత్నభండార!
యని పనవుచు వీధులన్నియు వెదకి
గనుపడ్డ యమ్మలక్కల విచారించి
సందుగొందులుజూచి జతగాండ్రనడిగి
యెందుగానక శోకమేరూపుగొన్న
కై వడి దనువెల్లఁగంపంబుపుట్ట
భావమ్ముసుడియంగ బదములు జెదరఁ
గన్నులగన్నీరు గాలువగట్ట
నున్నమితాస్యమై యొక్కచేరీతి
నోయంచు నార్చుచు నురముదాటించు
చాయత ధూళికా వ్యాకీర్ణఫాల
తలమును, స్వేదపంకిలములంగములు
కలిత గద్గదరుద్ధ కంఠరవమ్ము
సడలుచీరయు, వడంకెడు కౌనుగలిగి
పడుచును లేచుచు బావురుమనుచు
దిరిగివచ్చెడుదాని, దీనవిక్లబను
బరికించి పల్లెలో పలిజనులెల్ల
దలరెడునట్టిడెందములతో - గార్య
ములనేది బొమ్మలు మూగలు వోలె
వెనువెంటనడచిరి, వెలఁదిసూనుండు
జనినహేతువున నిశ్శబ్దమై - పన్నె
దరిగిన గృహమును దరిపి - ప్రాణేశు
బరికించెలౌకిక భావవిదూరు
సారవిచారు - నిస్సంశయాచారు
దూరవికారు - నిర్ధూతాంధకారు

బరికించి - వదనంబు వఱునట్లువారఁ
దరళాక్షి యీగతిఁ దలరుచుఁబలికె
"పలుకవో! నాతోడ బ్రాణేశ నీవు
జిలుకవో నాయెదఁ జిక్కఁణమధువు
బండరినాథుఁడే బగదాయ యగుచు
నిండారు కసుగందు నీడ్చికొన్నాఁడు
మనగూటిలో పిట్టమాయమైపోయె
మనయింటి దీపంబు మలఁగిపోయినది
మన తపో భాగ్యంబుమాసి పోయినది
మనప్రాణ సర్వస్వ మంతరించినది
మనహృదయగ్రంథి మనభక్తిఫలము
మనపాండురంగఁడే మనకింకలేఁడు
యేపొదలో దూరి యెటనున్నవాఁడొ
యేపాముపంటికాటెనసిన యదియొ
యేబావి పొట్టలో నిడుకొన్నయదియొ
నాబాలునెవ్వారు నాకునిచ్చెదరు?
ఆకలికై యెంత యలవరించెడినొ
నా కందదెంతగాన వసిపోయెడినొ
యాకన్నులనుకాంతులంతమా నేమొ?
యాకంఠమున దీపి యమరదోయేమొ
బ్రదుకునా నాతండ్రి బంగారుకొండ
పదముల కిణకిణక్వణనములీమ్మర
వచ్చునా? - మరల నా బాహుబంధమున
కచ్చంపు పున్నెంబులమరిన యట్లు
చిక్కనాశ్రుతులకు చిక్కనివాని
నిక్కంపు వరము నానీడ నాబిడ్డ"
నిలుచున్న జనములు నీరు గాగరగి
ఫలవించి రెల్లరు బావురుమనుచు

సదయునిపోలిక నఖలువిప్పి
సుదతి నూరార్పండు - జూడఁడుగూడ
“గోరా”, హృదయమెల్లగుమిలిపోయినది
నీరజాక్షికి విభునీరేజ సదృశ
పదములు గట్టిగాఁబట్టి బంధించి
కదలించినది - యామె గరములకంటి
కొన్నవి బ్రేవులు - గోమరునిశిరము
చెన్నేది మంటిలోఁ జిక్కినదనువు——
కరములా కాంతకు గట్టెవారినవి
యురమెల్ల గుతకుత యుడికిపోయినది.
సొగకన్నుల వెఱ్ఱిచూపు నిల్చినది
మూగగొంతుక బాష్పములు గలఁచినవి
తలఁగోటి వజ్రాయుధమ్ములు పగిలి
దలఁపులఁ గోటిసుడులు చెక్కుపఱచి
చెవులలోఁ గోటిగర్జితములురేగి
యవయవమ్ముల గోటియహితతుల్వెఱికి
యంతర్హృదినిగోటి యగ్నిశైలములు
దంతురితాశముల్ ధగ్గనిజిటిలి
“హా” యని లలితాంగి యాకాశమెల్ల
“హో” యని బదులివ్వ యొకసారియఱచి
పడినది ఋషుల శాపమ్ముచేఁబుడమి
బడినట్టి యప్సరః ప్రమదయుబోలె
నక్కడ నిలిచిన యవ్వలుగొంద
రక్కటికంబున నాచపలాక్షి
కుపచారములు సల్పి - రువిదయుదేరె;
నపగత కల్మషుఁడరవిందనాభ
చరణ సంస్మరణైక చంచరీకమ్ము
పరమవైష్ణవ శిరో భవ్యరత్నమ్ము

నాకుంభ కారకుఁడఘలువిప్పె
నాకలకంఠి హాహాకారములకు
బరికించె భక్తుండు బరమ శోకంబు
బరిగొన వెరవేది పలవించునట్టి
దరళాక్షి - దుఃఖ సంతప్తయౌదాని
బరిచుట్టినిలిచిన పల్లీ జనంబు;
చూచినవెంటనే సుదతి యెడంద
నాచిన వేదన యతిశయింపంగ
కరయుగమ్ములుదాచి - గన్నులయందు
బరవళ్ళుద్రొక్కు బాష్పములతోనిలిచి
దనయేక పుత్రసంతాన దుఃఖమున
దనవివేకము మాయ, ధైర్యమ్ము దలఁగి
బలికె "నీభక్తికై బాలునిగూడ
బలిగొంటి వింక నా ప్రాణంబుగూడ
గొందువో! కొనవోయి క్రూరకర్మండ
కందును మంటిలోఁ గలిపిత్రొక్కితివి
నిన్నేమియనగందు - నీచేతలెల్ల
మన్నించు గట్టడి మధుసూదనుండు
వాఁడునిందార్హుండు - వాఁడునిర్దయుఁడు
వాఁడెనాబాలుని బలిగోరినాఁడు
కరుణాకరుండంచు గల్లరిబిరుదు
మెరపి దాల్చినయంత మేలేమిగలదు?
కరుణాకరుండు నిక్కంబగునేని
బొరిగొనునేనాదు పుత్రుని, భృంగి
ననితరేచ్ఛులమాచు ననవరతంబు
దననామ భజనంబు దగిలిచేయుటకు
ఫలమిచ్చెనీనాఁడు బాండురంగండు
గులవర్ధనుండగు గొడుకును ద్రుంచి"

యను దారుణం బైనయతివవాక్యములు
వినికుంభకారుండు బెదవులు వణఁకఁ
గనులలోఁగరుణ తూగాడఁగాఁ బలికె
"వనజాక్షి! మాయా వివశమానసమున
వెలుఁగ నేరదుసుమ్ము విజ్ఞానకళిక
కలదు - లేదను వృథాకల్పనంబులకు
మఱఁగి - జన్మంబని మరణంబటంచు
నరులు గల్పించుకొన్నదిగాక - యాత్మ
బుట్టునే! చచ్చునే! పూబోడియేల
పట్టికై యీరీతి భ్రాంతి బొందెదవు
ఆత్మవాదుల మతంబనుసరింపక య
నాత్మవాదులపోల్కి నాతి యెందులకు
భావించె దా పట్టి ప్రభవింపలేదు
జావనులేదు నిస్సంశయంబిద్ది
మెలఁత! యాత్మయ నిత్యమేయనుకొమ్ము
నిలుపుదువే నీవు నియతికిఁలోగి
జచ్చుచు పుట్టుచుఁ జక్రంబు రీతి
గ్రచ్చరితిరుగు నీ కష్టజీవులను
తన తన కర్మాను గుణముగా జీవి
జనియించు - వర్ధిల్లు - సమయునుసుమ్ము
లేదు సంబంధంబు లేశమాత్రమ్ము
వేదవాదులు బల్కువిధమిదియింతి?
యిచ్చిన రంగఁడే బుచ్చుకొన్నాఁడు
త్వచ్చిత్తమునకు సంతాపమింకేల?
పుట్టంగవచ్చును భువి కోటిసార్లు
పుట్టునే విభుపదాంబుజముల భక్తి
మనకర్మపండి సంప్రాప్తించినట్టి
వనజాక్షుభక్తిని వనిత యెందులకు

నలఁతిగోర్కెల జిక్కియడ్డగించెదవు
తలఁగకఁజేసెదు దైవదూషణము;
పూని, యనేకాబ్దములు జేసినట్టి
మానిత తపమొక్కమారు మాధవుని
నిందింప దగ్ధమై నిలువదు సుమ్ము
తొందరపడి యేలతొయ్యలి! ఘోర
నరకదుఃఖముల కాకరమవయ్యెదవు?
బరిపరి విధముల భ్రమసియాడెదవు;
యెవ్వని మహిమ గీర్తింపను బూని
క్రొవ్వఱి శ్రుతులు వాక్రువ్వగానుడిగె
నేవానిరూపు బ్రహ్మేశాదులెల్ల
భావించి భావించి బరితుష్టినొంద
రేవాని చరణంబులిందిరాకాంత
పావనస్తనముల భరియించిపొంగు
నేవాఁడు మత్స్యాద్యనేకావతార
భావియై జగములఁ బరిరక్షసేయు
వాని, యౌవన మత్తవల్లవీ హృదయ
మానసీ రాజిత మహితవిలాసు;
వాని, తాపింఛ సవర్ణశరీరు,
వానియోగీశ్వరేశ్వరుని రంగనిని
మానిని! నామనో మండపంబందు
బూని చొక్కెడునట్టి పుణ్యకాలమున
సూనుని చావొక్క సుద్దిగాఁబనవి
ధ్యానంబు జెఱపితిఁ, దనయుఁడు గలుగ
వచ్చునుగాసంత భాగ్యమేయున్న
వచ్చునే మరల గోవర్ధనధారి
చరణనీ రేజ సంస్మరణైక సీధు
పరవశచిత్తమా భవ్యయోగమ్ము"

ననుపతిదైవ వాక్యము లాలకించి
వనితగన్నులనీరు వరద బారినది.
కొందరు దమలోన గొందల పడిరి
మందుండననుచు గొంతమంది వాదించి
రన్యాయమని కొందరాక్రోశపడిరి
శూన్యదృక్కులతోడఁ జూచిరి కొంద
రిట్టి చేతలు భూమినెందును గలవె
పుట్టక పుట్టక పుట్టెనే భక్తి
వీనిపుట్టెనె వట్టి వెంగలిగాక
సూనుని జంపు తుచ్ఛులకేటి భక్తి
యని కొంద రంకించి రాక్షేపణములు
వినలేదా! శంగని బ్రీతికై యొఁడద
గరముల జీల్చి దాఁగంగఁ జోటిచ్చు
పరమ భాగవత సావంతుని భక్తి
త్యాగంబుచే నమృతత్త్వంబు నొందఁ
గాగోరు భక్తుల కథలెల్ల నిట్టి
వేగాక మరివేరు విధములుగలవె!
భోగరూషితులైన పురుషులకివ్వి
మతికంటునేయని మఱికొందరనిరి
మతికెక్కెనని కొంతమంది గర్జించి
రీరీతి యటనున్న వారెల్లవారు
వారివారికి దోచు భంగులననిరి
దలకొక్క పుర్రెయుఁ దలకొక్క మాట
తలమె యీ వింత వాదమ్ములు దీర్ప!
సుదతి యెడందను శూలమ్ముఁవోలె
గదలించె భర్తృ విజ్ఞానబోధనము.
పతిజీవయైన యాపడతి పవిత్ర
మతి నేక పుత్ర-దుర్మరణశోకమ్ము

గ్రసియించినది, గనుల్గ ట్టెఱ్ఱవాఱ
ప్రసభ గద్గద భరాక్రాంత మౌనెలుఁగు
చలియింప, మృదుపలాశమ్మునువోలె
కళవళపడి, మోవి - కంపనమొంద
పలికె "నాకోర్కెలు బంగారుమేడ
లలిత మద్భాగ్య కుల్యాదివ్యసరసి
మజ్జీవన నిశాంత మాణిక్యదీప
మజ్జిగా నెలకొన్నయట్టి నాభక్తి
నాపరమానంద నందనవనము
నాపుణ్యసంచయ నలినగంధమ్ము.
నాదువెన్నెల విత్తు, నాప్రేమలతిక
నాదుప్రాణంబైన నారంగమూర్తి
నా పసిపాపని నాచికొన్నావు
నా పుణ్యదీపంబు నార్పివేసితివి
యమృతతుందిలమైన యట్టి నాజీవి
తమున శోకాగ్నిని దలిగొల్పినావు
సరళ కోమల మదాశాపాత్రయందు
గరళ బిందువులను గలిపివేసితివి
యెటుబుట్టి వోయెనో! యెలదీగెయెడఁద
బొటమరించిన యట్టిపూపిందెగాని
కళలేని తీగెయే కడకు నిల్చినది;
మలయవాయువు మాయమైనదేగాని
తదుపలాలన సౌఖ్యతరళచిత్తము
మృదుకంటకపలాశ వృతదేహయష్టి
పరమదుఃఖిత చూతవనీ మిగిలినది
పరమప్రియంబైన పారావతంబు
భ్రమపడి దానెటు వ్రాలెనోగాని
యమిత దీనముగులాయమె మిగిలినది.

కమనీయ తరములు గొంతులుగలిగి
క్రమవర్ధితమ్ము చిక్కణము నాభక్తి
నెనయు దీపము గొండనెక్కెనేగాని
గుణహీన మీజీర్ణకుటియె దక్కెనది
పాండురంగనిపేర భగవంతుపేర
చండించి సూనుని జంపికొన్నావు
కన్నతల్లి యెడందఁగనలు ప్రేమంపు
దెన్నులు నీకెట్లు దెలియునో స్వామి!
యిచ్చినరంగఁడే యేలెనటంచు
బచ్చునీతులు సులభముగ బల్కెదవు?
పుత్రుండు బచ్చెన బొమ్మయో! వాని
గాత్రంబునందున గలుగదో యుసురు
పసికందు బోకార్చి భజనలోఁ మునిఁగి
యిసుమంతయును మదినెరియకున్నావు
నీయెదరాచట్టొ! నిష్ఠుర వజ్ర
మో! యిదె భక్తికి పూర్ణఫలంబొ
పాండురంగఁడె యింతపని చేసినాఁడు
ఖండించినాఁడు నాకల్పవృక్షమ్ము
తనపైని నా భక్తి దక్కువైనదియొ
బనిబూని నాపాపఁ బలిగొన్నవాఁడు
కరుణాకరుండట! కల్లరిమాట!
కరుణావిదూరుండు గమలావిహారి"
జవరాలి దైవదూషణముతో మనసు
వివశమై ప్రేమమ్ము వెసమూరిబోవ
కుంభకారుఁడు గన్నుగోనలయందు
జృంభింపఁగా గోపరేఖ—శరీర
మాపాదమూలంబు నాకంపమొంది
పాపినీ! నావాని బండరినాథు

గలుషించి నిందింపఁగడఁగితివేమె?
దలఁగు మిచ్చటనుండి దౌర్భాగ్యురాల!
హరిదూషణము సేయునట్టి మొగమ్ము
బరికించు గతికి నోర్వగఁజాలనంచు
తనచేతిలోఁ జక్రదండమ్ముతోడ
వనితను మర్దింప వచ్చినయంత
నలినాక్షి తనభర్త నడవడిఁజూచి
వెలవెలనయి వేరు వెరవులేకున్న
"నన్ను ముట్టినను నా నలినాక్షునాన
యన్న"దా మాటతో నాతఁడు రుద్ధుఁ
డై—మంత్రనష్ట వీర్యంబైన యట్టి
భీమసర్పము పోల్కి బిట్టుగ రోజి
దండమావలవైచి తరుణార్కనేత్రు
ఖండిత భక్త వికారవిస్తారు
నారదముఖపూత నాదావతారు
ఘోర సంసారసంకుల నిజదాస
బంధవిమోచన ప్రవణవిలాసు
నంధకాంతక భావనాంబర తరణి
శ్రుతి మహిళాచిత్త శుక్తిమౌక్తికము
నతమౌని మానసానంద స్వరూపు
నైక సిద్ధాంత లక్ష్యైకమూలమ్ము
శ్రీకామినీ కుచసీమవినోద
తాండవ నృత్తరాద్ధాంతైకరసికు
యోగీశ్వరేశ్వరు నుపనిషద్యావ
తాగృహ్యమాణుఁడౌ దక్షిణనేత
పాండురంగనిమూర్తి భావించికొనుచు
నుండెకన్నులుమూపి యొకమూలయందు
చేరిన జనులెట్లు—జెప్పనులేరు

వారివారికిదోచు భంగిని బలికి
కొన్నారు—నాదెల్ల గుంభనిర్మాత
యన్నువ దుఃఖమ్ము నతనిఱాగుండె
జేసిన నడత, విచిత్రమిందేమి
యీసంసృతినెబడి యిది బరమార్థ
మనుకొని—దిరిగెడు మలిన జీవులకుఁ
గననౌనె—యున్మత్తు కరణి—బాలకుని
భంగి—పిశాచమ్ము భాతివర్తించు
జంగమదైవమ్ము జ్ఞానివర్తనము;
నతివ కడుపుకోత యారనేలేదు
నతని సమాధికి యంతమేలేదు
ప్రతికృతివిధమున బాషాణమట్లు
మతియెల్ల రంగసంస్మరణైకమగ్న
మైమగఁడుండంగ, మానిని విగళి
తామర్షయైక్షణి కావేశమునను
పతిదైవమును దిట్టుపఱచిన యఘము
పతితైకశరణంబుఁ బండరినాథు
వితగదూరిన యట్టివిధము జింతించి
మతిననుతాపంబుమల్లడిగొనఁగ
సకలపాపంబుల శాంతింపఁజేయ
నొక హరిస్మరణమే యోపునటంచు
బలియించుచున్నది బరమర్షిహృదయ
మతవిరాజిత రుచి మహిత దీపమ్ము
రంగని నామ మంత్రమ్ము సంసార
భంగుర సౌఖ్యచాపల్య రోధకము
మగనికి దిండిపై మమతయేలేదు
మగువకు భుజియింప మదిబుట్టలేదు
"అమ్మ! నా కాకలే యన్నంబువెట్ట

రమ్మ'ని పిల్చునర్భకుఁడింకలేఁడు.
చిటుకనగానొక్క చీమయులేదు
గుటియంతయును గయికొన్నదిశాంతి
యరుదెంచె సంధ్య, శోణాంబర, ముఖర
వరవిహంగమరత్నవలయముల్మీర
తరడోకి భక్తుముష్కరమైననిష్ఠ
జెరుపంగవచ్చు నచ్చరకన్నెపోలె
నతఁడు జలింపలేదా కుంభకారు
సతిగూడ తనదు నిష్ఠనుమానలేదు
కిరణకేసర ఘటాస్ఫురితముల్మీర
బరతెంచెఁ పూర్వాద్రి భాగమ్మునుండి
హరి - దనరాకచేనల్లలనాఁడి
బరువెత్తఁదొడఁగఁ దిమిరగజఘటలు;
నడునెత్తిపై నిల్చి నలినీప్రియుఁడు
గడిమిమై జగములఁగాల్చుచున్నాఁడు
నాకుంభ కారుహృదంత రమందు
శ్రీకరనిజదయా శీకరంబులను
జిలికి, భావాతీత చిద్విలాసముల
నలయక రంగఁడే యాడుచున్నాఁడు.
పరమపాతివ్రత్య భరిత - కుమ్మరిత
బరదైవతధ్యాన సరసిలోఁమునిఁగి
తనువానదెలియదు - దరిసెనురేయి
కనువెలిగించు జుక్కలచీరఁగట్టి
కనులువిప్పఁడు కుంభకారుండు వనిత
గనుదోయి శోకపుష్కర నిరుద్ధమ్ము
మఱిదెల్లవారెను - మధ్యాహ్నమయ్యె
బరతెంచినది రాత్రి ప్రత్యూషమయ్యె
మగఁడచలసమాధి మాననేలేదు
మగువకు శాంతికామడ దూరమయ్యె

నూరియవ్వలువచ్చి యువిదను జీఱి
యూరార్పఁదొరకొని "యున్నది కాల
మెందుల కీరీతి యిసుఁగునుగుఱిచి
గొందలపడెదవే! కోమలి! యేడ్వ
జచ్చిన కొమరుండు వచ్చునాయేమి?
జచ్చినవారితోఁ జావఁగానౌనె?"
యనుచు, వాపోయిన యర్భకుపోదె
వనితకు నేఁడుగాఁబట్టినదేమి?
యున్నమగఁడుగూడ నొక్కచేసారి
దన్నుగాదని మూగతనముగై కొనఁగ
నావేధవారికి నర్థమేగాదు.
నావెలఁదులు నూత నాశ్చర్యవిహిత
హృదయలై పోదురు - గృహముల గుఱిచి;
సుదతి ప్రాణేశ్వరుజూచును - చూపు
కొనలలో నొక వేయిగోర్కెలుదూగ
మనసులో ప్రేమమున్మత్తమైరేగ
బలవంతముగ నైన బలికింపఁదలఁచు
బలికింపఁదలఁచెడు భావమ్ముతోనె
నిలువెల్లబులకించు నీపవృక్షమ్ము;
గళమందె కన్నీరు గడ్డలుకట్ట
నతనిపాదమ్ములనంటఁగానెంచు
నతివపెట్టిన యొట్టు నాత్మలో నిలుచు
ధవుని గర్కశభక్తిదనయెద ప్రేలి
చివికినమోవిపైఁ జిట్లునిట్టూర్పు;
మగఁడు మాటాడఁడు మగువమాటాడ
దగునెట్లుగాపుర, మంత బూబోడి
దనకు దానయి సమాధానంబుదెచ్చి
కొనిమాట లాడింపఁగోరెనుభర్త,

నదిరాత్రి వెన్నెలయావరించినది
చదలెల్ల చిఱుగాలి చలువలదాకి
గదలాడినది కోర్కెకాంతయెడంద
వదనంబుపై లేని ముదమునుదాల్చి
గనుదోయి నౌక సోయగముదాల్చి - దనదు
దనువెల్లవింతసౌందర్యమ్ముఁ బులక
చిత్తరింపఁగ సిగ్గు, దత్తఱంపడుచు
నత్తలోదరి విభు నండకు వచ్చి
నిలచి నిల్వఁగలేక - బలుకఁగబూని
పలుకఁగలేక విభ్రమ వలితంబు
పలుకు గొంతుకలోనె బారాడుచుండ
గలవీణెబాడిన కరణి "నాప్రాణ
ధనమ! గన్నులువిచ్చి దమకంబుగురియ
గనుగొనుటకునోమగాలేదొ! నేను
మూఁడునాళ్ళాయె - నీమూసినకనులు
గూడవిప్పవు! బల్కవేడఁబోదునుర!
కలికి కోయిలగుంపు కంఠమ్ములెత్తి
బలుకుచున్నదిగాని ప్రాంతవృక్షముల
నీమాటలోఁదీపి నేరదోస్వామి!
నామీదకోపమా! నామనస్తృప్తి!
దండింపరానన్ను దప్పుదోచినను;
ఖండ ఖండములు నాకాయంబొనర్చి
నను - పైతుగాని, ప్రాణములతోనిలిపి
జనవీ యకున్ననే సైపలేనోయి!
మూఁడురాత్రులుగూడ మూఁడుకల్పమ్ము
లై దప్పినానురా! యభయమొసంగి
బలికెదవో! లేదొ! బలుకకయున్న
వలపులజిలుక! నీపాదాంతికమున

వదలెదనోయి! జీవములు స్వభర్తృ
పదసన్నిధినిమేను వర్జించుశుభము
గలుగునో! సకలకాంతల" - కంచుఁబట్టు
దలఁబూని యెదురుగా నిలిచినదాని
పరమ పాతివ్రత్య భరము రూపొంది
ధరణికి డిగ్గినట్లరుదారు దాని
గనుల నిండుగ నిండుకొనిన తరాసఁ
దన పాదములు దోయిగనుచున్నవాని
నక్షత్రప్రేమదివ్యావతారంబు
వీక్షించెనాతండు జక్షువులెత్తి
ప్రావృడంభోదంబు భంగి వినీల
మై వగలుడిగించు నాతనిచూపు
బొలపి నంతటిలోనె బొలఁతిమేనెల్ల
బులకలే పులకలై పొంగిపోయినది.
కుమ్మరి యంతటఁగూర్మి దులాకుఁడ
నమ్మెలంతనుగాంచి, యలివేణి! నాకు
నీపైనిఁగోపమా! నిబిడానురాగ
రూపిణి! యేల నిరూపింపుమిపుడు;
మనయింటఁ దిరుగుచు మాయమైచన్న
తనయుని కొఱకేడ్చు తల్లియెడంద
తలఁచికోపింతునో! ధ్వని! నేనొక్క
శిలగాను - హృదయంబుగల మనుష్యుఁడను.
యిచ్చినట్లే యిచ్చియిప్పుడు మరలఁ
బుచ్చికొన్నాఁడు నా పుత్రునటంచుఁ
శమలోదరునిపైనఁ గాకసేయుదునా?
ప్రమద! దన్గొలిచెడు భక్తులనెపుడు
మాయావిదూరులఁజేయనేజూచు
నాయురు క్రముఁడు - భాగ్యమ్ములు, బుత్రు

లను బంధములదగుల్కొననీడు, వాని
బనివడి మెల్లగా వదలించునిజము.
కమలాక్షి! యదియనుగ్రహమని గాక
భ్రమపడి కీడుగాఁబరికింపదగునె!
మరణించినట్టి కొమరుపైన నుఱవా!
యఱి ముఱినలుగంగ - నరులు గాలంబు
ననుసరింతురు - దప్పదవశులై, మృత్యు
వనునది జెప్పవచ్చునె? - యేరికైన!
కాన నేనెవ్వరిపైన కోపంబు
బూనుదునే! యింక బూర్ణేందువదన!
అతివరో గడుపు చిచ్చగలింపనీవు
బతితపావనుఁడైన బండరినాథు
వెత గదూరినగొంత వెతగల్గె నిజము.
మతికి - నదెప్పుడో మఱచితిసుమ్ము!
వగగుంద కింక నెప్పటి భంగిశాంత
ముగనిల్లు దీర్చుకొమ్ము పవిత్రహృదయ!
యని పల్కఁగువలయ దళాక్షి గన్గొనలఁ
బెనగొనఁ గోర్కెలు విభుని పదంబు
లంటఁబోయిన వెన్క కల్లంతయొదిగి
దంటవుగదవె! బిత్తరి! పాండురంగ
నికి ద్రోహమా! చాలు - నీతోడి బొత్తు
సకియరో! నీవు నా సర్వేశుపేర
నొట్టుపెట్టితివిప్పు, డుల్లంఘనంబు
నెట్టులొనర్తువే! యింక - నీ జన్మ
మందునన్దాక బేరాసలు మాను—
మిందీవరాక్షుని డెందమ్మునందు—
సరిగఁ బ్రతిష్ఠించి సలుపుమీవ్రతము.
పరమేశ్వరునిదయా భరమెంతబండి
నదొ? మన కామంబు నాశం బొనర్చె

నిదియొకసాకుగా మదిరాక్షి! యనుచు
జిఱునవ్వునవ్విన, చిత్సమున్నీంద్రుఁ
బరమశాంతుని జూచి పడఁతికి నంత
ధారలై యుబికి నిద్దపుఁగన్నులందు
భూరిబాష్పమ్ములు బొరిపొరి కుంచము
లను బుటమెగసె, బ్రమ్లానమైనట్టి
వనిత మొగంబును వాడప్పుసూచి
యతిదురంతములగు నాగమాగమ్యు
వితత మాయలకు నివ్వెఱపడి పలికె
"కలికి! తుచ్ఛంబైన కామంబుపైని
నిలిపితి మనము వెన్నెలలకుఁ గఱఁగి-
గరమర్థిఁ బుడమెల్లఁగౌగిలించినది.
దరిపి వెన్నెల పరాత్పరుని విభూతి;
వెలఁదివెన్నెల వలె నిలగల సర్వ
ములను బ్రేమించు మా పూర్ణపూరుషుని
తనువులంచును సుంత దారతమ్యంబు
గనుపింపఁ జేయక కల్యాణి! యపుడు
దలకొనులాభ, మద్దాని బోవిడిచి
సలుపుదురే తుచ్ఛ సంతానకాంక్ష."
నన్నంత మొగమెల్లఁ జిన్నవోయినది.
యన్నుల మిన్నకు, నధరంబుగంద
నిట్టూరుపుల నింక నిలచినలాభ
మెట్టులు లేదని యింతి వెన్దిరిగె;
గనులు మోడ్చెను భర్తగంజాక్షి భజన;
వనిత దృక్కులు మూతబడలేదు ముందు
నిలిచికొన్నాఁడు చనినయట్టి శిశువు.
దలఁపుల మెదలెను దల్లికివాఁడు
చిలికిన నవ్వులు, పలికిన పలుకు,

తెలయించినట్టి చేతలు, పట్టువడక
జారిన పరుగులు – బాహువుల్చైనచి
జేరినబాగులు, చిత్రంబునందు
వలెఁ "గొడుకా!" యని బాడియావట్లు
విలపించినది కాని, వినలేదు భర్త
వెడలిన వంతట విమలాక్షి నోట
నుడువులు మిడుగులు లెడఁదలోఁబెటిలి
యోరి కృష్ణయ్య! వేకారి వేకారి
మారునిటోలు కుమారునొక్కరుని
గన్నానురా! నాదు గన్నులుగప్పి
చిన్నయ్య గొన్నావు శ్రీ పాదములకు
నలినాక్ష! పాపని ననునెడఁబాప
వలదురా! ననుగూడఁ బైనం బొనర్పు
మవటి కే, వాఁడు మాయంబైనయంత
నచల సర్వంబు శూన్యంబైనదోయి!
యెంతవెన్నెలగాయనేమి! మా పాప
సుంత నవ్విన దానిశోభ గల్గెడునె?
నా పాప బ్రదికి చిన్నఁగ నవ్వియున్న
నీపాడు జగమెల్ల నింతదురంత
ముగఁజీకటుల గుంపుమూపి యుండెడునొ?
గగనంబుపై సుధాకరుఁడున్నవాఁడు
గోటి చంద్రుల వెల్గు గూడిన గాని
సాటివచ్చునె పాప చలువ వెన్నెలకు
చందురుఁడా నీకు జతగాఁడు గాడొ?
కందు – వాఁడెట్టి లోకమ్ములయందు
దిరుగాడు చున్నాడొ? తెలుపరాసుంత
పరుగెత్తి పరుగెత్తి భరమైన యలఁత
మెయివాల్చెనో? కాకమేలుకొన్నాఁడొ?

యయిన పోయనవారి నడిగి చూడుమురా!
అదియేమి! చంద్రమ్మ! యగపడుచున్న
దదికందుగాదు యుయ్యాలగట్టితివా?
మాచిట్టి పాపకు మామవునీవె
యూచరా! యల్లుని నోదార్చి తండ్రి!
దెలిసెలే నీ గుట్టు చలువలమామ!
యలపాప నీ యింటి యందునలేఁడు,
నీకు మా వానికి నెక్కుడిజోడు
లాకల్కి నగవు నీ యందు జొప్పడునె!
ఆకురాలనిచోట - నలరుల వాఁడు
సోకనిచోట - విశుద్ధ వాసనలు
దరుగనిచోట, యే తరుణమందైన
పరభృతంబులపల్కు పారాడుచోట
ప్రతిరేణువును పాటబాడెడుచోట
ప్రతిలత లాస్యముల్ప్రకటించుచోట
సకలసౌందర్యంబు సంక్షీభవించి
సకలకాలంబుల సాక్షాత్కరించి
సకలదేశముల యాశలు రూపుగట్టి
ప్రకటమైనిలిచిన భవ్యలోకముల
గరుడపచ్చలుదాపి గట్టినయట్టి
సురుచిరంబైన సుందరహర్మ్యమందు
వెలఁదిముత్తియములు వ్రేలాడఁగట్టి
యలరులకెంధూళియనువుగాఁజిలికి
కడుమనోహరములు కలలెల్ల నేపి
దుడుకుపాపని తలగడగానమర్చి
తెఱగంటిచానల దెలిసగవులనె
గరమర్థితోఁ బొత్తికలుగాఁబఱచి
యూర్వశిదీర్చిన యుయ్యాలయందు

సర్వలోకేశ్వరి, శాంకరీదేవి
బడుకొనబెట్టి యప్పుడపుడుమరుల
గడుకొన జెక్కిలి గమ్మగాగిటి
దనగౌంతులోని సౌందర్యమునెల్ల
నొనగూర్చికొని పాడియూపుచునుండ
నిదురబోవుచునుండు నిపుడు నాపాప
నిదురబోవుచునుండు నెనరు దొల్దీవి
నిదురలో నాచింత హృదయమ్ముసోకి
కదలియేడ్చునో? యేమొ కందుగన్విప్పి
చూచికోవమ్మ నీసూనునిగాగ
నాచిట్టి, శాంభవీ! నామనోజ్యోతి''
బనవుచునున్నదింకను గాంత - యపుడె
వనజబంధుఁడు గొండపై నిక్కినాఁడు
పనుపడదోచిన మినుమానికంబు
కనుగొని తెల్లవాఱినదంచు దెలిసె
కువలయదళనేత్రి, కుంభకారుండు
చవిగల్గు పండరీశ్వరపదధ్యాన
మధుశబలితమూర్తి మ్రాగన్నువెట్టి
కదలనేలేదు కాంక్షావివర్జితుడు
పడతియెట్టులొయింటి పనిదీర్చె - నామె
కడుగడుగున బిడ్డడాడినయట్లె
గనిపించు విభ్రాంతికలిత చిత్తమున
వనితచేతులుదాచు, వానికౌగిలికి;
అన్నమువండనే యబగుబలయ్యో
యన్నులమిన్న, ఛాయామూర్తివోలె
నడతెంచి పతిదేవునడుగులచెంత
నిడుద యూర్పులతోడ నిలచి, వచించె
తమ్మిరేకులువిచ్చి తడవాయె - కన్న

దమ్ములనేమికతమ్మున దెఱువ
వుర! స్వామి! పాపండువోయిన మ
కఱవై నదేమి నీకనుచూపుగూడ
పాపఁడులేక దీపంబులేనట్టి
యీపాడుగుడిసెలో నెట్టులోదిరుగు
చున్నాను - ప్రాణముల్గన్నులఁబట్టి
నన్ను బరీక్షింప న్యాయమా నేర!
నాలుగుదినములన్నంబులేకిట్లు
మూలగూర్చుండుటే పూన్కియో సా
నా నల్లపూసలైననుజూచి - యింక
మానిరావోయి! సమాధి నావాఁడ!
నా యొరుపెల్ల కన్నయ్యతోడుతనె
మాయమైనది - యింక మనలేనునేన
కనుదోయి విచ్చెవేగమ్మగాధవుడు
మనసుగంపించి యీమాటతోనపుడు
భాషించెనంతట భక్తవర్యుండు
యోషనీక్షించి "యయ్యో! నీరజాక్షి
గడచిపోయిన యట్టి గాథలుద్రవ్వి
యెఁడదచుమ్మలుజుట్ట నెందులకిట్లు
పరితాపపడెదవే, పరమేశుఁడొకఁడె
యరయ సత్యంబు దదన్యంబుమిథ్య
కలలోనఁ గలిగిన కందుగతించె
గలయందె యెందుకే యలపరించెదవు
వోయిన పాపండు పూబోణి! వచ్చు
నే! యెంత బనివిన నీ యాత్మశాంతి
జెదురుటయేగాక - శ్రీ కాంతభజన
మధురరసంబున మరువవే తనువు
నదె సత్యమైనట్టి యనుభవమందుఁ

గదలింప వీపాడు కష్టముల్మనసు
నన్నంబు దినకేమి హతమె నాకబల!
యన్న గధరు చింతనామృతపాన
తుందిలోదరుఁడౌచుఁ దోచకన్యంబు
మందుడఁబోలె నీమాడ్కి నుండితిని
పదవొడ! మేటికీ భ్రమ" యంచు నుడువ
మదిరాక్షి తనువు సమ్మద దంతురితము
నయ్యె - ధవుండు నీరాడుట కొఱకు;
నయ్యువిదయె జల మంది యిచ్చినది;
జలమంది కొనియెడి సమయంబునందు
జలజాక్షి దాకండు, శరుఁడు మగండు
కడుపునిండుగ భర్త గుడిచినయంతఁ
జడతుల మిన్నకుఁదుపు నిండినది
తాను భుజించి నట్లే, నెనరెంతొ
వానిపై, చేతిపైఁ బడినదో! నీరు
మరల సమాధి నిర్మగ్నుఁడై నాఁడు
కరమరుదగు కుంభకారభక్తుండు.
ఓరగంటను జూచె నువిద - సంసార
భారమేమియును గాఁబట్టని వాని
దనవైపు నింత జూడనివాని - భార్య
యనుమాటయే మఱచిన వాని - దనకు
నైన వారెవరు లేరనునట్టి - రంగఁ
డేనిఖిలంబని యెంచినవాని
దనమగఁడేగాదో! తలఁపు మారినదా!
వనితకు నీ క్రొత్త వర్తనమేమి
దెలియనేలేదు, నంచులనావరించి
తళతళ మెఱసె నేత్రములఁ గన్నీరు.
బలచిరింతటిలోన నెలుఁగెత్తి యెవరొ

యలివేణి - చనులఁ జక్కిలిగింతవాడమి
బరువెత్తె బయటికిఁ బాపండుగాడు
పరభృతమ్మది తీపిపాటబాడినది
ఆ పాట యెదగ్రుమ్మినటులైన - బహుళ
తాపంబుతోడ వాత్యాకంపితంబు
లతికయువోలె నల్లాడగాఁ దనువు
నతినేలపైఁబడెఁ జాపకట్టుగను.
గమనింపనేలేదు గొంతుండు దీని;
గమలాక్షి యంతలోఁ గన్నులు దెఱచి—
తనపాటు నొరులు జూచిన భర్తృదైవ
మునునింద సేసెద రనుభయంబునను
సరగునలేచి సుందరిలోని కరిగె
పరమపాతివ్రత్య భావైకజీవ!
బోనంబు జక్కుల బోనమై దీన
దీనయై విలపించె తెఱవ యీ రీతి
మఱచి పోయిన యాస కెఱలించిచూపి
పరభృతమా! యెంతపని చేసినావె
కూయకే కోయిలా! కూయబోకమ్మ
తీయతేనియ బరువు మోయలేదమ్మ
హృదయమ్ము నీ పుణ్యమే! కలవోలె
బ్రతుకులో విన్నట్టి పాపని గొంతు
తలఁపులు కెదికింపవలదె! నీ యాన
సలిపి కొందును నమస్కారమ్ము నీకు.
పాడవే యొక క్రొత్తపాట యీ దుఃఖ
పీడిత హృదినెల్ల - వెన్నెలతెక్క
లను విప్పికొవి యప్పికొన నవస్మృతులు
వనవిభూషణమ! నా తనయుఁడులేఁడు
యెవ్వరిఁజూచి నీ వింటిపై నిలిచి

మవ్వంపుఁ బాటఁ బ్రేమమున బాడెదవు.
కసిగందులేఁడు నిక్కంబుగా వాఁడు
వసియించు నందన వనములోనేఁడు
తావి పూవుల వెల్లఁ దరలిపోయినవి
యా వెన్నెలల గుంపులన్ని చేరినవి.
సెల కన్నెలందరు - చేరికొన్నారు.
మలయసమీరంబు నిలువకేగినది
తలిరుటాకులును సంతన కష్టైనెపుడొ
జిలుగు సంజలకాంతి యిలవీడియేగె
జలదేవతలు వెంటఁ జామరల్వీవ
వలసబోయిరిలేరు వనదేవతలును
గందు వీక్షించు భాగ్యము నోఁచికొన్న
నందనా రామమ్మునకు - ధరాదేవి
కేమి దక్కినదింక - యెల్లచెల్వంబు
నామ మతారూపి నాచికొన్నాఁడు
మీ కులపెద్దలు - మేదినిఁగలుగు
గోకిల లెల్లరుఁ గూడికొన్నారు.
తెలియలేదో నీకుఁ దెలివి మాసినదొ!
యిలనెందు కున్నావె! యింకను బికమ!
బుడుతఁడు లేఁడు పో! పో! వానిగోలు
పడి - నిరంతర దుఃఖభారంబునకును
దక్కినిల్చినయట్టి తల్లిశవమ్ము
దక్క, స్మశాన మాధారుణి - యందుఁ"
బడమటి సంద్రాన బడియె సూర్యుండు
బడతి దుఃఖముచూడ భరమైనవోలె!
జూచె, దృష్టులు విప్పి శూన్యదృక్కులను
నాచపలాక్షి గాఢాంధకారంబు
గవిసికొన్నది యెల్ల కడలనాత్మీయ

మవు దుఃఖమే భువి నలముకొన్నట్లు
కుటిలోన చిమ్మచీకటి - యంతలేచి
కుటిలకుంతల యొకగ్రుడ్డి దీపమ్ము
వెలిగించె - మెఱసె చక్షులలోన నీరు
చిలిపిపాపని మోము తలఁపునఁదోచి
తలమల్పి వీక్షించె ధవువైపు మగువ
మలఁచి నిల్పిన యట్టి మ్రానిబొమ్మతఁడు;
నా పాపఁ డింటిలోనడయాడుచున్న
నీ పగిదిని భర్త నేకాంతమందు
గనుగవమూసి కూర్చొననిచ్చునేమి
దనయుండులేని కతమ్మున నిల్లె
పాడువడ్డదటంచుఁ బడతి నిట్టూర్చె
వేడిగా - వగతోడ వేదుఱు గొనుచు
నాపతి దైవంబ! పాపడవత్తు
వా! పాండురంగని నంపరా! యింక
మన పాండురంగండు మఱగెను - నాడె
యనినది యర్ధోక్తి నత్లై మ్రింగినది.
కనులు విప్పె ధవుండు - గామిని యన్న
మును బెట్ట నఱితిండిదిని మూసె దృష్టి
తలె దొల్చె తరుణి హృదయములోఁదోచె
దలెదొల్చు నప్పుడు - దన కొంగు వట్టి
బుడి బుడి యేడ్పులు ముద్దులు గురియ
నడుగుల ద్రొక్కుచో సందెలు బలుక
నత్తనయుఁడు వెంటనంటిహఠాన
నెత్తుకొమ్మని చేతు లెత్తువాలకము;
కలికింకేమి యాకలి దోచలేదు
మలపి వేసెను దీపకలిక నిల్వెల్లఁ
జలియించుచుండ వెన్నెల బైటఁ జేరె

పలుకరించిరి చుట్టుప్రక్కలవార
లేమాటకును బదులివ్వదుగాంత
జాముప్రొద్దెక్కఁగా సంతైన నిద్రఁ
బోవ, దేమోయెంచి మూల్గుచునుండె
నావలనొక్కజా మయ్యె దాలోనె
గ్రుళ్ళికొనుచునుండెఁ, జెల్లుచునుండె
నల్లన మూఁడవ యామంబు - వెక్క
వెక్క యేడ్చుచునుండె - వెన్నెలమాగె
దిక్కుల - భరమయ్యె దీర్ఘ రోదనము,
ఆవినిశ్శబ్దరాత్ర్యంగనగూడ
నీవెలంది యెడంద నెగయించునేడ్పు
వినితుషారచ్ఛలంబున నీరువెట్టి
కనలేకవలె మొలంగినది - ప్రాభాత
మయ్యె - నీరజసమూహమ్ములువిచ్చెఁ
గుయ్యిడెమింటఁబక్షులు - దానఁదెలిపి
వాని గాంచిన యంత వనిత వక్త్రమున
వాన కాళులుగట్టె బాష్పజలంబు
మొదలంటనఱకిన ముగ్ధవృక్షమ్ము
ముదిత గుభాలున మూర్ఛ వోయినది
తటుకున లేచెనా తఁడు - సతిస్పర్శ
ఘటియించునో యనుకాతరత్వమున
నంబరమెల్ల నాహాకారమిచ్చెఁ
పంబినయవ్వాని భక్తివీరతకు
దేవతలెల్ల లజ్జావికుంచితులు
భావతంత్రులుమీటి పాడుకొన్నారు;
పండరినాథుడే బాష్పమ్ములలమ
గుండెలు చెదరి దిగ్గున స్రగ్గినాడు
శాపాహతిని ధరాస్థలిఁ బడినట్టి

పాపరాకన్నియ పడగెత్తినట్లు
దెఱవ మూర్ఛనుదేఱి - యఱమేనునెత్తి
గరములపైనాని - కరుణంబుగాఁగఁ
దిలకించె ధవుని నిశ్చలముగా, దిశలు
బులకించె నామె చూపులగమిఁజూచి-
దడియెండినట్టి బెదవులతో - నుదుటఁ
బడిన ముంగురులతోఁ బాలినచెక్కి-
ళులతోడ - బాష్పకల్లోలమాలాభి
కలితంబులైన కన్నులఁదేఱిచూడ
నలవిగానట్టి యాయమ మొగమందు
నిలిపె నిచ్చలపుఁజూపులు ధవుఁడంతఁ
బ్రేమమేకోశమ్ము పెకలించినదియొ
యా మహనీయుని యక్షియుగంబు
దడియయ్యె గొంతుక గడగడ వడక
నుడివెనాతడు బొత్తినానర వీక్షించి
"కరుణామయీ! మనోహరి! యిది యేమి
కొఱమాలు దుఃఖమ్ము - కొడుకు లేడింక
రాడువెన్కకుఁ బాండురంగని బాహు
పీఠ మందునఁజేరి నిద్రఁగొన్నాఁడు
క్రొత్తదుఃఖము నీకు గ్రొత్తడి! మదికి
హత్తదు - నేఁజెప్పునట్టి సత్యమ్ము
గడు బెళుసుగనుండుగాని - చావునకు
నెడలేదుఁదఱిలేదు - నెంతగుందినను
మరలిరారెవ్వరు - మరణ గహ్వరము
దరిసినవారలు - ధవళాయతాక్షి!
నీకున్న దుఃఖమ్ము నాకు లేకుండునే
నేకందు గుఱిచి - కానీ మనయత్న
మేమి చెల్లని దానికేడ్చుటగూడ

కోమలి! వితగాకఁ గూడునేఫలము
ఇన్నాళ్ళు విలపించితేమి సాధించు
కొన్నావు! మఱిఁదెచ్చికొన్నావాగోడుకు?
ప్రకృతి నటించుఁ జక్రమ్మునఁ బోలి
సకలాధినేత యిచ్చనుఁ దలఁబూని
గనుక - ప్రాప్తించు సుఖమ్ము దుఃఖమ్ము
మనమున కంటించుకొనక విజ్ఞాను
లనవరతమ్ముమాయా తీతుఁడైన
వనజాక్షు నిర్మల పాదపద్మములు
దలఁచుచు - భవబంధముఁ దాటిముక్తిఁ
గలిపికొందురు - భౌతికాశాసహస్ర
శకలిత చిత్తులీ - జన్మచక్రమ్ము
వికలులై దాటంగ వెరవేది - చుట్టు
చుందుదు - రాశలనెల్ల భ్రమందించి, నంద
నందనుపై నిల్పు డెందమ్మునీవు
బోలఁతి! లౌకిక జనంబులకు నాచిత్త
మల శిలా కర్కశంబయితోచు - నీవు
నావిధంబునదల్ప - నననేమి గలదు!
పావనజ్ఞానులు భవరోగములకు
భేషజమిదియెజెప్పిరి - తత్త్వమెంచి;
యీషత్తు గోర్కెలకెలమిలొంగినను
మనము వశంబు దప్పును - వాఁడుచెడును
గనుగొనలేడు నిక్కంబైనరూపు
తరుణిరో! మనపాపఁ దలపోసికొనకు
మఱచి బొమ్మికథ జరుగనియట్లె
మనపాపఁడూడిన మంచిదే యయ్యె
మనకింక సంసారమమతయే దప్పె
నీనాటికిని గింజలింటిలో లేవు

నానాధుడేమౌనొ! నాగతియేమొ
యను తుచ్ఛచింతల నఖిలకాలంబు
మునిఁగిదలంపవు పూర్ణపూరుషుని
రమణి! నీ సర్వభారంబులేనాఁడు
కమలేశ్వరున కర్పణముసేయఁ గలవా
యానాట, కే దుఃఖమంటదు నిన్ను
గాని "నేన"ను నహంకార మున్నంత
వఱకు - దుఃఖములు దప్పవు - కనుద్దెఱచి
పరిపూర్ణ హృదయంబు - పండరినాథు
నడుగులఁ బెట్టవే! యగచాటులేల?
పుడమిఁజూడు మఱెన్నిపుట్టియున్నవియొ
ప్రాణులు - వానికెల్లనుఁ జూపినాడు
వానియాహారంబు - పాండురంగండు
బుట్టించినట్టిదేవుఁడు - బూరిమేపఁ
గట్టడియే! యింతకడి చిక్కఁబోదొ
వగదక్కు - నేడుపవాస వ్రతంబు
నొగిఁజేయ విధియించెనో! పరమేశుఁ
డని, యంత - ధవుఁడు మాటాడెను నేఁడు
మనసు విచ్చియటంచు - మానిని దుఃఖ
మంతయు మఱచె నాయమ యనురాగ
మెంతటిదో! రమాధీశ్వరుకెఱుక—
పలికెఁ బతివ్రత భర్తనుఁ బుల్కు
పులుకునఁ గనుఁగొని "పున్నెంపుజోగి!
తెగఁగోసి కొన్నావు తెంపుతో నీవు
వగను రెచ్చించు చాపల్యంబులెల్ల
నాకింక గోర్కెలు నశియింపలేదు
నాకందుపై యాశ నలిగిపోలేదు
గలుగు లోకంబెల్లఁ గలవలెఁ గాంచఁ

గలవు - నీవేమియు - కష్టంబులేక
నాకింక నట్టి, జ్ఞానమ్ము రాలేదు
లోకంబు సత్యంబు నాకింకఱేఁడ!
పసిపాప రూపులోఁ బండరీశ్వరుని
యసదృశమౌమూర్తి నభివీక్షఁజేసి
కొలుచుచే నాపఁథ - కొడుకిట్లుబోవ
నలరంగడే పోయినట్లయ్యెనాకుఁ
పసికందు వెన్కకు వచ్చునందాఁక
వసము గాదోయి! భావము భక్తియందుఁ
బ్రళయాగ్నిఁబోలు తపంబైనఁ జేసి
కులదీపమైనట్టి కొడుకునుఁదేక
పోదునా! చూడుము - మురళీధరుండు
నాదురవస్థఁ "గ్రన్నన మాన్చితీరు"
ననయామె మాటల వినలేదు ధవుఁడు
కనుఁగవ మూసి చిక్కఁగఁ జొక్కినాఁడు
మొదలఁ దోచెను వెలుంగదుకులు గాఁగ
నదె యభివృద్ధమైనది - రాఁగ రాఁగఁ
గడకు దిక్కులనెల్లఁ గలయఁ బ్రాకినది
కడు వెక్కసంబయి - కనుగొనరాక
నావెల్గు నడుమన నణువు
భావింపనడియె దీపశిఖగా మారె
నాదీపమే యయ్యె నంతటిలోనె
వేద పూరుషుడైన విఠ్ఠలుండుగను
కలకల నవ్వులు కంచుగంటలయి
పలుకంగ మొలనూలు జిలిబిలియాడ
నిలిచిన రంగఁడు - నిఖిలగీర్వాణ
కులపారి జాతంబు - కులుకుఁజూపులనుఁ
జల్లించి - యమృతంపు వెల్లువనించి

యల్లన నీరీతిననెఁ గులాలునకు
"పరిపూర్ణ విజ్ఞాన! నరరూపమెత్తి
చరియించు నాదు వంశావతారంబ!
యఱుమఱలేదు నీదైనతపంబు
పరిపూర్ణమైనది - భవబంధములను
గెలిచితి వింక నీపొలఁతి చాపలపుఁ
కొలికిఁ దప్పింపుము - కొడుకుపైఁజింత
దలకొని - మమ్ముఁదడవంగ మఱచె
నలనల్ల బోధింపు మామెకు నెఱుక—
నాయమ గూడ నవ్యయమోక్ష పదము
కాయంబు గానందుఁ గాని, యొకింత
కాలంబు తడ - కొంతకత సెల్లవలయు
నాలీల లవియెల్ల నాగూర్చువాఁడ!
నీయొట్టు విడువకు నిర్ణిద్రకీర్తి!
తోయజ నేత్రి సంతుష్టిని గుఱిచి;
రేపటినుండి నిర్లిప్తతాభూతి
మాపి - ముందటివలె మన్నుఁద్రొక్కుచునుఁ
గాపురంబునఁజేయి గల్గించుకొమ్ము
నాపయి, నీక్షేమ మరసి రక్షింతు
నీమాటలెల్లను నెపుడుఁ జెప్పకుము
కోమలితో"నని కృష్ణుండు మాయ
మయ్యె "గోరా" యు మహాశ్చర్యమొంది
చయ్యనఁ గనువిచ్చి - సకియనీక్షించి
చిఱునవ్వి నవ్విన - జిఱునవ్వులోన
కఱిగిపోయెను - చానగాత్రంబులెల్లఁ
దనకు దుఃఖమ్ము ప్రాప్తముగానియట్లె
వనజాక్షి యొక వింత వాలకంబమర
మొగము నడ్డము ద్రిప్పి - మగనితోఁబలికె

“నగినావు రా నేడు - నాకల్పవేఁడ!
మఱియొకసారి నవ్వర! నీదునవ్వు
పెరలలో నావగ గరగిపోవంగ
నావేలుపుల పంట నవ్వినాడిపుడు
జీవితాశయెదావిఁ జిలికినదిపుడు
చూడరండో వనసుందరులార!
నేడు నాయింట వెన్నెలచిందులాడె”
మగువ కానందమున్మాదమై పోయె
నగవులే నగవులై మగఁడు దూగాడె;
పడమర యనుబోటి ఫాలభాగమున
కడునొప్పె - భానుండు కాంత చిత్రకము
తళుకుల పరసీమ - వలరాజుమామ
కలకలనవ్వె - చల్వల చందమామ
పాలవెన్నెలలంచు భర్తృముఖమ్ము
బోలవీక్షించెఁబూఁబోఁడి వీక్షించె
నావీక్షణమునకు నలసటేలేదు
నావెలందికి ప్రేమ కంతమేలేదు
“ఎంత సౌందర్యమే! యీనాడు విభుని
సంతోష పులకిత సరస వక్త్రమున
చలువ వెన్నెల నున్న సౌందర్యమెల్ల
నలువొప్పఁ గయిసేసె నావాని మొగమె”
యను భావములతోడ నతివయెడందఁ
బెనఁగొనెముదము, దీవెలు సాఁగిసాఁగి
నడురేయి యరుదెంచె నలినాక్షికనులఁ
బొడమిన నిదురమబ్బులు - తెక్కలార్చె
రమణినిఁ జూచి విరక్తుండు చాల “చాల
శ్రమపడినావు - కాసంత విశ్రాంతి
నందు - గన్నుల నిద్దురానెనీనాడు

సుందరి! "యన - వింతసోయగమూని
పొలతి చూపులు నెమ్మిపురులనుఁబోలి
కలయఁజుట్టెను కాంతు క్రమ ముఖమ్ము
పలుకఁబోయెను బాల - తలఁద్రిప్పెధవుడు
చిలుకల కొలికి గన్నుల నిద్రఁదలఁచి
యీ వెన్నెలలవాక నతివ బరుండె
నా వాలకముగాంచి హర్షించె ధవుఁడు
మెలికెలు దిరిగిన సెలయేరువోలెఁ
జెలగె యొయ్యారి వంపుల తోడి మేను—
యున్నమితములైన యువిదకన్బొమల
చెన్ను, నవ్విన యట్లుఁ జిత్రమైదోచె
కలలలోన బసిపాప గనుపించెనేమొ
చెలువ వాతెఱపైనిఁ జిత్తడి దొలఁకె
నెల బాలుఁడమృతంబు నిండించెనేమొ
తలలెత్తి నిక్కెఁ జన్నులదోయి సతికి
నాకాంతఁ జూచి కామావేశమింత
సోకదు - పతి, కెంత శుద్ధమ్ము మనసు!
పండువెన్నెలలోనఁ బలుకంగఁ దొడఁగె
పాండురంగని సుధాభరితనామంబు
నాకులాలుడు బ్రోదిమ్రాకులలోని
యాకులు - వెనువెంట నలరిపాడినవి
తెలతెలనైన వెన్నెల లందె యెప్డొ
దెలతెలనయ్యె దిక్కులగుంపు - జిలుగు
మొలగంట లులియంగ మొగముఁ జూపినది
తొలికొండ చఱుల ప్రత్యూష పురంధ్రి;
చలిగాలిపీచెఁ బూవుల చెక్కులంటె
యలరె ముత్తియములు దలిరులపైని;
నంతఁగులాలు డత్యను రాగమమరఁ

జెంతఁబండిన కాంతఁజేతులు దట్టి
పిలచిన-పిలుపు చక్కిలిగింతలోనె
జలజాక్షి కనువిచ్చి చకితయై లేచె
కాల్యముల్ దీర్చి నిక్కంపు భక్తుండ
తుల్యమ్ము - సంసారతోయధనౌక
కమలాక్షు భజన శ్రీకారముఁజుట్టెఁ
గ్రమముగా మన్నుఁద్రొక్కుచుఁ గులాలుండు;
మడతి, బండరినాథు మదినెంచు కొనుచు
వడి వడిగా నింటి పనులనుఁ దీర్చె
మహితమైనట్టి గోమయ వాసనల
గృహలక్ష్మినవ్వెఁ - దీర్చిన మ్రుగ్గుతోడఁ
జెదరి పోవని మ్రుగ్గుఁజెల్వ చూచినది
మదిలోనఁ బాపండు మలసెనో! యేమొ.
కనులయంచులనీరు కదలి యాడినది
తనపాపడున్నఁ బెట్టిన మ్రుగ్గుకెదికి
కనులపండువుఁ జేయుగదయన్నచింత
వనిత మొగమ్ము నిశ్వాసధూమ్రమమ్ము;
పమ్మిన కన్నీరుఁ జిమ్మివేసినది
యమ్ముగ్ధ, తన మగండరయునో యనుచు
బలవంతముగఁ బెదవుల నవ్వుదేర్చి
తెలి కన్నుగవలఁ జూపుల బాగుగూర్చి
కటి బొమ్మలందు వంకలు దీర్చి - నుదుటఁ
బరమ పాతివ్రత్య భద్రచిహ్నంబు
కమనీయమైన కుంకుమరేఖదనర
రమణి నిల్చినది - కులాలునియెదుట
నతడెచ్చరించె మందాలస దృష్టి
పతి - నెచ్చరింపులోఁ జాయగాఁదోచె
కపిగందుచూపు చక్కని వాలకమ్ము

కసుగందె నామోముఖమ్ముపై నవ్వు
దళిగిన నగవు మెత్తగఁ దెప్పలోనఁ
బరికించి - వేరైన భామినిరేఖ
ఘన విషాదాహియాడ్చినకుబుసంబొ
యనగ నిట్టూర్పు వీడెను - కులాలుండు
తలవంచి యాయమ ధరణి వీక్షించెఁ
దలనెత్తివాడు మిన్నులవంకఁజూచెఁ
బలికె నంతట తన ప్రాణేశుతోడ
నలినాక్షినాడు "గింజలులేవ" టంచు
వాఁడూరిలోఁబోయి వారిని వీరి
వేడి - కుండలనమ్మివేదీర్తుననుచు
మూఁడు నాళ్ళకు సరిపోవు బత్తెంబు
చేడియ చేతికిచ్చెను దెచ్చి - దాన
మొగమెల్ల విరిసెను ముగుదకు - లచ్చి
వగలునఁ దనయింటి వద్దకే వచ్చి
కొలువు దీర్చినటు - బేదలయాసలెంత
లలితమ్ములెంత కోమలమైన శాంతి!
క్రమముగాసాగెఁ గులాలుని వృత్తి
ప్రమదయునింటఁ బారాడఁగాఁదొడఁగె
వాని పుణ్యములు రూపమ్మెత్తినట్లు;
కూన యొక్కటిలేని కొదువయేదక్కఁ
దరళాక్షికితరచింతయెలేదు - దానిఁ
బరమాత్ముఁడొకఁడె దీర్పఁగఁగలవాఁడు
తలపోయ యత్నించుఁ గలికి శ్రీకాంతు
మలహరమైనట్టి మంత్రంబుగాని
పలికించునేదియో ప్రబలమౌకాంక్ష
కలయైన యా పసికందునామమ్ము -
భావింప నేర్చునుభామ - యానంద

సేవధి - రంగని శ్రీకరమూర్తి
నంతటిలోనిల్చి నఖిల యెదుటఁ
గాంతరూపమ్మయి కందునెమ్మోము -
మఱువంగనెంచును మానిని కొడుకు
మఱచును రంగని నరవింద నేత్ర -
యెంతఁ బ్రయత్నింపనంత గాఢముగ
వంతఁగూర్చుచుఁ బిల్లవాఁడెహృద్వీథి
నాక్రమించెను దేవునడుగులయందు
నేక్రమంబున నిల్వనీక చిత్తమ్ము;
నొకనాటి మధ్యాహ్నమువిదయు వాఁడు
వికసితముఖులయి - వేడుకఁ బ్రొద్దు
గడుపుచున్నారప్డుఁ గాంత, యెడంద
ముడివడ్డకోర్కెతో - "ముట్టికొందునర
నాయొట్టునాసామి - నాకు వెన్కకును
నీయరా! నేనోర్వనోయి! నీసడుకు
నాయొట్టుగైకొని నాకీయకుండ
మాయలమారివై - మఱగుచున్నావు
లేదు నాయొట్టుగాలినిఁ జేరిపోయె
పాదముల్ ముట్టుదు భ్రమచంపకోయి!"
యనినంతఁ జఱచినట్లయ్యె భక్తునికి
వినవెయో తన్వంగి! విభుఁడు రంగండు
నిన్నుఁగూడనుఁ, గలఁ జెన్నుగానిలిచి
నన్నెచ్చరించి - యీ నా పట్టు విడకఁ
బాలించునట్లుఁ బ్రీవమ్ముగాఁ జెప్పె
బాల! యెందులకుఁ జాపల్యంబునీకు
వలచుము పండరీశ్వరుని యొండేమి
ఫలము "గోరక మోక్షపదవి సిద్ధించు"
ననులోన నందుకొన్నది సుధామూర్తి

"కనపడె నిన్ననాకల కృష్ణమూర్తి"
యాకొట్టెధవుఁ, డేమి యుచ్చరించెడునో
యాకల్కి యనెడు పేరాస గూడంగఁ
బలికెను గాంత "పైపై నేమియందొ
వలపుల చిలుక! చెక్కులనవ్వు పండఁ
గులుకుచు దోగాడు కొనుచు - నాయంక
తలమునకేవచ్చెఁ దెలిసెనా! వచ్చి
కలకలనవ్వె - నవ్వుల మనవాని
వెలుఁగు వెన్నెలనవ్వు వింతలేతోచె -
వీడెవ్వఁడమ్మ! యీ విధముగావచ్చెఁ
జూడగా - నాపాప సొబఁగు లేననుచుఁ
దిలకించితిని గళల్వలచినమోము
తలపైని నెమలి కన్నుల గుత్తిలేదు
మనవాని బుగ్గలే - మనవాని కనులె
మనవాఁడె దారంగఁడనివచ్చినాఁడు"
తరుణికిఁబై మాట దొరలనేలేదు
కరమూరు చున్నది కన్నీటియూట
పరికించెఁ గుమ్మరివాఁడు, వామాక్షి
వరుసగా వెడలె నిశ్వాస ధూమములు
మనసులో నెన్నియోచనలు రేగినవొ!
వనితఁజూడకఁ జీవాలున లేచిపోయె
అప్పటినుండియు నాతని యెడఁద
నుప్పతిల్లెను చింత "యువిదకుశాంతి
గలిఁగెడు నట్టి మార్గంబేమి? యామె
దలపదు రంగని - దలపనివ్వఁదును
భరమైన కొడుకుమంపరమేమిజేయ
వెఱపేదిలోలోన నెఱియుచునుండె
నరుదెంచెరాత్రి - నీహారకరుండు

కురుల - మల్లెలబంతి కరణిఁజూపట్టఁ;
గూరుచున్నారప్డు కుంభకారుఁడును
వారిజాక్షియు నింటిబైట - వెన్నెలలు
పాలొల్కఁ బోసిన వసుమతియందు;
గాలిపాడుచునుండెఁ బూలపాటలను
తన భావలోకమే తనదిగానుండె
వనిత మౌనమ్మున - వాఁడంత దలఁచి
'పలుకవా! నాతోడఁ బడఁతుల మిన్న!
వలపనుఁ జిల్కఁ జెక్కలు విచ్చినట్లు
లని' యెచ్చరించిన నబ్జాయతాక్షి
కనులెత్తిచూచెఁ గ్రక్కున - నామెకండ్ల
మినుకులఁగాంక్షలే మెదలి యాఁడినవి
వినువీథిలోనఁ దెల్లని మబ్బులట్లు;
మఱలననె మగండు 'మహనీయమూర్తి!
తరళ దృష్టులనె యుత్తర మిత్తువేమొ
కలికి చూపులెగాదు కలకంఠమట్లుఁ
బలుకంగవలె మది వనటలు దొలఁగ'
ననినంతలోనె వనాంతరంబందుఁ
బనవి పల్కినదొక్క పరిగళంబెత్తి
విరహిణీ పికియుఁ దచ్ఛ్వరముతోఁగూర్చి
యరవింద సమవక్త్రియప్పుడూకొట్టె
భాషించెధవుఁడు శబలిత చిత్తుండు
యోషిల్లలామ! నీకుండిన యలఁత
మఱువనేలేదు - సుందరపాండురంగ
చరణపంకజ సమాశ్రయమునుఁగూడఁ
జేయనేలేదు - చచ్చినసుతునెందో
రోయుచున్నావు తిరుగ వచ్చుననుచు
వాఁడింకరాఁడు నీ వదనంబునందుఁ

గూడదు ప్రమదంబు - క్రుళ్ళుచునిల్లై
గతియింతువీవు - శ్రీకాంతు నామమ్ము
మతిఁజేర్పకాకందు మమతలోఁజిక్కి
యేకాంతవాసంబు నిచ్చించుచుందు
వో కరుణామయీ! యోగులు - మనసు
దళితేంద్ర నీలపాదమ్ములయందుఁ
జలియింపకుండ నిమ్మల నిల్పుకొఱకు—
నీకునేకాంతమే నిష్ఠురమైన
శోక మూలంబుగాఁజొచ్చె, ననేక
జననసంచిత పుణ్యచయములు పండి
కొనిన నీజన్మంబు - కూనకై ఁగుంది
రంగని వదలి వ్యర్థము చేసికొనుట
యంగన! చూడశక్యముగాదు - నాకుఁ
బద - పుట్టినింటికిఁ బదుగురిలోన
మదినున్న చింతముమ్మరముగాఁదోప
దటఁగొన్నినాళ్ళుండి యంతటవత్త
మిటకు - నన్నలయింపకే! చూచి చూచి
యనలేక ననలేక ననుచున్నవాఁడ
వినుము నాపల్కన్న - విభునిముఖమ్ము
దిలకించెఁ బొమలెత్తిపొలఁతి, యాయకకుఁ
దళతళమెఱయు వెన్నెలయందు స్పష్ట
ముగఁదోచెఁగాంతుని ముఖమండలమున
నెగపి కప్పినవంత మొగిళుల గుంపు
మఱుమాట పల్కదెప్పరమయ్యెసతికి
"సరి" యని యూకొట్టెఁబరమ పతివ్ర
తలకు - నాథునికన్నదైవమొండెద్ది
తలనున్న బరువుక్రిందఁ బడినట్లయ్యె
"గోరాకుఁ" - దృష్టుదై కునుకంగఁదొడఁగె

నీరజాక్షియుఁగూడ - నిదుర గూరినది;
తొలికోడికూసె - దిక్కుల నల్పుమాసెఁ
దులసీసుగంధ బంధురములు - చలువ
గాలులువీచె - మేల్కాంచెఁగుమ్మరిత
యాలోనఁ గుంభారుఁడక్షులవిప్పె
మన్నుఁద్రొక్కుటతోడ మధురమైపాగె
నన్నలినాక్షునామామృతస్మరణ;
పడమటి దెసమొగ్గె భానుండు - నెండ
వడతగ్గె - నప్పుడు భాండనిర్మాత
యాడె భార్యనుఁజూచి "యతివలమిన్న!
నేఁడె ప్రయాణంబు - నీపుట్టినింట
కలచంద్రుఁడంబర స్థలికెక్కునంత
నలుపుదమప్పుడే సాగుఁబై నమ్మ
వడివడినింటిలో వలయు నేర్పాటు
నడుపవే" యంచును - నలినాక్షి "వల్లె"
యన్నదాయింటనే మున్నదివాచ
నున్నదంతయు భక్తియొక్కటేదక్క!
యున్నకుండలనెల్లనొక్కచోఁజేర్చి
సన్నమూకుడులవి సరిగాగఁదీర్చి
కోమలి యింటిలో గుడ్డయు గుడుసు
నేమూల కామూలకే మూల్గకుండ
పేరిచి - తమతల్లిగారు తమింటి
పేరనిచ్చిన చెక్కపెట్టెలో దాఁచె
నిరుఁగు పొరుఁగు వారికెల్లనుఁజెప్పె
వరశీల - తమయింటిపై పొకసారి
చూచుచుండుడటంచుఁజూతు మన్నారొ!
యాచేడియలు కన్నులడ్డంబు ద్రిప్పి;
రేమొ! వారికినెల్ల నీమెపై ద్వేష

మామురహరుని మాయాలసితంబు
లిట్టి వట్టివటంచు నెవ్వరుచెప్ప
దిట్టలు! రంగఁడే - తెలియంగవలయు!
నరుణాంశుఁడంతట నస్తమైపోయె
ముఱిముఱి చీకటుల్ మెఱసె దిక్తటుల
నెలబాలుఁడల్లన నింగిపైఁ బ్రాకెఁ
జలువ వెన్నెల దిశాంచలములఁదాకె
నప్పుడు కుంభారుఁడన్నంబు దిన్న
నప్పడంతియు శిష్టహవ్యంబు గుడిచె
పదపడి యింటిలోఁ బనులనుఁ దీర్చి
మదిరాక్షి - గుడ్డలు మట్టసంబుగనుఁ
జిఱు మూటగట్టి చెచ్చెరవచ్చి ధవున
కరులు దుల్కాడఁ బ్రయాణంబునెచ్చ
రించిన - నతఁడు "సరే" యని సమ్మ
తించి - దుప్పటమునుఁదీరుగాఁగప్పి
కొని - కఱ్ఱనొకటి చేఁతనుఁబూనె - దారిఁ
జనునప్డు దోడుపడును - ననునాస;
తరుణియు నింటికిఁదాళమ్ము వేసి
వెరవుతోఁ జిఱుమూట వీపున గట్టు
కొన్న - దామూట చూడ్కుల పండుగయ్యెఁ
జన్నట్టి - కన్నయ్య శయనించునట్లు;
నడచెను మధుర శ్రీనాథనామమ్ము
నుడువుచు ముందునాథుఁడు - వానివెంట
ననుగమించెను చాన - యాభగీరథుని
అనుసరించెడు నమరాపగవోలె
నతఁడు భాసించె వేదార్థమ్ము పోల్కి
నతివ వెలింగె స్మృత్యర్థమ్ము రీతి—
ఖాండవినిర్మాత పలుకు నామమ్మె

యండజయాన తీయంబుగాఁబాఁడు
నతని కంఠమునందు నభ్రముల్మ్రోయు
పతిగళమున పికచయములు పలుకు
పదముల లయదట్ట భాండనిర్మాత;
సుదతి చేతులఁదట్టి చూపుఁతాళమ్ము
వెన్నెల విరిసినవేళ-లోకంబు
కన్నులు మొగిచిన కాలంబునందుఁ
బలుకుచున్నది గాలి - తలలెత్తియాఁడి
కలిమల హరణమ్ము - కమలాక్షు పేరు
నెక్కడనేర్చెనో! యెపుడు నేర్చినదో!
యక్కలాలుని చెంత నపుడె నేర్చినది;
యా కుమ్మరికి దృష్టులఱ మూత వడియె
నా కల్కికందమ్ము లార్ద్రమ్ములయ్యె
పద పదమ్మునఁ గొంతు వడఁకె నాతనికిఁ
బదపదమ్మునఁ బ్రేమ పండెనా కాంత
కతని పాలిటి రంగఁ డగుణుఁ డనాది
యతివ పాలిటి రంగఁడయ్యె బాలుండు
నడఁచు చుండిరి వారు - గడచినదారి
మెడమల్పి చూడకఁ - మిక్కిలి భక్తి;
మాగు బారెను చంద్రమండలం బంత
లోగఱితయుఁ గులాలుడుచేరినారు
తమయూరి పొలిమేర, తమయూరుఁజూచి
ప్రమదంబు తోడ నాప్రమదకుఁ గనులు
తెలతెలవాఱె తమ్ముల పోల్కివిచ్చె;
గిలకొట్టె మనసులోపల బాల్యఖేల—
లప్పుడు దానొక యచ్చరకన్నె
గుప్పలు దిప్పలౌ కోర్కులు మదిని,
దెలినవ్వు విడని వాతెఱ - పెనుదుఃఖ

జలజలోచన - చారు చక్రవాకముల
దులకించు పూప చన్నులు గదలాఁడ
నలనల్ల నటువచ్చె నా కుంభకారు
రెండవ కూతురు - లీలాస్మితంబు
మెండుకొనంగను మృదులోష్ఠమందుఁ
దన యక్క ప్రక్కకుఁ జనుదెంచి - చేతు
లనుఁజాచి - "యేదెపిల్లఁడు చూత" మనియె;
నా మాటతో గుండె నడచినట్లైనఁ
గోమలి - తలవంచి గోలుమటంచు
నేడువ దొడఁగె - నా యేడుపె చెప్పె
వాఁడెన్నఁడో - విష్ణుపదమందె ననుచు—
జెల్లెలి హృదయంబు శీర్ణమైపోయెఁ
దల్లి మనస్సులోఁ ద్రాచులు మలసె
నందఱు నేడ్వ - హాహాకార మెనసి
క్రందు కొన్నది ధరాకాశంబులందు
విన్నాఁడు మామ - యీ వేదనాగాథ
కన్నుల బాష్ప ముల్గరడులుగట్ట
విలపింపఁ దొడఁగె, వీరలమధ్య నొకఁడె
చలియింప నట్టి సుజ్ఞాని - యల్లుండు;
చుట్టుప్రక్కలవారు చూచి రీగొడవఁ
జుట్టుముట్టిరి యెంతఁ జూచిననొకటె
మరణంబునకు దయాభర మింతలేదు
పరమేశు నిచ్చ మార్చను వీలుగాదు—
తల్లిపల్కెన" దెంత దంటవే! నీవు
పిల్లవానికి నింత పెద్దరోగమ్ము
వచ్చినచో నొక్క వార్తయుఁజెప్పి
పుచ్చలేవో! చెప్పి పుచ్చియే యున్న
ఱెక్కలుగట్టి వ్రాలెడు వారు లేరొ!

యక్కటా! పిల్లని హతమార్చినట్టి
కౌగిలితోవచ్చి - కాయగోల్పడ్డ
తీగ పోలిక నిల్చితే బిడ్డ! యెటులఁ
గనుఁగొందునే నిన్న"టనుచు - కూతురునుఁ
దనతల్లి యొడిలోనఁ దలఁజేర్చి - యేడ్చు
చున్న - దేమంచు నిచ్చును నుత్తరము!
న న్నలినాక్షితో నప్పుడు పనవెఁ
జెలియ, లో యక్కా! యా చిన్నిపాపండు
నిలపై నిఁ బ్రదుకు వాఁడే గాఁడుతల్లి!
యా నవ్వుపౌరలేమి! యామాటలేమి!
యానిగారపు చూపులందమేమమ్మ!
మనుజ మాత్రుఁడె వాఁడమర్త్యుఁడే నిజము
మనకు దక్కునె వాఁడు మందభాగ్యులకు
బూచివచ్చె నటన్న బుడిబుడి బరచు
నా చెల్వమే పాపలందున్న దింక——
నాఁడరా చిన్నయ్య! యాఁడరాకృష్ణ
యాఁడరా నావాఁడ! యన్నప్డు ఘల్లు
ఘలుమంచు మొలనూలు పలుక - పెన్నెరులు
నలికంబుపై నాట్యమాడుచు నుండ
వనమయూరము వోలె వాఁడాఁడు నపుడు
కన్నులున్న వారెల్లఁ గరగిపోవుదురు
వాఁడు మాయంబయ్యె నేడింక నెవ్వ
రాఁడెద" రోర్వగా నతిభరమయ్యెఁ
బాపని తల్లికిఁ, బలికె "నో చెల్లె!
నా పుణ్యఫలము చిన్నయ్య చేతలనుఁ
గలచి కన్నులయందు నిలుపకే నీవు
తలమున్కలయ్యెను - తాళలేనమ్మ!
పోయిన గాథలు పోనిమ్ము - మఱల

యూర్పుమంటల యనుభవంబులకుఁ
గెదుకకే! తాపంబు గదురు - నాగుండె
చెదరు - వసంబేది జీవ పంచకము
బ్రిదులు - మఱువనిమ్ము పిల్లని సోదె
బ్రదుక నిమ్మిక నన్ను - బట్టనుఁ గట్టి"
యని - యింతలో దిక్కులనుఁ దెల్పుగూరె
దినమణి పొడసూపు దిశజొత్తు మీరె
నాదినమంతయు నంగలార్చుటయె
లేదింటిలో శాంతి - లేశమ్ముగూడ
మరుదినమయ్యె నావరకు నొకింత
పరితాప భరము మువ్వురకునుఁ దగ్గ
మఱిరెండు దినముల మఱచిరి చింత
తరళాక్షి చెల్లెలు, తల్లియుఁగూడఁ
గన్నతల్లి మొగానఁ గళ గూడలేదు -
చిన్న పాపని చింత, యున్నట్టి మగఁడు
తనుదాకఁ దనెడు చింత - కరుణలేకఁ
దనయునిఁ ద్రొక్కనేయను చింత - తనకు
సంతాన మింతనేచాయ యన్చింత
సంతతి లేనట్టి జన్మంబు వ్యర్థ
మనుచింత - పోయినఁ దన పసికందుఁ
గనుఁగొను మార్గమే మనుచింత - యన్ని
చింతలే, యెవరితోఁ జెప్పనులేదు
వంత మ్రింగనులేదు భామిని - యింక
మంచంబుఁబట్టు నున్మాదమే కొదువ;
చంచలాక్షి మనస్సు - చచ్చినపాప
వనటయొక్కటె - బాధపఱచెడు నంచు
జననియు - సోదరి - యనుకొన్నవారు
కాని, వారికి - లోని కత యేమి యెఱుక!

దీన దినములైన దృక్కులతోడ
శోకమే యింటఁ గూర్చున్నటులున్న
యాకూఁతు వీక్షించి - యమ్మ వచించు
"నెన్నాళ్ళు చింతింప నేమిలాభమ్ము
పిన్నపాపం డింక వెనుకకు రాఁడు.
రాతల్లి! ప్రబల కర్మము దాట నెవరు
నేతు రన్నంబును - నీరును విడిచి
పెద్దప్రాణము నిట్లు వెతఁబెట్టఁ దగునె"-
"వద్దంచు" బిడ్డలేవదు - బెంగపడును
తళ్ళ దగ్గుత్తికఁ దల్లినిఁ జూచి
క్రుళ్ళియేడ్చును బిడ్డ - కూఁతునుఁ గనుచు
బావురుమని మాతృదేవి శోకించు
నేవారు సరిచేతు రీ హృదయములు
దలె ముందుఁగూర్చొను లలన - కన్నీరు
పలపలగారు చెక్కులనంటి - యన్న
మిందదు - తిన్నట్టులేమో నటించు
సుందరి - యంతలేచును చేయికడిగి-
మఱల నేకాంతమే - మఱపురానట్టి
సురుచిరాకారుని సూనుని గుఱిచి
తలపోఁతయే - బొమ్మవలెఁ, బెనుమూగ
వలెనుండుటయె - మార్పు నలుసంతలేదు.
మగఁడందమా! జ్ఞానమదిరా ప్రమత్తుఁ
డగ పడండెన్నఁడు - వగపున - నాతఁ
డలినీలవేణి యూహలగూడు - సుంత
వల వంతకునుఁ దీరుబడి చిక్కఁబోదు
రమణికి, నింక సైరణ దక్కువయ్యెఁ
గమలాక్ష నిధ్యాన కల్లోలములను
మునిఁగి - యాలోకమే యనుకొననట్టి

తన ధవునిఁగనంగ మనసయ్యె - నెవ్వ
రంతలింతల లేని యట్టి యేకాంత
మింతి చేరెను భర్తనెలమి దోఁకఁ-
బలుకఁడువాఁడు, నిప్పులఁ బోర్లినట్టు
లలివేణి మనసు బాధాక్రాంతమయ్యెఁ
బలవింపఁ దొడఁగెఁ, గన్నులనుండి పాఱు
జలములు - పతిపాద జలజము ల్గడుఁగ
నోటి మాటకుఁగూడ నోచుకోలేదా!
మాటాడ వేమిరా! మన్మథాకార!
కొడుకునుఁ బోఁగొట్టుకొని నరకానఁ
బడిన నాపైనేమి - పంతమ్ము నీకుఁ
బాపఁడు లేక నేఁ బ్రదుక లేనోయి
యీపాడు దేహంబు నిపుడెఁ ద్యజింతు
నాకుఁ గైవల్యమీనాఁడు కాఁబట్టి
దాకూనయేస్వామి! యమృతత్వసిద్ధి
మఱల నాకసుగందు - చిఱు నవ్వుతోడఁ
బరుగిడ నేవలె - బంగారుకొండ
మనయింటిలో, నేమి మాటాడవేల!
తనయు నొసంగరా దండి భక్తుండ!
పలుకు నంతకు వరపడెదనీ నాడు
పలుక నేవలెనంచు - బహువిధంబులను
విలపింప వినుచుఁ జఖల విచ్చెవాఁడు
చలనంబులేని - పాషాణరూపుండు
పలికెనుగోల! నీవర్తనంబునకుఁ
దెలుపవే యేడ్తునో! చెలగి నవ్వుదునో!
కొమ్మ! నీవొకతె పోఁగొట్టు కొన్నావె
యిమ్మహిఁ బసిపాప - నెందఱులేరొ
యడిగిచూఁడవె - యెవరైన నీయట్లుఁ

గొడుకునకై ద్రవ్వుకొని యేడ్చినారొ
పిచ్చిపిల్లా! చచ్చి వెన్కకుఁ దిరిగి
వచ్చినవార లెవ్వరు గాఁనిఁగలరొ!
యొక కథఁజెప్పెద నోర్పుతో వినుము
సకల క్షితిని ధర్మసంరక్ష సేయఁ
బరమేశ్వరుఁడు బుద్ధభగవానుఁడగుచు
నరుదారఁ దిరిగెడు నట్టి రోజులవి-
యొక్కనాడు సమాధినుండి యాతండు
గ్రక్కునఁ దెఱచెను కందోయి - నెదుట
నిలచిన దొక్కతె నీవంటి యబల!
జలపరి పూరిత విలులితగాత్రి
కరయుగమ్మును మోడ్చి - కనకాంగి, చెంత
మరణించినట్టి కుమారుని శవము
పడియుండె ధరణిపై - వాఁడును నీదుఁ
గొడుకంతవాఁడె - నీ కూర్మివంటిదియె
యాతల్లి యనురాగ మవనతమస్త!
చేతస్సరోజంబు చిందింపఁ గరుణ
పలికె బుద్ధుడు "మాత! వచ్చినయట్టి
గెలసమేమి" యటంచు, నిలజాగి మ్రొక్కి
యాకల్కి దీన దీనాస్యంబుతోడఁ
నీకరణిని వచియించె "నో ప్రభువ!
తొలిచూలి నాకిది వలపులపంట
బలియయ్యె నేఁడు చేడ్పడి - మృత్యువునకు
నా పసిపాప వెన్కకు నిమ్ము తండ్రి!
నీపేరుతోఁబిల్తు నింకనావాని
పరమ తపస్సు లివ్వగలేనియట్టి
వరములు గలవె! నాపాప" నిమ్మంచు
కాళ్ళవ్రేళ్ళనుఁబడి కడువిలపించుఁ

దల్లిని వీక్షించు - ధాన్య బుద్ధునకుఁ
గనుఁదమ్ములను గిరికొనెను జలమ్ము
వనిత! తాత్త్వికులకు మనసులులేవె!
బదులిచ్చె బుద్ధుండు - 'వలదు సంశయము
బ్రదుకింతు నిప్పుడే - పాపని తల్లి!
కాని - యొక్కటె క్రియ గలదు దానికిని
వీని నిక్కడెయుంచి - చాన! నీవేగి
యేయింట నేనాఁడు నెవ్వరుఁ జావ
రాయింటఁ బిడికెడు నావాలుదెమ్ము
మఱియేమి వలదు - కుమారుండు బ్రదుకుఁ
ద్వరపడు' మన్నంతఁ బరుగిడె - నాపె
వెలది! నీవలెనామె వెఱ్ఱిబాగులది;
కలదె! చావన్నదె కలుగని యిల్లు?
కట్టిన కడపెల్ల జుట్టినదామె
చుట్టి చుట్టి - పడంతి - సొమ్మవోయినది
గాని యావాలు - చిక్కనెలేదు - నెచటఁ
దానడిగిన నవ్వె - తనకు నుత్తరము-
మఱలి వచ్చెను వ్యథాభరిత - యామాత;
చిఱునవ్వు పెదవులఁ జెంగలింపంగఁ
గడువడి నుడివె బుద్ధుడు చెయిఁజాచి
పడఁతి! తెచ్చితివె యావాలంచు - నామె
శిరమెత్తనేలేదు - సిగ్గున నలిగి
యరయుచున్నది భూమి నపరాధినివలె
నప్పుడు భగవానుఁడనె "తల్లి! చావుఁ
దప్పించు కొననేరి తరముగాదమ్మ
జననంబె యున్నచోఁ జావును గలదు
మనమున నెందుకీ మాడ్కిఁ గుందెదవు
నందఱుఁ జచ్చెదరమ్మ! యేనాఁడొ

యిందె - యూగెడు వారలెవ్వరులేరు
మరణంబునకు లేదు - కరుణయోతల్లి
పరికింపదితఁడు - పాపఁడు వృద్ధటంచు
జననంబు మరణంబుఁజాన! తప్పించు
కొనగ సత్యంబుగాఁ గోరెదవేని
తెగువ - వాసనలెల్లఁ దెగఁగోసికొమ్ము
తగులవు - జన్మబంధముల నటంచు—''
నామె హృదయకోశమల్ల విచ్చినది
ప్రేమస్వరూపుడౌ - విభునిఁ గట్టెదుట
దగ్ధంబొనర్చె నంతన వాసనలను
ముగ్ధ - నాటనుఁగోలె బుద్ధచైత్యమున
భిక్షుకీ వ్రతమును స్వీకరించినది
యక్షయ నిర్వాణ మందినదామె
యరపితివో! దీని యర్థమన్నంతఁ
దరుణి - మూకాకృతిఁ దరలిపోయినది
మరుసటి దినమందు దరసినదామె
మరల జీవితనాథు - మరియదే గొడవ
విసుగెత్తినది ప్రాణవిభున కన్నాడు
వసముగాదింక నావలన - నీయింట
నుండు మందువా! లేదా! యొక్కటిఁజెప్పు
మండజయాన యటంచు, నావాక్య
మునకామె యెడఁద గ్రుమ్మిన యటులయ్యె
వినయంబుతో శిరంబును వంచి నుడివె
''జీవేశ! నన్నేమి చేయుమన్నావు
భావమే - నిలువదు పరమేశుపైన
నన్నుఁదాకవునీవు - నాయొట్టుచుట్టు
కొన్నది యురిగాగ గొంతుకు, నిన్ను
భంగింప నాకేమి ప్రతినయా! చూఁడు

పొంగి వచ్చెడు నాదు పూపవయస్సు
విరికన్నె యేటికిఁ బరువంబుఁజిమ్మ
నరుదెంచి చుంబించునని మధువ్రతము—
వనలక్ష్మి - యుత్సాహమున నేల కులుకు
దనునప్పికొనునని తరుణ మాధవుఁడు—
నేల ధునీసతి యెగురు ద్రుళ్ళింత
జాలి గొన్నాఁడని సాగరస్వామి
గగనేందిరకు వింత సొగసేల - తుంగ
నగశిఖరంబు నెమ్మిగ ముద్దుగొనుట
కతివయేమని కోరు యౌవనంబుననుఁ
బతిదైవ మనుభవింపగ నిమ్మటంచు
అటులుండ నాస్వామి! యాశలన్నియునుఁ
దటుకున నెటుఁద్రుంతుఁ గటికతనాన!
మాట సామెత కన్నమాటనుఁబట్టి
యాటలాడింప న్యాయంబేమొ నీకు"
నందుఁకొన్నాడు వాఁడంత లోపలనె
"సుందరి! యెంతటి సోదెఁజెప్పితివె!
వహ్నితోఁ జెలలాట భగవంతు గుఱిచి
నిహ్నవించుట మాట నిలుకడ - వేడ్క—
కైనవెవ్వఁడు పరమాత్మ నిందించు
దానితోఁ దీరును వాని తపస్సు
సర్వేశునకు నపచారం బొనర్ప
నోర్వ, నేమైన, నన్నూరకనేల
దీనపై కెదుక - నాలోనేనులేను
వానియిచ్ఛయె - యింతవరకుఁ దెచ్చినది
యెంతకష్టమెకాని - యేమైనఁగాని
పంతంబు వదలను - భామ! నిన్నాక"
నన్నాఁడు - వేదుము గొన్నదికాంత

మిన్నవియుచుఁ దలమీదఁ బడ్డట్లు
నడలుచుఁ బరువెత్తి - యటనుండి వచ్చి
పడినది - తనతల్లి బాహుబంధమునఁ
బిలచినఁ బలుకదు - నిలుపదు నేడ్పుఁ
జిలుకల కొలికి కన్నులు వాచిపోయె
మఱుదినంబందుండి మంచముపట్టెఁ
దరుణి - తీవ్రంబైన జ్వరముగాచినది
తనువు నానాటికిఁ దఱుగంగఁజొచ్చెఁ
దినఁగ నన్నమువోదు - దీర్ఘదాహంబు
కనుల యందునె జీవకళనిలచినది
వనితకు లేదింక బ్రతుకుపై నాస
'గోరా'కు నిది ప్రాణ గొడ్డమై పోయె
నేరీతి దోప దింకేమైనఁగాని
రంగఁడే గతియంచు-రమణి మంచంబు
చెంగటఁ దానుగాచికొనియె యుండె
నయ్యది నడురేయి—యపుడు చెల్లెలికిఁ
దొయ్యలి తల్లికిఁ దూగువట్టినది
కనుఱెప్పలెత్తి చూచెను ధవువైపు
వనజాక్షి-యేదియో పలుక నున్నట్లు
అతఁడు ముందుకు వంగె-నలివేణి పలికెఁ
బతిదేవ ! పేఱొక్క పరిణయమైనఁ
జేసికోరా ! నాదుఁ జిన్నికుమారుఁ
డాసతి కడుపునందైన జనించి
మన యిల్లు పరమపావన మొనరించు
ననుచుఁ - దోడనె కన్నులను నీరునిండె
వనితకేడ్చెడు నంత బలమైన లేదు
మనమేమొ - బిట్టుగాలినది - తాపమున
నేమంచు నుత్తరమివ్వగా వలెనొ

యామగనికిఁ దోచ కటునిటుకునికె
నంతలో హృదయంబు నందుండి యెవరొ
కాంత! కానిమ్మని కడువడిఁబలికి
రతఁడు దిగ్భ్రమఁ జెందె నన్నవారెవరొ!
పతిత పావనుఁడైన పాండురంగండె!
మగనికి నిదియెల్ల మాయమై దోచె
నగవొ! యాశ్చర్యమొ! మొగమున్నవేలె—
వరధనుర్జ్యానాద పరిభీతయైన
హరిణి విధంబునఁ బరువెత్తినాఁడు—
నెల్ల చింతలు బాచు నేకాంతమునకు—
నల్లనఁ గనుమూసె నపుడు పురంధ్రి
తెలవాఱెనింటఁ బనులు సాగుచుండెఁ
జెలియలి కన్నన్న జీఱె నవ్వేలఁతి—
పిలచినదే చెలియలికిఁ గొండంత
ఫలము-తొందరగాఁగ వచ్చినదామె—
చెయిఁజాచె నక్క - విచ్చిన చూపుతోడఁ
గయికయిఁజేర్చి ప్రక్కనఁ గూరుచుండె
"జ్వరమెంతఁ జేసెనే పాడుదటంచు
నరవాయి గొనుచు సోదరి" యామెమాట
విని-యల్ల నవ్వెను వనిత - యద్దానఁ
గనపడె నూరు భావములు గుత్తులుగ—
నామాట యీమాటయైన దర్వాత
సీమంతినీమణిఁ జెల్లిలిఁజూచి
పలికె "నేనన్నచో మేలఁత నీకెంతఁ
గలదొ ప్రేమము - నేఁడు గనిపెట్టవలయు
నాదొక కోర్కెయున్నది - దానిదీర్తొ!
లేదొ! తెల్పవె!యంచు, వేమ, యందికొని
నాకు నీకును భేదమే కొల్దిలేదు

నీకోర్కె దీర్చుచే-నాకోర్కెయక్క!
చెప్పిన నీకేమి సేగిలేదేని
జెప్పుమ దేదియో చెలువారవిందు
నన్నది, వెంటనే యక్కమొగంబు
గొన్నది-ముదముచేఁ గ్రొంగ్రొత్తకాంతి
చెవిలోన నాకోర్కెఁ జెప్పెదనంచు
ధవళాక్షి తనదు సోదరి మస్తకంబుఁ
గరమొడ్డి - యల్లదగ్గఱఁ దీసికొనుచుఁ
బెరచేతఁ జెవిపైనిఁ బెరసిన కురులు
వెనుకకు జోపి చెప్పినది - యామాట
తననవ్వు పెలలనే దఱిగిపోయినది—
వినఁబడ లేదక్క! వినిపింపు మఱల
ననెచెల్లె! తిరుగఁజెప్పనుఁ బూనెనక్క
"చెలియ! బావనుఁ బెండ్లి జేసి కోవమ్మ!"
కలకలనవ్వు గజ్జెలమ్రోసె సతికి—
ప్రక్కలుబ్బ కొనంగఁ బడిపడి నవ్వ
నక్కకుఁ జెల్లెలి కొక్కచే నవ్వ
"నవ్వులుగాదె" యన్నది యక్క - "పాప
నివ్వగవలెనీవు-నిజముగా" ననుచుఁ
జిఱునవ్వుచునె చేతఁజెయివేసి—భగిని
పరువెత్తినది సిగ్గు తఱుముకొనంగ
కాంతకు ముదము వెగ్గలమయిపోయె
గంతులు వేత మన్నంత యుత్సాహ
మలము కొన్నది - దేహమాద్యంతమపుడు
పులకరంబులఁగొనె - గులకరంబులను—
కనులు మూయగలేదు - కనలేదు నిదుర
పెనఁగొన్న వెదుటనే ప్రేమంపుఁగలలు—
"సరిక్రొత్త పెండ్లాము పరియాచకంబు

చిఱునవ్వుతో విని చిత్తంబు కరఁగి
కౌఁగిలించెను తనకాంతుఁడు - చెల్లె
కౌఁగిలిలోననే కరఁగిపోయినది—
ముద్దులు - వెఱవెఱ్ఱి సుద్దులు - ప్రేమ
ఁద్దిన బాసలు - దీడిరించుటలు
నదెవచ్చె - దిగివచ్చెనంతలో నొకఁడు
త్రిదివమందుండి ధాత్రికిఁ—కమ్రమూర్తి
యెవ్వరయ్యాజియ్యా! యేయూరుమీది
యవ్వనాకముమాది - యమరుండనేను
యెఱుగవే యింతలో మఱపుతాకినదా!
తరుణీ! నీ చిన్నారి తనయుండనేను
మఱలివచ్చితినమ్మ! మమతతోనిటకె
యరుదార నీస్వసకై నాను కొడుకు
నమ్మవు నాఁడు - పెద్దమ్మవునేఁడు
నమ్మవా! నన్ను నన్నాఁడు సూనుండు
రార! నా కన్నయ్య! రతనాల బరణి!
రార! నా ప్రాణమా! రస సాగరంబ!
నాఁడు పోయిన వాఁడు నేఁడు వచ్చిడివి
కూడిందలేదురా కొడుక! నిన్నీడి
పోడుఁబాటెను వాడచూడరా! తొగల
తేఁడు - పూయని యట్టితేయి విధాన—
నీవు లేనట్టి దానికి, - నింకనూరఁ
గావలసినయంతఁ గళగల్గు లెమ్మ—
ఓపికంబుల గుంప! ఓయశిబాల!
పాపఁడు వెనుకకు వచ్చినాఁడమ్మ!
రండు రండిక సుధారాగములాడి
పొండు - జీవితముఁ బున్నెముల్మొలువ
పకపకమని నవ్వెభామ - మొగమ్ము

వికసింప - నానవ్వు విన్నది తల్లి
యెన్నాళ్ల - కెన్నాళ్ల కింతనవ్వినది
పున్నెంబు లెల్లనుఁ బొంగినయట్టు
లని యద్భుతానంద జనితవేగమున
జనని - వేగమ్ముగా సాగి వచ్చినది
యెందుకే నవ్వెద - వేమియానంద
మందితి వీనాఁడటంచుఁ బ్రశ్నించె
"నేమి లేదన్నదా యెలనాగ - కాని
యేమి లేకేమి - యా కోమలి హృదయ
నందన వనిలోని మందార విటపి
సందోహములను వాసనలు విచ్చినవి___
మఱిరెండు మూఁడు నాళ్ళరిగిన యంత
దరుణి, యొక్కదినానఁ, దల్లి సమీప
ముననుండఁ - గ్రాలుచూపులనెత్తియామెఁ
గనినదా దృష్టులఁ గనవచ్చెనెమొ
మాటలాడెడుఁ గోర్కె - మాతృదేవియునుఁ
బోటి నెమ్మది తలంపును గ్రహియించి
జఱగుచుఁగొంత దగ్గఱియెఁ - బ్రేమమున
గరములఁ దనతల్లి కంఠమ్ముఁ బెనచి
దడిచూపుఁ గలువ ముత్తమ్ముల నామె
యెడఁద - భూషించుచు నెలనాఁగ పలికె
వినవమ్మ! నా దగు విన్నపం బొకటి
మనవిఁ జేతును నీకు - మదిదాచలేను
నేమందువో! తీర్చవేమొ! నా హృదయ
కామితమను శంకఁ గలగుండువడుచు
నాలోనె తలపోసి నవయుచున్నాను
తాళఁజాలనె! వంతఁదల్లి ! నేనింక
నెట్టులుగాని నీవీడేర్పవలయుఁ

జిట్టికోరిక - నాదు జీవముల్నిలుప
దలపుఁగల్గినయేనిఁ - దప్పదునీకు—
నిలుపుమీ! నాచన్న నిండుకాపురము
నిలిపి కొమ్మలపైని నీకన్నకూఁతుఁ
జెలియలు సమ్మతించినది - నాభర్త
యనుమతిఁగొన్నాను - నమరెనన్నియును
వనజాక్షి, ''ఊఁ యనవలయు నీ వాకతె—
దాచనేటికి నింక దయతోడనీవు
నా చెలియలినిచ్చి - నలువొప్పచుండఁ—
బరిణయంబొనరింపవలె - నాఁదుధవున
కలమరఁజేసిన యటులైన ధరణి
నిజువ నమ్మాయంచు నిబిడ బాష్పంబు
కలిత నేత్రాబ్జయై - కడుదైన్యమొంది
విలపించుఁ దనకూఁతు వీక్షించి - మదిని
దలముగాకుండఁ జింతలు వేలుబెనఁగ
నేమాటఁ జెప్పకే యా మాతృమూర్తి
ప్రేమార్ద్ర బాష్పముల్ బిరిగొన్నఁ గనులఁ
గనుఁగొనుచును లేచి కడువడిఁ జనియె
మనమున జికటారి మలసినట్లయ్యెఁ
గలికికా పోకతోఁ, గందుమొగమ్ము
దిలకింతు ననునాస మలికితమయ్యెఁ
గడచెనా దినమెల్ల గనకాంగి యొక్క—
కడియైన నన్నంబు గుడువనేలేదు
తననాథుఁడొకసారి దరిసెనమివ్వఁ
డనయంబు నేకాంతమందు - రమించుఁ
దనతల్లి యేమను కొనినదో గాని
తన మాటకేమి యుత్తరము రాలేదు
తల్లి సమ్మతిలేకఁ దండ్రినినడుఁగ్గ

జెల్లదు - తనకోర్కె సిద్ధింపఁబోదు-
చెలియలే మనుమ పెద్దల చాటుపిల్ల!
వెలిబుచ్చినది తన వలపు తీరేమొ
పడఁతి కెట్లును సేయఁ బాలువోలేదు
యెడఁద యేయాశల కెడమీయలేదు
తన తల్లి గనినప్డు తరళ నేత్రముల
నినుచు నీరంబులు నిర్భరప్రేమ
వివశయౌ మాతృదేవియు - బిడ్డ కలఁత
నవలోకనమొనర్చి - యలమటఁగుందుఁ
గాని - చెప్పదు తనకడచూలిఁ గుఱిచి
"యేనిత్తు, నివ్వ"నంచే మాటగాని—
మఱుదినమంతట దరిసె - నన్నంబు
సరిపడదయ్యెఁ గూఁతురికి - నీగతికిఁ
దాళ లేదింక నా తల్లి మనంబు
గోల! యేటికె యిట్లు గ్రుళ్ళెదవూర
కలసెద - వలయింతువమ్మ! యందఱను—
ఫలియింపఁజేతు నీ తలపింకలెమ్మ—
పచ్చపచ్చగనీవు - ముచ్చటగులుక
నచ్చంపు లక్ష్మివై - యలనల్లనింటఁ
బారాడ నేర్చినఁ బదివేలు తల్లి!
తీరెనే యనుకొమ్మ తెఱవ నీకోర్కె-
యికలెమ్మ మాయమ్మ! యిందిన యంత
యొకకడిదినుమంచు నుద్విగ్న హృదయ
దఱిఁజేరవచ్చె - చందనశీతలమ్ము
కరమెత్తి ప్రేమ సుందరముగా - జనని
దాకిన యంతట నా బిడ్డకమృత
శీకరములు మదిఁజింది నట్లయ్యె—
నలఁత సర్వము మాయమైనది - కనుల

నిలిచె సజీవుడై నీల్గినకందు —
గృహపతిఁ బ్రార్థించెఁ గేలొగ్గి నెలఁత
దుహిత కోరికఁదెల్పి - తోడనె యతఁడు
సమ్మతించెను - నెట్లు సమ్మతింపండు
నమ్మాధవుఁడు సర్వమాడించుచుండ!
జరిగె నేర్పాటులు పరిణయంబునకుఁ
దరుణి జ్వరమ్మునుఁ దానయితగ్గె
శీతల వైరాగ్యసిక్తభావుండు
చేతస్సమాధాన సిద్ధిదిక్షుండు
జ్ఞానైకఖని, కుంభకార భక్తుండు
తానేమో, తపమేమొగా, నుండెఁగాని
పట్టించికొనఁడు నల్పంబును మదికి;
నిట్టలంబుగరేఁగు నింటి సంబరము
పరిణయంబొనరింప వలయు దినమ్ము
నరుదెంచెఁజిరునవ్వులై, కుంభకారు
తొలిభార్య వేడుకఁ దొంగలించినది
పొలపంబు వెలయు గన్నులతోడిపొలఁతి
నడుగడుగుననామె కక్షలయందుఁ
బొడసూపెరాఁబోవు పుణ్యదినంబు
"లిఁకఁగొంతసేపులోనీడేరుఁబెండ్లి
వికసింపఁ జిరునవ్వు వెన్నెల చలువ
లడిసిగ్గు, సోదరి - యరుణహస్తములు
తడఁబడ - భర్తకుఁదలఁబ్రాలువోయు -
దలఁబ్రాలు పోసినంతన నఁగుఁ బెండ్లి
దలముగాదెవరికిఁ దప్పింపపైని -
బిదప సూనుడు గల్గుఁజిన్న చెల్లెలికి
నెదనున్న కోర్కెలే యెత్తినమూర్తి
తులగ పిల్లఁడువాఁడు, నిలువఁడెచ్చోటఁ

గలయఁగ్రుమ్మరు నెల్లెడలఁ జిక్కకుండ
పడసాలలో వాఁడె, బయటనువాఁడె
నడువీథివాఁడె, యంగడియింటవాఁడె"
యనుకొన్నదీగతి, నంతలోపలనె
కనులముందటనిల్చెఁగందు - సమ్మోద
పరవశమైనది, పగటివేళలనె
కరముపెనంగొనుఁగలలకు మడఁతి;
కనులయంచుల నీలికాటుక దిద్ది
ఘననీలవేణిఁ జక్కఁగ నావటించి
జడవేసి - బొశ్శెమ్మనిడి - తావిపూలు
ముడిచి - గావిరిబొట్టుముద్దుగాఁదీర్చి
తళుకు నెన్నుదుట బిత్తళిబొట్టువెట్టి
చెలియలిఁగై సేసెఁ జెలువప్రేమమున
నీలిచుక్కల చీర నీటుతో - కర్ణ
మూలముల్దాకుచూపులతోడఁ - దీగె
వలెనటునిటుఁదూగు బడుగుమధ్యమునఁ
వెలది వెన్నెలడుల్చు వెలఁదినవ్వులను
జెఱఁజిక్కరాలేని తెఱగున అవికె
దెఱఁజిక్క - నక్కబిత్తరపుఁజన్నులను -
గిలుకు గిలుక్కంచు నలుపుగాఁబలుకు
పలుకున - వలపుఁబ్రాబలుకులఁజిమ్మి
జలపట్టి - యెదఁబట్టు చక్కిమెట్టియలఁ
బలుమరునెలుగించు బాజుబందులను
నిలువెల్లఁదొడకెడు నెలపిగ్గుతోడఁ
గలకలలాడు ముక్కరతోడ - సొగసు
లమరినదానిని - నతివలమిన్న
భ్రమర మానని నవప్రసవంబు - చేతి
తాకు సోకని యట్టితలిరు - సంవేధ

శోక మెఱుంగని శుద్ధరత్నమ్ము
రుచిచూడఁబడనివారుణి - భర్తృపుణ్య
నిచయముల్మగుదగా నిలచినరూపు -
సక్రొత్త పెండ్లికూఁతురిని - జెల్లెలిని
పరిపరివీక్షించుభామ - యేమంతఁ
బరువమ్ము జిమ్ముసోదరివాలకమ్ము
తరుణి - యెరుంగదు తనమదిలోని
యారని యాశలే యరిది కాంతులనుఁ
గూరిమి చెల్లికిఁ గూర్చుచునంచు;
దరిసెను లగ్నమంతట - దేవగణము
వర్షించె దివినుండి - భక్తుని పెండ్లి
యున్ననల్వురు పెద్దలొక్కచోఁజేరి
పన్నుగాఁదీర్చిరి పరిణయ మహము -
మరునాఁడు నింటనందఱుఁజేరి - వేడ్క
సరసంబులాడెడి సమయంబునందు -
నొకయవిదితమైన యుద్విగ్నరేఖ
మొకమునఁ గనుపింపఁ బున్నెంపుఁబ్రోవు-
నల్లుని వీక్షించి యన్నాఁడు మామ
"చెల్లెను పెండిలి - చెలియలినక్క
నొకచెట్టునకె కట్టియుంచితినోయి!
యొకతీరుగా నరయుము - భేవభావ
మందక - నిరువురి యందున నీవు
ముందున, కింకనేమున్నదిమాకు
నాస, మీకాపురమన్నివిధాల
వాసికెక్కిననదే పదివేల"టంచు
నాపల్కులకుఁ దథాస్తనెనల్లుఁడెవరో
పాపము! తను పట్టి పలికించినట్లు
మామమోదించె సమ్మతికిఁ గొఁడంత

యామనుష్యునకైన యర్థమే వేఱు -
నల్లునకైనట్టి యర్థమే వేఱు
నెల్లపన్నాగంబులిందిరేశునివి;
అమృతంబుచేనిండి నట్టి కుంభంబు
ప్రమదాకృతినిఁదాల్చి పారాడునట్లు
క్రొత్తజవ్వనమూను కొన్నట్టిభార్య
యుత్తమశీల! తన్నుద్వీక్షఁజేసి
ధవుఁడనునాసఁ జేతఁనల్లఁదిరుగ
నవజిత కాముడైనట్టియాతండు
పరికింపఁదేమియు శిరమెత్తి - యామె
పురపురఁబొక్కి-సంబర మెల్లవిడచుఁ
జెలియలి యెడఁదలోఁజిందించెధవుఁడు -
వలపుఁగ్రొత్తేనెలు, వాపిగానవ్వఁ
దొలిభార్య, "పుత్రుండు దొలిచూలుగలుగు
నిలునింపుఁగ్రొంజూపు కళికలనంచు"
నవ్వినతనయక్క, నాతి వీక్షించి
త్రవ్వినసిగ్గులై, తథ్యమ్ముపలుకఁ
దడమాడి, చివ్వనఁదాటుఁదా వెంటఁ
బడునక్క, సమ్మోదభావాఽభిరామ,
"చెప్పవే! సత్యమ్ము, సిగ్గుల గిలక!
కుప్పవోయవె! మదిఁగోటిరత్నాలు
ధవుఁడుదాకెనొ! ప్రేమదట్టాడుకొనెనొ
జవరనై యుండెనోసంబరములు! మ
దీయ భాగ్యమ్ముదోతెంచెడు నట్టు
లీయింటఁబసిపాపయెల నవ్వుగలదొ!
పలుకదే మాట చెల్లెలు, మూఁగవోలి
తలవంచి, బొటవ్రేలిధరణిపై వ్రాయు,
లజ్జాభరమ్మునలలితాంగి, పలుక

నుజ్జగించిన దన్నయుల్లమై, యక్క
పలుమారువింత నెపమ్ముల నడుగు
తెలిగండ్ల చూపులే వెలువయుత్తరము
జరిగె నీరీతి వాసరములుగొన్ని
మఱువడ్డ మాటల మనసులతోనె
యిరువుర కొక్కనాఁడే కాంతమందుఁ
దరుణంబు సాధించి, తల్లి వీక్షించి
కూరిమితోఁ బెద్దకూతురువలికె
'దీఱెనే కద పెండ్లి తీరెనుకోర్కె
చెల్లనేరని ముద్దుఁజెల్లించి - నాదు
నుల్లము - సమ్మోద పుల్లంబొనర్చి
నావమ్మ! నీ ఋణం బావంతయైనఁ
ద్రోవనేరను తల్లి!-పావిత్ర్యవల్లి!
యిన్ని దినంబులు నిచ్చట నెలమి
నున్నార, మింక, మాయూరు చేరంగ
ననుమతి యియ్యవే యమృతమయాత్మ!
పనిపాటు లేక మీ పైఁబడనెన్ని
దినములు పోషింత్రు! - తినుచుఁగూర్చొన్న
జనయిత్రి! కొండలైనను నిల్వఁగలవె!
కలిగినవారమో! కైయాడ నోటఁ
గలదు భోజన, మింతఁ దెలియనోనేను
తీగెకుఁ గాయలే వ్రేగౌను - యందో!
ఆగతి యిపుడేమి యంటినదమ్మ!
కాలుసేతులు మాకు గట్టిగా నున్న
నేలీలనైన జీవించెద - మెచట
నుండిన నీకన్నయువిదలె గదవె;
యొండాడకుము పంపుమమ్మలికమ్మ
దక్కి - యాయూరేమి దగ్గఱ కాదా

ప్రక్కనున్న దెగద - రాకపోకలకుఁ
గలదొ కష్టము! చూడఁదలఁచిననెంత
వలయు యత్నమ్ము రావచ్చునులెమ్ము
మము సాగనంపుము మన్నించి" యన్నఁ
గమలసమ్మితవక్త్రి - కరుణార్ద్రహృదయ
జనయిత్రి దుహితృ భాషణములు - తనదు
మనమునఁ దలపోసి - మఱిమఱి మెచ్చి
తన భర్తకునుఁజెప్పి - యనుమతిఁదీసి
కొని యంత నిశ్చయించెను ప్రయాణమ్ము—
ఒక పుణ్యదినమందువికచనీరేజ
నికర సమ్మర్ద గంధిలశరీరుండు
మలయసమీరుండు, మదమంథరమున
మలసెడువేళ, కుమ్మరి బయల్దేరె;
దనయూరి గుఱిచి - యాతనివెన్కనిర్వు
రనుగమించిరి పత్నులలనక్రమముగ—
నొడిబాలు దాల్చిన యొరపుతో - ముగుద
నడలతో మదులఁబ్రేముడి తొలఁకాడ
ననుసరించెడు కూఁతులను వీక్షసేసి
జననియు, జనకుండు, చలువయై యెదలు
తడికండ్ల "నిఁక నిల్చెదము తల్లులార!
వడి వడిఁబొండింకఁ దడవగు" ననిరి
నంతఁ బితరులకు, నసమాన వినయ
దంతురితములు - చిత్తమ్ములతోడ
నిరువురు కూతులు శిరములువంచి
యరుదార గావించి రభివందనమ్ము
లిరువురి శిరముల నెలమి దీవెనల
విరులనుఁ బితరులు కురియించి, రప్పు
డప్రతిమాన దివ్యజ్ఞాన కాంతి

దీప్రుండు - గతభేదదృష్టి - నిధ్యాన
మధుమత్తుఁడితర దుర్మానవవాక్య
బధిరుఁడల్లుఁడు భక్తిభరితుఁడై వెట్టె
దండంబు - మామకత్తకు - వారి మదినిఁ
బండరినాథు రూపములుగాఁదలఁచి
అల్లు - విజ్ఞాన సంపుల్లునీక్షించి
యల్లనల్లనఁ బల్కెనప్పుడు మామ—
"సెలవు మాకిక - సాగవలయునుద్రోవ
నిలువదీరదు బొందు; నిరతంబు, మీరు
ఖమ్ములే - కాంక్షించి కలగుండువడెడు
మమ్ము-మర్వకుమయ్య నెమ్మనంబందు—
నప్పుడప్పుడు సేమమమరంగ మాకుఁ
జెప్పిపుచ్చుచునుండు - చెవులపండువుగ
వినఁగందు - మిపుడు మా ప్రేవులుదీపి
పెనవైచితిమి గళంబుననీకు నేమి
చేసినదైన నీ చిత్తం" - బటంచు
భాసురమూర్తి కుంభారుండు - శాంతి
దలుకొత్తు చూపులఁ దనరవీక్షించి
పలికె "నిబ్బరియంపుఁ బాటింతుసమత
నలరింతు - నిజము దివ్యానంద మొసఁగి
దలరకుఁడని, యంతఁదారు సంతృప్తి
గని - దుహితలతోడఁ గడసారిగాఁగ
వెనుకకు మఱలెదమని చెప్పి - సారె
దలమల్పి చూచుచు - దైన్యంబు గొన్న
దలిపుల మగిడిరి - తల్లియుఁదండ్రి —
నడువఁ దొడఁగెనంత నలినాక్షపదని
గడిత చిత్తుఁడు - కుంభకారభక్తుండు
వానివెన్కనుఁ బెద్దభార్య - పవిత్ర

మానస, యటువెన్క మదనసామ్రాజ్య
వరకేతనంబునుఁ బురుడించు వెలఁది
సరసత్రపా విభూషణ-చిన్నభార్య;
యడుగడుగునయందు నతఁడుచ్చరించుఁ
దడయక-నిందిరాధవునినామమ్ము
నామధుదిగ్ధమైనట్టి నామమ్ము
కోమలు లిఱుపురు కూర్మితోఁబాడు
దురు - వారి పాటకుఁ దరువులనున్న
వరపుష్పములు త్రపా భరితంబులగును—
నీరీతి మధుఘస్మరారాధనైక
ధీరచిత్తులు, వానిదివ్యస్వరూప
మెదలలోఁ బొదలసమ్మదముఁ బొందుచునుఁ
గడిపిరి - తమ యూరుఁగలి విరహితులు
వారిఁజూచిన యంత నూరిలోనున్న
వారిజాక్షులు గుంపుఁ జేరినా రచట—
కనుగీటె నొకతె ప్రక్కననున్న యట్టి
వనితనుఁగని, యామె కనుల నవ్వినది
నవ్వుగాదది త్రాచు, నంజు; ముమ్మోఁతి
నవ్వులలో వసనాభి చిట్లినది
పరమేశ్వరుఁడు దయా భరితుఁడై సృష్టి
కరుదార నొసఁగిన వరము, హాసంబు
దానిలో రేఖగాఁ దనరుచునుండు
వాని తేజం,బెవ్వఁడేని నిష్కలుష
భావంబుతోనవ్వ - వాఁడెయానగవు
లోవెలసెడుఁ - బరరూపు నర్చించి
నట్టివాఁడటుసేయ నట్టిడులెల్లఁ
గట్టడులై - చెడఁగందురు - నిజము
పాడులోకంబు తత్త్వంబు నూహింప

దాడెదు - నున్మత్తమైన తాండవము
కామధేనువుపాలు - కలువలతేని
యామని వెన్నెల - యమృతంపుసోన
నందనారామ మందార వాసనలు
చిందంగ, కెలఁకులశీతలకాంతి
మలయింపఁదగినట్టి మధురహాసములఁ
జిలికించి - కోడెనాగుల దొడ్డవిసము
నవ్వెదరేమి యానందమో జనుల
కవ్విధిఁజెలరేగి నవ్వులందు—
నొకతె గీరెను - మరియొక్కతె చేయి
నొకదాని మూతి ముందుకువచ్చె - నొకతె
గికురించె - నొక్కతె మొకము చిట్లించె
వికట దృష్టులతోడ నొకతె వీక్షించె—
నెందులకో వీరికింత విడ్డూర
మిందరకేమి గావించిరివారు
కొఱగాని, దేమి యక్కఱలేదు భక్త
వరులకూరక వచ్చి పడును వైరంబు
నదియెల్లవాని మాయావిలాసంబు
వదిలించుఁ గడకు నీశ్వరుడెయాముడుల;
దిన్నగా నిలుసేరి కొన్నారువారు
కన్నులఁ దడిగ్రమ్మె - కందులేనట్టి
యిలుఁజూచి పెద్దదౌనిల్లాలి, కతఁడు
చలి యింపలేదు వీసంబైనగాని
తొలుతటి వలెనెమరల మన్నుద్రొక్క
కెలసంబుసాగె - లక్ష్మలబాతియింటఁ
దిరుగాడఁ జొచ్చిరి తెలవలిర్వురును;
జరిగెఁ గొన్నాళ్లు - డెప్పరమయ్యెఁ జిన్న
భార్యకు మదనతాపమ్ము - విజ్ఞాన

ధర్యందు - పతియొక్క తూరి గన్నెత్తి
కనినదిలేదు, పల్కినది లే, దరుల
పెనఁగొనఁ గౌఁగిలించినదిలే "దేమి
కర్మమో" యనుబాధ కందిపోయినది;
నర్మగర్భము గాఁగ నాతికన్నొప్పమలె
యందించె నాయూహ నక్క, కామెకును
గ్రందు కొన్నది చింత - కడకొక్కనాఁడు
చెలియలినొంటిగాఁ బిలిచి - లేవగవు
లలనల్లఁగంటి తెప్పల నప్పళించి
కొనుచుఁ - జెల్లెలిచెక్కుకొనగోట మీటి
వనిత - యల్లడఁబల్కె - బ్రాయమే నేర్ప
వలెనమ్మ! యన్ని యూహలు - బేలమాడ్కిఁ
దలకుదురే! యిట్టి చెలువంబు నడవి
పాలుసేయగ నీకు బోలునే! మగలు
జాలిఁగొందురె! చెల్వ! సమయమీకున్న -
నగవుల నడపుల నవలోకనముల
బిగువుఁల బ్రియురాండ్రు ప్రియులగరంచి
కరమర్థి సుఖియింత్రుగాని నీమాడ్కి
యఱిముఱి నుందురే" యనుచు - నాలోనఁ
బేరిన వగపొక్కసారిగాఁబొంగి
నీరేజముఖి కండ్లనిండెను నీరు;
కరుణాభరితయక్క! కడువడిచీర
చెఱఁగున నానీటి తఱగలనొత్తి
వచియించె - నీరేయి - భావైకనిపుణ
ప్రచుర విలాస సంపదలు - దట్టాడ
దరిఁజేరి - నీదుచిత్తమ్మెల్లఁగూడఁ
దరళ వినీల నిష్ఠుర కటాక్షములఁ
బూనిచి - చూడుము - వానిపై పునకు

చానరో! నీకోర్కె సఫలమౌననుచుఁ;
గలకంఠి - యారాత్రి కమనీయగాత్రి
చెలువుగాదిద్దిన తిలకంబుతోడ
నలతినవ్వులతోడ నపుడప్డునిక్కి
జలదరించెడునట్టి చనుదోయితోడ -
వడఁకు నడుముతోడ - వాలారుఁగండ్లఁ
బొడసూపు చూపుతూపులతోడ, నెదుట
నిలచినఁ - దలియెత్తినెఱఁత నీక్షించి
తలఁపునెఱింగి - కన్నుఁగఁమూసెవాఁడు;
నిదురించె నాయమ నిట్టూర్పుగాడ్పు
వెదజల్లి తనయక్క - వీపునఁగ్రుమ్మి -
తెలవాఱె - మనసులో నిలువగలేదు
కలఁత యధ్యాఢకుఁ - గాంతుని దరిసి
నిలచిన దాతండు - మెలఁత యలంత
తెలిసి తెలియనట్లు మెఱఁగుచున్నాడు
ఇకఁగాదటంచుఁ బ్రశ్నించినదామె
వికసితస్మేరయై - వింతవాలకము
గనుపింప - మెఱుఁగు ముక్కఱగదలాడఁ
గనుచూపులందు నిక్కపురక్తిపొదల
"నన్నుముట్టనటంచునానవెట్టితివి
వన్నెకాఁడ! ఋణాను బంధమ్ముదీరి
నది - నీకు - నాకు నావంతశోకింప
మదిలోన, కాని కుమారుండు లేని
కొఱఁత చిత్తము గ్రుచ్చుకొనుచున్నదోయి
పరిపూర్ణ యౌవన భరముతో, మధుర
మమృత కుంభము బోలునట్టియామగువ
సుమగాత్రమైన నీమాడ్కికినితవు
గలిగింపదో! దానికర్మంబుగూడ

బలిసినదో! యింతవరకొక్కసారి
చూడ, వేగతి! యింకఁ జేడియకన్న
వాఁడు - మందస్మిత ఫలితవక్త్రుండు -
వలన గంభీరంబులక్షులనెత్తి
యఁదాని - మొగమున నిలిపి భాషించె
తెలియని దానవే తెలవ! నీకింత
పలుకంగ వలయునే! పరిపరిరీతు
లిలఁబుట్టినట్టి జీవుల కర్మగతులు
నిలుపంగఁదరమగునే! మన, కేల
బేలవై యీరీతి విభ్రాంతిమునుఁగ
లోలాక్షి! విన్మనాలోఁ దప్పులేదు
పరిణయంబైన తర్వాత - మీతండ్రి
సరిగాఁగఁజూడు మిద్దఱనంచుఁబలికె
నవునంటి - నామాటనాత్మలోనున్న
భువనేశ్వరుఁడె చెప్పెఁబూనిక - దాని
కిఁకలేదు తిరుగు , వేయివిధాలనైన
సకియ! నీచెల్లెలి సంస్పర్శసేయఁ
దగవానొ! నాకు, నిద్దఱయందుభేద
మగపడదెట్లు - నేనంటినదాని!
వఁదుడుగుమటన్న - నలివేణితనువు
జలదరించినది - మిన్నులు భూమిగూడఁ
దిరిగినట్లైనది - దిరదిరఁదిరిగి
ధరణిపైఁబడినదా తెలవ - యాలోన
చెలియలు వచ్చిచూచె - దురంతశోక
దళితయై - పన్నగ తరుణియువోలె
నిలఁగ్రుంగి - మేనెల్ల మెలికలువోవఁ
బలుమఱు - నూర్పుమంటలు గ్రక్కుదాని-
మొకమొల్లఁ గన్నీటిముద్దయై - హృదయ

మింకఁదాళ లేదంచు నెత్తిచాటంగఁ;
దనువెల్లఁజెమట చిత్తడిగ్రమ్మ - ధరణిఁ
జనుదెంచినట్టి యా జలదేవతయనఁ
గననగు దాని, నక్కను - దోడనామె
మనమెల్లఁగుమిలి పోయినది - దుఃఖమున—
ననలేదు - ననుభవింపనులేదు, లలిత
వనజాక్షి పుడమిపైఁ బడినట్టియక్క
శిరమును గ్రహియించి, కుఱువునఁజేర్చి
తుఱుముపీడ్వడుచుఁ బెన్నెఱులు నటింపఁ
దలవంచి - కనులఁజెక్కులఁ బెదవులను
జలములు జాల్గట్టి పలవింపఁ దొడఁగె—
నటనుండి తొలఁగె నిరస్త సమస్త
కటువికారుడు - కుంభకారభక్తుండు
నంతలింతల వారలదియేమటంచుఁ
జెంతకుఁజేరి ప్రశ్నింపరు - భక్తి
తెల్లమైనదటంచుఁ దీండ్రగాఁబలికి
త్రుళ్ళింతతోడఁ జేతులు ద్రిప్పినవ్వి
రాపశువులకెట్టులవ గతంబగును
శ్రీపతి విరచించు చిద్విలాసములు!
గడచె దినంబెల్లఁ గమల నేత్రలకు
నెడఁదలు గదలించు నేడ్పులతోనె—
చనుదెంచెను ప్రదోషసమయంబు - నెఱసె
వినువీధినెల్లెడఁ బెల్లుఁజీకటులు
ప్రమదా విలోచన బాష్పసంకులము
నమరంగ భుజియించె నన్నంబుమగఁడు
భుజియించిరోలేదొ! పూఁబోణు - లేమి
భుజియింత్రు—దుఃఖమే భుక్తివారలకు;
నదియేమి చిత్రమో! యా కుంభకారు

వదనంబు నేటికి వాడుదేఱినది!
కనుగొనలందుఁ జిక్కని ముత్తియమ్ము
లనునట్లు - బాష్పమ్ములలమినిల్చినవి
యిఁకఁజూడగాలేదు నిల్లాం(డతీరు
తికమకలాడుచు - దేవురించుచును—
గడువడి నొక్కయేకాంతమౌచోటుఁ
దడవి కూర్చొనియె—బాధా విపశుండు
నిట్టూర్పు గాడ్పులు నిబిడమైరేగ
దట్టపు వగపు చిత్తమ్ము గ్రుమ్మంగ
తలపులు తీగలై మెలికెలు దిరుఁగఁ
దలపోసె నీగతి దళిత చిత్తుండు—
"ఇంక దాళలేనోయి యిందిరాజాని!
సకలేశ! తారకాక్షర గుహాహరిత!
యిగఁబరీక్షించిన నిలనాదు బ్రదుకె
యగును శూన్యంబు - మాయాతీతవృత్తి!
జనులకునన్నుఁ బాషాణ స్వరూప
మునుఁజేసినావు - నా పుణ్యముల్పండి
వచ్చిన భార్యల బ్రదుకెల్ల నడవి
విచ్చిన కెందమ్మి విరులఁజేసితివి—
నాయింటికొాక దీపమైయుండినట్టి
యాయిసుంగును గూడ నార్పివేసితివి
యేమి చేయుదువోయి! యింక మారమణ!
నామానసంబెల్ల నలిగి పోయినది
యిగ భరియింపను బ్రదుకెట్టులనైన
వగఁదీర్చి తీసికో! పండరీనాథ!
రాతినాతిగఁజేసి రక్షించినావు
నీతియే! ననుఁజేయ నిలువుటాబండ,
మనసున్నదే నాకు మగువా! యటంచుఁ

బనవి చెప్పితిని నా భార్యకుఁగాని
నమ్మదు, దానిని నమ్మనిచ్చితివా!
నమ్మనెట్టులు! నామనమ్మన్నదాని
కిని గుఱుతేమిరా! వనజాయతాక్షి
చనినట్టి సుతునికై వనటగుందంగ
నొకసారి గాకున్న - నొకసారియైన
"నకటా" యటంచు నన్ననిచ్చినావా!
తలమున్కలయ్యెను త్తలపాటు - బ్రదుకఁ
దలము గాదింకనెట్టులనైనఁ - జిత్త
శాంతినొసంగు వేదాంత విహార!
పంతంబు నకునిల్పి భరియింప బ్రాఁతి
యనినంత హృదయంబు నందుండి యొకటి
వినవచ్చె వాక్కు "పండినది నీకర్మ
తడలేదు - ధైర్యంబు దలగకు - మొట్టు
విడువకు మని" దాని విన్నాఁడొలేదొ!
వనటెల్లనెట్లుపోయినదొ! సంతోష
మునను జెంగించెను - తనువునే మఱచి
పండుకొన్నాఁడంతఁ బండరినాథ
మండింత చిత్తుండు, మదినున్నవంత
యంతరించిన నిద్రనందె నాతండు——
చింతాతిరేక నిర్జిత బుద్ధులైన
పడతులేమేమి సంభాషించుకొనిరొ
యొడలెఱుంగక నిద్రనొందినయట్టి
ప్రాణనాథున కిఱుప్రక్కలఁజేరి
వానిపాణి యుగమ్ముఁబట్టి - పేరెదల
నదిమికొన్నారు - మాయల మన్మధుండు
మదిరాక్షులను మొత్తెమాసరంబుగనుఁ
గనువగలనుఁ దారకలు సుళ్ళుజుట్టెఁ

దనువులఁ బులకల దండడిరేగఁ—
జనుమొనలుబ్బఁ బంబిన నవోద్రేక
మున, తైకవిడెఁ దటుక్కునఁ గనుల్దెఱచె
మగ,డెవ్వరో నిద్రనగపడి దురుసు
మగువల చెయిది సూటిగఁజెప్పినట్లు;
తన హస్త తలములు తడయకఁబట్టి
చనులపై నిడికొన్న చానలఁజూని
తటుకున దెమలించి తన హస్తములను
కట!కటా! మీరెట్టి కట్టడికార్య
మునకొడఁగట్టితిరనుచునె లేచి
మనమున కోపంబు మల్లడి గొనఁగ
బలవంతమున నగ వెలయించి - యింట
నలుమూలలనుఁజూట్టి - తళ తళలీను
కొడవలిఁదెచ్చి . యీ ఘోరాపచార
మతఁగంగఁ దగిన ప్రాయశ్చిత్తమనుచు
రెండుచేతుల నప్డెఖండించి కొనియెఁ
బండరి నాథుని బాసకై - వాఁడు
కుండలతోఁదెచ్చి క్రుమ్మరించినటు
నిండె – గేహమునిండ నిబిడమైనల్ల
వానికాబాధగాఁబట్టనేలేదు
మానస విష్టర మధ్యంబునందు
శ్రీ పాండురంగఁని జెలువుగా నిలిపి
పాపాప నోదనప్రవణ! నాయఘము
ద్రోవరాయనుఁచు జేతులనెత్తి - లోక
పావన వాక్కులఁ బ్రార్థించుచుండె
చూచిరిబ్బురుగూడ సుదతులు - మదుల
గ్రాచెడు నాకుంభకారుని చెయిది
పకపకమనినవ్వు - పట్టనినవ్వు

వెకలినవ్వెదనెల్ల పెకలించునవ్వు
పెద్దయిల్లాలికిఁ బిచ్చిపట్టినదొ!
తద్దర్శనంబునఁ దలగనినవ్వు!
నవ్వుతోడనె యేడ్పునారంభమయ్యె
కెవ్వుమంచని చావుకేక వేసినది
నిలువలేదింక నానెలఁతకేమేమి
తలఁపులు దోచెనో! తలమోదుకొనుచుఁ
బరువెత్తఁదోడఁగెను పండరిపురికిఁ
దఱుముచున్నట్టులెవ్వరొ! వెన్కనిలచి;
రమణి వెన్వెంట "గోరా" బారె - వెఱ్ఱి
ప్రమదంబుతో - రక్తరంజితమూర్తి!
యాయిద్దరి పరుగునందుకోలేకఁ
గాయంబు తూగంగఁ గమలదళాక్షి
వెనువెంట నంటిపాఱెను - చిన్నభార్య
ఘనతరావేశవి కంపితదేహ
దళితసర్వాశ - ప్రోజ్జ్వలదగ్నికుండ
తులిత హృదయ - నీలజలధరహారి
కచగుచ్ఛకలిత జఘనభాగ - బాష్ప
నిచయ నీరంధ్రితనేత్ర - యధ్వాఢ
పదరుపల్లంబని పాటింపకొక్క
యదటునఁబోవుచున్నది - తనసుఖము
తుడిచివేసినయట్టి తోయజనేత్రు
నడుగుట కొఱకొన్యాయాన్యాయములను!
తెలతెలవాఱె - దిక్కులఁగాంతిగూఱె
కలువలకందు - లోకమ్ములవిందు
జక్కవ కవలకాయ్వెక్కుడుమందు
నిక్కకెందమ్ములనిబిడకౌతుకము
గగనంబుతొడవు - దిక్కామినీరమణుఁ

దగపడెఁగమలాప్తుఁడంతరిక్షమునఁ;
దళతళమనివెల్గెఁ దరుణార్క కిరణ
కలితంబులౌచు - రంగనిగుడిగోపు
రముల దీపించు హిరణ్యకుంభములు
ప్రమదమ్మునిండార భక్తులందఱునుఁ
జేరిరి వాకిటఁ - జిత్సుఖాధారుఁ
గోరికలూరఁగన్గొనునాసతోడ ___
నామదేవుఁడు భక్తనలిన బాంధవుఁడు
నామదేవుఁడు దీన నవనీరదమ్ము
నామదేవుఁడు లోక నాయకసఖుడు
నామదేవుఁడు మోక్షకామినీధవుడు
నామదేవుండు విజ్ఞానసాగరము
నామదేవుండు రంగని యరిగాపు
పాండురంగని లెంక - పండరీశ్వరుని
గుండె - పండరినాథుఁగూరిమికొడుకు
రంగండు జరియించుశృంగారవీధి;
రంగనినవ్వులు పొంగారుచోటు;
నామదేఁడు మహానందపూరితుఁడు
శ్రీమానినీచిత్త సేవధియైన
గోవిందునకు మేలుకొలుపులు వాడ
భావంబు చిగురింప వచ్చియున్నాడు
పలుకుపల్కును సుధాభరితంబొనర్చి
పలుకుచున్నాఁడు ప్రాఁబలుకులకొనల
మెలఁగు భావములెల్ల మిళితముల్గాగఁ
బలుకులచెలికిఁ జెక్కిలి పుల్కరింప
పరమపూతమ్ములభంగ గీతములు;
పరిపూర్ణ భక్తిభావమున మేన్మఱచి
యాడుచున్నాఁడు లయానుసారముగ

బోడిమి తనకరంబులు తట్టితట్టి;
చేరినజనులెల్ల - శ్రీకాంతభక్తి
వీరుని - సదమలాచారుని నామ
దేవునిఁగనుఁగొని - దేహమ్ముఁబుక
భావించి, తదభంగ భవ్యవర్ణమ్ము
లనువాదమొనరించి - యాతనితోన
ఘనమోదకలితులై - కరములుతట్టి
నర్తించుచున్నారు, నలినాక్షకీర్తి
కీర్తనారతులు గ్రిక్కిరిసినవారు
నారదాదులగు సన్మౌనులు - దేవ
వారంబు - నభమున - బారులుదీరి
యంతటఁజేరిన దాగుంపులోనఁ
జింతాపరాధీన - చిక్కణబాష్ప
కర్దమితాంగి - శ్రీకామినీరమణ
దుర్దమ మాయావిధూతవివేక—
కడువడిగాఁ గుంభకారునిపత్ని;
పడినవి చెవులలోఁ బండరినాథు
నుతులు - సహింపలేదతివయెడంద
యతనినిష్కరుణతో నంగలార్చినది
యొక్కసారిగ హోయంచు సకల
దిక్కులు బదులివ్వఁ దెవిరియార్చినది
"పరమభాగవతుల ఫణితులునమ్మి
కరుణావిదూరు రంగనిఁబూజసేసి
చెడినాము - మీరింకఁజేయకుండయ్యె
దుడుకురంగనినామ దుగ్ధపానమ్ము
నాకన్నకొడుకును - నామనోధనము
నాకోరికలపంట - నాచికొన్నాఁడు
నాధైర్యమెల్లను - నజ్జయిపోవ

నాధవుహస్తముల్నఱకించినాఁడు
నాచెలియలి యౌవనంబెల్ల బీటఁ
గాచిన వెన్నెలగాఁజేసినాడు
నాయిల్లుగూలిచి - నాసుఖమెల్ల
మాయంబుగావించి - మర్మంబులేని
గోలవిధాన - యీగుడిలోనఁజేరి
మూలనక్కినవాఁడుమ్రుచ్చు - నేవిడుతు
ననుకొన్నవాఁడా! యేమయినఁగానిమ్ము
వనజోదరునిగుట్టు బైటికీడ్చెదను"
నిటులభాషించు నాయింతినీక్షించి
తటుకుననెల్లరు దలఁగిరంతటనుఁ
గలసెనాతలమునఁ గంజాక్షపాద
కలితచిత్తుఁడు కుంభకారభక్తుండు—
కారుచున్నది రక్తపూరంబు - తెలియ
నేరండుకుమ్మరి - నిష్ఠురభక్తి
మునిగి, పూజారులు చనుదెంచియపుడు
వనజాక్షమందిర ద్వారంబుదెఱచి
రాగమావేద్యు! దివ్యజ్ఞానబోధ్యు,
యాగస్వరూపుని - యోగప్రదీపు
సచ్చిదానందు - విశంకటభక్తి
మచ్చిత్తభక్తనిర్మలభావసౌధ
శయనైకశీలు - శాశ్వతుని - విజ్ఞాన
మయుఁ - బాండురంగనిమరులుదొలంకఁ
గనుఁగొనెనోలేదొ! ఘనసమ్మదంబు
పెనఁగొన - సురలెల్లఁ బిచ్చలింపంగ
గళమెత్తిభజన బిగ్గఱగాఁగఁజేసె
నలతయన్నదెలేని నామదేవుండు
తోడనజనులు చేతులుదట్టికొనుచుఁ

బాడిరి - వెన్కఁ, న భంగకీర్తనలు;
అప్పుడుకుమ్మరి యానందభరము
కుప్పతెప్పలుగాఁగ గొంతెత్తిపాడి
కరములుదట్టఁబోఁ గరములులెక్కడివి!
నఱికికొన్నాఁడు దెప్పరమైనభక్తి—
కరములులేనట్టి కొఱతకన్పడియె
పరమభక్తునకు, నెవ్వగదలకొనియె
కటకటా! నేఁడుశ్రీకాంతునిభజన
నటుసేయరాకుండ - హస్తయుగమ్ము
దొఱఁగితి''నని - యెంతకరుణాకరుండొ!
పరమేశ్వరుఁడు - భక్తుభావంబునందు
తలపోఁత పొడముచే తడవుగానొసఁగె
మొలపించినట్లుఁజేతులు, వానిఁజూచి
యరుదొందినాఁడుకుమ్మరి - గాఢమోద
భరముననిలువెల్ల విరులుపూయంగ
దడదడఁబరువెత్తి - తరుణార్కనేత్రు
నడుగులఁబడినాఁడు - హస్తముల్మోగిచి
కనుఁగొనెనీవింత కమలదళాక్షి
కనులునమ్మఁగలేదు - గనుకనిపాటి
ముట్టుకొన్నది శయంబులు గాత్రమందె
పుట్టినవే! యింకఁబువ్వారుఁబోడి
మనసునిల్వగలేదు - వనజాక్షుపాద
వనజంబులందల్లె వ్రాలిపోయినది—
యలనల్లనటఁజేరెఁ జెలువంపుబరణి—
యలసశరీర - పిచ్చిలలజ్జ - కుంభ
కారునిరెండవకలికి - యాశ్చర్య
పూరితయై పూర్ణపూరుషునెదుట
నిలచినదూరకొదలవంచి - యేమి

సలుపంగఁదోచక చంచలహృదయ—
నలువుగానప్పుడు నారాయణుండు—
పలికెఁగుమ్మరి పెద్దభార్యను గూర్చి
"తలనెత్తిచూడుము – తలిరాకుఁబోడి
చలువవెన్నెల నవ్వు సౌరు గుల్కంగ
నిలిచికొన్నాఁడు నీ నెనరులపంట
జిలిబిలిపలుకుల చిన్నిపాపండు
మెచ్చికొన్నాను – నీ యచ్చంబుబత్తి
కిచ్చుచున్నాను – గతించినశిశువు
కైకొనవమ్మ! నీ కరములసాచి
శోకంబు విడువుము – శుద్ధవిచార
సందేహమేటికీ సర్వలోకంబు
లందుఁబ్రసిద్ధమైనట్టి సత్యమ్ము
పండరినాథుని భావించువారి
కుండగారాదెట్టి యుమ్మలికమ్ము
లనిపల్క శిరమెత్తి – యంతగౌరాంగి
వనజనాభునిఁజూడ – వానికౌగిటను
ఘలుఘల్లుమని చిఱు గజ్జెలుమ్రోయ
చిలిపినవ్వులతోడఁ జెక్కులుపూయఁ
గలకలమనుచు మేఖలనవ్వ – పైడి
మొలత్రాడు నడుమున మురువుగుల్క
కరములగొనబు కంకణములుమెరయ
నెఱయఁగుంతలములు నిటలంబుపైనఁ
గనుదోయినెఱమిన్కు కాటుకవెలుఁగఁ
దనమహానందంబు – తనకోర్కెపంట
తనదుముద్దులగుత్తి – తన భక్తిఫలము
తనపాండురంగడు తనయుండు – చేత
లెత్తి చాచుచు నుండె – నెసగిన ప్రేమ

తత్తఱంబున లేచి తల్లి - బాలకుని
గరములఁగొని బిగ్గఁగౌగిలించినది
యరుదున నిలువెల్లఁ గరగిపోయినది
చిప్పకూకటిదువ్వి, చిబుకంబుపుడికి
"యప్ప! యెన్నిదినంబులయ్యెరా! నిన్ను
నెడఁబాసి - నేటికిఁగడకుఁ జిక్కితివి
యడజడియెల్ల మాయంబయ్యె" ననుచు
జలజాక్షి సంతోష పులకిత యగుచుఁ
దలఁపులు మఱచి - మిన్నులఁదేలియాడు
కరణి - బొంగురమట్లు గిర గిర దిరిగె 90
సురలెల్ల సమ్మోద పరవశులగుచు
కరతలమ్ములు మోడ్చి శిరములల్లార్చి
కురియించి రంతటఁ బ్రొవ్విరివాన—
నారదుండు పగతానందుండు - బాష్ప
పూర పూరితుఁడౌచుఁ బొగడంగ దొడఁగె
నిఖిల మహర్షులు - నిబిడ ప్రమోద
ముఖరిత ముఖులు - నిమ్ముల జయాకార
ములు సల్పిరధ్యాత్మ బోధరూపునకు
ఫలితావ తారుండు - పాండురంగనికిఁ
జేరిన జనులెల్ల చిక్కఁటాశ్చర్య 91
నీరధిమగ్నులై నిడుగనుల్వెట్టి
కనుచుండిరీవింతఁ గలిమలాపహుండు
నమితసుపర్వుండు - నామదేవుండుఁ
జలువవెన్నెలలకు సైదోడులైన
యలఁతినవ్వుల ముఖమందగింపంగఁ
జనవుగుల్కఁగవచ్చి - వనజాక్షుపాద
వనజంబులందున వ్రాలినవాని
పరిసరజ్ఞానంబు మఱచినవానిఁ

బరమ భక్తులకొజ్జ బంతియౌవాని
"గోరాఁ" గనుంగొని కూర్మితొల్కాడ
సారస ప్రతిమ హస్తములఁదాకి
లేపిన - భక్తి నిర్వేల బాష్పములు
దీపించుఁ గన్నుల తీరుతో - లేచి
నిలచినంతనే "వాఁడె నీసుతుం" డనుచు
బలికె మాధవుడు - నుత్పలగంధి కొమరు
నందింపబోయిన - డెందంబుకలఁగి
కందుఁగైకొనక - శ్రీకాంతునిఁజూచి
యీరీతి విలపించె - "నారంగరంగ
యేర మానవు దండ్రి! యింకఁబరీక్ష
నీకందునాకేల! యీభార్యయేల!
నా కంఠమునఁ జుట్టినావేల మాయ!
తాళలేనిఁక మహోద్దామ! నాయోర్పు
ప్రీలినదోయి। నీశ్రీధామమునకుఁ
జేరిచి కొమ్మంచుఁ" జిన్మయమూర్తి
నీరజ నాభుండు - నిరుపమజ్ఞాన
పరిణత చిత్తుని భక్తునీక్షించి
పరమగుహ్యంబైన వైష్ణవమాయఁ
బరపెడుఁ జిరునవ్వువాతెఱకొనల
నరుదారుచుండంగ "ననుపమజ్ఞాన
సేవధి! నీకేలచింత - నాపనుపుఁ
గావింపు మావంతఁగలుగదు గొఱఁత
నిత్యముక్తులుమీరు - నిత్యపవిత్ర
మత్యుదీర్ణులు - పాపమల దూషితములు
భువనంబులోమంగఁబూని - నాయిచ్చ
నవతరించెదరు - మీకపవర్గ సుఖము
సందిగ్ధమగునె! నిస్సంశయమోయి!

మందబుద్ధుల లోక మర్త్యులనెల్ల
నమృత ధారాపూర్ణమైన నీ బోధఁ
గ్రమముగాఁబూతులఁగావించి - పిదప
వత్తువులే నా నివాసంబునకును
నుత్తమశీల యీ యువిద - యీ బాలు
నే, నన్ను గానెంచె యెలమిఁ బ్రేమించెఁ
గాన - నీమెకుఁగూడఁ గలుఁగును ముక్తి—
నీచిన్న భార్యను- నిన్ను జేఁపట్టి
నోచిన భాగ్యంబె - బ్రోచును పొమ్ము
వికలతమానుము - వెలఁది మిన్నలను
నిఁక విసిగింపకు మీ యొట్టుఁబెట్టి,
యన్ని యొట్టులు నేటి కంతరించినవి
సన్నుత గుణుల నీ సకియలఁగూడి
యనుభవింపుము ధర్మ్యమైనట్టి సౌఖ్య"
మనిపల్కి- ప్రశ్రయ వినమితుఁడైన
యాకుంభ కారుని యౌదలపైన
శ్రీకామినీ క్రోడసీమ కుంకుమము
దలకొన్నయట్టి హస్తంబుంచె, నంత
నలువొప్పఁగాభక్తనామదేవుండు
కరములు దాచి బిగ్గఁగౌఁగిలించె
ధరణికిఁ దొడవు కుమ్మరిబత్తుఁబ్రేమ;
దివిదీటుకొన మ్రోసె దివిజ దుందుభులు
చవులొలికించె నచ్చరల నాట్యములు
చేరిన జనులెల్లఁ జిన్మయానంద
పూరితులై —జన్మములఁ దరియించి
రచ్చెరువేల! ప్రత్యక్షదైవంబు
సచ్చరిత్రుల నేల శపథంబుబూని
కొలువిచ్చియున్నాఁడు కలియుగంబందు

బలహీనులకు దిక్కు పండరీశ్వరుఁడు;
'పాండురంగా'' యంచుఁ బల్కినఁజాలు
నండనేయుండి - సర్వాపదల్బాపు
వాని నామము భక్తభాగ్యరూపమ్ము
వాని నామము సర్వపాప మారకము
వాని నామము శ్రుతి ప్రసవగంధమ్ము
వాని నామము సుధావర్ష పూరితము
వాని సేవించెడు భక్తవర్యులకుఁ
గాని కార్యములేదు - కల్పవృక్షమ్ము
కామధేనువు - భక్తి కలితంబులగుచు
నామహితుని నామ మనయంబు దలఁచు
కలియుగంబందు రంగఁడె దిక్కు - వాని
సలలిత నామంబె - సౌఖ్యంకరంబు

(గోరాకుంభారు కథ సమాప్తము)

———

# పండరీ భాగవతము

## నరహరి చరిత్రము

తరుణేందు ధరుని పాదంబులు దప్ప
స్మరియింపడెన్నండు పెఱదైవతముల—
నలికనేత్రుని కథాకలనంబు దప్పఁ
దలపండితర దైవతముల గాథలను—
పంచాక్షరీమంత్ర పఠనతత్పరుఁడు
పంచకేంద్రియ దర్పవారణ మల్లుఁ
డనుపమ పుణ్య కర్మాసక్తబుద్ధి
ప్రణుతింపఁ దగువాఁడు భక్తవర్యుండు
వీరమాహేశ్వ రాచారవ్రతుండు
ధీరచిత్తుఁడు - సమధీత విద్యుండు
శివభక్తపద రజశ్చిత్రిత మౌళి
భవిజన సంసర్గపాప దూరగుఁడు
సదమలవృత్తి కంసలబత్తుఁ డొకఁడు
విధిఁజేసి పండరి వీటవసించు—
"నరహరి" యని వాని నామంబు, నైక
పురటభూషణ విధాపరిణత బుద్ధి;
వీక్షింపడింతడు, విఠ్ఠలేశ్వరుని
దక్షవిజేతృ భక్తం మన్యుడఁతఁడు:
పాండురంగని పాదభజనంబు వినఁడు.
పండరినాథు రూపంబు గనండు:
తారకమను కుహూకారకోకిలము
తారకప్రాణుండు - తరుణేందు ధరుఁడు
కరుణించునేమి? శ్రీకరరామచంద్ర
చరణాంబుజమ్ములు మఱచిన యట్టి

దురితుల - శివమనస్సరసీజ భృంగ
మరయండు క్రీగంటనైనను హరుని
నిరసించువారల, నిఖిలవేదాంత
పరిధిస్ఫురన్మూర్తి పాండురంగండు!!
హరిహరాద్వైత భావానందపరులు
దరియింత్రు జన్మబంధమ్ముల వలన——
ప్రతి దినమ్మును 'చంద్రభాగ'లో శ్రుతివి
హిత భంగిఁ దానమ్మునిమ్ముగఁ దీర్చి——
యొడలినిండుగ, బూది యొనరంగదిద్ది
మడిగట్టి, రుద్రాక్షమాలలు దాల్చి
చెలువంబుగాఁ గొండె పిగవైచి - కర్ణ
ముల, రుదురాక పోగులు చలియింప
మల్లికార్జునదేవ మహితాలయంబు
నల్లన చేరి, బిల్వార్చన చేసి
వచ్చు నింటికిఁ బ్రజమెచ్చి చూడంగ
నచ్చంపు భక్తితో నంగముల్దూగ
ఆనందవాః పూరితాక్షుండు, పులక
లానిన దేహమ్మై, యడుగడుగునందు
హరహరా! మురహరాభ్యర్చిత చరణ!
తరుణ చంద్రకలాప, ధర్షితపాప
కైవల్య కోటీర! కరుణాపటీర!
భావుక భక్తహృద్వనజకాసార!
గిరిజామనోహర! గిరిశా! యటంచు
పురహరభక్త శేఖరుఁడైనవాఁడు;
వానిజీవేశ్వరి, పతిహృదయజ్ఞ
మానినీతిలకమ్ము, మన్మథవైరి
చరణనిష్ఠావికస్వరవృత్తి, వాని
పరమపుణ్యమ్ములు, వడపినరూప

మిట్టుల శితికంఠునే కాంతభక్తి
పట్టిన పుణ్యదంపతులకుఁ గొన్ని
సమములు గడచె, నిశ్చలమైన నిష్ఠ;
క్రమముగాఁ బాండురంగనిఁ జేరె, వీరి
కొలిచిన కొలుపు - ప్రాఁబలుకుల కొనల
వెలుగు దీపంబైన విఠ్ఠలేశ్వరుని
రూపాంతరంబె హరుండు నిక్కంబు—
ఆపదుద్ధారకుండైన రంగండు
తనభక్తు నజ్ఞాన జనితమై - మోక్ష
మునకు బాధకమైన మురపురహరుల
ద్వైతభావము వాపఁదఱి వేచియుండె
నాతని యిచ్ఛకు నన్యథాత్వంబు
గలుగునే! మఱియట్లు గలుగునయేని
నిలుతురే బ్రహ్మాదినిఖిల దేవతలు!
పండరిపురి నొక్కఁబిచ్చు ప్రార్థించి
యుండె, పండరినాథు నొడికంబుగాఁగ
"దీనావన వ్రతాధీన చారిత్ర!
నానావివిధ లీల! నాదావతార!
నిన్నుఁ గొల్చెడు భక్తుడెన్నండుగాని
కన్నుల నీర్వెట్టిఁ జన్నెయోచింపు!
పున్నామ నరకంబు పోఁగొట్టుకొనఁగ
నెన్న సూనుఁడుగాడె హేతువు, వాఁడు
లేకున్నచో గతిలేదు జన్మకును
నాకొక్కసుతునిచ్చి నా సోదె దీర్పు
మీ కోర్కె దీర్చి తివేని లోకేశ!
నీకొక్క నవమణీనిచితమైనట్టి
మొలత్రాడు చేయించి మ్రొక్కుఁ జెల్లింతు
ఫలియింపఁజేయరా! పండరినాథ!"

యనుచు - రంగఁడు తథాస్తని నాఁడు - బిచ్చి
జనకుఁడై నాఁడు చక్కని కుమారునకుఁ—
గనులలోఁ దెలికాంతి గదలియాడంగ
మనము హరించు నిర్మల హాసలవము
పెదవిపై మెదలాడ - వదనంబుగమిచి
పొదివిన యలకలు - ముద్దులు గురియ
లలితశిరీష పేశలములు చెక్కు-
లెలవిచ్చి యరుణకాంతులఁ గ్రుమ్మరింప
పండరినాథుని పరమాను కంప
పండిన యట్లున్న బాలు వీక్షించి
యమిత సమ్మోద భారాక్రాంతునకును
క్రమ విహీనములు వాక్యములు - బాష్పాంబు
భరితముల్గన్నులు - పదములు చలన
పరములు - పులక సంపద్భూమ తనువు
మనము సాంద్రానంద మత్తంబు - రంగ
ఘృణకు జీవనము పరిక్రీతమయ్యె—
నడుగులఁ జిఱుగజ్జెలల్లననులియ
బుడి బుడి నడలఁ బాపఁడు నడయాడ
పాండురంగని దయాభరముగేహంబు
మండనమైచుట్టు మాడ్కిభావించు
కిలకిలమనుచు నవ్వుల బండివోలె
చిలిపి పాపండు ముద్దులు జారి పోవ
నవ్విన యిప్పు, డానంద నందనుని
మువ్వలు మ్రోగిన సవ్వడి వినును;
కరతాళములకనుగలముగఁ దరుణ
చరణముల్నర్తింప - శారద పద్మ
పరిభవ కారియౌ వదనంబునందుఁ
బరుగిడఁ జిఱునవ్వు - బాలుండు పాండు

రంగని గుఱిచి యభంగముల్వాడి
చెంగున నాట్యంబు చేసెడు వేళ
తన యింటి దీపమై దయచేసినట్టి
సనకాది ముని మనస్సంసేవ్యుడై న
వేదవేద్యుండై న విఠ్ఠలేశ్వరుఁడు
బోధస్వరూపుఁడౌ పురుషోత్తముండు
తనసృష్టి దిలకించి తానెసంతోష
మున నాడుచున్న చొప్పున సమీక్షించు;
వణిజుఁడు - తనకోర్కె ఫలియించె నేటి
కని - రెండు గన్నుల నినుచు నీరములు—
నీరంబులందాడు నిర్జరపుణ్య
సారమ్ము, సాత్వత, సక్తమహమ్ము
పాండురంగని రూపు, భక్తజీవనము
పాండురంగని రూపుభవరోగహరము—
సొగసులే పులకించు మొగమెల్ల నెత్తి
బిగువుగా తడిముద్దు వెట్టికొన్నపుడు—
అళివినీలములు కుంతలములనొత్తి
చిలుపని ముత్యాలు జిందించునపుడు—
కలకల చలువ నవ్వులు విరియించి
తెలిమల్లెలను చభ్రాంతినిఁ జెందునపుడు
వలపు సంపెగల ఱేకులఁబోలు కనులఁ
బొలపంబుమెఱయుఁజూపులఁ జూపు గలిపి
చూచిన యప్పుడు - సుమనోమనోర
థాచితపేటి - బ్రహ్మానంద వార్ధి
దివ్యబృందావన దీపప్రరోహ
మవ్యయ మోక్ష విద్యాదేశికుండు
మురళీస్వ నాయితమూర్తి - సద్భక్త
తరణైకయానపాత్రంబు - విఠ్ఠలుఁడు

తననోము పంటగా దరిసెన మొసఁగె
నని పొంగుఁగోమటి - యాపొంగులోనఁ
బరువెత్తుఁ జిఱుగాలి పొరలనుఁబోలి
పరమేశ్వరుని ప్రేమ బంధురాశిషము—
తనసుతునకుఁ నభిధానంబొనర్చె
వణిజుండు "విఠలుండ"నుచు నీరీతి
వానికోరిక మోక్షపదవికే మార్గ
మైనది - రంగని యవ్యాజ కరుణ
వాని యిల్లాలును వాత్సల్యభక్తి
నూని సేవించె పుణ్యోజ్జ్వల మూర్తి—
ఫలియించినది కోర్కె - పాండురంగనికి
మొలనూలు చెల్లింపవలయునో కాదొ!
వారిని వీరి విచారించి బచ్చు
వీర మాహేశ్వరాచారుని - స్వర్ణ
కారుని - దఱిపి కాంక్షనుఁ దెల్పినంత
నూఱట దక్కె, యర్థోక్తులలోనె
"హరహరా" యనిలేచి యాలంబొనర్చి
హరభక్తునకు నిట్టులవమతి గూర్ప
వచ్చిన యీ పశుప్రాయుడెవ్వండు
చిచ్చరకంట విచ్చిన మంటగముల
భస్మ సాత్కృతిసేయు పశుపతి! వెగడ!
యనస్మద్విధుల తోడనా! బాల్యఖేల!
ప్రాణలింగ సమర్చనా నిష్ఠవృత్తి
ప్రాణముల్వోయిననైనఁ దదన్య
సేవలు సేయునే! చిత్తజారాతి
భావింప నేర్చిన పరమ భక్తునకు
మదికెక్కునే! యన్యమతి హీనకథలు
పదక వాదముసేయ వచ్చినావేర!

నందికేశ్వర పదాళిందంబునందు
డెందంబు సొగియునా నందంబులవము
పోలునే! తక్కొరుఁ బూన్చిన భక్తి!
కూళ! యేగుండెతోఁ గొనకొనవచ్చి
నావుర! రుద్రు కన్నను జగంబందు
దైవంబు వేఱున్నదా! వక్రబుద్ధి
హరి విరించులు శివు నరిగాపులనుచుఁ
బరువడి వేదముల్వలుకుట లేదొ!
పరమేష్ఠి గర్వంబు పాపంగఁ దలలు
తఱగి పోసెన్నొ! లేదొ! యురగభూషణుఁడు
హాలాహలపు చిచ్చులదరం బెల్లఁ
గ్రోలంగ దివుర, సురాళిఁ బ్రోవంగ
నదలించి దాని, హుమ్మని యాని, జగము
బ్రదికించినట్టి యాఫాలాక్షు కరుణ
గోరని వారలెవ్వారురా! జడవి
చారులు - నీవంటి వారలు దక్క
పశుపతి కరుణకు బాహ్యుఁడవైన
పశువ! మహేశ్వరు ప్రతిననుఁ జెఱుపఁ
దలఁచి వచ్చితివి - నా తల యెత్తుధనము
గొలిచిన - శివుఁదప్పఁ తలయెత్తిచూడ"
ననిరోష సంభృతుండయి యదలింప
విని - కన్నుగోనల తనువునయందు
వినయంబు దొలుకంగ - విద్విత్తముండు
వణిజుండు - చిఱునవ్వు వాతెఱయంచు
లనునిల్వ, నిట్టులల్ల నఁబల్కెమృదుల
ఫణితులు —— భవుసేవ భవరోగములనుఁ
దొలచిన పుణ్యమూర్తులు - మీకు నీతి
పలుకఁగఁ బ్రాతె మావంటి మూర్ఖులకు!

నేనేమియంటినంచెదఁ గ్రుళ్ళరోష
మూనెద! రా శివునిపైని దోషంబు
నెంచితినేమి! ముగ్ధేందు ధరుండు
పంచాక్షరీమంత్ర పరదైవతంబు
దైవంబు కాడంటినో! వక్రబుద్ధి
కావరమూని భక్తప్రతారణము
సేసితినో! ధేనుభూసురజాతి
గాసిఁబెట్టితినొ! నిష్కారణమేల
యలిగెదరయ్య! దివ్యావతారునకు
మొలనూలు సేయించి - మ్రొక్కఁజెల్లింపఁ
దలఁచితి - మిమ్ముల దఱిసినాకోర్కె
తెలియఁజెప్పితిని - ప్రార్థించితిఁదమ్మ—
కనకదామము సెక్కఁడని - దీననేమి
వినయంబు కొఱయయ్యె! విఠ్ఠలేశునకు
మీసేవ గొనఁగఁ గామింపఁగారాదొ!
యీసకలంబున కేలినవాఁడు;
దేవేంద్ర కోటీర దీధితిస్తోమ
లావణ్యనికషోప లపద విభ్రాజి;
పరమేష్ఠి భావనాంబర దివాకరుఁడు
పరమదైవంబైన పాండురంగండు
తమ యలంకృతులకుఁ దగఁడొ! శంకరున
కుమకు, నే పరమాత్ముఁ డొరవడివాని
నిందింపఁజెల్లునా! నిటలనేత్రుండు
సందేహమేటి కంశమ్ము శ్రీహరికిఁ
బాండురంగని, కిదె, పందెంబు సఖుము
పాండురంగనియందె భవమూర్తి దోచు
తోపింతుబో! నేను చూపింపనేని
నీపాదములు వట్టి నిటలంబునందు

ధరియింతు భూతి తథ్యంబు సు''మ్మనుడు
చరణతాడితమైన సర్పంబువోలె
మొగమెల్ల జేవురింపఁగ మంటఁగ్రక్కి
భుగభుగ మనుచును పూత్కార మెగయ
కుపిత తీవ్రంబు భ్రూకుటి సుడివడగ
నపరాద్ధునకు నల్గి, హాయనియార్చి
పలికె మాహేశ్వర భక్తుండు - బత్తు
"నిలుపు మీ మాటలు - నిలుపుము ప్రతిన
నిలుపు మీ, యిలవేల్పు నిందు గౌరవము
పలుకు నెగ్గుటయన్న పరహాసమేమి?
పాండురంగనియందు భవమూర్తి చూప
కుండపీడను - మఱియొండు మాటలను—
నీనుడి ఫలియించునేని వైష్ణవము
నూనుదు - తప్పదు సూ! నిజంబన్న
"కానిమ్ము! నీచేయు కనకదామమ్ము
పూనిన నిముసమే - పురుషోత్తముండు
గజకృత్తి ధరియించి - కరపద్మమందు
నజకపాలముబూని - యఱుత నెమ్ములను
హారముల్దాల్చి - చంద్రాభరణమ్ము
దీరిచి - చటులతార్తీయీకలోచ
నముతోడ, హస్త సన్నద్ధ త్రిశూల
ఢమరులతోడ నిట్టలముగఁదోచి
కొలువిచ్చునంచు నా కోమటి తనదు
పలుకుల - మఱి యనువాదంబుసేసె
"వీరమాహేశ్వరా చారంబు గురువా!
వీరవైష్ణవమొ, నసార మీనాడె
తేలిపోవలెనోయి! తేటతెల్లముగ
బాలభాషణముల పనియేమి! - తెమ్మ

కనకమ్ము, తెచ్చిన మణులు, చెక్కెదను
పనిఁబూని - కఱుదుచూపఱకు వ్రేఁగుగను
మఱచితి - రంగని మధ్యప్రమాణ
మెఱుఁగను - నీవు చెచ్చెఱఁదెచ్చి - కొలఁత
యిచ్చినఁ దీరిచి యిత్తు నీక్షణమ—
చిచ్చుఱ కనుగల్గు శిష్టమూర్తి దక్క
పరికింప నన్యదేవతలనేనంచు
నెఱుగుదువేకదా! మఱతువో! యేమొ!
నఱచిన వందెంబు సత్యంబుగాఁగ
నఱకొఱ లేకుండనట్టులయున్న
దనిపల్క - బిచ్చు, తథాస్తని నవ్వి
కనుగ్రేవలనుఁ దృష్టి కనుపింపమ్రొక్కి
పండరినాథుని పాదపద్మముల
యందనుఁజేరి, దుఃఖాక్రాంతుఁడగుచుఁ
బరులచే దండింపఁబడిన బాలుండు
పరువెత్తి తనతల్లి దరిఁజేరి - పనవి
పనవి యేడ్చెడుభంగి వణిజుఁడు రెండు
కనులలోఁ గన్నీరు కావేరిగాఁగ;
సనకాది మునిమనోధనములు - గోప
గణహృదయాహ్లాద కౌముదీరాత్రు
లంధకాంతక మానసాబ్జ భృంగములు
సింధుకన్యా మనశ్శ్రీరవి మూర్తు
లసురనాయక జీవహంతలు - భక్త
వసుదానచణములు - వల్లవీమాన
పశ్యతోహరములు - వసుమతీమధుర
కైశ్యమండనములు - కలికల్మషఘ్న
ములు - రంగవిభు పదంబులు కౌఁగిలి
విలపించె - నీగతి వివశాత్ముఁడగుచు

"పరమదుఃఖితులు మామొఱలాలకించి
నెఱిదీర్చు ప్రభుఁడవు నీవుగాకున్న
నెవ్వరున్నారురా! యింకలోకేశ!
యెవ్విధినైన నీవే కటాక్షించి
యాపద దొలగింపరా! పాండురంగ!
యాపదుద్ధారకుండని పేరుమోపి
కడగి భక్తగణంబె కావలైతేని
కడలేని కన్నీరు తుడువవైతేని
నిలుచునా! నీకీర్తి నిర్మలమూర్తి!
తలమేదు నీ దొడ్డతనమును నమ్మి
చేసితి ప్రతిన - నాచేసిన బాస
వీసమంతైనఁ దప్పింపఁబోకోయి!
పాండురంగఁడు భక్తపరతంత్రుడనెడు
నిండు సమాఖ్యను నిలుపుకొమ్మోయి!
హరవిరించులకును నాదికారణము
పరదైవతమ్ము మా పండరినాథుఁ
డనెడు ప్రస్తవము తథ్యంబుగాఁజూపి
కనులకుఁబండువు గావింపుమోయి
యని మ్రొక్కి - కన్నీట నడుగులు కడిగి
వనజాక్షు మధ్యమ్ము పరిమాణముగొని
వీరమాహేశ్వరాచారునకొసఁగి
చేరె గృహఁమ్ము నిశ్శ్రీకముఖుండు—
కనకదామము దీర్ఘాగంసలబత్తు
మణిగణమ్ములు నెక్కి మహితమౌరీతి
నెఱసంజతేకులు నెగడెను మింట
సురసుందరీ పదశోణిలాక్షా ప్ర
సరణంబువలె - కల్పశాఖి శాఖాగ్ర
తరుణకిసాలయ తతకాంతకాంతి

పరగినయట్టు, లభ్రభామినీ లలిత
చరణ తులాకోటి సంబద్ధశోణ
మణిమరీచులు మింట మసలినయట్లు;
వణిజుండు నైకభావా విష్టహృదయుఁ
డయియల్ల నల్లన నడుగులు దూల
కయిమోడ్చి యాస్వర్ణకారుని దరిపి
నిలచినఁ జిఱునవ్వు మొలకలై పోవ
మొల నూలుచెల్లించి - మొగమున పొగరు
కుప్పతెప్పలుగాఁగఁ - గోమటిచూచి
యెప్పుడు దర్శనంబిప్పింతువన్న!
యని బిట్టు నవ్విన - నా నవ్వుతోన
మనమునత్రాచులు మలసినట్లైన
కనులూరఁబారు సఖంపచ బాష్ప
కణములు నారుక్మకారుని చరణ
తలములు దడుపంగఁ దలవంచి వినయ
కలితమ్ము - శాంతిరేఖా మండితమ్ము
పలుకులో నుపనిషద్భావంబు మ్రోయ
పలికె నీగతి నన్న! భవరోగహరుఁడు
పాండురంగఁడు నూత్న పల్లవకాంతి
మండితమురు జటా మధురమస్తమున—
తారకాకమన సుందర భూషణమున
హారి వినీల కంఠాబద్ధ మనుజ
కీకస హార వికీర్ణ కాంతులను
ప్రాకట ప్రమథ గర్జార్భటీ పుల్లి
తోల్లాస వాసుకి వేల్లనంబులను
మల్లికా విశదసు మధురగాత్రమున
నిప్పుడ దర్శనంబిచ్చెడు నీకు—
తప్పదు దివిజ సంత్రాస హారకుఁడు

భవమూర్తి నిక్కంబు, పండరినాథుఁ
డవతంస గుచ్ఛ పింఛాచిత మౌళి
యనుమాటతోన భక్త్యావేశ మెసగి
తనువు కంపింప నా కనకదామంబు
గొని - యాలయముఁజేరి - కోరికలూర
వినతాతనయ ప్రాణవిభుఁ జూచిచూచి
చూచు చూపులతోన సొగసి డెందమున
వాచా మగోచర వైభవుఁడైన
రంగనిపదముల వ్రాలి దుఃఖంబు
పొంగంగ - గద్గదపూర్ణమౌ నెఱఁగు
వెడల కందదుకులై విఱుచుకొనంగ
నెడఁద దుమ్మలుచుట్ట - నేచిన యూర్పు
మంటలు - తీవ్ర జిహ్మగములై వెడల
కంటి నీరూరగ గండరువట్టు
లోరంత ప్రొద్దుండి - "ఓయి! విఠోబ"
పోరాని పోకలఁ బోయితినంచు
చేయఁరానిది బాస చేసితినంచు
నాయందు దయఁతప్పినావేమి తండ్రి!
శ్రీకాంత! నాబాస చెల్లింపకున్న
నీకు నాకునుఁగూడ నేటితోఁ దీరు
బాంధవంబని, యఱపలుకులోఁ దెలిపి
బంధుర దుఃఖ సంబాధ్య మానంబు
హృదయంబు వహ్నిపరీతమైనట్లు
బెదరి, తల్లడపడి వివశుఁడై నిలచి
నిలువని దుఃఖమ్ము నిలుపంగలేక
నలగి - రంగనిదయ నాపైని నేడు
తప్పునేమోయని తలరి, యట్లగునె
తప్పదంచని, లేని ధైర్యంబుపూని

కరములు వడకంగఁ, గనకదామంబు
పరమపూరుషుఁడైన పాండురంగనికి
ధరియింపఁజేసిన ద్వ్యంగుళీమాన
మరుదుగఁ దక్కువయైన, వీక్షించి
తనువు కంపింప చింతాజర్జరితము
మనము వాత్యాచంక్రమణములఁ జిక్కి
పల్లటిల్లిన నవపల్లవంబువలె
నల్లాడ, నిటలపర్యస్తమౌ చెమట
యల్లన కాలువయ్యె చెక్కులంట
మల్లంబు గ్రుమ్మినయోజ కలంగ—
రోదనోచ్చూన, మశ్రుపరీత గర్భ
మా దీనవావ లిప్తాపాంగ భరము
సంకుచద్భ్రువు - శుగస్తమిత తేజమ్ము
శంకా విమూఢ నిశ్చల తారకమ్ము
కనుదోయి నిలవంచి - కర్తవ్యమేది
తన భవితవ్య నిర్దాక్షిణ్య వృత్తి
దలచి రంగనిదయ తప్పినదేమి
కలుషంబు లంటిన కారణంబుననా
నన్నుఁ బరీక్షించునా! విఠలుండు
నన్ను దూరముసేయునా! పాండురంగఁ
డని యార్చి - నా పూజయందె లోపంబు
గనపడెనో! యంచు కరము చింతించి
గుండెలోనెక దట్టుకొన్న దుఃఖమ్ము
మండు నిప్పులయేటి మాడ్కిఁ బొంగంగ
గళము పగులగ, బిగ్గఱగాగ నార్చి
యిలఁగూలి విలపించె నిట్టులాబచ్చు—
"నీమాయ దాటంగ నేనెంత వాఁడ
శ్రీమానినీ మనస్సేవధి! కృష్ణ!

హర విరించులకు నూహ్యముగాని యట్టి
పరమ గుహ్యంబైన భావత్కచరిత
మెఱుగంగఁ దగునట్టె! యీకదర్యుండు
పరమపూరుష! నీదు భక్తులకింక
గతి యెవ్వరోయి! నిష్కారుణ చిత్తమున
హితమేది నీవే పరీక్షింపఁ బూన—
లౌకిక దుఃఖ విప్లవములఁ జిలికి
లోకేశ! నీసేవలోనైన శాంతి
యనుభవింతమటంచు నాసలుపెంచు
కొనిన నీ భక్తులకోర్కెలు త్రెంచి
యెందుకీరీతిగా రించెదవోయి!
కొందలపడు సాధుకోటి కన్నీరు
యాదవీ మధురాధరామృతా స్వాద
మేదుర రుచికన్న మిక్కిలియగునె?
హరిభక్తి వర్జితులౌ మూఢ జనుల
తరమిడి పెట్టు బాధలనెల్ల నోర్చి
యవమానములకోర్చి, హాస్యంబులోర్చి
చవిలేని లౌకిక సంగతి కోర్చి
నీయందఁ జేరిన నీవు కన్గొనవు
మా యంతరంగమే మాడ్కి శాంతించు!
తీరని యగ్నిచే దీపితమగుచు
ఖారాయమాణ జీవనమున యందు
శ్రీకాంత! విధురచిస్ఫీతమైనట్టి
నీ కటాక్షములేక నిల్వంగ గలమొ!!!
నా మనోధనమూర్తి! నా కంటి జ్యోతి!
నామోద రూపంబ! నా ప్రాణఫలమ
నా కష్టముల పంట! నా యూర్పుగ్రోవి!
నా కల మృదు భావనాంబర చంద్ర!

నా మాతృదేవత! నా యదృష్టంబ!
నా మాన మాణిక్య! నవరుచి స్తబక!
యేలరా! నాపైని నింత కోపంబు
చాలురా! నాయోర్పు జర్జరితమ్ము
పలుకరా! నాతోడ పండరినాథ—
మొలనూలిలో రత్నములు చెక్కలేదో!
చెక్కిన రత్నముల్ చెలువుగాలేవో!
చెక్కడమున నేర్పు చిక్కగాలేదో!
చాలదో! రత్నసంచయ ముకుందనము
పోలదో! యేలరా! మూగతనంబు
నా యెదనే గోతునా! ఖండములుగ
చేయింతునా! వాని చెక్కిదామంబు
నాయుష్ణ బాష్పసంతాన రత్నములె
మాయయ్య! చెలువుగా మాటింతునేమి?
ఏమి నీకోర్కె దేవేళయటన్న
కామితార్థములిచ్చు ఘనమూర్తి నుండి
వార్షుక మేఘనిస్వన ధీరవృత్తి
తర్ష విహీన భక్త ప్రమోదమ్ము
ఈషల్లసితహాస హిమశీతలమ్ము
పోషితామృత రస పూర్ణతాగుణము
పరిమితాక్షరభావ పరిమళాసార
పరిపూరిత దిగంత వలయమ్ము! పలుకు
వెలువడె నీరీతి వినవోయి! నేత్ర
ములనుష్ణ బాష్పముల్ పొంగులు వోవ
నేల యేడ్తువు? భక్తుఁడెడఁ గ్రుళ్ళినంత
జాలయి పాఱునా సరళచిత్తమ్ము;
గోవు వెన్నంటెడి కోడెవిధాన
భావంబు దొంగిలి పరచిన ప్రియుని

వెనువెంట, మనమంటు వేదురుజిక్కి
చను, గతత్రప, యభిసారికమాడ్కి
యనుసరించెదను భక్తౌఘమ్ము నేను—
మనసిజ శితపుష్ప మార్గణ దూయ
మానయై - యుపపతి మార్గమ్ముసూచి
వాని రతంబులోపలి చవులెంచి
తలపోయు పుంశ్చలీ తరుణిమోహంబు
కొలదికి మిగులు భక్తులయందు నాకుఁ
గల ప్రేమ,- నావాని కాంత కపోల
తలముల నిరెండ దాకి కందినను
సహియింపలేను నిశ్చయముగ నేను
మహిత దేవేంద్రాద్యమర కోటికన్న
గరుడుని కన్నను కమలజకన్న
పరమప్రియంబు నా ప్రాణంబుకన్న
నాకు దగ్గఱివాఁడు నా భక్తవరుఁడు—
నేకాంత భక్తసమీక్షా బుభుక్ష
దలకొనవాని తెన్నులు చూచిచూచి
కళవళపడు నాదు కన్నులు - వాని
పూతాంఘ్రి ధూళిని పూయంగఁ దలఁచి
యాతనపడును దేహము, వానితోడ
పలుకుటవలని తత్పరత వక్త్రమ్ము
కలగుండువడును - నిష్కలుషమ్ము వాని
నామమ్ము జపియించు - ననుపుతోఁ బొగులు
నామన మనిశమ్ము - నాకును భక్త
వరునకు ద్వైవిధ్య భావమ్ములేదు
పరమేశ్వరుఁడె లేఁడు భక్తుఁడు లేక;
నన్నాశ్రయించిన నాభక్తు నెవఁడు
కన్నుల గర్వంబు గప్పికారించు

వానిపై నలుగుదు, వాని శిక్షింతుఁ
గాని సంస్తుత్య మేకాంతమ్ము, భక్తి
లేక బాహ్యాచార లిప్తుడై యెన్ని
పోకలఁబోయినఁ - బుట్టదునాకుఁ
గరుణ, సద్భక్తిదీక్షా గురుఁడైన
పరమ పూజ్యులమేలు బంతివౌ నిన్ను
నేను పరీక్షింతునే! యేటి మాట!
యా నిటలాక్ష మహాభక్తుఁడైన
కంసలబత్తు - నిష్కారణవైర
పాంసులుఁ డైనాఁడు - భ్రమితుఁడైవాఁడు
నాయందు గాన, నజ్ఞానంబు దీర్చి
యోయన, నే వాని నుద్ధరించుటకె
పన్నితి, వింత యుపాయంబు పొమ్ము
పన్నగాభరణ దివ్య స్వరూపంబు
నేన చూపింతు, నీకేల నీవంత
నా నడుమునకును నవ్యదామంబు
వదులైన దనినొక్కి పలుకు"మటన్న
ముదితుఁడై వాఁడు "నమోవాక" మనుచు
తలవంచి, తత్పద తామరసముల
కిలజాగి, మ్రొక్కి - గ్రహించె మధ్యంబు
కొలత క్రమ్మఱ, - క్రొత్త కుతుకంబుమేన
పులక సస్యంబులఁ బూరింప మగిడె
పండరినాథుని భవ్యరూపంబు
రెండు కన్నులను వర్తింప భక్తుండు—
మధుఘస్మరార్ద్రి సమ్మాన సంజాత
మధురత మానంద మాధ్వీక మత్తుఁ—
డవిరళ పులక పుష్పాచిత దేహుఁ
డవదాత లలిత హాసాత్యంత శీత

ల కపోల దీప మాలాయిత కర్ణ
వికచ కుండల ప్రతిబింబిత కాంతి—
శ్రీనికేతన భద్ర సింహాసనాయ
మాన నిటాల కమ్ర తరోర్ధ్వ పుండ్ర
ధవళిత సకల భక్తతతి చిత్తుండు—
శివకేశవాద్వైత శీలుండు, రుక్మ
కారుని దఱికి, కంకాళ భూషణుని
కారుణ్యమునుఁగోరు కంసలబత్తుఁ
డల్లంత దూరంబునందె వీక్షించి
యల్లన నగి, దక్కొనని చిట్టమిడిచి
చిడిముడి పడుచున్న చిత్తచాపలము
గడవనేరక తన కన్నులయందు
నపహాస్యభరము నాట్యములాడ-పెదవి
కపటాదరంబను గరళంబు దొలుక
నెదురుగఁ జనుదెంచి "యేమోయి! ఖండ
విధుశేఖరు వియోగ వేదన నలిగి
కాచుకొన్నాము నీ కరుణకుఁ దండ్రి!
మాచనవుల మంచి - మమ్ము నీవారి
తఱిఁ బ్రోవకున్న దుస్తరభవ వార్ధి
తరియింప నెయ్యది తరణిఁ విఠ్ఠలుఁడు
గ్రహియించెనే కద! కనకదామమ్ము
నహిమాళి దర్శనంబబ్బునే మాకు
నబ్బకుండిన వైష్ణవాచరణంబు
దబ్బరకద! శైవ తంత్రంబు స్వీక
రింతువే కద! చంద్రభృద్గాఢ భక్తి
మంతుఁడవై - వీర మాహేశ్వరులను
సేవింతువే కద! చేసిన ప్రతిన
భావింపవో! సత్యవాక్యము దప్పి

ఘోర రౌరవ బాధ గూలంగఁ దలఁతొ!
యేర! పల్కవటంచు నెకసక్కెమాడ
నలఁతి నవ్వుల పెరలజుల కొక్క
చెలువంబు ఘటియింపఁ, జేతిలో నున్న
కనకదామము చూపి కంసలబత్తు
మనము తీవ్రాశ్చర్య మగ్నమ్ముసేసి—
పలుకు పల్కన నిల్చి పాండురంగండె
పలికింప—నీమాడ్కి భాషించెవాఁడు
నీ వచించినదెల్ల నిజము! నా ప్రతిన
వోవదు - సత్య సమ్మూథమ్ము గాదు
పాండురంగనిఁ గొల్చు భక్తుని బ్రతుకు
చండీశ పాద కంజాత సేవనము
భవ తరణంబు, తద్భక్తులు ప్రమథ
నివహంబుగాక చన్నె! మర్త్యులనగ
మాహేశ్వరులపాద మధుర తీర్థంబు
లూహాతిగ పవిత్రితో జ్జ్వలితములు
శంకర భక్తభాషణము, సమ్మోహ
సంకట దావాగ్నిచయము! తదంఘ్రి
సంపర్క పుణ్యసంచయ వాపితము, ని
లింప దుష్ప్రాప్య ధూళీపాళి - నైక
భవ్యతపః పరిపాకాయితంబు—
సేవ్యుఁడౌ శంకరు సేవింపఁ గలిగి
వాని చింతనయందె వర్తించుకంటె
మానవునకు నింక మహనీయమెద్ది!!
యావేశభరమున నన్నానె కాని
మీవంటి భక్తుల మృదులాంఘ్రి సేవ
పావనభూతి సంభరణంబు! దేవ
దేవ శంకరపద దీక్ష—నా పుణ్య

ఫలమదెంతటి దయాభరము నాపైని
గలవొ! పల్మరు జ్ఞాపకంబెలయించి
పురికొల్పుచున్నావు! భూతేశ చరణ
పరిపూజ నాచార భద్రసంగతికి
నీవె సద్గురుఁడవై నిలచి, శాసించి
నావు, నాపాలి దివ్యావతారుఁడవు—"
కంసల బత్తుని కనుగోనలకవ
తంసమైనది, దృష్టరదహాస రేఖ
గమనించినాడు భక్తకుల మండనము;
విమలదయాభర వివశజీవనుఁడు
వినయశస్త్రిండు, సంవిన్మూర్తివైశ్యుఁ
దనయకశాదుని యవలేపభరము—
మఱిపల్కెనో వీరమాహేశ్వరుండ!
హరిహరులకు భేదమజ్ఞాన కృతము
పరమేశ్వరుఁడు గొల్చు పండరీనాథు
పరమేశ్వరుని గొల్చు పండరీశుండు—
పరమపూరుషుఁడైన పాండురంగండు
పరదైవతము, ఖండపరశువు, సతత
సక్తులు, తావి పుష్పంబునుఁబోలె—
రిక్తవాదములతోరిత్తఫలమ్ము —
శివమూర్తి సగుణమై చెలగినయపుడు
భవనివారకుఁడైన పండరినాథు
కలుముల చెలి చెలికాని విఠలుని
దలఁచు నిర్గుణునిగా, తాను విఠలుఁడు
పరిపూర్ణ రూపుఁడై, భాసించినపుడు
పరమేశు మదిలో నుపాసించుచుండు
నిఱువురకును రూప మెన్నంగలేదు
నిఱువుర రూప సమేధితుల్నిజము

హరిహరు లిఋవురటన్నదే మిథ్య
హరియె హరుండు నా హరుఁడే హరియును
ప్రళయకాలమునందు భయదంబుగాఁగ
చెలరేగి జీవుల శిక్షించునపుడు
హరుఁడంచు, ప్రాణిసంహతుల నిర్మించు
తరుణంబునందు విధాతయటంచు
ధరణి సర్వము దయార్ద్రమనస్కుఁడగుచు
భరియించునపుడు విశ్వంభరుఁడనుచు
నానావిధంబులు నామరూపములు
గాని సర్వేశుఁడొక్కండె నిశ్చయము—
వాఁడె నా తండ్రియౌ పాండురంగండు
వాఁడె లోకమ్ముల పతితపావనుఁడు
వాఁడె ఫల్గున రథప్రాచీతపసుఁడు
వాఁడె గోపీ మానపశ్యతోహరుఁడు
వాఁడె శ్రుతిస్మృతి వనమత్తగజము
వాఁడె దీనావన వ్రత దీక్షితుండు"
సహాయింపలేదు కంసల బత్తుచిత్త
మహిమకుటాన్య దైవాభివర్ణనము
చాలింపవోయి! ప్రజ్ఞావాదములను
గోల! భట్టువిధాన కొఱమాలి పలికె
దేది దామంబునందిమ్మన్న, భక్తి
మాధుర్య భృళకంపమానంబు - కరము
దాచి - వివేకముద్రా ముద్రితములు
పూచిన చిఱునవ్వు పూతలువెలయ—
నొసగుటతోన దామోదరుమధ్య
మసదు నీచేసిన యట్టిదామంబు
వదులైన దిదెకొమ్ము పట్టితెచ్చితిని
మధువైరి మధ్య ప్రమాణమ్ము మఱల,

తొలిసారి పొరపాటు తోచినదేమొ!
చెలువమునకుఁగూడ చెలువమౌ విఠలు
నాకృతి తోచినయంత చిత్తమ్ము
నాకవశమ్ముగా నాట్యముసేయు
నేనేమిసేయుదు - నెంతకు దింపఁ
బూనిన - నిలువదు - ముగ్ధకురంగ
చపలమ్ము - నా యీదోసంగు మన్నించి
యుపకృతి గావింపు మురగ భూషణుఁడు
సంతోషమొనపి దర్శనమిచ్చునీకు
సంతాపముడుగు, మేచక్కటినైన
నీసేవ నీచేతనే పొందవలయు
భాసురమూర్తియౌ పండరినాథుఁ
డనిపచించిన, హృదయాంతరతాప
విని గూహనైక ప్రవిష్టయత్నమ్ము—
నలస నిశ్వాస ధూమ్యాశ్యామవర్ణ
కలితమ్ము, శశ్వద్వికారావ గుప్తి
తర్షతదంతరోద్గారితకృతక
హర్షావదాత వర్షాంకురభరము
తిలతండులన్యాయదీప్తమ్ము - పెదవి
సెలవుల నెలనవ్వుచిత్తడి గురియ—
మొలనూలుగొని, రేపుప్రొద్దున రమ్ము
చెలువుగ దీర్చియిచ్చెదనని పలుకఁ
దలవంచి "భాగవతావతంసాయ!
దళితపాపాయ, శీతకరకోటీర
చరణతులాకోటి సౌమ్యచిత్తాయ
పురుషోత్తమాయ నమోనమ"యంచు
పుడిమిపై సాష్టాంగపడి దండమెఱిగి
యడుగడుగున మాధవాను చింతనము

చెలగంగ గృహమునుఁజేరెనాబచ్చు—
నలికలోచన పదాబ్జాళింద రంగ
వల్లి కాయిత సర్వవాసనామయుఁడు
తల్లీనవృత్తి, సంధ్యాకాలపూజ
సేసె కంసలబత్తు శివునకు, సర్ప
భాసురాంగదునకు, ప్రమథనాథునకు
పాటలిత ప్రత్న పల్లవాకార
జాటజూటునకు, చంచచ్చంద్రకిరణ
పరిణాహ సంపదాపాదితాపాంగ
కరుణావివృద్ధికి - కందర్పదర్ప
సాగరాచామ భీషణ కుంభసంభ
వాగాధ కందరదగ్ని నేత్రాంత
రుద్యదంగా రచ్చటోచ్చలద్ధ్వాన
సద్యోవిజయమురజాయిత దిక్కు-
నకు - తద్దిశానిస్వ నత్రస్తకర్ణ
వికలస్రంసత్కా-ద్ర వేయకోటీర
శశ్వదుద్బంధనాసక్త హస్తునకు
విశ్వేశ్వరునకును - వివిధప్రకార
తోష్టూయ్యమాన క్రతుభుజౌ ఘమాన
సేష్టపూరునకును నిందిరారమణ
మానస వనపుల్ల మందారమూర్తి—
కానత వైరికి - నఖిలైకగతికి—"
ప్రణతపాలకుఁడైన భవుమూర్తి చెన్ను
కనుల యాసలు దీరగాంచెడు నపుడు
తరుణేందు కరవికస్వర జటాపాళి
కరవిరి దండల నలరించునపుడు
పరదైవతము, ఖండ పరశునామంబు
పరమకౌతుకమునఁ బఠియించునపుడు—

అష్టమూర్తికి - జగదవనైకరతికి
శిష్టరీతుల సమస్కృతి సల్పునపుడు
కనులనిండుగ నీరు కరములనిండ
పెనుగొన్న రోమాంచ వీరున్నివహము
గళము నిండుగదైన్య గద్గదవృత్తి
కల శరీరమునిండ కంపమ్ముపుట్టె
వీరమాహేశ్వరా చారభక్తునకు;
గౌరీశ పాదపంకజ లగ్నచిత్త
పరమ పాతివ్రత్య భరితవిచార
కరములు మొగిచి - శంకరుఁదేటి చూచి
యర్థించె భర్తృమోక్షానంద వరము
సార్థకీ కృతనిజ జన్మ, తత్పత్ని—
తదనంతరమ్ము శీతల చిత్తవృత్తి
సుదతి వడ్డింపగ - శూలినివేది
తంబైన యన్నంబు - తనివిదీరంగ
సాంబ నామావళీ జప తత్పరతను
భుజియించి, పదునాల్గు భువనంబులందు
గజకృత్తి వాసుఁడే ఘనుఁడైనదైవ
మనుపూన్కి చెల్లించు నడియాస పూని
కనకమేఖల చెక్కఁగడఁగెనా బత్తు—
పండరినాథ దివ్యరసానుభూతి
మండిత చిత్తుండు మధుర జన్ముండు
సంతత బాష్పవర్ష స్నాపుతాక్షుఁ
డాంతర దుఃఖకంపాయమానతనుఁ
డవనత శీర్షుఁ డాహ్లాదవి యుక్తుఁ
డవజిత గాఢ దర్పాంధ కారుండు
శాంతి స్వరూపుఁడశ్రాంత గోవింద
చింతనాభ్యాస నిశ్రేయస పరిధి

పరమవైష్ణవుఁడైన బచ్చు, గృహంబు
పరువడి చేరఁబో - బాలుండు - లలిత
వలితముల్-ముగ్ధభావ ప్రేంఖితములు
కలమందహాస వికస్వర రూప
ములు-కౌతు కాక్రాంతములు - క్రమవర్తి
తల నటచ్చూర్ణకుంతల బర్హభార
మృదు విభేదన పరిక్లిన్న నిర్గమము
లధర మాణిక్యచ్ఛటాసార గుంభి
తములు - చూపులుచల్లి, తరుణారవింద
కమనీయములు - పదక్రమములు ముగుద
చిఱుగజ్జియల నవ్వు చిందులు మీర
పరుగెత్తుకొని వచ్చి - బాహువులెత్తి
యాకలి కన్నుల నప్పుడీక్షింప___
లేక లేక తపః ఫలితము భాగ్యమ్ము
గాఁగ జన్మించిన కందునుఁ జూచి
యాగ నేరక - కన్నులందు ప్రేమాశ్రు
వులు దూకినవి - మేనపులకలునిండి
మొలకలైనవి-కరమ్ములు సారె సారె
చలియించినవి - సుధాసారంబు వోలి
నిలువెల్ల నాక్రమించిన ప్రేమవృత్తి
జనకున, కంత హస్తమ్ములు చాచి
తనయు గ్రహించి - కుంతలములు బుడుక
కరములు జడములై - కంఠమ్ము దైన్య
భరితమై - "నా స్వామి! పండరినాథ!"
యని పల్కఁబోయి - పల్కను నోరురాక
తనమది లోననే తలఁచుకొన్నాడు
పరమ ధన్యంబైన - వాత్సల్య భక్తి
పరిపాక మిట్టిదెవ్వరు నేర్పినారు?___

చిఱునవ్వు తొడవు దాల్చిన మోమునందు
పరమ గంభీరతా భావంబు దోప
వినయ సౌరభభార వీక్షణ పంక్తిఁ
దననాథు పాదముద్రల నీడలొలుక
ననురాగ శబలితమైనట్టి చిత్త
మునకు వశిత్వమ్ము ప్రోది వెట్టంగ—
తరుణ సుందరమైన తనమోవియందు
పరమ పాతివ్రత్య భంగిమలలర
ఘలు ఘల్లుమను నూడిగములు ప్రాణేశు
సలలిత నామంబు జపియించుచుండ—
చెలగుచునవ్వు మంజీరముల్దనకుఁ
గల భాగ్యమునకు వ్యాఖ్యానముల్వలుక
పుడమికి దిగిన వేల్పుల గోవువోలె
నడచుచు వచ్చు మందాకిని వోలె
తనువు దాల్చిన సతీ ధర్మంబు వోలె
వనజాక్షి—కోమటివానియిల్లాలు
నెదురేగుదెంచి ప్రాణేశ్వరు దివ్య
పదధూళి ఫాలమ్మపై ఘటియించి
జలములఁ గడిగి తత్సలిలము శీర్ష
తలమున భక్తితత్పరతనుఁ జల్లి
కొని - గంగకును కోటి గుణములు హెచ్చు
తనపతి తీర్థపాదములాచమించి
మ్రొక్కి— నిల్చినను, విభుండింద యనుచు
నక్కుమారుని చేతికందివ్వ - కన్ను
లను కుచంబుల పయస్స్రవణంబులుబుక
కొని వెంట నడువ, భక్తుఁడు ప్రవేశించెఁ
దనయిల్లు, హరినివేదన పూత మన్న
మును భుజించెనొ లేదొ పుణ్యాంకరంబు

పాండు రంగని నామభజనంబు చేత
గండరించినది సకల మందిరమ్ము—
సతియును పతియు నిశ్చలమైని నిష్ఠ
పతిత పావన మైన పండరి నాథు
నామముల్ పాడుచున్నారంత - పూర్వ
కామినీ కుంకుమాంకమ్మును వోలె
కమలినీ హృదయకాంక్షా దివ్యమహము
తిమిర భ్రమల్లోక దివ్యాంజనంబు
ధేనుభూసుర తపోదీక్షా ఫలంబు
భానుండు దోచె నభ్రంబునయందు—
స్నాన సంధ్యాద్యను ష్ఠానంబు దీర్చి;
మానినీమణి నమ్రమస్తయై మ్రొక్క-
సెలవుల కొనల విచ్చిన చిఱునవ్వు
మొలకల తోడుత, "మురహరభక్తి
రస్త"ని దీవించి యా పాండురంగ
హస్త నిష్ఠైక మోక్షానంద కాంక్షఁ
డపగతే తరనిందితాభిలాషుండు—
క్షపితాంతరిక శత్రు సంచయుఁ, డతుల
నామ పారాయణానంద మగ్నుండు
భూమికిఁ దొడవైన పుణ్యపూరుషుఁడు
కడువడి నడచుచు కంసలబత్తు
కడప త్రొక్కినయంత, కల కల నవ్వి
ప్రత్యూషకాల నిర్వర్తిత భూత
పత్యుపాసన బిల్వపల్లవ స్పర్శ
పరమ పవిత్రంబు - పాణితలంబు
నరమదినెత్తి యాహ్వానంబొనర్చి
జాగరారుణ కటాక్షమ్ముల యందు
సాగెడు ప్రౌఢ హాస్యమ్ముతోఁజూచి

పండరినాథ భావస్నిగ్ధభక్తి
భండార! భక్తిదర్పణభూత! నీదు
కరుణకు నవశులై కాచికొన్నాము
తరుణేందు కోటీరదర్శ నోత్సవము
లీనాటికైన సేయింతువో! లేదో!
దీనావన వ్రతాధీనంబుగాదొ-
త్వాదృశ పురుష జీవనమిదె, పోయి
మాధవునకును దాసంబు వెల్లించి
పాండురంగఁడు తాను పరదైవమేని
చండీశుమూర్తి దర్శన మిమ్మటంచు
పలుకుచుటన్న నా పలుకులయందుఁ
జిలికిన విషము చూచియు రంగనాథు
వచనంబులోని భావంబు నూహించి
యచలుఁడై-లేతనవ్వధరంబునందు
దొలుకాడ - నా కళాదుండిచ్చినట్టి
మోలనూలు గ్రహియించి పుష్కరంబులకు
ననుగులౌ కరముల నంజలిగూర్చి
"ఘనకేశ చరణసంగత వాసనాయ
ప్రమథస్వరూపాయ, భక్తిప్రదాయ
సమధిక జన్మనే - శాంతిప్రదాయ
పురుషాయ తుభ్యం నమోనమ" యంచు
పరమవినీతుఁడై పలికి - విఠలుని
దరిఁజేరి - పెదవుల దొరకొననూర్చు
విరిదమ్మికన్నుల నెఱసిన నీటఁ
బదములు గడిగి, భువన మాతయైన
మధుసూదనుని మనోమందిరమైన
యల రుక్మిణీసతి కంజలివట్టి—
చలియించు కరముల శ్యామసుందరుని

దరిఁజేరి, మొలనూలు దరియింపఁజేయ
నరుదారగా నొక్క యంగుళమంత
బిగువైన వీక్షించి - భీతుఁడై మఱల
నగధారి హిత వచనంబులు దలఁచి
ఫలియింపనేరక భావంబునందె
బలిసిన తన ప్రొక్కుబడి నూహసేపి___
యురియాడ మానస మొక్కింత తడవు
కర చరణంబులు గదలింపకుండి
పలపలనైనట్టి వదనంబునూర్పు
తలకొని వాడిన తరుణాధరంబు
గలిగి - జాల్గట్టు నఖంపచ బాష్ప
కలితార్ద్రములు - కటాక్షములతోఁ బాండు
రంగని వీక్షించి, రాజీవనేత్రి
మంగళమయి - దయామధురిమసీమ
సకలైక జనని - వైష్ణవి, యోగమాయ
యకలుష బ్రహ్మ విద్యామంత్రమూర్తి
నల రుక్మిణీసతి నార్తుఁడై చూచి
గళము చలింపంగ - నిలువెల్ల వణక
తరుణ రాజీవ సుందరములు - దుఃఖ
పరితప్త భక్త జీవాతువుల్ మోక్ష
సేవధు - లార్తుల చిత్తముల్ సొగియు
తావులు - లలిత పాదంబులు కౌగి
లించి - యన్యజ్ఞానమేది - శోకించెఁ
బంచ భూతమ్ములు ప్రతినాద మీన
తల్లి! నీకైనను దయ గల్గలేదొ!
ముల్లోకముల నేలు ముర సూదనుండు
కరుణ దప్పెనదేమి కారణంబునన
సరళభావమున విచారింపవమ్మ!

నీదయ లేకున్న నీరజనేత్రు
సాధింపవచ్చునే! జనని! భావత్క
కరుణా కటాక్ష, కింకరుఁడు విష్ణుండు
పరదేవతవు - నిన్ను భావించుటందె
పరవశమ్మయ్యె - దివ్యత్రయీమూర్తి
హరవిరించాదుల కందనియట్టి
భవదీయమతుల వైభవము, రాగాంధు
లవివేకు లర్హులే - యభినుతి సేయ
జనకుని హృదయమీ షత్కఠినంబు
జనని చిత్తమ్ము పుష్పసమాన మనుచు
జగములో పదుగురి సంభాషణములు
నగుబాటొనర్తువే! నాయెడ నేడు——
ధరణికి పుత్రకు నరయంగవచ్చు
ధరణికిమాతయెం దరపినలేదు——
నాదోష మేమని నాయందు నేడు
ఖేదంబు గల్గె సంవిన్మయీ! పాప
మలినచిత్తులకు - దుర్మానబద్ధులకు
కొలదులే యఘములు! - కోట్యర్బుదములు
నిక్కంపు దయ మాకు దిక్కుగాకున్న
నెక్కడఁ బోయెదమే! జగద్ధాత్రి!
నని యేడ్చి - తనుదానె యాత్మ శాంతించి
మనము గూడగఁదెచ్చి - మాధవుఁజూచి
దీన దీనము - క్షణాధిగత సంతోష
భానమ్ము, విస్మయభావ చుంబితము
పెదవుల యంచులు విరుచుకపోవ
నదవదయగు వెట్టిహాసంబు చేసి
తనలోపమే యున్నదనుకొని మఱల
వనజాక్షు కటి సూత్రపట్టి గ్రహించి

యలస నేత్రములతో — నధిగతాయాస
మలిన ముఖమ్ముతో - మాధవ విరహ
చింతాపరాధీన చిత్తమ్ముతో - ని
రంతర ప్రకట తీవ్రతర నిశ్వాస
శబలితాధరముతో - స్వప్నమ్ము వోలె,
నిబిడ నిదాఘ సన్నిహిత మధ్యాహ్న
భీతభీతము మందవాతమ్ము వోల్కి
నేతెంచె బత్తుని యింటి చక్కటికి—
పరమభక్తుని దీన వదనంబుపైని
గికికొన్న శోక పంకిలత - కళాదు
మొకమున - నవ్వుగా మొనసి బింబించె
నొకరి యేడుపు - మఱియొక్కరి నవ్వు
చిత్రముల్ మూనవ చిత్తప్రకృతులు!
నేత్రాంచలంబుల నిండిన కపట
వృత్తి, కోమటి మది వికలంబుసేయ
బత్తు, బొమ్మలువంచి పల్కెడులోనె
కనుల నీరూరగఁ గరములు దాచి
కనకదామముఁ జూపఁ, గంసలవాని
యానందమొక నిమిషార్ధంబులోనె
మ్లానమై నిట్టూరుపై నిలచినది;
వెక్కిరింపగఁ బోయి వెలికిలఁబడ్డ
చక్కటియై, మనస్సద్మంబునందు
బరువడి తనతోకపై నిలుచుండి
పరవళ్ళుద్రొక్కు దుర్వార మాత్సర్య;
మారయు కన్నులయందున తెల్వి
యారగాఁ జూడని యట్టులు చూచి
కళలుడి పోయి - శుష్కంబైన మొగము
పలపలనై యార బయలునుఁ బోలి—

పొడమి లేనట్లున్న పొడినవ్వు నవ్వి
కడివోయినట్టి వాక్యమ్ములతోడ
జరిగినదేమన్న, స్వర్ణదామంబు
ఖరకరనేత్రుని కటిబంధమునకు
నొక్క యంగుళమంత నిక్కంబుగాను
తక్కువైన యది సూత్రంబిదె కొమ్ము
కొలచి తెచ్చితినన్న కోపంబు పెదవి
సెలవులనే యాపి చేతిని దాచి
"పన్నగాభరణునిపై దైవమొక్క
టున్నదో! లేకున్నదో! నిర్ధరింప
వలెనను నడియాస, పండరినాథు
తలఁచిన పూనిక, - తన హృదయంబు
తరుమంగ గాంగేయదామంబు గొనుచు
మఱునాడు రమ్మని నెఱినెచ్చరించి
హరశుభాకార నిధ్యాన పీయూష
పరిణతచిత్తుఁడు, బత్తుఁడేకాగ్ర
తనుఁబూని కాంచనదామంబు చెక్కి
పనిఁబూని మరుసటి వాసరంబుననుఁ
జనుదెంచినట్టి యా సరసిజనేత్ర
ప్రణుతి శీలునకు నప్పనముసేయంగ
నాతండు గొనిపోయి - యఖిలైకగతికి
ప్రీతితోడుత సమర్పించిన మఱల
ద్వ్యంగుళీ మానంబు వదులైన నెగులు
పొంగగనేడ్చి - యేమో విచిత్రంబు
జరిగెడునంచు నిశ్చయముగాఁదెలిపి
తిరిగి కంసాలి దగ్గరి ప్రశ్రయమున
వినమితుఁడై యెల్ల వృత్తముసెప్పి
కనుదోయి బాష్పసంకలితముగాఁగ

కరములు ముకుళించి కంజాక్షభక్త
వరుఁడు, ముగ్ధమ్ముగాఁ బ్రార్థనసేసె—
పరమేశ్వరైక జీవన! యెంతచక్క-
పఱచిన మొలనూలు - పంకజాక్షునకు
సరిపోవదేమి యాశ్చర్యమో! వాని
పరమ పవిత్ర రూపమ్ము నాకంటఁ
బడిన తక్షణము, నాయెడ విస్మరించి
బుడుతనై పోదును, బుద్ధివశంబు
గాదు నాతెచ్చెడు కటిబంధమాన
మాదరణీయమైనదియొ! కాదేమొ?
వివరింపలేను, నీవే యొక్కసారి
భువనపాలకు పుణ్యమూర్తి వీక్షించి
వచ్చిన, నీచిక్కు వదలునో కాదొ!
మచ్చిత్తతాపంబు మానునో లేదొ!
దయసేయవన్న! భక్తకులకోటీర!
నయహితాచార! దీనత్రాణవివశ
ములు యథార్థంబు! మీబోంట్ల హృత్పద్మ
ములు - భవదుపకృతిమొనపి భావించి
భావత్కచరణ రజంబుగాఁబుట్టి
సేవింతునిను, పూజసేయు పుష్పంబు
గానిలఁబుట్టి - నిష్కలుష వాసనల
నేనుపచరియింతుఁ - జేతు నీజన్మ
మందె త్వచ్చరణ దాస్యంబు రమ్మన్న!
డెందంబు కలుచఁ - దీండ్రింపంగ, శిరము
నందు వజ్రాఘాతమైనట్లు మిడిసి
తుందుడుకున తోకత్రొక్కిన త్రాచు
నాకృతి చిరచిరలాడుచు, నిప్పు
దాకిన కోతివిధమ్మున నెగిరి

కనుల రుణమ్మునుఁ గ్రక్కవీక్షించి
తనువు కంపింపంగ - దంతముల్గొఱికి
కటతటమ్మంత నుత్కటముగ వణక
నిటల దేశమ్మున నెఱయఁ జెమ్మటలు—
పదతలంబున బిట్టు వసుధ ధట్టించి
యదయుఁడై పలికె నా హరభక్తుఁడపుడు
“భళిభళీ, యెంతటి భక్తుండవోయి
తెలిసెలెమ్మింక, నీ తెక్కలితనము
లావలించిన ప్రేవులన్ని యెంచెదవు
భావంబె యొకతీరు, పలుకొక్కతీరు
నంగిటబెల్లంబు నాత్మలో విషము
దొంగ! నావ్రతమును దోచవచ్చితివి—
కులశీలుఁడై వచ్చి గొఱ్ఱెవై కూపి
చిలువవై - పడినన్ను చెఱుపనెంచితివా!
చాలుచాలింక లజ్జావంధ్య వృత్తి
కూళ! నిన్గనుఁగొన్న ఘోరపాపంబు—
వీరశైవాచారవిధి దీక్షితుండు
తారకా కమనసుందర భిన్నదర్శ
నైనంబు భరియించునని యెంచినావా?
దీనునివలె తరి తీపులుపల్కి
యెంతకు దిగితివోయీ! మొనగాడ!
వంతుకు వచ్చితివా! మెచ్చవచ్చు
కదలురా! యింక నాగడప ద్రొక్కకుము
విధుతలఁ గూల్చిన విశ్వేశు భక్త
వరునితో తగునని పరిహాసమాడఁ
దరమౌనె! నీకు వృధా ప్రయత్నుఁడ”
యనుచు, గద్దించి పొమ్మనుచునుఁ దరుమఁ
దనయభాగ్యమునకుఁ దామదిఁగనలి

కాళ్ళీడ్చు కొంచు రంగని గుడిఁజేరి
తల్లీన వృత్తి పాదంబులు పెనిచి
పడియుఁడె, భక్తుని భావంబుదెలిపి
కడతేర్చు ప్రభువు – రంగఁడు దక్కఁయున్నె!
ఖరకరుండంతట గగనమధ్యమున
ఖరకరంబులు విచ్చి కనకనవెలిఁగె;
పండరినాథ దేవస్థాన శృంగ
మండితమ్ములు, హేమమయములు - కలశ
ములు - సూర్యకరజాలములఁదోగి క్రొత్త
కళల గన్నవి - దిదృక్షాసక్త భక్త
జనముల సందడి శాంతించుతోనె
కనక ఘంటల కలకల నినాదములు
నిలచిన, నర్చక నికరంబు సుంత
యలత గూరిన శ్రాంతి నందంగఁగోరె;
దిక్కామినీ మణుల్దిగ్గురుమనఁగ
చక్కఁగ మధ్యాహ్న శంఖంబుమ్రోసె;
కనులలో బాష్పముల్ కాలువగట్ట
మనమున దుఃఖమున్మత్తమై రేగఁ
దనమ్రొక్కుబడి వితథంబయ్యెననుచుఁ
బనవియేడ్చుటెగాని భావంబునందుఁ
దలఁపడతండు మధ్యాహ్నమయ్యెనని
తలపఁడు తనకూన తరళితాపాంగ
ములతోడ నెదురు తెన్నులు సూచుననుచు
తలఁపడు దుఃఖమేతము ద్రొక్కుచున్న
మనముతోఁ బావిత్ర్య మధురిమసీమ
తన బహిఃప్రాణంబు తరుణి! స్వకీయ
భుక్తశేషోత్సుకబుద్ధియై, మోద
రిక్తదృష్టులను, నిరీక్షించుననుచు;

నెంతభావోద్రేక, మెంతజితాత్మ,
యెంతటి సన్నిష్ఠ, యెవ్వరికంటె
కడిది భక్తుండు, జగంబులయందుఁ;
బడఁతి - దైవంబైన భర్తరాకున్న
కడునొచ్చి జాగేల గల్గెనోయనుచు
నొడలెల్లనుద్వేగ ముప్పతిల్లంగఁ—
దలఁచివందు డునది, తనయునిఁ, దండ్రి
తలఁచి యేడ్చెడువాని, తతబాష్పపూర
లులితనేత్రుని, ధరాలులిత శరీరు
కలిత ధూళీపాళి కబళితాలకుని
యూరార్పవెర వేది - యువిద - నితంబ
భారకాంచీ కలక్వణనమ్ము చెలఁగ
నలసాలసములు - రమ్యమ్ములైన
లలితముల్ పాదముద్రలు, నంచలముల
యందె యడంగు ప్రేమామృతసార
తుందిలములు, హవిర్ధూమ పవిత్ర
ములు, మేచక కటాక్షములు; నిత్యతృప్తి
దులకించు చిఱునవ్వు - దోపంగవచ్చి
లక్షించె నాత్మవల్లభు, భక్తిమయుని—
లక్షించి, బాష్పమాలా పరిక్లిన్న
గళ - భర్తృభావ విఘ్నవిశంకి చిత్త—
పలుకనేరక బొమ్మపగిది నిల్చుండె;
జనకుని గన్నంతతనయుండు, కనుల!
బెనగొనఁనాసలై, ప్రీతి హస్తములు
దాచి, యేడ్చిన, పరంధాముని వరము
పూచిన కొడవైన, పుత్రుని, హృదయ
మున కత్తుకొని, చిన్నిముంగురుల్దడవి
వనజనాభునివైపుఁ బసిగందువైపుఁ

బలుమారు చూచి తీవ్రంబైన దుఃఖ
జలధి కట్టలు దూసి, సంభ్రమింపంగఁ
గావంగలేక గద్గద కంఠుఁడగుచు
భావంబు వివరించి పలుకంగలేక
నిలువె బాష్పములుగా నిలచినవాని
తలము గానట్టి చిత్తక్లేశమునకు
లోగి యంగమ్ములు లోలముల్గాఁగఁ
దూగెడు వాని, నిర్ధూత కల్మషునిఁ
బతిఁజూచి, ధీరతాస్పద చిత్తవృత్తి
యతివ, కన్నులనె బాష్పంబువులప్ప
శించి, శిరంబు పంకించి - యోచించి
కించిద్విలాస వక్రీకృతమైన
వదనంబులో, లేత పరియాచకంబు
గదియంగఁ బలికె "నెక్కడి చేతలివ్వి
మధుసూదనునకు మీ మధ్య నిదేన
యొదిగిన చెలిమి! సర్వోత్తముచిత్త
గతినింతయసదుగా గ్రహియించినారొ!
యతనికి భక్తుని యాపదఁబాపు
నంతకుఁ, గన్నుల కంటునే నిద్ర!
సుంత! వాఁడే దీర్పఁజూచును మ్రొక్క
బడి! మనకేటికీవంత! మానవున
కొడఁగూడునెల్ల దైవోపహతమగుచుఁ
బోయినఁ బోవును - పురుషుఁడు రెంటఁ
బాయంగవలయు దౌర్బల్యమ్ము సుండు
రండు పోవుదము బిడ్డండు రోషిల్లె
పాండురంగఁడు మనభక్తి వాగురము
నందుండి యేరీతి యవతలఁ బడునో!
కందముగా" కని, కంజాయతాక్షి

ముసిముసి నగవులు మొగమున నుబికి
పసిలేని నాథు వక్షమ్మునఁ జింది
యమృత సేచనము సేయఁగ - లేవనెత్తి
కొమరుని గ్రహియించి, కుటిలకటాక్ష
చారు పాతంబుల - శ్యామసుందరుని
పేరెదఁ గ్రుచ్చి—యీప్సితములు వాక్య
భంగుల - భర్తృ భావము పల్లవింప
నింగిత మెఱిఁగి భాషించుచు గృహము
చేరెఁ- దోడుత నస్త శిఖరంబు సేరె
నీరేజ మిత్త్రుండు - నెగడెను మింట
సంజకెంజాయలు - చండికారమణ
మంజుల తాండవ మహావిసృమరము
లైన కటాక్ష విన్యాసములొప్పలి—
కానసైనది చంద్రకళ, తూర్పునందు
భయద భూతేశ్వర పాదవిక్షేప
రయగళితమ్ము - నూర్ధ్వప్రేంఖమాణ—
మర్ధ దృశ్యము - జిల్గుటందియఁబోలి;
స్వర్ధునీ ధరగళ శ్యామలదీప్తి
పుంజముల్ దిశలలోఁ బొలపినవనఁగఁ
బుంజుకొన్నవి - లేతమొలక చీకటులు
గజవైరి కనకశృంఖలకాంతి దిక్కు-
లఁజెదిరి వచ్చియల్లనఁ జేరికొనఁగ
వెలిఁగెనో యనదీప కళికలు చెలఁగె
నలసైధమానకాంతులు - వరవర్ణి
నీకందసమములు - నిలయంబులందు
ప్రాకట భక్తి సంభ్రమ పుల్లచిత్తుఁ
డవదాత భస్మ కాంత్యాలింగి తాంగుఁ
డవగత శైవసిద్ధాంత రహస్యుఁ

డపగతేతర దర్శనాకాంక్షి - శైవ
జపతంత్ర నిష్ణాత, చండీశభక్త
మహేశ్వరార్చా సమధిగతమహిముఁ
డీహా వివర్జితు, డింద్రియజేత
యలికనేత్రునకు - సాయంకాలపూజ
సలిపి - తద్దర్శ నాశాసముచ్చ్వాన
ములు - రెండు కన్నుల వెలలి బాష్పములు
తలముగాకెగఁదట్టి తనువెల్లఁదడుపఁ—
గరములు చేర్చి, వికస్వర పులక
భరితమ్ము వార్షుకాభ్ర పరాహతమ్ము
హరిత సుందరమైన యవనీ తలమ్ము
సరియగు - దేహమీషత్కంపితముగ—
నెలుఁగు వణంకగ - నెదచలింపంగ
పలుకు రాపడగ - నీవగిది వచించె
జయతాండవోద్దండ - జయధృతరుండ!
జయమహాకాల! భీషణరమ్యలీల!
జయనిటాలాక్ష! సంశాపిత దక్ష!
జయపార్వతీనాథ! సకలైకనేత!
త్వజ్జటాజూట పర్వతము - మాధుర్య
సజ్జిత చంద్రభాస్వత్కైశ్యభూష!
భవదీయ చారుచాపల వామభాగ
మవనమితాన్యరసాస్వాద మధురి
మమ్మ! సురాసుర మంగళ ఫలము
కమ్మని కడగంటఁ గ్రాలెడు చూపు
పులకాచిత స్తన కలశ సంరంభ
మిళనస్పృహాసమున్మేషసంవలన
పరము - దక్షిణ తనూభాగంబు, హాస
గరిమ దయారస కల్లోల సాంద్ర

మనవరతమ్ము - తీయని కలలందు
కనుపించు గాత, నా కన్నులయందె
నిలుచుగావుత - మల్లె నీడలువోలి
ప్రళయకాలమున సర్వము గ్రసియించి
యేకుఁడై యుండి - యనేక ధాత్వంబుఁ
జేకొనునప్డు - నీ చిత్తమ్మునుండి
వెలిగె నీసర్వంబు - విష్ణుండు విధుఁడు—
ఘలుఘల్లుమని పాదకటకముల్ మ్రోయఁ
బలికె వేదమ్ములు బహుళ శాస్త్రములు
ఫలియించె సర్వదేవతల నోములును
నీకన్నపురు మహత్వాకల్ప మూర్తి
నీకన్న కారుణ్య నిచితనీరదము
నీకన్న దుష్ట సన్నిహిత మృత్యువును
నీకన్న గతియెందు నిక్కంబు లేదు
నీకన్న కానుపు నిబిడశోకంబు
పోకార్చి, కన్నులముందు నిల్చుండి
పలికింపవేమిరా! పార్వతీరమణ!
చిలికింపరానవ్వు చిఱుత వెన్నెలలు
ఎంతని నిన్నుఁ బ్రార్థింతురా! తండ్రి
యెంతని తలపోసి యేడ్తురా! జియ్య!
యీ వియోగంబు సహింపగాలేను
దావాగ్ని కన్ననుద్భటము - నీ వొక్క-
పరి నన్నుఁజూచి ప్రపంచమ్మునందె
పురుగుగాఁ బుట్టింపుము, కలంకి లేదు
కాని నీ యమృత వీక్షణములేకున్న
నీ నవ ఖండ ధాత్రీశ్వర పదవి
యబ్బినలేదు నా కావంత సుఖము
దబ్బరగాదు! సత్యంబు నీతోడు

నీవు వచ్చెదునాస నిలిచినానోయి!
నీ వపుర్వీక్షకై నిట్టుపాసమున
కనలుచునున్నవీ కనులు, నీతోడఁ
దనలోని కోటిచింతలు చెప్పికొనగఁ
దహదహలాడుఁ జిత్తమ్ము! త్వత్పాద
గ్రహణంబునకు నాదు కరములుమిడుకు
నెన్నడు నీవు వీక్షింతువో! కాని
సన్నతాస్యంబు, నీ చరణ నీరేజ
ధూళికై వగఁగొన్నదో! లింగమూర్తి
చాలుమేలము మనఁజాలనో స్వామి!
యని పల్కి తన వసనాంచలమ్మునను
గనులొత్తుకొని నీలకంధరభక్తి
భరభుగ్న చిత్త - తత్ప్రత్న ప్రకాశ
పరిణాహితారకా పరితఃప్రపూర్ణ
నయనావకాశ! వినయనయదీప్తి
మయ! తనభాగ్యంబు మానినిఁజూచి
సుదతి! గంగాంబు సంశోభితజూటు
నెదలోన నిల్పి పూజించితే యనినఁ
జిఱునవ్వు మొగముపై చిత్తడి గురియఁ
బరిపూర్ణరేఖ నీశ్వరుఁడు మద్భావ
సదనంబు, మగఁడుగా - సాక్షాత్కరించి
ముదముతో నేనిచ్చు పూజలనంది
కొనుచున్న వాఁడింక కొదువనాకేమి?
యనె! నామె పతిభక్తియది యట్టిదౌనా!!
హర నివేదితమైన యన్నంబు గుడిచి
పరుపుపై తన మేను వ్రాల్చినయంత
పంచాక్షరీజప ప్రణవ చిత్తమ్ము
వంచించి నిద్దురవట్టె - నానాడు

కలయది, కలలోన కాలగళుండు
తలవని తలఁపుగా దర్శనంబిచ్చి
యోయి! మద్భక్తి భావోద్రిక్త హృదయ!
నీయుపాసనము సన్నిహితఫలమ్ము
పండరినాథుని భవ్యరూపమ్ము
పండించు నీ కోర్కె - వాఁడుగా నేను
నేనుగా వాఁడును నిఖిల లోకములు
పూని రక్షింతుము - మంతుము సుమ్ము
తరలు ముగుడికిఁ - ప్రాంతఃకాలమందు
పరమ భక్తుండైన బచ్చుని గుఱిచి
పరుషమ్ములాడితి! ప్రమథులకన్న
పరతత్త్వమెఱిఁగిన బసవనికన్న
నగరాజ సుతకన్న - నా కన్నవాఁడు
జగదభివంద్యుఁడు—చక్రి పూజకుల
నిటు నటుఁ బలుకఁ జన్నే"! యంచుఁ బలికి
నటులైన, నల్లన నక్షులు విప్పి
వివిధ భావమ్ము లుద్వేలమ్ములగుచుఁ
గవగూడి పెనగ వికారంబు సెంది
యోచించి, యోచించి, యోరిమికంది
వాచాతిగంబైన భవమూర్తి చెన్ను
తలపోసి, తలపోసి, తద్దయునలరి
పలికిన పలుకుల భావంబు దలఁచి
కలదని లేదని - కడఁగి శంకించి
కలయని నిజమని కళవళమంది
జవరాల మేల్కొల్పి - స్వప్న వృత్తంబు
వివరింపనెమ్మోము - విరిసెనామెకును—
కనిపించినాడటే! ఫణిభూషణుండు
మనపూజ నేటికి మదికెక్కెనేమొ

పాండురంగని కొక్కపరి సేవదీర్చి
రండు చూతము - నిశారమణ కోటీరు
నానతి గద!" యన్న నర్థోక్తులందె
ప్రాణేశు కుడికంటఁ బరిఢవిల్లినది
లలిత కిసాల కల్పంబైన జొత్తు;
పులకరించినది సంపూర్ణశరీర
మలివేణికతని భయంబుచేనౌనొ!!
మలయమారుత సంగమముననో కాక;
విరిసెను చీకటుల్ - విరియఁగలేదు
పరిపూర్ణములుగ - దిగ్భాగంబులందు
కంసలవాని హృత్కంజాతమందు
నంశమపాస్తంబు - నంశానపాస్త
మైనట్టి యజ్ఞానమట్లు, చంద్రుడు
దీనుఁడైనాడు, సతీనాథుబోధ
గూడ కంసాలి చేకొనఁడేమొయంచు
నీడంబులను మెడల్నిక్కించి కూసె
పులుగుల దళము, లభూతపూర్వంబు
నలరింపనొక్క బ్రహ్మానంద భరము
చరణాయుధమ్ములు చెచ్చెర్ని నాదముల
సరమోత్కతో, బరాబరులు సేసినవి
విశ్వరక్షకుడైన విఠలేశునకు;
శశ్వత్ప్రమోద బాష్పస్విన్నమైన
హారి గద్గద మంద్రధీరమ్మునైన
యూరుజభక్తులోకోత్తర పాండు
రంగ గీత స్తుతి, ప్రత్యూషపవన
సంగ దీర్ఘీకృత సంచారమగుచు
నెటినెల్లవారల నిదురవేసినది;
పరమదైవంబైన పండరి నాథు

గుడిగోపురంబులఁ గొమరారుచున్న
పడగల కమరిన పసిఁడిమెఱుంగు
చిఱుగంట లల్లన చెలఁగి నవ్వినవి—
కరుణా నిబద్ధ శంకరహిత వచన
పరిబాధ్యమాన హృత్పద్ముండు, గూఢ
తరదుర్మదుఁడు, శోక దళితుఁ డాబత్తు
తలరి, కింకర్తవ్యతా మూఢుఁ డగుచు
మలహరుఁ డైనట్టి మల్లికార్జునిఁ
బూజించి, తత్పాదముల నీరుగ్రోలి
యోజననేకథా యోజించికొనుచు
తడఁబడు పాదముద్రలతోడ గర్వ
ముడివోవుదాన, దైన్యోద్విగ్నమైన
మనముతో నరచచ్చి, మ్లాన బాష్పములు
కొనగోట మీటుచుఁ - గోమటియింట
నడుగుపెట్టినయంత, నాతండు లేచి
యడుగుల కెఱగి సాష్టాంగమ్ముగాఁగ
యెంత యదృష్టమో! యీ నాడు హరుఁడ
నంతాను కంపగృహమ్ముకే వచ్చి
దరిసెన మొసఁగెఁ, దథ్యముగ నాభవము
తరియించె నంచు పాదమ్ములు గడిగి
జలములు గ్రహియించి సతియునుఁదాను
కులవర్ధనుండగు కొమరుతో జోత
వెట్టించి, మొగమెల్ల వినయంబుదొలుక
కట్టెదుటను నిల్చి కరములు మొగిచి
యానతియేమన్న! "నా విత్తలేశ
కానిపింపుము నేనె గ్రహియింతుఁగొలత
మొలనూలుకని" వ్యథాముషితుఁడై పలుకఁ—
బలుకును దానిలో భావంబుగూడ

తెలిపి, తెలియనట్లు తిన్నగా నవ్వి
కలవికస్వరములు - కడగంటిచూపు
కోపులు పరిఁజుట్టు కొనునట్లు - దారిఁ
జూపిన - శైవుండు - శూన్యమనస్కుఁ
డై వెనువెంటనే యభిగమియించెఁ——
దీవెలు గొనుచున్న దృక్కులు, నిటల
పరిరంస్వమాణముల్ - పల్లవసామ్య
భరితోష్ఠ రుక్పరిష్వక్తముల్ చూర్ణ
కుంతలమ్ములు మీరకోమటి బిడ్డఁ
డంతఁ - జంపకదామ హస్తముల్సాచి
తరుణ, మనోహరి, చరణనీరేజ
పరటాయితమ్ములు - పాదాంగదములు
స్వనియింప వెనువెంటఁబడిన, నిల్లాలు
తన పసిబిడ్డ రోదనమును - హృదయ
కుతుకంబు గెడఁగూడికొనుచుఁ బ్రేరేప
పతివెంటనే నీడవలె నడచినది;
యూరి వారెల్లరు నుబ్బుకపోయి
చేరి యీ వార్తయే చెప్పికొన్నారు
సరసిజనేత్రి, కంసలవాని భార్య
తరుణార్క నేత్రుని దరిసించువేడ్క
కలపికొన్నది ప్రాణకాంతుని తోడ;
వలమానసైక భావశ్రాంతుఁడైన
వీరశైవుఁడు కనుల్విప్పనేలేదు
హార్యక్షరమ్ము, పంచాక్షరీజపము
విడువనేలేదు, నావెలఁది ప్రాణేశు
నడుగుల మఱచిన యదియునులేదు
రంగనిధ్యాన సారఘమత్తుఁడతఁడు
త్వగత్పతంగాయిత మదనకాయ

సారజ్ఞ విషమాక్ష చటచటద్వహ్ని
పూర, రుద్రధ్యాన భూషితుండితఁడు
విశదభస్మ ప్రభావేష్టితుఁడతఁడు
కృశతను పుండ్రాంక కీర్ణుండితండు
తులసికాదామ గంధిల కంఠుఁడతఁడు
లలిత రుద్రాక్షమాలా రమ్యుఁడితఁడు
హరిహరాభిన్నత్వము మరినయ్యె
హరిహర భక్తులకైక్య మబ్బినది
వీక్షింపరో! మరుద్వీథులనుండి
యక్షుల మోదబాష్పాళితో సురలు!
వారేమి? రంగఁడే పరవశుఁడగుచు
కారుణ్యమునుకోటి కన్నుల తోడఁ
గురియించినాడు - దిక్కోమలుల్ కనుల
విరియించి చూచిరీ వింతదృశ్యమ్ము;——
కిరణ దళమ్ములు క్రిక్కిరియించి
కరమర్థిఁ దనలోనె కలకల విరిసి
తరుణత్రయీమూర్తి తానె కెందమ్మి
విరియయి, పూజింపవేచియున్నాడు;——
తలల నలార్చి ముద్రతి వనస్పతులు
చిలికించినవి రస చిక్కణ మధువు;
లానంద వికసితమైనట్టి వేళ
నానంద నందను నాలయమందు
కనక ఘంటికలు మంగళము పాడినవి
మనములు సమ్మోద మధురమ్ముగాఁగ;
దరిసినారిర్వురు తటిదంబరుగుడి
పరమేశ్వరైకాంతభక్తునిఁ జూచి
నవ్వుకొన్నాఁడు లోననె విఠలుండు
నవ్వులే పువ్వులైనవి, విగ్రహమున

పండరినాథుని భద్రరూపంబు
దండఁ జేరిన యంతతనువు విస్తృతము
బచ్చున, కీశాన భక్తుని మేన
చిచ్చునాల్కలు దాచి చెరలాడినదియు
శ్రీ మనోహరు భక్తు చిత్తమ్మునందు
కామధేనువు పాలుకరుడు గట్టినవి;
పచ్చవిల్తునిదాయ భక్తునెడంద
పచ్చినెత్తురు లొల్కి పాయవిచ్చినవి;
నందనందన భావనాబద్ధమతిని
నందనారామంబు నివ్వెపోయినది;
భోగిభూషణ పాదపూజకు హృదిని
నాగులు తలలెత్తి నాట్యమాడినవి—
కోమటి కన్నుల క్రోవుల నిండ
నామోద బాష్పంబు లావర్చించినవి
కంసాలి మీలితాక్షమ్ములనుండి
స్రంసమాణమ్ము పశ్చాత్తాపజలము
కమలాక్షభక్తశేఖరుఁ దూరుజునకు
ప్రమదమ్ముతో మేను పరవశించినది
గౌరీధవార్చనై కరతికి శోక
భారంబుచే మేను పల్లటిల్లినది;
వలపుచే విఠ్ఠలు పరమభక్తునకు
పులకలు నిలువెల్ల పూచి పొంగినవి;
కలితశుగ్భురితాప ఘనకళాదునకు
పులకలు కంటకంబులుగ నిల్చినవి;
కంఠమ్ముమోద విక్లబము కోమటికి;
కంఠమ్ముదైన విక్లబము బత్తునకు;
కలితోష్ఠలిఖువురు - చారుకపోల
తలప్రస్రవత్స్వేదతతి - రూషితులును

నిశ్వాస మాలికా నిభృతులిఱ్వురును
నశ్వర భవవాసనావి యుక్తులును
పరమ భక్త్యుద్రేకభరితులిఱ్వురును
పరమాత్మ వీక్షణ పరమానసులును
గమనించె గోమటి కన్నులు విచ్చి
కమలనాభుని దివ్యరమణీయ మూర్తి
దోచినధనములు దొరికినయట్లు
వాచాతిగము వైభవము దక్కినట్లు
తన భాగ్యమెల్ల ముందఱ నిల్చినట్లు
తన కలలెల్ల తథ్యములైన యట్లు
కటితట విన్యస్త కరములతోడ
నిటుకపై నిలుచున్న యిందిరా రమణ
చరణముల్ గమిచి, విస్రబ్ధగాత్రముల
ధరనొరగిన తన ధవుని వీక్షించి
కనులలో, గన్నీరు గ్రక్కుచు జాయ
తనయుని డించి - యాతప్తచిత్తమున
నలరుక్మిణీ ప్రతి యడుగులదోయి
చిలికించినది శోకచిక్కణాశ్రువులు
బాలుండు - ముగ్ధభావంబుతో నింద్ర
నీలకటాక్షముల్ నించినవాఁడు
లాలితాకారుఁడౌ లక్ష్మీశు మేన;
ప్రాలేయ కన్యకాప్రాణేశచరణ
పరిపూజనైక జీవనుఁడైన బత్తు
తెరువడు కనులు, హృద్దేశంబునందు
పెనగొని యున్నవి - వివిధభావములు
వనితా శిరోమణి వానియిల్లాలు
సేవించుచున్నది శ్రీ నికేతునుని
భావభవాంతకు భవ్యరూపమ్ము

చిన్నెలేమైనఁ దోచిన వేమొ! యామె
కెన్నజ్ఞానులకేమి! యీ విభేదములు?
అబ్బురవోయినా రర్చకులెల్ల
గిబ్బ తత్తడి బత్తు - కృపణదీక్షలకు
నది నడివేళ, దేవాలయమందు
గదిపికొన్నది శాంతి - ఘంటికాధ్వనులు
నిలచెను - భక్తులు నిలయాభిముఖ్య
చలితులు - కతిపయ జనము లాశ్చర్య
కలితులందే దిదృక్షా కౌతుకమున
నిలచిరి, వారిలోపల నొక్కఁడేని
విగత సంస్కారుండు వెదకిన లేఁడు;
ఖగకేతనైక కాంక్షాలులితుండు
పరమార్థ తత్త్వ దివ్యస్వరూపంబు
పరమభక్తుఁడు కొంతవడికినిఁ దెలిసి
కనులు విప్పని వాని కఠిన పాషాణ
మునుఁబోలు కంసాలి మొనసి వీక్షించి
కరుణాశ్రువులు జడికట్టి! నో యన్న!
యరయని దేమి? దివ్యానంద భూమ
మైన రంగని చెలువదెకటీరంబు
మానుగాఁగొనుము - ప్రమాణమంచనినఁ
గరము దాపగఁ బోయి, కనులిప్పియున్న
పరవశత్వమునఁ జాపల్యమ్ముగలిఁగి
తెరతునో యనెడు సందియమున మునిఁగి
పరమశైవుండు సంవ్యానమ్ము తోడఁ
గనులు గట్టికొని, దగ్గరి కటీరంబు
మునివ్రేళ్ళఁ బుడికిన - భుజగోపవీత
ఫణము కన్పింప, దిగ్భ్రాంతుఁడై వాఁడు
తనుదానె నమ్మకఁ, దరుణాబ్జ నేత్రు

నాపాద చూడంబు నంటిన - సర్ప
నూపురంబును - గజనూతన కృత్తి
వ్యత్యస్త పాద విన్యాసంబు, సారి
తాత్యంత పీన భుజార్గళ యుగము
గళవలత్కీకస కమనీయహార
ములు, కపాల తరళమును, తిగకన్ను
జటిల జటాజూట జాహ్నవీ పూత
తటవికసిత చంద్రతరుణ సుమమ్ము
భుజగమండల నైక పూత్కారకోష్ణ
రజతగండస్థల భ్రాజిష్ణుమూర్తి;
దోచిన, నాశ్చర్య ధూత వివేకుఁ
డై చిత్రమట్టుల పాస్తచేష్టుండు
నిలుచుండి, మదిలోన పలుపలు గతులఁ
దలపోసి, చంద్రావతంసుడే యనెడు
భావంబు తిరపడి, బహుళ విషాద
మావేశితము గాఁగ "నయ్యయో యిన్ని
దినములు - తథ్యంబు తెలియనిదాన
వినతసురాసుర విమలకోటీర
మణిగణ చుంబిత మహనీయ పాదు
భణితి మండను నిన్నుఁ బండరినాథుఁ
డని యెంచి, యపరాధుఁడైనాను తండ్రి!
నను దయ మన్నించి నాయఘంబులను
క్షమియింప వలయు నిష్కారణ బంధు!
భ్రమిత చిత్తుఁడనంచు బాష్పజుష్టంబు
లక్షులు విప్పిన, నా క్షణంబుననె
పక్షివాహనుఁడైన పాండురంగండు
సమచరణములతో, శారద వికచ
కమలముఖమ్ముతోఁ, గటితటన్యస్త

కరములతోఁ, పీతకౌశేయ కాంతి
హరిత సుందర లలితాంగంబుతోడ
కరుణా వికస్వర గండ ప్రదేశ
పరిణత తాటంక భాసురకాంతి
చయముతో, సాధురక్షాయత్న దీక్ష
శయధృత మధుర వంశమ్ముతో-మృదుల
చరణ తులాకోటి సామబుగ్గాన
భరముతోఁ, దదను రవవ్యగ్రయజుర
ధర్వణ హస్తాంగదంబుల; లలిత
సర్వమనోహారి సరసహాసమున
దరిసెన మొసఁగినఁ దల్లడమొంది
శిరమునల్లార్చి - యిస్సీయని రోసి
తనువు తీవ్రద్వేష దళితమై తూఁగఁ
గనులట్టె మూయుచుఁ గరములు దాచి
పుడికిన, మఱి, యదే, భుజగభూషణము
నొడలిపై గజకృత్తి-నిడుంద ముక్కన్ను
వలమాన వికట కపాలహారమ్ము
తలపైని రేఱేఁడు, తథ్యమ్ముగాఁగ
నచ్చు గ్రుద్దిన యట్టులమరినఁ జూచి
మెచ్చి - యక్షుల విప్ప - మృదుల మయూర
పింఛ గుచ్ఛాపీడ పీనకైశ్యుండు
వంచక దూరవై భవుఁడు, గోపీ దృ
గుత్సవ మంజు గుంజోద్భాసితుండు
వత్సవత్సలుఁడు - దివ్యనిగమశాఖి
శాఖాగ్ర పల్లవ చరణయుగుండు
సౌఖశాయనిక విష్వపరిష్వక్త
సనకాదికేంద్రియ చషకపీయూష
కనదుదారస్మిత కలితుండు, విధృత

నవతులశీ వాసనా ముషితుండు——
శివమనో మందార జీవపుష్పమ్ము
పాండురంగఁడు దయాభరితుఁడై దోప
రెండు కన్నులుమూసి, రేగినగాసి
'హరహర' యని మూఢమైనట్టి చిత్త
మురియాడఁ - గన్నుల నూరు బాష్పముల
నిలచినఁ గంసాలి, నిబిడ నిశ్వాస
చలితాధరోష్ఠు, వేష్టనైక భావ
పరిఘూర్ణమాన హృత్పద్మునిఁ జూచి
మురహర భక్తుండు మొనసి ప్రశ్నించు
నంత, నజ్ఞానాంధ కాసురహంత
సంతత భక్తరక్షా బద్ధ బుద్ధి
ప్రత్యక్ష దైవమ్ము పండరి నాథుఁ
డత్యంత మధుర వాక్యముల నీరీతి
పలికెను, భూతేశ భక్తుని గుఱిచి
"కలిమలా విషయ సంకల్ప! గిరీశ
చరణాక్రమితము - యుష్మద్ధృదయంబు
నిరవకాశమొ! కాక, నిలువంగనైన
నావంత యవకాశమబ్బునో! మాకు
రావచ్చునో! యుడు రాజధరుండు
కోపగాడట! నన్ను గూర్చి నీసేవ
నోపఁడో! గ్రహియింప, నూకొట్టవేమి?"
యని తిన్నగా మేల మాడినఁ——గోల
గొని ప్రేసినటులైన, ఘోరతాపమున
నదరు శరీరంబు, నల్లాడు నెలుఁగు
నదవదయైనట్టి యంగముల్గలిగి
కను దమ్ములను నిండి కవియుచీకటులు
మనము చీకటియు ముమ్మరముగఁ బెనఁగ

నిలిచెఁ గళాదుండు - నిండెను పులక
లల పంకజాక్ష సేవాయత్త మతికి
బచ్చున, కానంద పరవశత్వమున
తచ్చపలాక్షి - ముగ్ధంబైన హరిణి
వడువున సర్వేశుఁ పండరినాథు
నెడఁద నల్లని చూపు నింపివేసినది
మఱిపల్కె - నాశ్రిత మాయానిరోధ
పరిపూర్ణ హృదయుఁడౌ పాండురంగండు
పరమార్థ భావనా పంధ్యులు, వాద
పరిణత బుద్ధులు, వక్రప్రవృత్తు
లత్యల్ప సంస్కారు లజ్ఞాన చక్ర
వాత్యా విధూత తత్త్వజ్ఞానులైన
కుటిలులు గల్పించు కొరమాలినట్టి
నటనలు గాక, యున్నదె మాకు మాకు
భేదలేశంబు, నోభేల! నీవేల
వాదంబులకుఁ జిక్కి వసమఱిచెదెదు!!
హరిగిరీశులు భిన్నులనువారు - వారి
వెరవుమాలిన పల్కు వినువారు - ఘోర
నరక కూపంబున నవయకుండుదురె?
హరుఁడు నాయాత్మ, పశ్యత్ఫాలు మదిని
దివిరి వెల్గొందెడు దివ్వెను నేను
దివస కరుండ ద్వితీయుఁడై యున్న
వివిధ శరీరుఁడై వెలిఁగెడు భంగి
నవని మర్త్యులకు శ్రేయస్కాముఁ డగుచు
నానా విధంబుల నామరూపములఁ
బూని వర్తింతును నేన! యీజ్ఞాన
మలవడనట్టి వారందంగలేరు
కలిగృహీతులు - మోక్షకమనీయ పదవి

నా శివాంశమున కనన్యమౌ భక్తి
సేసినదాన, నీ సేవల కలరి
నిన్నుద్ధరించు పూనిక మదిఁబూని
పన్నితి నింత యుపాయమ్ము సుమ్ము;
అత్రి మహాముని - యనఘుండు తొల్లి
పుత్రార్థియై తపంబునఁ జరియించి
నన్ను పాసించిన నన్నున మేము
పన్నుగ మువ్వురు ప్రత్యక్షమైన
నచ్చెఱు వడుచు, నేనాది విష్ణువున
కిచ్చగించిన, నెట్టులిపు డొక్కసారె
మువ్వురు ననుకంపఁ బూని తిరనఁగ
నవ్వి, యో సువ్రత! నామ రూపములు
భిన్న రూపములైన బేలు వోయితివి
కన్నులు గాక, లోకన్నులు దెఱచి
కనుమోయి! సత్యంబు గందువుగాని
గణుతింప నొక్కటే గలదు దైవంబు
నిరుపాధికంబది, నిర్వికల్పంబు
నిరుపమానంబు - వినిర్గతాద్యంత
సీమ - లోకావనశీలమై - భిన్న
నామరూపంబుల - నైకప్రకార
ములవెల్గు - కూటస్థ పురుషు నర్చింప
కలదు నందఱుఁ గొల్వఁగలుగు ఫలమ్ము
వాసుదేవ స్వరూపమునకు భక్తి
చేసితిఁగాదో! నీ చేసిన తపము
వరుస మువ్వుర కనువర్తించె సుమ్ము
వరమౌని! మాయంశభవుల నీకుఁ
దోడ - దత్తాత్రేయ దుర్వాస చంద్రు
లీడిత మతులు జన్మింతురు సత్య

మునివర మొసఁగితి, నాయుదంతంబు
వినలేదా! నీ వన్న, వీరశైవునకు
మనమువిచ్చినది రమాపతి కరుణ
తనువెల్లఁ బులక సంతానమ్ము విరిసె;
పాండురంగనిఁ గొల్చు పరమ భక్తునకు
పండు వెన్నెలకాంతి - వాని యిల్లాలు
పుణ్యజీవిత మంచుఁ బొంగిపోయినది
గణ్యవిచార - యాకంసాలి భార్య
శ్రవణముల్ విచ్చి యాశ్చర్య సంతోష
వివశయై విన్నది - విఠలు పలుకు
దిక్కులన్నిట నొక్క దివ్యసందేశ
మక్కజంబు గనిండి నొక్కిపల్కినది;
యలసాలసంబైన యమృత మారుతము
జిలిబిలి యనువదించినది భాషణము;
గగన మార్గమునుండి కదుపులై సురలు
నగుమొగంబులఁ జూచినారు, ధరిత్రి;
ప్రముదితమతి, చంద్రభాగాస్రవంతి
గమనమ్ములో వింతకళలు చిమ్మినది;
మల్లికార్జున శిరోమాల్యమౌ - గంగ
యుల్లాసమున సుధనొలుకఁబోసినది;
గోరూప ధారిణి క్షోణీసవిత్రి
శ్రీ రమ్యములు, చనుల్చేపి పిండినది
పుల్లతంత్రీస్వన భూప్రజాహృదయ
వల్లకు లొక్కచే భంగి - మ్రోగినవి
తపముచే బ్రహ్మంబు దర్శింపుమనెడు
నుపనిషత్తుల యమృతోపమ వాక్కు——
వీరశైవుని పుణ్య వీథి - విచ్చినది
వీరశైవుని కంటె వెలుఁగు విచ్చినది

నవ్వుచున్నాఁడు - నటరాజు - వెన్న
పువ్వుల యదలోని, బొందమ్మియందు
నవ్వుచున్నాడు నందనందనుఁడు
మువ్వన్నె పులితోలు ముసుఁగులఁదాగి
హరిహరులొక మూర్తి నైక్యమ్ము నెంది
దరిసెన మొసగిరధ్యాత్మధామములు
గళసీమ గద్గదాకలితమై వణక
పులకలు తంగేడు పూలుగాఁబూయఁ
గనుల నానందమే కాలువగాఁగఁ
దనువెల్ల జడము - చిత్తము రాగ పూర
పూరితమును గాఁగ, ముఖముల్లసిల్ల
వీరశైవుఁడు - భక్తి వివశుఁడై - కోటి
భవముల పుణ్యంబు పండినయట్టు
లవనీసతీ కుంకుమాంక చిహ్నములు
చండికానిటల కాసార పద్మములు
ఖండిత నిజభక్త కలుషముల్, నిగమ
వీధీవిహారుండు విఠలు పదము
లాదర మేదురమగు చూడ్కి - ద్రావు
కైవడి - చూచుచుఁ గరములు చేర్చి
భావంబు సంభ్రమ భ్రమితమై తూఁగ
పలికె" నాయపరాధ భరము సహించి
కలిమల జుష్టుని, గర్వాంధమతిని
కొలిపించి కొన్నదే కోటి దీవెనలు
తలమౌనె! తండ్రి నీ దయ యంతయనఁగ
భవమంతయును వృథా భ్రాంతిలో మునిగి
యవివేకినైన నాయందు నీకెంత
మమకారమోయి! రమానాథ! నన్నుఁ
దమియించు నీ తీయదనపు వేదనలు;

హరిహరి! శిక్షార్హుడైన నాయందు
కరుణ గుప్పితివి, నీ కఠిన విచిత్ర
శిక్ష - నా హృదయమే చీల్చివేసినది——
దక్షాధ్వర ధ్వంసి! తావకీనంబు
సలలిత ధీర దర్శనముతోపాటు
కలుపుకోరా నన్ను! కైలాసమునకు
తాపింఛ పింఛ సందానిత మౌళి!
గోప గోపీ మనః కుట్మల సురభి!
తారకా కమన సుందర జటాశాలి
తారక! చంద్రికాధవళ శరీర!
హరిహరరూప దివ్యానంద వార్ధి
పరిపూర్ణ విగ్రహా! భాగ్యైక ఫలమ!"
యనినుతియించి - సాష్టాంగంబుగాఁగ
వినమితుఁడైన - ద్యోవీధిలోనుండి
కురియించె నిర్జరకోటి ప్రమోద
భరితమాశీర్వాద భద్రభాగ్యములు;
పండరినాథుని భాగ్యంపుమోవి
నిండె - వెన్నెలతావు నినిచిన నవ్వు;
కోమటి భక్తుని కోర్కెలు పండి
యామోదములు దిక్కులందుఁ బంచినవి;
నెఱిఁ బరస్పరమును నిండు కౌగిళుల
కరగిపోయిరి బచ్చు - కంసలబత్తు
మొలనూలు కట్టిరి - ముత్ప్రపుల్లితులు
నిలినాక్షు భక్తులు, నడుమునకతికి
సరిపోయినది - కాలసర్పపట్టంబొ
చిఱుగజ్జియల మ్రోత చిందుదామంబొ——
యాకళాదుని భార్యయర్యుని యువతి
జోక కన్నుల విరిచూపులతోనె

కలిపికొన్నారు నిష్కలుష బాంధవము;
చిలిపిచూపులనవ్వు చిందులు ద్రొక్క
బుడిబుడి నడలతో - ముందుకు వచ్చి
బుడుతఁడు కంసాలి పుట్టంబుఁ బట్టి
యెత్తి కొమ్మని - చేతులెత్తుచున్నాఁడు;
హత్తినయాశ్చర్య మంతరంగముల
కెచ్చుగాఁ గన్నులనిపి జింతలాఁడ
నచ్చంపు గండుర్వులైరి పూజరులు;
కలకలమని గుడిగంటలుమ్రోసెఁ
గలుగుమోదము వెళ్ళఁగ్రక్కెడు భంగి
తరలెభక్తయుగమ్ము, దత్సతీమణులు
దరలిరి, వెనువెంటఁ దరళాయతాక్షు
లవ్వారిపోయెడు నద్వమ్ములందు
నవ్వారి, వినమితంబైన మస్తములు;
కాలాంతరంబునఁ గల్మషదూరు
లోలనమోక్షంబు నొందిరివారు
సందేహమేల! యీ సర్వలోకంబు
లందు, విఠ్ఠలుఁడు, ప్రత్యక్షదైవమ్ము;
వాని నామముకలి పాపమారకము
వానిరూపము భక్తభావమందార
మనియిట్లు, ప్రశ్రయధనుచేత, వైష్ణ
వనతమస్తకుచేత, పండరినాథ
చరణసీరేజ సంచరమాణ, భృంగ
పరివారని భసర్వవాసనుచేత
నైకభాషాపరిజ్ఞాన దుగ్ధాబ్ధి
శీకరమృదువచస్సేచనుచేత,
ఘన గిరి తిర్మలగణ్యతాతార్య
జననపవిత్రిత ఘనవంశజనన

చిరపుణ్య పరిణాహపరిమళచేత;
నిరతశబ్ద బ్రహ్మనిధ్యానసన్మ
నోరమకీర్తి కర్పూరునిచేత;
పారణీయగుణుండు, పండరీశ్వరుని
కృతినాథుఁ గావించి, కీర్తింపఁబడిన
ప్రతిలేని పండరీ భాగవతమ్ము
శ్రీమహితాకారు, చిత్సుఖాధారు
సామజరక్షకు, సర్వసురేడ్యు
పై జయంతీమాలవలె, సర్వసేవ్య
మై, జగమ్ములఁదావులందించుఁ గాఁత; 829

(నరహరి చరిత్రము సమాప్తము)

పండరీ భాగవతము సంపూర్ణము

